# మాండూక్యోపనిషత్తు

శ్రీ స్వామి చిన్మయానంద
కృతము

అనువాదము
శ్రీమతి వరలక్ష్మమ్మ

# ఆచార్యదేవుని దివ్యసందేశము

[ఎవ్వరి పాదారవిందములవద్ద నాశీనులై (మన స్వామీజీ) ఉపనిష దర్థముల నభ్యసించిరో, ఎవ్వరు ఉత్తర కాశీయందు హిమాలయ పర్వతచ్ఛాయలలో నివసించుచున్నారో, అట్టి పరమ పూజ్యులైన గురుపాదులగు శ్రీ స్వామి తపోవన్‌జీ మహారాజు పంపిన ప్రోత్సాహకరమగు దివ్యసందేశమును, ఆశీస్సును ఇందు పొందుపఱచి యున్నాము.]

బ్రహ్మమొక్కటే సత్యము. మిగిలినదంతయు మిథ్య. సదా ప్రకాశించు సూర్యుడు, చంద్రతారకలు, వీనితో కూడిన యీ విశ్వము, అంతయు అతి దీర్ఘస్వప్నము. ఏమి? ఈ కనబడుచున్న విశ్వమంతయు కేవలము దీర్ఘస్వప్నమేనా? అదియెట్లు? మాండూక్యకారికలలో, పరమాచార్యులైన గౌడ పాదుడు దీనికి ప్రత్యుత్తరమీయ ప్రయత్నించుచున్నాడు. ఈ విశ్వమంతయు కేవలము స్వప్నమేకాని సత్యముకాదని సహేతుకముగాను, యుక్తియుక్తముగాను ఈ కారికలు వివరించి నిరూపించుచున్నవి.

పోనిమ్ము. ఈ విశ్వమంతయు ఏదో సత్యముయొక్క స్వప్నమే కావచ్చును. దానిని గురించి చింతించి మన సమయమును వ్యర్థపుచ్చుటలో మనకేమి లాభముకలదు? ఈ సమస్యను గుఱించి చింతన చేయుటలో మనకు లాభముండనే యున్నది. ఈ జగత్తు దానియందలి విషయములు మనకు శాశ్వతానందము నీయజాలవనియు మనమొక తుది నిర్ణయమునకు తప్పక రాగలము. తత్ఫలితముగా ఆ శాశ్వతానందమే

బ్రహ్మయనియు, స్వప్నతుల్యమైన యీ క్షణికజగత్తు బ్రహ్మము కాదనియు మనము తెలిసికొనుచున్నాము.

అట్టిన శాశ్వతానందరూపమైన యీ బ్రహ్మను తెలిసికొనుటకును, అక్షరమై నిత్యమైన యట్టి యానంద మందు స్థిరపడుటకును మనము ప్రయత్నించి యుండవచ్చును కదా. అట్టి శాశ్వతానంద స్థితికే గౌడపాదుడు మనలను తీసికొని పోవుచున్నాడు. అయితే ఆ మార్గము బాణమువలె సూటిగాపోవు దగ్గరదారి. కాని పామునడకవంటి వంకర టింకరగాపోవు చుట్టుమార్గము మాత్రముకాదు. ఇదియే గౌడ పాదుని కారికలలోగల గొప్పతనము, విశిష్టత.

అట్టికారికలను ఆధునిక విద్యాభ్యాసముచేసిన నవీన సన్యాసియగు శ్రీ స్వామి చిన్మయానంద వాక్కులద్వారా విను అవకాశము ఆంగ్ల విద్యాభ్యాసకులైన మన రాజధాని పౌరులకు కలుగుటచే వారు చాలా అదృష్టవంతులని చెప్ప వచ్చును. సనాతనపరులైన పూర్వ సంస్కృత పండితులవలె గాక యీతడీ కారికావిషయమును విజ్ఞానశాస్త్ర సంబంధ ముగా నుండునట్లు నవీన పద్ధతులలో వివరించునని విశ్వసించు చున్నాను. ఆతని ఉపన్యాసములను వినుటవలన బహుశా మీరు 'అజాతవాదము'ను బుద్ధితోనైన గ్రహించగలిగెదరు. మఱియు తురీయమైన బ్రహ్మయే సత్యమనియు, మిగిలిన జాగ్రత్స్వప్న సుషుప్తిజగత్తంతయు సృష్టింపబడనే లేదనియు, కావుననే అదంతయు కేవలమొక దీర్ఘస్వప్నమనియు మనము మనసా ఒప్పుకొనినట్లు భావించెదము. కాని వేదాంతశాస్త్ర గ్రంథములను కేవలమభ్యసించుటకును, 'ఆ తురీయ బ్రహ్మయే

నేను' అను అనుభవమునుపొంది అందు స్థిరపడుటకును చాలా చాలా అంతరము గలదు.

కావున భగవంతుని ఉపేక్షింపకుము. కేవలము భగవదనుగ్రహముచేతనే యాతని నిజతత్త్వమైన తురీయస్థితిని తెలిసికొనగలుగుచున్నాము. భగవంతునిపై భక్తిప్రేమల నలవఱచుకొనుము. ఆతని నామమునే సదా జపింపుము. ఆతనినే ప్రశంసింపుము. ఆతని విభూతినే సదా ధ్యానింపుము. ప్రతికర్మను భగవదర్పితముగా చేయుము.

ఇట్లు కొంతకాలము అభ్యాసముచేసిన చంచలమై అపరిశుద్ధమైన మన మనస్సు పరిశుద్ధమై ఏకాగ్రము కాగలదు. అటుపిమ్మట నీవా శాశ్వతానందరూపమైన తురీయ బ్రహ్మమును తెలుసుకొని ప్రత్యక్షానుభూతిని పొందగలవు.

అజాతవాదమును బోధించుటతోపాటు సగుణరూపియైన భగవంతుని అఖండకీర్తననుకూడ యజ్ఞశాలలో అభ్యసింప జేయుటలో బహుశా ఇదియే యాతని మనస్సులోని ముఖ్యోద్దేశమై యుండును.

ఢిల్లీ ప్రజలు స్వామి చిన్మయానందుని జ్ఞానయజ్ఞోత్సవముల వలన అత్యంత లాభమును పొందగలరని యాశించుచున్నాను. జ్ఞానయజ్ఞమును సఫలముగా సమాప్తి నొందించుటయేగాక తద్ద్వారా పొందిన జ్ఞానము నభ్యసించునటుల మిమ్ములను భగవంతు డనుగ్రహించుగాక !

ప్రేమతో, శుభమునాకాంక్షించు

ఉత్తరకాశి,
20-10-53.

స్వామి తపోవన్‌జీ.

# స్వామీజీ ఆశీస్సులు

ఈ సంపుటములో ఢిల్లీ యజ్ఞశాలలో నేను చెప్పిన విషయములన్నియు సంగ్రహించబడి యున్నవి. ఈ విషయములు తత్తత్కాలములందా యా మహాత్ములు ప్రయత్నించుచుండిన హిందూమతపునరుద్ధరణకు ప్రసిద్ధ చిహ్నములై వెలయుచున్నవి. ఇట్లు నేను చెప్పుటకు తగినంత కారణము కలదు. ఇవి క్రొత్తగా స్వతంత్రము వచ్చిన దినములు. మన రాజధానీనగరమందలి ప్రజలందరును అధికోత్సాహముతో ఉద్విగ్నులై యున్నారు. అట్టి యీ దినములలో, ఇదివరకు మతమును దానిని అనుసరించుటకు అవకాశము గాని అపేక్ష గాని లేక యున్న కొంతమంది యజ్ఞశాలలో నా ఉపన్యాసములను వినుటకు వచ్చియున్నారు. వివేకవంతమైన ప్రస్తుత తరమువారిచే యీ విషయము లిచట కూర్చబడి యున్నవి. గౌడపాదునిచే ప్రతిపాదితమైన ఉన్నత వేదాంత తత్త్వములపై పూర్వపక్ష సిద్ధాంతములను చేయు నిర్దాక్షిణ్య వాదములను, అనుచితకరమగు హేతువులను ఇంతమాత్రమైన వారికి నేను బోధించగలిగినందుకు ధన్యుడననియే భావించవలసి యున్నది. కారికాకారుడైన గౌడపాదుడు మాండూక్యోపనిషత్తునందు వ్రాసిన కారికలందు హిందూమత చరిత్రలో మొట్టమొదటివారిగా ఉపనిషద్భావములను శాస్త్రీయశైలిలో వేదాంతరూపములో ప్రతిపాదించెను.

ఢిల్లీ జ్ఞానయజ్ఞ కమిటీవారు ఇదివరకే "ధ్యానము - జీవితము" అను పేరుగల సంపుటమును వెలువరించియున్నారు. అది యీ గ్రంథమునకు సహకారి కాగలదు. ధ్యానపూరితమైన హృదయముతో చేసిననాడే శాస్త్రాధ్యయనము లాభకారి కాగలదు. ప్రపంచమతమైన వేదాంతమందలి సూక్ష్మ విషయములను గ్రహించుటకు అత్యధికముగా ధ్యానము మననము తప్పక కావలసి యున్నవి. శాస్త్రాధ్యయనము చేయునపుడు, చేసిన పిమ్మటకూడ ఎవరైతే యీ ధ్యానమననములను ఉపేక్ష చేయుదురో వారికి వేదాంతము కేవలము ఆదర్శమాత్రమే యగుచున్నది. లేదా ఒక భ్రమగానో స్వప్నముగానో తోచును. ఆంతరికమైన మనోబుద్ధుల పరిశోధనాగారములలోనికి ప్రవేశించకుండ ఎట్టి వేదాంత విద్యార్థియైన తాను మతతత్త్వమున పాండిత్యమును వహించగలనని భావించిన ఆతడు మానవశరీరశాస్త్రము నభ్యసించకుండగనే పరిపూర్ణ వైద్యుడు అగుటకు ప్రయత్నించుచున్న వాడగును.

జీవితమును గుఱించి యెక్కువగా తెలిసికొనుటకును, ఇందు సూచింపబడిన పరిపూర్ణ జీవితమును గడుపుటకును, తెలివిగల ప్రతి విద్యార్థికి యీ గ్రంథము మిక్కిలి సహాయపడునని నా దృఢ విశ్వాసము.

మహానగరములైన పూనా లోను మద్రాసు లోను కేనోపనిషత్తు, కఠోపనిషత్తు, ముండకోపనిషత్తులను గూర్చి

ఉపన్యసించిన పిమ్మట మాండూక్యోపనిషత్తుతో నా ప్రజా సేవా ప్రణాళికను పరిపూర్తి నొందించుకొనగోరు నాకు ఢిల్లీ యజ్ఞ కమిటీ వారు ఈ సదవకాశము నిచ్చినందుల కత్యంత సంతుష్టుడనగుచున్నాను. ప్రజలకు హిందూమతాను యాయులకు ఢిల్లీ వచ్చి నా ఉపన్యాసములను వినుచున్నం దుకును, భక్తి శ్రద్ధలతోను నిస్వార్థభావముతోను, ఉదార బుద్ధితోను ఈ ఏర్పాట్లను చేసిన ఢిల్లీ జ్ఞానయజ్ఞ కమిటీ వారికి నా కృతజ్ఞతలు.

ఆ మహాత్ములయొక్క అనుగ్రహమందరికి కలుగుగాక !

[illegible]



# మాండూక్యోపనిషత్తు

ఓం భద్రం కర్ణాభిః శృణుయామ దేవాః భద్రం పశ్యేమాక్ష
భిర్యజత్రాః ।
స్థిరై రఙ్గై స్తుష్టువాం స స్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ।
స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః ।
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు ॥
ఓం శాంతిః ! శాంతిః ! శాంతిః !

ఓ, దేవతలారా! మా చెవులతో మేము మంచినే వింటుము గాక! మా కనులతో మేము మంచినే చూతుము గాక! మాకు దేవతలు నిర్దేశించిన ఆయువున్నంతవఱకు జీవించి మిమ్ములను స్తోత్రములు చేయుదుము గాక! పురాతనుడై ప్రసిద్ధిచెందిన ఇంద్రుడును, లోకచక్షువై సర్వవేత్తయైన సూర్యుడును, అరిష్టనాశకుడైన వాయువును, ఆత్మవిద్యను అనుగ్రహించు బృహస్పతియును మాకు శుభమును చేకూర్చుగాక!

ఓం శాంతి శాంతి శాంతిః

గురుశిష్యులు కలిసి శాంతి పాఠమును చదివిన తర్వాతనే ప్రతి యుపనిషత్పఠనము ప్రారంభమగుచున్నది. సామాన్య ప్రార్థన చేసిన తరువాత గురుశిష్యు లిద్దరును నొకస్థలమున కూర్చుండి తమ వేదాంత చర్చలను ప్రారంభించెదరు. తీవ్ర నాస్తికతగల నేటి ప్రపంచములోని విద్యావంతులైన యజ్ఞానులు, ప్రార్థనయొక్క శక్తిసామర్థ్యములను, ఆవశ్యకతను, తత్కార్యములను గుఱించి యాశ్చర్యపడుదురు.

మనలో ప్రతియొక్కరును కేవలము నిరాశా నిస్పృహలతో కూడిన నియమిత, నీరస వ్యక్తులు మాత్రమే కాదు. మనయందరిలోను సర్వశక్తివంతమై, భయ రహితమై, అనంతమై, ఆనందమయమైన దివ్యతత్త్వము కలదు. మనలోనున్న యా దివ్యతత్త్వము బహిర్గత మగుట కనుకూలించునదై ప్రార్థన మన మనోబుద్ధులకు పరిపూర్ణత నిచ్చుచున్నది. కావున ప్రతిదినము ఉపనిషత్పాఠమునకు మునుముందుగా, సర్వజ్ఞమైన యా దివ్యతత్త్వమును శరణుపొందిన గురుశిష్యులు తమలోని దివ్యత్వమును నభివ్యక్తపరచుటకుగాను ప్రార్థన చేయుచున్నారు.

శాంతిపాఠములోని ప్రతి పదమును మనలోని క్రూర ఘాతుక స్వభావమును చెప్పుచున్నది. ప్రార్థనద్వారా మనము దేవుని ఒక న్యాయవాదిగను, ఒక వైద్యునిగను, ఒక దళారిగను, మఱియు మన ఘాతుకోద్దేశములకు ప్రాపుగను, నుపయోగించుకొనుచున్నాము. ఇది యా ప్రార్థనా విధానముయొక్క తప్పుగాదు. ఒక క్రూరుడు కత్తితో తన తల్లిని నరికినంత మాత్రమున కత్తి క్రూరమైనదని మనము నిర్ణయించలేము కదా! అదేరీతిగా దైవానుగ్రహామే యుద్దేశముగాగల ప్రార్థనను మనము మన నీచోద్దేశముల కుపయోగించినయెడల మనమా ప్రార్థనా సంస్థనే భ్రష్టుచేయుచున్నామని తెలియుచున్నది.

మహనీయులైన యుపనిషత్ ఋషులు నిష్కాములు. ఈ ప్రపంచమును తఱచిచూచిన యా ఋషులు దానిని నిస్సారమైనదిగను, దుర్ఘటమైన దుఃఖముతో కూడియున్నదిగను

వారు కనుగొనిరి. కావున యట్టి విషయ ప్రపంచమందు వారికి యాసక్తిలేదు. ప్రాణికోటికంతటికిని సంస్కృతి, వికాసము, కలుగవలయుననియే వారుకోరిరి. వేదకాలమందలి యిట్టిజాతీయ స్వభావమే అన్ని యుపనిషత్తులలోని శాంతిపాఠములలోను సంపూర్ణముగా ముద్రవేయబడియున్నది. గురుశిష్యులిద్దరు తమ ఆధ్యాత్మిక జీవితమునందు శుభమునే వినవలయుననియు, శుభమైనదానినే చూడవలయుననియు, హృదయపూర్వకముగా కోరుచుండిరి. దేవతాస్థానమైన హృదయప్రదేశములో శని గ్రహము ప్రవేశించుటకు కన్నులు, చెవులు, అను నీ రెండు జ్ఞానేంద్రియములును రెండు రాచబాటలై యున్నవి. మిగిలిన మూడు జ్ఞానేంద్రియములును మానవునిలోని ఆత్మఘాతుకతకు అంతగా దారితీయలేవు. ఘాతుక దృశ్యములు, నీచోద్దేశముల మర్మరధ్వనులు, రెండును కలిసి తమ యెదుటనున్న దివ్యత్వమును తుడిచివేసి మన హృదయములోనున్న ఆధ్యాత్మిక తాసౌధమును అధఃపాతాళమునకు త్రోసివేయుచున్నవి. కావుననే యీ వేదఋషులు "తామెల్లప్పుడు పవిత్రమైనదానినే చూడవలయును, శుభంకరమైనదానినే వినవలయును" అని ప్రార్థన చేసిరి.

ఇట్టి యీ వేదఋషుల ప్రార్థనలో హైందవతత్త్వసారమును కనుగొనగలము. సంఘములోని ప్రతి వ్యక్తియు తాను శుభమునే కనుగొని దాని కనుగుణముగానే నడచుకొనవలెనని హృదయపూర్వకముగా తలచినచో, అట్టి దేశములో, అట్టి సాంస్కృతిక యుగములో కారాగారములు కనుపించవు, నగర వీధుల వెనుక మురికిప్రదేశములు నష్టప్రాయమగును. దారిద్ర్య

మును ఊహింపనుకూడ లేము. రోగములు సకృత్తుగా నుం డును. ప్రస్తుతపరిస్థితులను పరిశీలించిన మనమవ్విధమగు సమగ్ర మైన యాధ్యాత్మికతాసామ్యము సంభవించునని యూహించు టకు కూడ అశక్తులగుచున్నాము. అంతేకాదు నిస్పృహు లముకూడ నగుచున్నాము. కాని యీ పద్ధతియే యానాటి ఋషుల లక్ష్యమై యుండెడిది. మరియు వారికాలములోనే వారి లక్ష్యములను ఆచరణయోగ్యములగు సత్యములుగా నెట్లు సమగ్రభావమును పొందింపజేసిరో తెలియుచున్నది.

మరియు వారు సంపూర్ణత్యాగభావముతో వారి జీవిత మును గడపుటయే కాక, విశ్వమానవ ప్రేమ సిద్ధాంతమునకు తగు రీతిగా ప్రవర్తించిరి. అయినను అట్టి పరిపూర్ణతగల యీ తరమువారు తమ భౌతిక శారీరకావసరములపట్లకూడ యద్విధ మైన అలక్ష్యమును చూపలేదు. వారికి జీవితముపై కూడ యేవ గింపులేదు. పై పెచ్చు జీవితముపై పేరాశగలవారై, అధికా ధిక ఆయుష్యమును గోరుటలో వారు విసుగుజెందలేదు. ఈ విషయము వారిప్రార్థనలో స్పష్టమగుచున్నది. జగన్నాథుడు తనకుండదగిన పూర్ణాయుష్యమును, ఆరోగ్య భాగ్యములును అనుగ్రహించుకాక, అనియే వారు ప్రార్థించిరి.

ఇంద్ర, వాయు, సూర్యాది దేవతలను గూర్చిన వారి ప్రార్థనలు తరువాతి కాలమందలి రామకృష్ణాది దేవతల యారా ధనను మనకు జ్ఞప్తి పఱచుచున్నవి. రామకృష్ణాదులు పురాణ కాలములో దేవతలుగా స్వీకరింపబడినవారు. వేదకాలము లోని యాచార్యులు పంచభూతములను, అటువంటి మరికొన్ని

మూర్తులనే దేవతలుగా భావించిరి. అట్టి దేవత లిచట గురు శిష్యులచేత స్తుతింపబడుచున్నారు.

ప్రతి శాంతిపాఠమును మూడుసార్లు శాంతిపదోచ్చారణ కలదై ముగియుచున్నది. శాస్త్రపాఠము జరుగునపుడు గలుగు మూడువిధములగు విఘ్నములను తొలగించుట కొఱకు మూడుసార్లు శాంతిని పఠించుచున్నారని ఆచార్యులు దాని భావమును వివరించిరి. మూడువిధముల విఘ్నములు. 1. ఆధిదైవికము–దైవముచే కలుగ జేయబడినవి. 2. ఆదిభౌతికము – అగ్ని, వరద, భూకంపము, మొదలైనవి. 3. ఆధ్యాత్మికము– అలసత్వము, కపటము, విశ్వాసము శ్రద్ధ లేకపోవుట, మొదలగు మన వ్యతిరేకభావములచే గలుగు గుణములు.

మనముకూడ ప్రతిదినమును ఈ ఉపన్యాసమును శాంతిపాఠముతో ప్రారంభింతము. మనమందరము కలిసి పఠించు ఈ శాంతిపాఠములో శాంతిపదత్రయమును ఉచ్చరించునపుడు సహకారముతో చేయు నీ యుపనిషదధ్యయనము పైని చెప్పిన యే యొక్క విఘ్నము కలుగకుండ కొనసాగవలెనని హృదయ పూర్వకముగా ప్రార్థించెదముగాక !

అహంకారనిరసనమను ప్రయత్నముతో శరణాగతి సాధనయను సోపానములద్వార తమలోని సత్యప్రాసాదమును చేరి, తామే దానికి యజమానులని మరల కనుగొనుటకై యుపనిషదృషులు అందు ప్రవేశించిరి. ఆ సత్యసామ్రాజ్యమెట్టి దనగా, అందు ప్రవేశించినవారు తిరిగి రానటువంటి విచిత్ర ప్రపంచము. అయినను స్వార్థరహిత సేవాసక్తులై, దివ్య భావ

ముతో తమ సాటి మానవకోటిని ప్రోత్సాహపరచి సత్య పద
విని చేర్చు మార్గదర్శకులై కొందఱు తిరిగి యందుండి యెగిరి
వచ్చిరో యనునట్లు అరుదుగా నీ ప్రపంచములో కన్పించు
చుందురు. కావుననే వారు భాషకు సాధ్యమైనంతవఱకు శబ్ద
చిత్రముద్వారా ఆ సత్యసామ్రాజ్యమును వర్ణించి దానినిచేరు
ముఖ్య మార్గములను వివరింప ప్రయత్నించిరి.

మైమఱపించు నానందము నిచ్చునట్టి యా దివ్యాను
భూతి సమయములో తాము వినిపించిన ఉత్తమ గ్రంథములగు
ఉపనిషత్తులకు తమ కర్తృత్వములను సూచించు తమ నామము
లను చేర్చుటకు కూడ వారు మఱచిపోయిరి. కావుననే యుప
నిషత్తులలోని వేదాంతవాఙ్మయము అనేక సంపుటములుగా
నున్నను, వానికర్తలెవరో మనకు తెలియరాలేదు.

కాని యింత విశదముగా బోధించిన తత్త్వమును వారు
స్వయముగా ననుభవించి యానందించిన వ్యక్తులు, ఇట్టి జ్ఞాన
ప్రకాశమునిచ్చు ఉపనిషత్పదముల వెనుక దాగియున్నారని
మాత్రము మనము తెలిసికొనగలుగుచున్నాము.

మన భావమును కొంచెము సువ్యక్తము చేయగల
జాబునుగాని, తృప్తికరమైన టీకనుగాని మనము వ్రాయుట తట
స్థించిన దాని నితరులకు చూపి, దానిలోని స్వయం సృష్టకళా
సౌందర్యమును మనమానందించకుండ యుండలేము కదా!
మనమే కాదు ప్రతి కళాకారుడును ఇతర కార్యాసక్తులగు
సామాన్య మానవులకు విసుగు పుట్టించువాడై యట్టి చీకాకు
మార్గమున పడుచునే యున్నాడు. ఉదాహరణకు ఒక చిత్ర

కారుడు తన చిత్రగృహములోని చిత్రములను చూచి ఆనందించవలసినదని మన కాళ్ళమీదపడి మనలను బ్రతిమలాడుకొనును. గాయకుడు తన పాటపిచ్చిలో మైమఱచి, ప్రయాణమగుచున్న మనలను రైలుతప్పునట్లు చేయును. ఒక వ్రాతగాడు మన భుజములు పట్టుకు వ్రేలాడినవైన మనలను సంపుటములుగానుండు వాని వ్రాతప్రతులను వినునట్లుచేయును. ఆర్కిమెడిస్ తన నూతనావిష్కరణములోని యానందములో తన నగ్నతను కూడ మఱచి, నగరవీధులలో "నాకు తెలిసినది" యని యఱచుచు, పరుగెత్తెను. సంపూర్ణ జ్ఞానప్రకాశము నుండి, ఒక సూక్ష్మకిరణప్రసారము కలిగినపుడు, తన కించిజ్జ్ఞత్వమును విడిచి పైకిలేచు క్షణములందు ఇట్టి సంఘటనలు కలుగుచున్నవి. ఒక్క నిజమైన కవిగాని, చిత్రకారుడుగాని, గాయకుడుగాని, శాస్త్రవేత్తగాని తన కార్యవిశేషమును తన స్వసృష్టి యని చెప్పుకొనడు. సంపూర్ణముగా అహంకారమును విడిచి నప్పుడే కల్పనాకళ పూర్ణత్వమును పొందుచున్నది.

ఉపనిషదృషులు అహంకారాతీతమైన యవస్థయందు తాము స్థిరపడినపుడు తమ గ్రంథములకు తమ కర్తృత్వమును అంటగట్టకుండుట సహజమేకదా ! వారి పూర్ణానుభవములను అత్యుత్తమముగా ప్రకటించినప్పటికిని, తాము వెల్లడి చేయ దలచుకొన్నంతగా తమ సిద్ధాంతములను, అందలి పరిపూర్ణతా ప్రాభవము మొదలగువానిని పూర్తిగా ప్రకటించలేకపోయితిమని వారు భావించుచుండిరి. అనంతమైన యా యాత్మతత్త్వమును అంతముగల యీ సాధనలద్వారా గ్రహించుట

గాని, వెల్లడిచేయుటగాని దుష్కరము. "భగవంతునికి లక్షణము చెప్పుట భగవంతుడు లేడనుటయే."

యూరోపు దేశములోని వేదాంతము, వేదాంత గ్రంథములుకూడ ధనసంపాదనా సాధకములుగాను, కీర్తి ప్రతిపాదకములుగాను మాత్రమే యుపయోగపడుచున్నట్లు, హిందూ దేశములోని యుపనిషత్తులు కేవలము భౌతిక సుఖ సంపాదన కుపయోగపడునట్టివి మాత్రము కావు. పాశ్చాత్యులకు వేదాంతము ఆత్మతుష్టినిచ్చి, సంతుష్టిని కలుగజేయు ఒక సాధన మాత్రమే యగుచున్నది. ప్రాచ్య దేశస్థులగు మహర్షులకును, వారి సంతానమునకును వేదాంతము, ఆత్మోద్ధరణకు తోడ్పడి, ఆత్మతృప్తినిచ్చునదియై యున్నది. వారు తాము సంపాదించిన జ్ఞానముగాని, దానిని వ్యక్తపఱచు భావప్రకటనలుగాని తమ స్వంతమైనవి కావని హృదయపూర్వకముగా నమ్మినవారు కనుకనే వారు తెరమఱుగుననే యుండదలచిరి. ఇతరులెవరో తమకు చెప్పుచున్నారో యనునట్లు తాము శ్రుతిమంత్రములను విన గలిగిరి. శ్రుతి యనగా "వినబడునది" యని యర్థము.

ఇట్టి గురువులవలన వినిన మంత్రార్థమును గ్రహించి స్వయముగా ఆత్మానుభవమును పొంది ఆ పరమసత్యమునందు శిష్యుడు స్థిరపడుచున్నాడు. ఇట్లు స్థిరపడిన వెనుక తానే గురువై, తనవద్దకువచ్చు సాధకులకు దానిని తెలియజేయునపుడు, ఆవిద్య గురుపరంపరాయాతమనుచు గాని తాను కనిపెట్టినదిగా యెన్నటికి చెప్పుకొనడు. ఈ విధముగా మన శాస్త్ర గ్రంథములు నేటి వఱకు తమపవిత్రతను కాపాడుకొనుచున్నవై, మనకు గురుశిష్య పరంపరగా వచ్చుచున్నవి. కాబట్టి నేడు వేదికలనెక్కి జ్ఞానులవలె

యుపన్యాసములలిచ్చువారి యుపదేశములను విని వానిని శాశ్వతమైన యా వేదభాగములుగా మనమెంతమాత్రము భావించరాదు. అట్టి భావమునకు అవకాశమే యుండరాదు. అట్లే మనము భావించినయెడల పాశ్చాత్యదేశమునందువలె మన దేశమునందును పదునైదు సంవత్సరముల కొకసారి మారుచుండు వేదాంత తత్త్వమును మనముకూడ యలవఱచుకొని యుందుము.

యూరోపునందు జాతీయ జీవనవిధానము మారునప్పుడును, ప్రతియుద్ధానంతరమును, ప్రతి విప్లవ పర్యవసానమందును, మానవ జీవితపు విలువలు సరిదిద్దబడుటను చూచుచునే యున్నాము. తత్ఫలితముగా మానసిక భావములోను, బుద్ధిలోను భ్రాంతిచేత కల్పితమైన మార్పుల కనుగుణముగానే లెక్కలేనన్ని గ్రంథములు ప్లేటోనుండి నేటివరకు ఉద్భవించి వారి గ్రంథాలయములను నింపుచున్నవి. మన హిందూ దేశములో అట్లుగాక, అతి ప్రాచీనకాలమునందు, గంగానదీ పరిసరప్రాంతములలో శాశ్వతమైన యా వేదవాక్యములు, ఉపనిషత్సత్యములు యే విధముగా బోధింపబడినవో యీ నాటికిని సర్వవిధముల అదేరీతిని ప్రకటింపబడి ఉపదేశింపబడుచున్నవి. విజ్ఞానశాస్త్రాభివృద్ధి, జాతీయ జాగరూకత, రాజకీయ పరిజ్ఞానము, అంతర్జాతీయ సమస్యలు, మన బాహ్యాభ్యంతర విషయ ప్రపంచమును, అందలి యనుభవములను ఎంతగా కలియబెట్టుచున్నప్పటికిని, సుషుప్తికాలములోని యనుభవము సర్వకాలములందును ఏకరీతిగనే యుండుననుట మీరందరంగీకరింపవలసిన విషయమేకదా! అభివృద్ధిపొంది, మనము పూర్తిగా

పురోగమించినవారమై ప్రపంచమందలి బాహ్యమైన సర్దుబాట్లను మార్చిన మార్పుగలము. తత్ఫలితముగ మన స్తత్వములు, బుద్ధిలోని భావములుకూడ మారిన మారవచ్చును. కాని సుషుప్తిలోని యనుభవము మాత్రము యెట్టికాలమునందైనను మార్పుచెందక ఒకేరీతిని నుండును. కావు నదానిని మార్చలేము. దివ్యత్వముయొక్క బాహ్యానుభవము కూడ నటువంటిదే. ఉపనిషత్తులలో చెప్పబడిన గమ్యస్థానముకూడ నదియే. మన సమిష్టిజీవితములోని బాహ్యవిషయములెట్టి మార్పు జెందినను ఆ పరమ సత్యము మాత్రము మార్పు చేయుటకు వీలు కానిది.

ఈ ఉపనిషత్ గ్రంథమునందు ప్రవేశించుటకు పూర్వము ఆ ఉపనిషత్తుయొక్క కూర్పును గుఱించి, దానిలోని విషయమును గుఱించి, దానియొక్క కారికలను గుఱించి తెలిసికొందము.

ఋక్కు, యజుస్సు, సామము, అథర్వణము, అని వేదములు నాలుగు. ప్రతివేదము మూడుభాగములుగా విభజింపబడినది. ప్రథమభాగము, మంత్రభాగము, మధ్యభాగము, బ్రాహ్మణభాగము, అంత్యభాగము, ఉపనిషత్తులు లేక ఆరణ్యకములు అని పేర్కొనబడుచున్నవి. అందు మంత్ర భాగము ముఖ్యముగా ప్రకృతిని స్తుతించుట, పంచభూతములయొక్క శక్తిసామర్థ్యములను వర్ణించుట అనువానితో కూడియున్నది. ఆనాటి ఆర్యులు వివిధనామరూపములలో ప్రకృతిని గ్రహించి, యందుండు భగవచ్ఛక్తిని, దయను, క్షమను, కరుణను, కనుగొనుటయేగాక దానియందలి అతీత యుగ్రశక్తినికూడ కను

గొనిరి. అవి యెట్లు కనుగొనిరో పై విషయమువలన తెలియు చున్నది. బ్రాహ్మణభాగములో యజ్ఞయాగాదులు చేయు విధములు, వాని సూక్ష్మ వివరములు మొదలగునవి వర్ణింప బడినవి. నామరూపాత్మకమైన సమస్త ప్రపంచమునకును ఆధార భూతమై, ఏకమైన ఆ తత్త్వమును గుఱించిన చర్చలు, అది సాధకునిచే పొందబడు విధానము ఆరణ్యకములలో గలవు.

మొత్తము నూటయెనుబదిమూడు ఉపనిషత్తులు కను గొనబడినవి. అందు నూట యిరువదియైదు ప్రాచీనములని నిర్ణయింపబడినవి. అందును పది యుపనిషత్తులు అతి ముఖ్య ముగా పరిగణింపబడుచున్నవి. ఆ పది యుపనిషత్తులకును ప్రసిద్ధ వేదాంత శాస్త్రజ్ఞులగు నవీనాచార్యులు సమగ్రమై విపుల మైన భాష్యమును వ్రాసిరి. ఆ పదింటియందు మాండూక్యో పనిషత్తు ఉత్తమోత్తమమైనదిగా పరిగణింపబడుచున్నది. ఈ మాండూక్యోపనిషత్తులో పన్నెండు మంత్రములు మాత్రమే గలవు. అత్యంత సంగ్రహముగా నుండుటచే దానియందలి విషయము విద్యార్థులకు సులభముగా గ్రహించ శక్యము కాదు. కావుననే శ్రీ శంకరులకు గురువైన గోవింద పాదా చార్యులకును గురువగు శ్రీ గౌడ పాదాచార్యులు స్వయము గానే కారికలు వ్రాయు బాధ్యత వహించిరి. అందుచే నేడు మాండూక్యోపనిషత్ పాఠము కారికలు లేకుండ సంపూర్ణము కాదని తలచుచున్నారు.

కారికలు కేవలము వ్యాఖ్యానము వంటివి కావు. ఉప నిషదర్థమును జ్ఞాపకముంచుకొనుటకు వీలుగా నుండుటకై ఆ కారికలు శ్లోకరూపములో నున్న వ్యాఖ్యానములగు

చున్నవి. మరి మంత్రములు సూత్రములుకూడ నిట్టి యుద్దేశముతోనే వ్రాయబడినవి. కాని మంత్రములు గద్యలో నున్నవి. వాటి సంక్షిప్తత అసలువిషయములోని యర్థమునుకూడ విడువవలసినంతగా నున్నవి. కాని కారికలు అంతగా సంగ్రహింపబడి యుండలేదు. మరియు కారికలు శాస్త్రములోని ఒక భాగమును మాత్రమే వివరించునవై యుండ సూత్రములు వాని భావమును సంపూర్ణముగా వివరించుచున్నవి.

మనమెంత కుతూహలముతో పరిశీలింప ప్రయత్నించినను ఉపనిషత్తను పదము గ్రంథములోని విషయమునకుగాని, యా గ్రంథకర్తకు గాని సంబంధించినది కాదని తెలియుచున్నది. కొన్ని యుపనిషత్తుల నామములు ఆ గ్రంథములోని ప్రథమ మంత్రముయొక్క ప్రథమపదమే యై యున్నవి. (ఈశావాశ్య, కేన మొ॥) ఇట్టి ఉత్తమ గ్రంథములకు కర్తల నామధేయము కనపడక పోవుటచే నవీన యుగపువారమైన మనము ఆశ్చర్యపడవచ్చును. కావున మనలను తృప్తి పఱచుకొనుటకై కొన్ని యుపనిషత్తులకు మనమే యేదో యొక ఋషి కర్తృత్వమును అంటగట్టెదము. (కఠోపనిషత్తు – కాఠకఋషి).

ఇటీవల నే నొక ధర్మశాలలో నొక వృద్ధసన్యాసిని చూచితిని. అతడు మాండూక్యోపనిషత్తునకు నట్టి పేరువచ్చిన కారణము నిట్లు చెప్పెను. దానికి తగినంత బలము లేకపోవుటచే యా వివరణ, నేటి నవీన విద్యార్థికి యసంగతముగా తోచవచ్చును. కాని యిది సత్యసాధకులను సరియైన పద్ధతిలో నడుపుటకు చాల యుపయోగపడవచ్చునని నేను భావించెదను.

సంస్కృతములో మండూకము అనగా కప్ప. కావున కప్ప స్వభావమునకు సంబంధించిన శాస్త్రము అని యర్థము వచ్చు చున్నది. అయితే యిన్ని జంతువులుండగా ఆ కప్పనే యీ యుపనిషత్తునకు గ్రంథనామముగా యెన్నుకొనుటలో కారణ మేమి? దానికా సన్యాసి చెప్పిన కారణమిది.

కప్ప సాధారణముగా సంవత్సరములో తొమ్మిది పది నెలలు నీటిలోనో, బురదలోనో లేక మురికిగుంటలోనో నివ సించును. అచటనది తపస్సు చేయుచున్నదో యనునట్లు నిశ్శ బ్దముగా దేనిని కోరక, యేపనియు చేయక (నిష్కామము, నిష్క్రియము) నుండును. వర్షాకాలము వచ్చినంతనే యవి బయటకువచ్చి కన్నీరుకార్చు ప్రాణులకు తమ సందేశము నిచ్చుచున్నవో యనునట్లు వానలో విలక్షణ మనోహరమైన ధ్వనితో బెకబెకలాడ ప్రారంభించును.

నిజమైన మహాత్మునకుకూడ నిట్టి స్వభావమే యుం డును. అతడొక గుహనో, లేక ఏకాంతప్రదేశమునో ప్రవే శించి జనసమ్మర్దమునకు దూరముగా, హిమాలయ ప్రాంత ములోనో ధ్యాననిమగ్నుడై, ఆత్మానందము ననుభవించుచుం డును. ఇట్టి ఆత్మదృష్టిగల పరిపూర్ణవ్యక్తులు, ఆత్మధ్యానము గలవారై ఆత్మయందే ఆత్మానుభవమును పొందుదురు. వర్షా కాలములోనగా చాతుర్మాస్యములో ధ్యానావస్థను వదిలి బహిష్ప్రజ్ఞగలవారై, బాహ్యప్రపంచములోనికి వచ్చి ఆ సత్య మును బాహాటముగా గర్జించెదరు. విషయాసక్తులైన ఐహిక వ్యక్తులకు నిజముగా వారి వాక్కులు కప్పల బెకబెకల వలెనే

కఠినముగా నుండును, ఆ సత్యమును మనోహరముగా గానము చేయుటకుగాని, మనస్సు కరగించు కవిత్వములో చెప్పుటకు గాని యా ఋషులకు తెలియదు. ఆ సత్యమునకు ఎట్టి మెరుగులు పెట్టక, శిల్పసౌందర్యరహితముగానే దానిని ప్రకటించుటయే వారికి తెలియును. కాబట్టి సున్నితహృదయులకును, ఉద్రిక్తభావులకును వారి సత్యవాక్కులు కప్పల బెకబెకల వలెనే వినబడును. కాని కన్నీరుకార్చుచున్నట్లున్న వర్షాకాలమందు, ఉరుముల రణగొణ ధ్వనులతోను, భయంకర తుఫానులతోను, కూడిన జీవితములో నిట్టి కప్పల బెకబెకలు, అనగా ప్రవక్తలయొక్క, మహర్షులయొక్క జీవితమందలి సత్య ప్రకటనలు నిజముగా ఓదార్పును, అత్యంత సుఖమును కలిగించును.

వానకాలములో వానలనడుమ కప్పలన్నియు చేరి ఏకగ్రీవముగా బెకబెకలాడిన సామాన్య ప్రజానీకము, మరల శోచనీయమైన క్షేత్రములలో కన్నీరువర్షము కురియునేమోనని యెదురుచూడవచ్చును. అట్లే జీవితములో తెలిసి తెలియక చేసిన చెడుపనులద్వారా సంఘమందు మానవుడు ఉద్రేకపూరితుల చే అపమార్గమున త్రోయబడును. అటనుండి ప్రపంచ సమస్యలు అను గర్తములోనికి జారిపోవునప్పుడు గీతలో చెప్పబడిన విధముగా (యదా యదాహి ధర్మస్య—ఇత్యాది) దేవమానవులవతరించి బాధిసత్వమునుండు నా యుగప్రవర్తనను నిందించుటయేకాక ఆ సత్యతత్త్వమును ప్రకటించి వెడలుచున్నారు. అట్టివారు మరలిపోవులోపల సంఘములో ధర్మమును సుప్రతిష్ఠితముచేసియే పోవుచున్నారు.

దారిలోని ధర్మశాలయందున్న మహాత్ముని యభిప్రాయము ప్రకారము నీ మాండూక్యోపనిషత్తు విద్యార్థులకు తమ యొక్క మనోబుద్ధులయందలి మాధుర్యమును గుఱించి తెలిసికొను నవకాశము కల్పించుచున్నది. మరియు నీ యుపనిషత్తునందలి ప్రతిపాదనలు, ఉద్రేకముచేగాని, హృదయార్ద్రితచేగాని మధురముగా చేయబడినవి కావని యీ మాండూక్యనామము హెచ్చరించుచున్నది. మెఱుగులు తళుకులు లేని ముడిసరుకువలె, చెక్కడపుపనిలేని నగ్నసత్యమునే యుపనిషత్తులు ప్రకటించుచున్నవి. అట్లుచేయుటవలన నవి మన ప్రస్తుత యూహాలపైన, భావనలపైన తిరుగుబాటు చేయునట్లు మన బుద్ధిని తీర్చి దిద్దుచున్నవి.

"మాండూక్య" మను గ్రంథనామమును గూర్చి యింతవరకు చర్చించుచుంటిమి. ఇప్పుడు "ఉపనిషత్తు" అను పదమునకు ప్రారంభవిద్యార్థుల యుపయోగమునకై యర్థమును వివరించుట అప్రస్తుతము కాజాలదు. ఉప, ని, యనునవి రెండును, "షద్" అను ధాతువునకు ఉపసర్గలై యున్నవి. ఉప=సమీపమందు, ని=దిగువయంతస్థులో, షద్=కూర్చొనుట – గురువుసమీపమున కొంత దిగువగా కూర్చొని – అనగా దేహమనోబుద్ధుల స్థాయిలో నతనితో సమానులమనిగాక గౌరవమర్యాదలు, భక్తిప్రపత్తులతో నతని వాక్కులను వినుటచే గలుగు జ్ఞానమని తాత్పర్యము.

ప్రతి యుపనిషత్తులోని బోధనా విధానము ఒక్కవిధముగానే యున్నది. అది జిజ్ఞాసువై, యాతురుడై యున్న

శిష్యునకును, దయా ప్రేమలతో కూడిన మహాజ్ఞానికిని నడుమ జరుగు సంభాషణరూపమై యున్నది. ప్రతియుపనిషత్తు వెనుక నిశ్చయముగా నొకగురువును, నొక విశిష్టశిష్యుడును నున్నట్లుగా నది చెప్పుచునేయున్నది. మాండూక్యోపనిషత్తులో కూడ నొక గురువును శిష్యుడును వేదాంతచర్చలు చేయుచున్నట్లు ప్రారంభమునే తెలియుచున్నది. "ఒక గురువు పలుకుచున్నాడు, శిష్యుడు ప్రశ్నించుచున్నాడు" ఇత్యాది స్పష్టముగా సూటిగా చెప్పకపోయినను గురుశిష్య సంవాదమును సహృదయులు గ్రహించి యానందించుటకుగాను ఉదాత్తమైన ధోరణిలో సూచింపబడియున్నది.

ఉపనిషత్తులు పరమతత్త్వమును నిర్వచించి వివరించుటకే వ్రాయబడినవైనప్పటికిని యవి కేవలము గంభీర పదములద్వారానే యట్లు చేయుటలో సఫలమైనవి. కావున యట్టి పదముల భావార్థమును తెలియబఱచుటకై యీ యుపనిషదధ్యయనమందు గురువుయొక్క ఆవశ్యకత అనివార్యమైయున్నది. అందుపయోగింపబడిన పదముల ధ్వన్యర్థముద్వారా సత్యతత్త్వవర్ణనచేసినంతగా వాచ్యార్థముద్వారా నవి సూటియైన నిర్వచనముల నీయలేవు. ఎంత విపులముగా నున్నప్పటికిని కేవలము వాచ్యార్థము విద్యార్థికి యుపనిషదర్థమును బోధింపజాలదు. కావున యుపనిషత్తులు తా ముపయోగించు పదములద్వారా తామా సత్యతత్త్వమును నిర్వచించుచున్నామని యెన్నటికిని చెప్పజాలవు. కాని యా పదములకు ధ్వని సంపదగలదు. అట్టి పదముల నుపయోగించియే యా మహర్షులు అనిర్వచనీయమైన దానిని నిర్వచించిరి – అబోధ్యమైన దానిని

బోధించిరి. కావుననే యందుపయోగింపబడిన పదముల యదార్థ తాత్పర్యమును వివరించుటకై మనకొక సహాయకుడు కావలసియున్నాడు.

విస్తారమైన వేదములయొక్క సంపూర్ణ దృశ్యమును, అందు ఉపనిషత్తులయొక్క సరియైన స్థానమును సూచించుటకు గాను నే నిప్పుడు చెప్పిన యుపోద్ఘాతము చాలునని తలచెదను. ఇచట మనపని కేవలము విద్యాలయపు విజ్ఞానముతో వినోదించుట కాదు. ఇచట మనము చేయిచేయి కలిపి, ఉపేక్షింపబడిన దేవాలయమునకు దారితీయు మధ్యమార్గముద్వారా, అడుగులు వేయుచు, శాశ్వతమానముతో పరిపాలించు మహత్తరమైన పరమాత్మ తత్త్వముయొక్క సముఖమునకు చేరవలసియున్నది.

ముక్తికోపనిషత్తులో మాండూక్యోపనిషత్తును గూర్చి యిట్లు సమీక్ష చేయబడియున్నది. "ముముక్షువులకు విముక్తి నందుటకు మాండుక్యోపనిషత్తు ఒక్కటియేచాలును." ఇది చాలా టూకీగా చెప్పబడినప్పటికిని మహత్తరముగానున్నది.

ఈ యుపనిషత్తునందు గద్యాత్మకమగు పన్నెండు మంత్రములే యున్నను, భూతకాలమందుగాని, వర్తమానకాలమందుగాని, యే వేదాంతము సాధించలేని, యీ జీవితముయొక్క సమగ్రపరిశీలనను అతిసునిశితముగా నెరవేర్చినది. ప్రాచ్య దేశములోని మతములుగాని, పాశ్చాత్య దేశము నందలి వేదాంతముగాని జీవితములోని యొకభాగమగు జాగ్రదవస్థను గుఱించి మాత్రమే సాధారణముగా పరిశీలనలను చేసినవి.

కాని ఆ పరమతత్త్వము దృష్ట్యా వేదాంతము సంపూర్ణ జీవిత మునుగాని, మానవానుభవములయొక్క మొత్తమునుగాని వివ రించునదిగా యుండవలెను. శ్రీ శంకరులు గౌడపాదాచార్యులు కూడ వేదాంతమున కిట్టి నిర్వచనమునే యంగీకరించిరి. మాండూక్యోపనిషత్తులో నా మహర్షి మానవజీవితమును పూర్తిగా విడమర్చి యందుండు సంపూర్ణ సత్యమును కనుగొను విధానమును వ్యక్తపఱచుటలో సహాయపడుచున్నాడు.

మన మనుభవములను గణించి, జీవితమును జరుపు కొను త్రివిధమైన చేతనావస్థలు నిందు పరిశీలితమగుటయేగాక వాని నొక్కటొక్కటిగా నభ్యసించుటకుగాను నీ యుపనిషత్తు ఆ త్రివిధమైన యవస్థలను ఇచట గ్రహించియున్నది. ఆ మహా ర్షులీ మానవ జీవితమునుగూర్చి తెలిసికొనుటకుగాను నవలంబిం చిన పరిశీలన, పాండిత్యపటిమ భావనాచరిత్రలో సాటిలేనిదై యున్నది. అచట ఆవేశముగాని, ఉద్రేకముగాని, వ్యామోహా దులుగాని లేవు. వారిది సత్యతృష్ణ. కావున వారా సత్యమును తప్ప మరి దేనిని యన్వేషించలేదు. అట్టి యన్వేషణయం దెట్టి యనిశ్చిత నిర్ణయములకు రావలసివచ్చినను, వారు నిరుత్సాహమునుగాని, ఆతురతనుగాని, భీతినిగాని, నిస్పృహను గాని చెందలేదు. వారు శ్రద్ధాస్థైర్యములు కలవారై, అణచ రాని జ్ఞానకాంక్షతో తమ యన్వేషణను సాగించిరి. అట్లు వారా సత్య శిఖరాగ్రములను చేరినవారై, వారి యనుభవము లను, అవ్యక్తమై యనుభవైకగ్రాహ్యములగు పదములద్వారా తమవలె అంతఃప్రేరితులైన శిష్యులకొఱకు ఘోషించిరి.

కేనోపనిషత్తులో, కఠోపనిషత్తులో నిదివఱకు వివరించి యున్నట్లు ఉపనిషత్తులకు సాధారణముగా గ్రంథకర్తలనబడు వారు లేరు. కాని మన మీ మహత్తర సాహిత్యఖండములకు నొక గ్రంథకర్తను కనుగొనుటకు మన దౌర్బల్యముచే ప్రయత్నము చేయుదుము. ఇట్లు మధ్వాచార్యులు, అతని శిష్యులైన శ్రీనివాస, వ్యాసతీర్థులను నిద్దఱునుకూడ "ఈయుపనిషత్తులో ప్రథమాధ్యాయము నందున్న గద్యాత్మకమగు మంత్రములు, పద్యాత్మకమగు కారికలు కూడ, వరుణుడు మండూకరూపమును ధరించి యందజేసినవి" అని చెప్పుచున్నారు. ఈ వివరణ పౌరాణిక మనస్తత్వము కలిగిన వారిని సంతృప్తిపఱచగలదేమోగాని నేటి విశ్వవిద్యాలయము లందలి విద్యార్థులను మాత్ర మేవిధముగను తృప్తిపఱుపజాలవు. మాండూక్యోపనిషత్తును చదువుటకు నిది మనకొక తికమక సమస్యను కలిగించుచున్నది. ప్రొఫెసరు డ్యూసను ( Duesson ) మాండోక్యోపనిషత్తు అనునదొకటి ప్రత్యేకముగా లేదనియు, మంత్రభాగము కూడ గౌడపాదునిచేతనే రచింపబడినదనియు, ఈ వాఙ్మయమంతయు నొక ప్రకరణగ్రంథము లేక వేదాంత విభాగములో నొక వివరణ గ్రంథమనియు, తన "ఉపనిషత్తులలోని వేదాంతము" అను గ్రంథములో ప్రకటించి దానినే నిరూపింప యత్నించినాడు. ఇట్లు తన సిద్ధాంతమును రుజువు పఱచుకొనుటకు శ్రీ శంకరుల నుదహరించుచు నిట్లు చెప్పుచున్నాడు. "శ్రీ శంకరులదృష్టిలో నిదియొక ప్రకరణగ్రంథము మాత్రమే యైయున్నది. అందుచేతనే తన యుత్కృష్టగ్రంథము

లలో నెచటను శ్రీ శంకరు లీ మాండూక్యోపనిషత్తును ఉదహ రించలేదు" అని ద్వ్యాసను వాదనమై యున్నది.

పై విధముగా మధ్వాచార్యునకును ద్వ్యాసనునకును తమ అభిప్రాయములో అత్యంత విభేదము కానవచ్చుచున్నది. మధ్వాచార్యుడు కారికలు కూడ నీ యుపనిషద్భాగములోనే చున్నవనుచుండ ద్వ్యాసను మంత్రములుకూడ కారికాభాగమే యనుచున్నాడు.

వివేకవంతులైన పండితు లిట్టి నిరర్థక వాదనలతో తమ యమూల్య సామర్థ్యములను వ్యర్థపఱచియు, యుపనిషత్ప్రాపి తము వలని సరియైన లాభము నెట్లు పొందలేకున్నారో యను దానికి మచ్చుగా నే నీ విషయము నిచట యింత విపులముగా వివరించి యున్నాను. శంకరుడు తన భాష్యములో మాండూ క్యోపనిషత్తును నుదహరించలేదని ముతుకగా చెప్పి విమర్శిం చుట యీ సున్నితమైన వ్యవహారమున నది యింకను ముదుక యగుటేకాక తాత్కాలికపద్ధతిగా కూడ నుండగలదు. వాస్త వములో మాండూక్యమునుండి యుదహరించుచున్నామని చెప్పాచు శ్రీ శంకరులకంటె పూర్వీకులైన యనేకులు ఈ యుపనిషత్తునుండి యుదహరించియున్నారు. శ్రీ శంకరుల భాష్యమందుకూడ మాండూక్యోపనిషత్తు నందలి భావములను జీర్ణించుకొని ప్రతేన్చిన వాసనను అనేకస్థలములందు, అనేక పదములలో కనుగొనగలము. తన సాహిత్యోద్దేశ్యమునకు నీ గద్యమంత్రము లంతగా నుపయోగపడకుండుటచే శ్రీ శంకరు లీ యుపనిషన్మంత్రములను యథాతథముగా నుపయోగింపక పోయి యుండవచ్చును. శ్రీ శంకరులు తమ భావముల నభి

వ్యక్తపఱచుటకై యీ మంత్రములు నేరుగా నుపయోగపడ లేదు. మరియు నతని గద్యరచనా విన్యాసములోని యను ప్రాసకు మాధుర్యమును కూడ నీయలేకపోయెను. శ్రీ శంకరులు కేవలము వేదాంతియేగాక కవితాశిల్పి కూడ యని తెలిసి కొనిన మనము అతడు మాండూక్యోపనిషత్తును నుదహరించ కుండుటను మరికొంత యామోదించగలము.

అద్వైత తత్త్వమును స్థాపించుటచే మాండూక్యోప నిషత్తు చాలా చిన్నదైనప్పటికిని వేదాంత వాఙ్మయములో నత్యున్నతస్థానము నాక్రమించుచున్నది. జపించుటకు తగిన మహావాక్యములలో నొకటి యగు "అయమాత్మా బ్రహ్మ" యనునదీ యుపనిషత్తులో కలదు. వేదాంతసాధనకై నొక్కొక్క వేదమునుండి గ్రహింపబడిన నాలుగు మహావాక్యములు గలవు. అందు "అయమాత్మాబ్రహ్మ— ఈ మనలోని ప్రత్యగాత్మయే యీ పరమాత్మయగు బ్రహ్మ" అను నీ వాక్యము అధర్వణ వేదమునకు సంబంధించినది. అట్టి యీ వాక్యము ఈ యుపనిషత్తునుండియే గ్రహింపబడినది.

వేదాంతులు, మీమాంసకులు యిరువురు కూడ "శాస్త్రగ్రంథములను విశ్వసించుటకు ఆ గ్రంథములే నిశ్చయ మైన వాదాత్మకము లనియు, ఆ శాస్త్రముల ప్రామాణ్యము అధికారపూర్వకమైనదనియు తెలిసినప్పటికిని వారిద్దరు ఉప పత్తి-లేక-హేతువాదమును శాస్త్రవివరణకై నంగీకరించి యున్నారు. అనేక శ్రుతిగ్రంథములు సత్యప్రమాణముతో నిరంతరముగా "అగ్ని చల్లగానున్నది" యనిన దానినట్లు గ్రహింపజాలము కదా! అట్టి స్థలములందు మనమా శైలి

కేవల మాలంకారికమనియు, నా శ్రుతివాక్యముల కొక యుప పత్తి పూర్వకమైన యర్థమును గ్రహించవలయుననియు తెలిసి కొనవలెను. ఇట్లే మన యుపనిషత్ప్రారమందు, మంత్రములు, సత్యప్రకాశములైన కారికలు, తదన్వేషణ, తచ్చింతనల కొక మార్గమును, క్రమమును సూచించుచున్నవి. కావున గౌడ పాదాచార్యులు మన బుద్ధికొక పుష్టికరమైన యాహారము నిచ్చువాడై తన కారికలద్వారా తర్కవాదములతో నతి భోజనమును కూడ నిచ్చుచున్నాడు.

ఈ గ్రంథమంతయు అనుకూలముగా నాలుగధ్యాయము లలో విభజింపబడినది. మొత్తముమీద కారికలు 215 శ్లోకము లలోనున్నవి— ఆగమప్రకరణము–29; వైతథ్యప్రకరణము–38; అద్వైతప్రకరణము– 48; అలాతప్రకరణము– 100.

ఆగమప్రకరణములో పండ్రెండు మంత్రములును, మధ్యమధ్య యామంత్రార్థమును, తదుద్దేశమును వివరింప దలచినపుడు కారికాకారుని కారికలును గలవు. కారికభాష్యము కాదని యిదివఱకే మేము వివరించి యుంటిమి. సంపూర్ణ శాస్త్రముయొక్క యేకాభిప్రాయమును వివరించుటతో కారికా కారుని పని ముగియుచున్నది. శాస్త్రము సంపూర్ణమైన భావనాపద్ధతిని సమగ్రముగా వివరింపదలచిన, కారికాకారు డందలి యొక భాగమును మాత్రము విపులీకరించి విశదపఱచు చున్నాడు.

ప్రతి యధ్యాయమునకు ముందందలి విషయమును ఉపోద్ఘాతముగా చెప్పెదము. అప్పుడు మీ కా విషయము అత్యంతము పరిచితము కాగలదు.

# మాండూక్యోపనిషత్తు

## ఆగమ ప్రకరణము

మాండూక్యోపనిషత్తులోని యీ ప్రథమాధ్యాయము కారికలతోపాటు మంత్రభాగము కూడ కలిసియున్నదగుటచే "ఆగమప్రకరణము" అని పిలువబడుచున్నది. గ్రంథమంతయు కారికాకారునిదే యను 'డ్యూసను' మహాశయుని యభిప్రాయమును నే నిదివఱకే వివరించియున్నాను. ఇప్పుడు డా॥ వెల్లెసర్ (Welleser) "గౌడపాదీయకారిక యనునది నాలుగధ్యాయములతోకూడిన యొక గ్రంథముయొక్క పేరేగాని గ్రంథకర్త పేరును సూచించునది మాత్రము కాదని" నిరూపించుటకు యత్నించుచున్నాడు. గౌడదేశము (ఉత్తర బెంగాలు)లో నాడు ప్రచారములోనున్న వేదాంతమునకు కొన్ని సిద్ధాంతములు కలవనియు, అవన్నియు నీ నాలుగధ్యాయములలో కూర్చబడియుండుటచే నిది గౌడపాదీయకారిక యనబడుచున్నదనియు అతని వాదనమై యున్నది. సంగ్రహించి చెప్పిన "పుస్తకమే గ్రంథకర్తగా పరిణమించినదిగాని గ్రంథకర్త గ్రంథముగా పరిణమించినది కాదని" యతని మతము. ఆ ఫ్రాంసు పండితునకీ తికమక "గౌడపాదీయ"యను బహువచన ప్రయోగముచే కలిగినది. కాని గౌరవనీయు లెప్పుడును బహువచనములోనే సంబోధింపబడుదురను విషయ మతడు మఱచినాడు. సంస్కృతములోనే కాదు ఇంగ్లీషులో కూడ నిట్టిది కలదు. ఉదా :- రాచరికపు "మేము". 'గౌడ' యనునది యొక తెగవారి నామమై యుండవచ్చును. 'పాద' యనునది

గౌరవార్థమై చేర్చి యుండవచ్చును. ఇట్లు మనము "గౌడ దేశము నుండి వచ్చిన యొక గౌరవనీయుడైన మహర్షి యీ కారికలను రచించెనని" నిర్ణయించవచ్చును.

అనుకూలమైన స్థలములలో కారికలు చేర్చబడిన పన్నెండు ఉపనిషన్మంత్రములతో కూడియుండుటచే నీ ప్రథమాధ్యాయము "ఆగమప్రకరణ" మని పేర్కొనబడు చున్నది. శ్రీ గౌడపాదుని 29 శ్లోకములు ఉపనిషత్ గ్రంథము నందలి పదములకు ప్రతిపదార్థము నిచ్చుటకు పాటుపడుట లేదు. ఈ గ్రంథమందలి ముఖ్యాంశమగు తురీయమగు అద్వైత బ్రహ్మతత్త్వమును సులభముగా బోధించు విధాన ముతో నీ యుపనిషదర్థమును నమర్చుటకు ఈ కారికలు ప్రయత్నించుచున్నవి.

కారికాకారుడు తన ప్రత్యేక సిద్ధాంతములకు సూటిగాను తాను చెప్పబోవు విషయమునకు సంబంధించునవిగాను నుపయోగపడని పదములను వివరించుట మానివేసెను. కాని ఆ కారికలు విపులముగాను, విశదముగాను, సూక్ష్మమగు ఉప నిషత్పదములచే సూచింపబడి యుపదేశము చేయు భావము లను బయల్పరచుచునే యున్నవి. శ్రీ గౌడపాదుని వేదాంత మను చిత్రపటమునకు నీ మాండూక్యోపనిషత్తు చుట్టు చట్రము వలె నున్నది. ఈ ప్రథమాధ్యాయము "ఆగమప్రకరణమని" పిలువబడుచున్నది.

ఈ ప్రకరణ గ్రంథ ముపదేశగ్రంథ మనబడుచున్నది. ఆ పేరునకు తగినట్లుగానే గ్రంథ విషయమగు బ్రహ్మతత్త్వ

మును నొక సాధకుడు తన పరిణతిచే నందుకొనుటకు వీలగు నట్టి ప్రబలమైన నుపదేశము లీగ్రంథమందు నిమిడియే యున్నవి.

శ్రీ గౌడపాదుడు గ్రంథము నాధారముగా చేసికొని జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను, తదనుభవములను, విశ్లేషించి వివరించుచు, తద్ద్వారా యీ మూడింటికిని యావల నుండు ఆత్మసామ్రాజ్యమగు తురీయావస్థను మన బుద్ధిగ్రాహ్యమగునట్లుచేయ ప్రయత్నించుచున్నాడు. ఇట్లే గ్రంథమును, కారికలను విశ్లేషించుటచే మనకు సులభగ్రాహ్యమగుటకై రాబోవు చిత్రపటములో నున్నవిధముగా వ్యక్తపఱుపవచ్చును.

మం॥ హరిః ఓం । ఓ మిత్యేత దక్షరమిదం సర్వం
తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి
సర్వ మోంకార ఏవ । యచ్చాన్య త్త్రికాలాతీతం
తదప్యోఙ్కార ఏవ॥ ౧

ఈ ఓం అను అక్షరమే సర్వమునై యున్నది. దీని వివరణము ముందు చెప్పబడుచున్నది. భూత భవిష్యద్వర్త మానములు 'ఓం' యనునదే యగుచున్నవి. త్రికాలాతీతమైన దేదిగలదో అదికూడ 'ఓం' కారమే యగుచున్నది.

ఇందు ప్రవేశము లేక విలాసముగా పుస్తకము చదువు వారికి నీ యుపనిషత్తునందలి తొలి పదములే యత్యంతము అసందర్భములుగా తోచును. ఆ సత్యమును గూర్చిన ప్రకట నయే యేదో విప్లవాత్మకముగా నుండును. మరియు నా సత్య మును హఠాత్తుగా ప్రకటించుటచే వారికాపదములు వింత గాను, భయంకరముగాను గోచరించును. కాని నేనిదివఱకు చెప్పినట్లు శ్రుతులన్నియు గురుశిష్యుల మధ్య జరుగు శాశ్వత సంభాషణారూపములు. గంగామాతయొక్క ప్రవాహ గానము లతో ప్రతిధ్వనించు హిమాలయ ప్రాంతపు లోయలలో, ఒక పర్ణశాలా ప్రాంగణమున కూర్చుని శాంతివాసనల వెదజల్లు ప్రశాంతసాధుమూర్తిని మనమా యుపనిషత్పదములద్వారా చూడవలెను. దివ్యత్వమునందు ఏకాగ్రబుద్ధిగలవాడై, శక్తి పూరితుడై, తన యెదుట కూర్చునియున్న యువక శిష్యునకా గురుమూర్తి యావేశపులకితుడై తన యందలి యాత్మతత్త్వ మును గూర్చిన జ్ఞానవర్షమును కురిపించుచున్నాడు. ఈ యుప నిషత్తులను ప్రారంభించుటకు ముందు మనమిట్టి దృశ్యమును

చూడగలిగినయెడల ఆ పదములయొక్క గంభీరభావములు అసందర్భములు కావని మనకు తెలియగలదు.

ఒక సామాన్య సాధకుడు నిరాశా నిస్పృహలచేత బాధ పడి గురుపాదముల నాశ్రయించుటలేదు. పరిపక్వతచెందిన ఆధ్యాత్మికవిద్యార్థి కేవలము జీవితములోని నిరాశా మోహ ములచే చెదరగొట్టబడినవాడు మాత్రముకాదు మఱియు నతడు పిఱికివాడై జీవితబాధలనుండి పరుగెత్తిపోవనులేదు. పైగా నాతడు జీవితమును సంతుష్టితో సమగ్రముగా గడిపి జీవితాంత మునందు జీవితములోని యుత్తమసుఖముకూడ దుఃఖము యొక్క రూపాంతరమే యని తెలిసికొని యున్నాడు. దీనిని మీరు కేవలము ఆత్మఘాతుకమైన నిరాశావాదమని భావించ రాదు. ఈ యసంతృప్తి జీవితములోని ఆశాభంగములవలన కలి గినది.కాక జీవితమును అత్యున్నతముగా ననుభవించుటవలన కలిగిన ఔదాసీన్యము మాత్రమే యగుచున్నది. అట్టి క్షణ మున నా సాధకుడు తన భావములనుగాని, తనలోని యనిర్వచ నీయమైన నిరాకారమైన యొక దివ్యత్వమును, ఎటునుండి వచ్చి నదో తెలియకుండగనే తనను చుట్టుముట్టిన యా దివ్యాను భూతిని వ్యక్తపఱచుటకు ఆతనికి మాటలు చాలుటలేదు. ఆ యనుభూతియణచరానిదే గాక ప్రోత్సాహకరమైనదిగా కూడ నున్నది.

కావున యదార్థమైన యొకవిద్యార్థి తాను సమగ్రశక్తి యుక్తుడై జీవించవలెనను కోరికతో నిండినవాడై తానిదివఱకు వివేకముతోను, శక్తియుక్తులతోను చక్కగా గడిపిన జీవిత మును వదలి గురుపాదముల నాశ్రయించుచున్నాడు. అంత

నతడు తనగురువు నిట్లు ప్రశ్నించుచున్నాడు. "హే గురూ ఆహార నిద్రాదులకంటెను, ధనసంపాదనాసంచయములకంటెను ఆశానిరాశలకంటెను జీవితములో మరియొక యుత్తమమైన నిర్దిష్టలక్ష్యమేదియు లేనే లేదా? ఈజీవితము కేవలము కష్టపరంపరలకు నిలయము మాత్రమేనా? సుఖదుఃఖముల ననుభవించుచు, జననమరణరూప సంసారములో చేయు యాత్రవంటిదేనా యీజీవితము? ఇట్టివేదనాత్మకమైన మరణమునుండియు-అతిచంచలమైన విషయ సుఖములనుండియు జీవికి ముక్తియేం లేదా? ఇంతకంటె ఉన్నతము ఉత్తమమునైన యభిలాషలతో జీవించుటకు తగిన ప్రశాంతిస్థానము, ముక్తిమార్గము మరియొకటిలేదా ?" అని ఈ విధముగా శిష్యునిచే ప్రశ్నింపబడినవాడై యా పరమగురువు శిష్యుని పరిపక్వస్థితినిగ్రహించి, యా శిష్యుని యొక సుదినమున తనవద్దకు పిలచి యీమహత్తైన యుపనిషత్తును బోధించి వివరింప ప్రారంభించును.

ఇట్టి విషయమును బాగుగా అర్థముచేసికొని, యీ పైన చెప్పినట్లుగా ఉపనిషత్ప్రారంభ విధానమును చక్కగాగ్రహించిన యెడల మనమాసం దేశములోని యథార్థభావమును సులభముగా గ్రహింపగలుగుచున్నాము.

మంత్రములోని హరిః ఓం, అనునీరెండు పదములును గురువుయొక్క ప్రార్థన యని చెప్పవచ్చును. ప్రతిదినము శిష్యుడు కూడ ఆ మంత్రమును జపించును. దీనివలన తనకు శాస్త్రము యొక్క సరియైన యర్థము తెలియునట్లు, తద్వారా వేదపాఠము సఫలముగా ముగియునట్లు దైవానుగ్రహము కలుగవలయు ననియే యాతని యుద్దేశము.

శ్రీ శంకరాచార్యులు తన యుపోద్ఘాతములో నిట్లు చెప్పుచున్నారు. "నామము, నామమునకు విషయమైన నామి (పేరుగలది) రెండును ఒకటియే యగుటచే నిచట ఓం అభిధానమునకే ప్రాముఖ్య మీయబడినది. ఈ యుపనిషత్తులో ప్రారంభమున ఆ ఓం లోని యక్షరముల ఉచ్చారణా విధానము వివరింపబడి, పిమ్మట నాయక్షరము లే భావమును సూచించుచున్నవో యది వివరింపబడి యున్నది. "తస్యేదం ఉప వ్యాఖ్యాం - దాని వివరణ యనుసరించుచున్నది-" ప్రస్తుతము గురువు శిష్యునకు ఓం అను అక్షరమును సులభశైలిలో నుచ్చరించుటకు గానుచెప్పి పిమ్మట 'అదియే యీ సర్వము' అని యొక్కపదములో నాతని సమస్యను తీర్చుటకై ప్రయత్నించుచున్నాడు." అని

శిష్యుని ప్రశ్నయేమనగా 'నే ననుభవించుచున్న యీ నానాత్వవిశిష్టప్రపంచము వెనుక సత్యతత్త్వమేదైన కలదా?" యనునది. గురువు అట్టి తత్త్వసిద్ధాంతమును చెప్పదలచుకొనిన వాడై, "సర్వశక్తిమంతమై, దివ్యతత్త్వమైన ఆత్మయొకటి యీదృశ్యమానమగు బాహ్యప్రపంచమునకు వెనుక నున్నది" అని చెప్పుచున్నాడు.

వేలకొలది మట్టికుండలకు మూలము మట్టి తప్ప మరి యొకటేదియు నెట్లుకాదో, అట్లే నీ దృశ్యమాన ప్రపంచమునకు కూడ నొక శాశ్వత దివ్యతత్త్వము మూలమైయున్నది. ఆ మట్టి కుండలన్నియు మట్టిలోనే పుట్టి మట్టిలోనే పెరిగి మరల మట్టిలోనే

కలియునట్లు ఈ ప్రపంచముకూడ నా పరతత్త్వమునందే సృష్టి స్థితి లయములు గలదై యున్నది. అట్టి సృష్టి స్థితి లయముల కాధారమైన సర్వవ్యాపి శుద్ధచైతన్యమే ఓం కారమని శిష్యునకు గురువు సూచించుచున్నాడు. ఇట్లు క్రొత్త తత్త్వమును గురువు చెప్పగానే శిష్యుడు మిక్కిల యాశ్చర్యాన్వితుడై, గురువును ప్రశ్నించు ముఖభంగిమతో గురువుయొక్క ముఖమును చూచుచున్నాడు. ఇట్టి భావమును శిష్యుని ముఖమందు కనిపెట్టిన గురువు దయార్ద్రుడై "దాని వివరణను ఇకముందు చెప్పబోవుచున్నాను" అని తొందరగా బదులు చెప్పుచున్నాడు.

మరియు హిమాలయ పర్వతలోయలలో నుండు ఆశ్రమములో నివసించు నా శిష్యునకు ఆ ఆశ్రమము, తత్ప్రాంతమున ప్రవహించు గంగ, ఆ చుట్టునున్న పర్వత లోయలు, అన్నియు పవిత్రములే కావున ఆతడు వీని నన్నిటిని ఓంకారముగా భావించుటకు అంతకష్టము కాదు. కావున ఓంకారమనగా తాను చూచు పరిసరప్రాంతములు తన ఆశ్రమము, అందుండు గురువు మాత్రమే యని శిష్యుడపార్థము చేసికొనకుండుటకై "భూతభవిష్యద్వర్తమానముల నుండునదంతయు ఓంకారమే" యని గురువు చెప్పుచున్నాడు. అనగా మన తాత ముత్తాతలచేత గ్రహించబడిన, మనము గ్రహించుచున్న, మన సంతానము గ్రహించబోవు నీ విషయ ప్రపంచమంతటికిని త్రికాలాబాధ్యమైన ఆధారరూపమగు ఆత్మతత్త్వమొకటి యున్నదనియు, అట్టి ఆత్మకే యీ ఓంకారము ప్రతీకమనియు తాత్పర్యము.

ఇచటకూడ శిష్యుడు కొంతవఱకు తికమక పడవచ్చును అనగా త్రికాలము లందు గ్రహింపబడు ప్రపంచమున కాధార మగు ఆత్మకే యీ ఓం ప్రతీకమనియు త్రికాలాతీతమైన దానితో నీ యాత్మ కెట్టి సంబంధమును లేదనియు శిష్యుడు భావించవచ్చును. కావున గురువు, "పరిమితమైనదానికి, యపరిమితమైనదానికి, అనగా త్రికాలాంతర్గతమైనదానికి, త్రికాలాతీతమైనదానికిని ఓంకారమే ఆధారము" అని చెప్పు చున్నాడు.

కాలజ్ఞానము మనస్సుయొక్క యింద్రజాలము. మనస్సు లేనిచోట కాలముకూడ నుండజాలదు. అట్టి మనస్సు జడము, అచేతనము, భౌతికము అని మన కందరకును తెలియును. కాని యీ మనస్సు జీవము నందినపుడు చేతనము చలనక్రియా వంతము నగుచున్నది. కావున త్రికాలాతీతమైనది ఆ దివ్య చైతన్యమే. దానివలనే యీ దేహమనోబుద్ధులనెడి యంత్రము చేతనమై చలనశక్తిగలదై పనిచేయగలుగుచున్నది.

ఇట్లు ఓంకారము, అందలి మాత్రలు, వాటి సూచ నలు కూడ యీ సృష్టప్రపంచమునకే కాక దానికాధారమగు నా అద్వైతబ్రహ్మతత్త్వమునకు కూడ ప్రతీకమై యున్నది. ఆత్మీయముగా చూచిన నీ ఓంకారము మనలోనుండు దేహ మనోబుద్ధులకే కాక దానివెనుకనుండు ఆత్మకేంద్రమునకు కూడ ప్రాతినిధ్యము వహించుచున్నది. అది యెట్లు అను దానినే యీ ఉపనిషత్తునందు గల పన్నెండు మంత్రములు వివరించుచున్నవి.

మం॥ సర్వం హ్యేతద్బ్రహ్మాయమాత్మా బ్రహ్మ
సోఽయమాత్మాచతుష్పాత్॥ 2

ఇది యంతయు బ్రహ్మమయే, ఈ ప్రత్యగాత్మ కూడ బ్రహ్మమయే. అట్టి యీ ఆత్మ చతుష్పాదములు గలది యగుచున్నది.

పూర్వమంత్రములో మహర్షి తన యతీతజ్ఞానమును సంగ్రహించుచు "ఇది యంతయు ఓం"అని చెప్పెను. దానినే కొనసాగించువాడై, శిష్యునకు వివరించు నుద్దేశముతో, 'ఇది యంతయు బ్రహ్మ' అని చెప్పుచున్నాడు. అనగా "ఆ ఓంకారమే బ్రహ్మ" యని శిష్యు డర్థము చేసికొనవలయుననియే గురువుయొక్క భావమై యున్నది. ఓం మనలోని ఆత్మ కేంద్రమునకే కాక భ్రమాత్మకమైన నీ సమస్త ప్రపంచమునకు నాధారమైన యీ పరమాత్మనుకూడ సూచించుచున్నది. నామరూపాత్మక ప్రపంచమంతయు నా సర్వవ్యాపి సత్యతత్త్వముపై నారోపింపబడినదే" అనియే సమస్త యుపనిషత్తులు నిరంతరము విసుగుచెందక ఘోషించుచున్నవి.

వేదాంత విచారణయందు దేహమనోబుద్ధులనుండి విరక్తుడై తొలగి ఆత్మధ్యానము చేయవలసినదని గురువు చెప్పినను తుదకది యాతనిలోనుండు ఆత్మతత్త్వమునకే దారి తీయుచున్నది. తన చుట్టునుండు రాక్షసిక ప్రవృత్తులనుండి విడమరచి కేవలము ప్రత్యేకవ్యక్తిలోనుండు దివ్యత్వమును మాత్రమే యీ విధానమువలన కనుగొనుచున్నామని భావింపరాదు. ఇచట ఆత్మజ్ఞాన మనగా సర్వత్ర వ్యాపించియుండు ఆ దివ్యత్వముయొక్క జ్ఞానమే అని తెలియవలెను.

ఈ యభిప్రాయమునే వేదాంతములో నొక యుదాహరణద్వారా చక్కగా వివరించియున్నారు. ఒక గది నావరించియుండు ఆకాశము వాస్తవములో నా మహాకాశముకంటె యెవ్విధముగను భిన్నము కాదు. బయలనున్న ఆ మహాకాశము ఏ కాలమందును యద్విధముగను పరిచ్ఛిన్నము కాలేదు. రాళ్ళు, ఇటికలు, గోడలద్వారా నా మహాకాశము నియమితమైనట్లు గ్రహించలేము సరికదా నా గోడలు, ఇటికలు, రాళ్ళు, గదిలోని యాకాశము ఇత్యాదు లా మహాకాశములోనే నిలచి యున్నవి. ఆకాశమే ఆకాశమునకు హద్దు కలిగించుచున్నదని చెప్పగలమేమోగాని మరియే యితరమైన ద్రవ్యము దానిని పరిమితము చేయలేక పోవుచున్నది. అట్లయినను నా మహాకాశము గదిగోడలమధ్య నున్నదై తనను ప్రత్యేకమైనదానినిగాతలచి, "నేను వంటగది ఆకాశమును, పడకగది ఆకాశమును" అని తనలో భావించుకొనుచున్నది. వాస్తవములో నా గోడలు కట్టుటకు పూర్వమా యాకాశము మహాకాశముగానే యుండినది. మరియు నా గోడలు విరిగిపడినను మరల నది మహాకాశముగనే యుండును. కావుననే "గదిలోని యాకాశము" అను నీ ప్రత్యేకభావము కేవలము మిథ్యాకల్పితము. ఆ మహాకాశము ఆ గదిలోని గోడలు మొదలైనవానితో మిథ్యాతాదాత్మ్యమును పొందుటచే గలిగిన భ్రమయే యది. వాస్తవములో గదిలోని యాకాశము మహాకాశము నొకటియేయై యున్నవి.

అట్లే, శాశ్వతమై, అనంతమై, అవ్యయమైన ఆ సత్యతత్త్వము మాయాచోదితమై నీ దేహమనోబుద్ధులతోడి

ఏదైతే మనలో నాత్మగా పరిగణింపబడుచున్నదో నా దివ్యమైన జీవజ్యోతిని–వేదాంతపరిభాషలో పరమాత్మగా చెప్పబడుదానిని సూటిగా కాకపోయినను, నా పవిత్ర భాషలో ధ్వనిరూపముగానైన సూచింపవలెను కదా ? అట్లు చేయుటకు వేదాంతములో వివేచన తర్కము ఉపయోగింపబడినవి. ఏ నామరూపములద్వారా జీవతత్త్వము నిరంతరము విస్పష్టగా పనిచేయుచున్నదో, ఆ నామరూపములను ఈ వివేచనాతర్కములు నిర్దయతో విమర్శించి వివరించుచున్నవి.

దూరముగా కొండలలో ధూమమును చూచిన యచట యగ్ని యున్నదని మనము నిర్ణయించెదము. అట్లే అచేతనమైన, యీ భౌతికతత్త్వమందు చలనమును చూచిన ఏదో యొక చేతనతత్త్వము దీనితో సంబంధము కలిగియున్నదని మనము నిర్ణయించుచున్నాము. స్వతఃగా చలనము లేని యీ భౌతిక విషయమునుండి చలనమును చురుకుదనమును గ్రహించుటద్వారా ఋషులు మనకా యాత్మతత్త్వమును బోధించు మార్గము నవలంబించిరి.

విద్యుచ్ఛక్తి ఉన్నదున్నట్లు గ్రహించుటకు శక్యము కాదు. కాని యొక గ్రామీణునకు విద్యుచ్ఛక్తిని గురించి బోధింపవలెననిన అది గోచరించు బల్బులద్వారాను, పంకాలద్వారాను దానిని యతనికి ప్రత్యక్షపఱచెదము కదా !

సాయంకాలమందు సముద్రపుటొడ్డున నడచునపుడు [illegible] "నాయనా! సముద్రమనగా నేమి ?" అని యడిగిన దానిని వివరించుటకు, దానిని పరిశీలించుచున్న యా

పిల్లవానికి ప్రత్యక్షమగు విషయములద్వారాతప్ప వేరేవిధము మీకు లేదు కదా ! కావున మీరు "తరంగములు, చిఱుతరగలు, నుఱుగు ఇత్యాది నీవు చూచుచున్నవన్నియు, నీ చూపునకందక దూరముగా నున్నవన్నియు సముద్రమే. కాని యా సముద్రములో నీ తరంగములు, సంచలనములు, తుఫానులు, అపాయములు ఏవియు లేవు. అవన్నియు సముద్రము పైని తోచునవే యనియు, దాని లోతులలో సుందర్యశాంతి కూడ చేరని నిశ్చలమైన ప్రశాంతత కలదనియు ఇంకను లోతులకు పోయిన ముత్యాలు రత్నాలు దొరకుననియు చెప్పుదురు. ఇచట తండ్రి పిల్లవాని బోధకై సముద్రమును నుండు తరంగములు మొదలైనవానిని కనబఱచి, వాని సాకారమై యడుగున నుండునదే సముద్రమనియు, అదియే సీటి పై భాగమందు, తరంగములు మొదలైన రూపములను ధరించినట్లగపడుచున్నదనియు చెప్పవలసివచ్చును కదా !

అట్లే మన సనాతన ధర్మమునకు పితుగులైన మహాత్ములు శిష్యునియొక్క జ్ఞానతృష్ణను తీర్చుటకొఱకై, యీ పరమాత్మ తన నభివ్యక్తపఱచుకొను నీ నామరూపప్రపంచము ద్వారా నీ యాపరమాత్మనుసూచించి చెప్పుటకు ప్రయత్నించుచున్నారు.

ఈ మాండూక్యోపనిషత్తులోకూడ నారా పరమాత్మను దాని యభివ్యక్తరూపమగు ప్రపంచముద్వారా బోధింపఁబడుచుచున్నారు. ఇట్లు బోధించుటకై ముందుగా నా ఋషి అలంకారిక భాషలో "ఆ బ్రహ్మ నాలుగు పాదములు కలది" అని చెప్పుచున్నాడు. ఇట్లు చెప్పుటచే అవిభక్తమైన యా యఖండతత్త్వము నాలుగు భాగములుగా విభజింపబడినదని యెద్దే

శము కాదు. శ్రీ శంకరులచట తమ వ్యాఖ్యానములో నిట్లు వివరించియున్నారు. "ఆవుకి నాలుగు పాదము లున్నట్లు బ్రహ్మకు నాలుగు పాదము లున్నవని భావము కాదు. "పాదము" అనగా నిచట "అవయవము" అను కోశార్థమును తీసికొనగూడదు. అట్లైన నీ వేదాంతమంతయు అపార్థమును ఆపోహనే మనకు కలిగించగలదు. ఏక జాతీయమై అఖండమైన యీ పరమాత్మకు నాలుగు పాదములున్నవనిన స్వగతభేదము వచ్చిపోవును. ఇట్లు స్వగతభేదము కలది పదార్థమగుచున్నది. ఆ ఆత్మ పదార్థమనిన నదికూడ అంతవంతమై నశించునదగుచున్నది.

ఇచట నాలుగు పాదములనగా నాలుగు విధములైన కర్మక్షేత్రములు. మొదటి మూడు నాలుగవదానిలో లీనమై పోవునప్పటికిని ఆ యాత్మ నాలుగు క్షేత్రములలో నాలుగు విధములుగా నభివ్యక్తమగుచున్నదని భావము. అది యెట్లగుచున్నదో నీ యుపనిషన్మంత్రములను చదువునపుడు తెలిసికొందము. ప్రస్తుతము శ్రీ శంకరులు చెప్పినట్లు ఆ పాదములు ఈ దృశ్యమాన ప్రపంచమందు వ్యవహరించు అంశములుగా నర్థము చేసికొనిన చాలును. నాలుగణాలొక పావులాబిళ్ళగా నున్నది. అట్టి రెండుపావులాలు చేరిన అర్థరూపాయ యగుచున్నది. మూడుపావలాలు చేర్చిన ముప్పావలా యగుచున్నది. నాలుగవపావలా చేర్చినపుడు ఈ మూడు ఒక్కటై ఒక రూపాయ యగుచున్నది. ఆ రూపాయబిళ్ళలో నీ పావలా లవముగాని పరిమిత పావలాలు ప్రత్యేకముగాగాని లేవు కదా

అదేవిధముగా మానవుని ఆత్మీయ జీవితమును విడమర్చి చూచిన, మనము నిత్యము అనుభవించు మూడు అవస్థలు గలవు. అవి జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థలు. ఈ జాగ్రత్స్వప్నసుషుప్తులను అధిగమించి నాలుగవదగు తురీయావస్థను చేరినంతనే యీ మూడవస్థలు అందులో లీనమై ఏకమైన పూర్ణత్వము నందుచున్నది. ఆ పరిపూర్ణాత్మలో నీ మూడవస్థలు లేవుకదా. ఈ యుద్దేశ్యమే యీ మంత్రములో 'పాదములు' అను దానిచే సూచింపబడినది. అవి ఏవి ? అవి యెట్లు ప్రవర్తించుచున్నవి ? వాని కర్మక్షేత్రము లేవి ? యను నివన్నియు నికముందు వివరింపబడును.

> జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః సప్తాంగ
> ఏకోనవింశతి ముఖః స్థూల భుగ్వైశ్వానరః ప్రథమః
> పాదః ౩

ప్రథమ పాదము వైశ్వానరుడు. అతని కర్మక్షేత్రము జాగ్రదవస్థ. అతడు బహిష్ప్రజ్ఞ కలిగియున్నాడు. అతనికి సప్తాంగములు, పందొమ్మిది ముఖములు గలవు. అతడు స్థూల విషయములనే యనుభవించును.

జీవిత కేంద్రము మూడు ముఖ్యతత్త్వములతో కూడి యున్నది. అవి 'అనుభవించువాడు,' 'అనుభవింపబడునది,' యీ రెంటికి సంబంధమును కల్పించు 'అనుభవము'. భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు తమ పరిశీలనకు బాహ్యవిషయ ప్రపంచమును క్షేత్రముగా తీసికొనిరి. కాని వేదాంతులు ఆత్మీయము, ఆంతరిక విషయములనే పరిశీలనా స్థానములుగా పరిగణించిరి.

తార్కికదృష్టిలో నిట్లు ఆంతరికవిషయ పరిశీలన చేయగా తుదకు "జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూడు గలవని" కనుగొనిరి. ఈ మూడవస్థలలోను మనము ప్రవర్తించునపుడు మూడు ప్రత్యేకవ్యక్తులవలె మనలను కనుగొనెదము. జాగ్రదవస్థాభిమానియగు విశ్వుడు స్వప్నావస్థాభిమానియగు తైజసుని కంటె భిన్నునివలెను, ఆ తైజసుడు సుషుప్త్యవస్థాభిమానియగు ప్రాజ్ఞునికంటె భిన్నునిగను తనను భావించుకొనును. అట్లే ప్రాజ్ఞుడు విశ్వతైజసులకంటె తాను భిన్నుడని భావించును.

ఇచట ఉపనిషత్తు మనలోని విశ్వుని స్థానమును, అభిమానమును, కర్మక్షేత్రమును, అనుభవమునుు, వివరించి చెప్పుచున్నది. ఈ విశ్వుడు లేక వైశ్వానరుడు జాగ్రదవస్థాభిమానియై బాహ్యవిషయ ప్రపంచమును అనుభవించును. విషయజ్ఞానమును కలిగియుండుటయేగాక యాతనికి తెలిసిన యానందానుభవమంతయు నా విషయప్రపంచమునందే యగుచున్నది. అతడు శబ్ద, స్పర్శ, రూపరస, గంధాది విషయములను మాత్రమనుభవించగలడు. విశ్వుడు జాగ్రదవస్థయందున్నప్పుడు ఈ పంచేంద్రియ గోచర విషయ ప్రపంచమువందు తప్ప యితరత్ర యెట్టి యనుభవముల ననుభవింపలేడు.

ఈ విశ్వునికి "సప్తాంగములు – పందొమ్మిది ముఖములు" కలిగియున్నవని యిచట యీ యుపనిషత్తు వర్ణించుచున్నది. కేవలము వాచ్యార్థమునే గ్రహించు ధీమంతులు. ఇందుండు ధ్వని సౌందర్యమునుగాని, అలంకార సంపదనుగాని దానియందలి ముఖ్యభావమునుగాని గ్రహించలేరు. వాచ్యా

ర్థమును మాత్రము గ్రహించి వారు ఇది చాల అసందర్భ ముగా నున్నది యందురు. ఏలయన జాగ్రదవస్థలోని మానవుడు బహుపాదములు, బహుశిరస్సులుగల యొక భయంకర రాక్షసవ్యక్తియా యని వారికి తోచును. ఈ నాటి విద్యావంతులగు నవీన శాస్త్రజ్ఞులు, తమను భయంకర రాక్షసుల నుగా వర్ణించు నా యుపనిషత్తుల నెదుర్కొనుటకే యిట్టి యర్థము చెప్పుచున్నారు గావున మనము వారిని కనికరించవలసియే యున్నది. కాని యట్టి యనుమానమేదియు నిచట యుద్దేశింపబడియుండలేదు. మనమా వాక్యములను సూక్ష్మముగా పరిశీలింతము.

ఇచట ముఖమనగా విశాలభావములో "అనుభవించు సాధనము" అని యర్థము. ఇట్టి యర్థముతో చూచిన మనము పంచముఖులమగుచున్నాము. మనమీ విషయ ప్రపంచమును పంచేంద్రియములద్వారా యనుభవించుచున్నాము కదా ! ఈ మంత్రములో విశ్వుడు పందొమ్మిది ముఖములుగలవాడని వర్ణింపబడియున్నది. అనగా పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచప్రాణములు, మనోబుద్ధిచిత్తాహంకారములు నాలుగు కలిసి పందొమ్మిది యగుచున్నవి. ఈ పందొమ్మిది సాధనలద్వారా మనమీ బాహ్యప్రపంచమును జాగ్రదవస్థయందనుభవించగలుగుచున్నాము. ఇందులోనే యొక సాధన లేకున్నను, మన యనుభవము దానికి సంభంధించినంతవరకు తగ్గిపోవును. ఇట్లే యర్థమును గ్రహించగానే యిదివరకు తలచినట్లుగా ఉపనిషన్మంత్రార్థము అంత అసందర్భముగా తోచదు సరికదా చాల అర్థవంతముగాను, యుక్తి

యుక్తముగాను, సాటిలేని రచనగాను తోచును. కావున యుపనిషత్తులు గురువువద్ద కూర్చొని యభ్యసించిన ప్రయోజనవంతములగునే కాని గ్రంథాలయములలో కూర్చొని బీరువా నుండి తీసిచదివిన వానివలన యెట్టి ప్రయోజనము కలుగ జాలదు.

ఈ ఆత్మ బ్రహ్మయని ముందుగానే చెప్పబడినది. ప్రత్యేక జీవియే విరాడ్రూపము, ప్రత్యగాత్మయే పరమాత్మ యని చెప్పియుండుటచేత, వ్యష్టియే సమిష్టియని రుజువుపఱచు కొనినచే పై వాదము దృఢపడగలదు. దీనిని రుజువు పఱచుటకే జాగ్రదవస్థాభిమానియగు విశ్వునకు సప్తాంగములు కలవని చెప్పుచున్నది. సప్తాంగములు ఛాందోగ్యోపనిషత్తులో వివరింప బడియున్నవి. శాస్త్రీయ సంప్రదాయమును బాగుగా తెలిసి కొనినవారికి ఈ పై వర్ణన యీ విరాడ్రూపమును సూచించుటకు చాలియున్నది. వ్యష్టిజీవియగు విశ్వుడు తన పరిమితిని తనలో నిముడ్చుకొని జీవితమును గడుపు చున్నప్పుడు, విరాడ్రూపము సమిష్టినంతయు తనలో నిమిడ్చికొని యుండవలెను కదా! ఈ విరాడ్రూపమును సూచించుటకే శాస్త్రము తన స్వంత పరిభాషలో "ఆ విరాడ్రూపమునకు అధిక తేజస్వంతమగు సత్యలోకమే శిరస్సు, సూర్యుడే కన్నులు, వాయువే శ్వాస, ఆకాశమే మధ్యభాగము, జలమే యోని, భూమియే పాదము, ఆహావనీయాగ్నియే ముఖము'' అని చాందోగ్యము లోని వైదవ అధ్యాయములో పదునెనిమిదవ శ్లోకములో వర్ణింపబడియున్నది.

ఆర్యులు సహజముగానే కవులు. పరిసరములనున్న గంగా తీరము లందలి సుందరదృశ్యములచే వారిలో నీ కవితాశీల మభివృద్ధిచెంది యుండును. వారు తమ దేహమనోబుద్ధులతో సహా సమస్త ప్రపంచము నందలి మోహమును త్యజించినను, తామా యతీతావస్థయందలి యనుభవములను వివరించబోవు నపుడు తమలోని యీ కవిత్వవాసనను విడువలేకున్నారు. కావుననే శాస్త్రములలో కూడ వారి వాక్యములు అత్యంత అలంకారికముగను, కవిత్వసరణిలోను మనము కనుగొన గలుగు చున్నాము.

ఆ సంస్కృతభాష కే యట్టి సౌందర్యము కలదు. ఆ నాటి ఋషులు దానిని సదుపయోగము చేసిరి. శిష్యులు కూడ ఆ కాలపువారే గావున వారు కూడ యీ బ్రహ్మతత్త్వమును కావ్య సరళిలో వివరించిన మిక్కిలి యామోదించువారై యుండి యుండవచ్చును. ఇపుడు మనము చర్చించుపదము "సప్తాంగములు" అనునది చాలా సంగ్రహించి చెప్పబడినదై, అందు వేదాంతభావమే కాక అత్యంతకావ్యసరళి కూడ కలిగి యున్నది.

కావున ఛాందోగ్యోపనిషత్తులో విపులముగా వివరించ బడిన యీ విరాడ్రూపము మాండూక్యములో ఏకపదముచేత వర్ణింపబడియున్నది. విశ్వుని విశ్వరూపమే "విరాట్" అన బడుచున్నది. గీతలో భగవంతుని విశ్వరూపమును గురించి మీరు తెలిసికొనియే యుందురు. ఇట్లే జీవి విశ్వవ్యాపి యను టకుగాను వర్ణించిన యీ విరాడ్రూపవర్ణన ఆధ్యాత్మిక సత్య

మగు "అయం ఆత్మా బ్రహ్మ" అను మంత్రములోని భావ ముతో పూర్తిగా నేకీభవించుచున్నది.

ఒక గదిలోని యాకాశము ఆ మహాకాశము కంటె భిన్నము కాకపోవుటచే గదిలోని యాకాశమును మనము దానియందలి యాకాశత్వము ననుసరించి దానిని యనంతము లగు బ్రహ్మాండము లనిముద్చుకొను నా మహాకాశముగా వర్ణించగలము కదా ! ఇట్టి భావములోనే ఆ శుద్ధజ్ఞానమెంత తార్కికముగాను, శాస్త్రీయముగాను నున్నప్పటికిని, యుపని షత్తులలో వర్ణించిన యా యాత్మతత్త్వమును గ్రహించుటకు సాధనము కాజాలదని చెప్పబడినది.

తరువాతి మంత్రము తైజసుని వివరించుచున్నది.

స్వప్నస్థానోఽన్తః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతిముఖః
ప్రవివిక్తభుక్తైజసో ద్వితీయః పాదః॥ ४

ద్వితీయ పాదము తైజసుడు. ఆతని కర్మక్షేత్రము స్వప్నావస్థ. ఆతడు అంతఃప్రజ్ఞ కలిగియున్నాడు. ఆతనికి సప్తాంగములు, పందొమ్మిది ముఖములు, కలిగియున్నవి? ఆతడు మానసికప్రపంచము నందలి సూక్ష్మవిషయములను అనుభవించుచున్నాడు.

జీవి స్థూలదేహము నందభిమానము గలవాడై, ఆత్మ తత్త్వమును గ్రహింపజాలని యజ్ఞానములో బాహ్యమైన విషయప్రపంచమును గ్రహించుచున్నాడు. అట్టి మిథ్యాజ్ఞాన ముచే మోహితుడై జాగ్రదవస్థ ననుభవించుచున్నాడు. ఇట్టి

వ్యక్తి - అనగా జాగ్రదవస్థాభిమని "వైశ్వానరుడు" అని పిలువబడుచున్నాడు.

అదే జీవి బాహ్యప్రపంచమునుండి విరమించుకొని సూక్ష్మశరీరాభిమానియైనప్పుడు తైజసుడని పిలువబడుచున్నాడు. తైజసునికి స్వప్నావస్థలో నొక ప్రత్యేకప్రపంచము కలదు. ఇచట నీ మంత్రము తైజసుని కర్మక్షేత్రమును, ఆతడనుభవించు విషయప్రపంచమును, ఆతని స్వభావమును గుఱించి వర్ణించుచున్నది.

స్వప్నములోనున్నప్పుడు ఆ స్వప్నమును చూచువానికి అది యెంత సత్యమైనప్పటికిని ఆ స్వప్నము సత్యము కాదనియు అది వాస్తవములో స్వప్నమును చూచువాని మన స్సృష్ట ప్రపంచమే యనియు మన కందరకును తెలియును. జాగ్రదవస్థలో విశ్వుడు విషయప్రపంచమునుండి గ్రహించిన యనుభవములు ఆతని మనసునందు హత్తుకొని పోవుచున్నవి. ఆతని మనస్సులోని యొకభాగము స్వప్నావస్థలో, ఆతని మనస్సుయొక్క మరియొక భాగములోనున్న యీ యనుభవపరంపరలను దర్శించుచున్నది. ఇట్లు తైజసుడు సూక్ష్మ ప్రపంచగ్రాహి యగుటచే నాతడచటి సూక్ష్మ విషయప్రపంచము ననుభవించుచున్నాడు. కావున తైజసుని కర్మక్షేత్రము స్వప్నజగత్తై యున్నది. సప్తాంగములను, పందొమ్మిది ముఖములను ఇదివఱకే విపులముగా వివరించితిమి.

విశ్వతైజసు లిద్దరు మనలోని ఆత్మతత్త్వముయొక్క అంశములే. మనలోని యీ శుద్ధచైతన్యము స్థూలదేహాభిమాని

యగునపుడు వైశ్వానరు డగుచున్నాడు. అదే శుద్ధచైతన్యము సూక్ష్మ శరీరాభిమాని యగునపుడు తైజసుడై స్వప్న జగత్తుననుభవించుచున్నాడు. ఇట్లు రెండు పాదములను వివరించి యిప్పుడు ఉపనిషత్తు తృతీయ పాదమగు ప్రాజ్ఞుని వివరించ బోవుచున్నది.

> యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన
> స్వప్నం పశ్యతి తత్సుషుప్తం । తత్సుషుప్తస్థాన
> ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానంద
> భుక్ చేతోముఖః ప్రాజ్ఞస్తృతీయః పాదః ॥౫॥

నిద్రపోవువాడు ఎచట యెట్టి కోరికలను కోరడో, ఎచట స్వప్నమునుకూడ చూడడో, అదియే సుషుప్త్యవస్థ. ఈ మూడవ పాదమే ప్రాజ్ఞుడు. అతనిది సుషుప్త్యవస్థ. ఆతని యందన్ని యనుభవములు భేదరహితమై యేకీభవించు చున్నవి. అతడు సంపూర్ణచైతన్యముయొక్క ప్రజ్ఞాన ఘన రూపమై యున్నాడు. మరియు నా సుషుప్త్యవస్థ జాగ్రత్స్వప్నములయందు నా చైతన్యమును ప్రసరింపజేయుటకు ముఖ ద్వారమై యున్నది.

ఈ సుషుప్త్యవస్థను గూర్చి పాశ్చాత్త్యులింకను ఎక్కువగా తెలిసికొనవలేదు. పాశ్చాత్త్య మనస్తత్వశాస్త్రము కూడ యీ సుషుప్త్యవస్థను గూర్చి చర్చించుటకు సిగ్గుపడుచున్నది. సుషుప్తిని వర్ణించుటలో కలుగు కష్టమేమనగా సర్వేంద్రియములు నచట మనోబుద్ధులతో సహా నిష్క్రియములగుచున్నవి గావున తత్సంస్థూలసూక్ష్మ ప్రపంచములేవియు నచట యను

భవించి తెలిసికొనుటకు లేవు. మనకు తెలిసినదేదియు నచట లేదని చెప్పుటయే మనకు తెలియును.

మనకు గల ప్రపంచ జ్ఞానమంతయు దేహమనెడి గృహమునకు అంటియున్న విషయగ్రహణ యంత్రములగు పంచేంద్రియముల ద్వారా వచ్చినదే యగుచున్నది. కావున సర్వ ప్రపంచమును మనమీ యింద్రియములద్వారానే తెలిసికొనుచున్నాము. సుషుప్తిలో మనోబుద్ధులు విశ్రాంతి తీసికొనుటచేత నీ యింద్రియములు పనిచేయలేవు కావున సుషుప్తిలో మనము పూర్తిగా అజ్ఞానమునే అనుభవించుచున్నాము. సుషుప్తిలో మనకు తెలిసినది యొక్కటే. "నాకు ఏ జ్ఞానము లేదు" అని మాత్రమే మనము తెలిసికొనుచున్నాము.

కావున నవీనయుగములోని విజ్ఞాన శాస్త్రాభిమానియగు భౌతికవాది ఇంద్రియములుకూడ ప్రవేశించలేని యీ యవస్థను పేర్కొనుట కనుకూలమగు నవీనభాషకొరకు నాతడు వేచియుండవలెను.

సుషుప్తియొక్క లక్షణ మీ మంత్రములో నత్యుత్తమముగా చెప్పబడియున్నది. ఇచటకూడ నిషేధించు భాషలోనే లక్షణమున్నది. "ఎచట విషయవాంఛలేదో, ఎచట స్వప్నమును దర్శించడో" ఇత్యాది నిషిద్ధ వాక్యములచేతనే వర్ణింపబడియున్నది. అనగా జాగ్రత్స్వప్నములులేని యవస్థ సుషుప్త్యవస్థయై యున్నది.

జాగ్రత్స్వప్నావస్థలకు వ్యతిరేకముగా నిచట మానవ రూపములో నుండదగిన సమస్త జ్ఞానమును ఘనీభవించి

యున్నది. ఆ ప్రజ్ఞానమే మనస్సునందు ఇంద్రియములందు విభక్తమగుచున్నది. ఇంద్రియములు విషయమును గ్రహించిన మనస్సు దానిని స్థిరపరచుచున్నది. స్వప్నములో కూడ నా శుద్ధచైతన్యము మన మనోజగత్తులోని యాలోచనలను మాత్రమే ప్రకాశింపజేయుచున్నది.

కాని యీ జాగ్రత్స్వప్నావస్థల నధిగమించిన సుషుప్తిలో నీ ప్రజ్ఞానము స్థూలప్రపంచమునుగాని సూక్ష్మప్రపంచమును గాని ప్రకాశింపజేయదు. సుషుప్తిలో నీ ప్రజ్ఞానము ఘనీభూతమైనట్లు తోచును. కావున నచట మన చైతన్యమంతయు ప్రజ్ఞానఘనరూపములో నుండును. ఇట్టి ఏకరూపమైన ప్రజ్ఞానము ఆనందమయమని చెప్పబడుచున్నది. జాగ్రత్స్వప్నములలోనున్న మనస్సులోని యలజడులను సృష్టించుటకు తగిన కారణమిచట లేదు కావున నది యానంద మయమే యగుచున్నది. అయితే మనమా సుషుప్త్యవస్థకు సహజమైన యానందమును తెలిసికొనుచున్నామని భావముకాదు. కాని మనము మేల్కొనినంతనే జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను పోల్చిచూచినపుడు సుషుప్తిలో పరిపూర్ణ సుఖము ఆనందము ఉన్నదని మాత్రము గట్టిగా చెప్పగలము.

ఇట్లా యుపనిషద్గ్రంథములు సుషుప్త్యవస్థను వర్ణించునపుడు అది యానందమయమని వర్ణించిరి. అనగా నచట యానందమే యున్నదని దృఢపరచుటకంటె అచట మనోబాధలు కలిగించు కారణములు లేవని చెప్పుటయే వారి భావమై యున్నది. మనస్సులోని యలజడులు అశాంతియు కూడ విషయప్రపంచములో పొత్తుకొనిన వాసనల వలననే

కలుగుచున్నది. మన సుఖమునకు ప్రపంచ పదార్థములతో సంబంధము కల్పించుకొనుటచేత, నా పదార్థములను గ్రహించి, రక్షించి జాగ్రత్తపరచుకొనవలెనను కోరిక మనకు కలుగును. ఆ పదార్థములు మనకు లభింపకపోయినపుడు మనస్సులో అలజడులు బయలుదేరును.

ఇంద్రియ విషయములు మనకు సుఖమునుగాని దుఃఖమునుగాని నీయజాలవు. మనకవి సుఖదుఃఖములనిచ్చు శక్తి కలిగియున్నవనిన దానికి మన మా విషయములకిచ్చు అసత్యపు విలువలే కారణము. సుషుప్తిలో మనకు మనోబుద్ధులు పనిచేయవుకావున మన కీ విషయ ప్రపంచజ్ఞానమే యుండదు. అందుచే నా విషయములు మనలను పరిహసించుటకుగాని పరవశపరచుటకుగాని యవకాశము లేకపోవుటచే మనస్సునకు అశాంతి కలిగించు సమర్థత యా విషయములకు ఉండదు. కావున యీ యావరణను ఆనందమయ కోశమని శ్రుతి వర్ణించుచున్నది. ఆ పరమాత్మ యీ సుషుప్త్యవస్థాభిమాని యగునపుడు "ప్రాజ్ఞుడు" అని పిలువబడుచున్నాడు. ఈ ప్రాజ్ఞుడు విశ్వునివలె బాహ్య విషయములందుగాని, తైజసునివలె ఆంతరిక సూక్ష్మ విషయములందుగాని ఆనందము నన్వేషింపడు. ఆ సుషుప్తిలో నాతడు సంపూర్ణానందమునే యనుభవించుచున్నాడు. ఇచట ఆనందమనగా దుఃఖాభావరూపమగు ఆనందమే యగుచున్నది.

ఆ ప్రాజ్ఞుని నైజతత్త్వము నిచట శ్రుతి వివరించుచున్నది. ఆ సుషుప్త్యవస్థ ఆత్మజ్ఞానమునకు సింహద్వారము వంటిది. ఇచట మహర్షులయొక్క కవితావాసన గోచరించుచు

న్నది. ఉత్తమ కవిత ఘనమైన వేదాంతముతో కూర్చబడి నది. ఇదియే యుపనిషత్తులలోని ప్రత్యేక సౌందర్యము. ఆ ఋషులు కేవలము వేదాంతులు మాత్రమేకాక అంతఃప్రేరిత కవులై కూడ నున్నారు. ఈ సుషుప్తిని "చిత్" అని జ్ఞానము నకు సింహద్వారమని చెప్పుటచే నీ సుషుప్త్యవస్థలో విషయ గ్రాహియగు ప్రజ్ఞానమంతయు ఏకీభూతమై యొక ప్రజ్ఞాన ఘనరూపమును దాల్చినదని వివరించుటకు నిచటగురువు ప్రయ త్నించుచున్నాడు.

ఆ ప్రజ్ఞానము సుషుప్తినుండి స్వప్నమును ప్రకాశింప జేయుటకు ప్రసరించినది. అది మరికొంతదూరము ప్రసరించి జాగ్రదవస్థలో బాహ్యప్రపంచమును తెలిసికొనిచేయుచున్నది. అదేవిధముగ జాగ్రదవస్థనుండి మనము విరమించుకొని మన జ్ఞానము నీ స్థూలశరీరమునుండియు, బాహ్యవిషయ ప్రపం చమునుండియు మరల్చిన నా జ్ఞానము సూక్ష్మప్రపంచమగు స్వప్నావస్థను ప్రకాశింపచేయగలదు. అచటనుండి మరల మన జ్ఞానమును మరికొంత అంతర్ముఖముగా మరల్చిన నది సుషు ప్తిలో నొక ప్రజ్ఞానఘనమై జాగ్రత్స్వప్నరహితమైన స్థితి నందుచున్నది. అదియే సుషుప్తి. ఇట్లా జాగ్రత్స్వప్నములు ప్రకాశించుటకునై, తద్వారా చైతన్యకాంతులు ప్రసరించు టకుగాను నీ సుషుప్త్యవస్థ సింహద్వారమని చెప్పవచ్చును. ఇట్లు చెప్పుటలో సూక్ష్మమైన వేదాంతమును ఆత్మీయముగా వివరించుటకు ఉత్తమ కవిత యుపయోగపడుచున్నదనుటకు నిది యుదాహరణమై యున్నది.

ఈ సుషుప్త్యభిమాని ప్రాజ్ఞుడనబడుచున్నాడు. ఈ ప్రాజ్ఞుడే ఆ బ్రహ్మయొక్క తృతీయపాదము.

ఏష సర్వేశ్వర ఏషసర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష
యోనిః సర్వస్య ప్రభవావ్యయౌ హి భూతానాం 6

ఈతడే సర్వేశ్వరుడు. ఈతడే సర్వజ్ఞుడు. ఈతడే సర్వాంతర్యామి. ఈతడే సమస్తమునకు మూలకారణము. ఇందుండియే సమస్తము ఉద్భవించి యిందే సమస్తము లీన మగుచున్నది.

సుషుప్త్యవస్థాభిమానియగు ప్రాజ్ఞుని వివరించుటకు మహర్షి మరియొక మంత్రమును అధికముగా చెప్పు చున్నాడు. బహుశా సాధారణమానవుడు ఆ సుషుప్త్యవస్థను తెలిసికొనుటకుగాను తన జీవభావమునుండి విరమించుకొని యటు మరలుట కష్టమని యా గురువు గ్రహించియుండును.

జాగ్రదవస్థలోనున్న మన వ్యక్తిత్వమును గ్రహించుట చాల సులభము. సాధారణ మానవునకు స్వప్నావస్థను గ్రహించుటయే కొంత కష్టమగుచున్నది. కాని కొంత ప్రయ త్నముతో దానిని గ్రహించవచ్చును. ఇంక సుషుప్తిలో నుండు తనను గ్రహించుట మరియు కష్టమగుచున్నది. మన కందరికినీ పంచేంద్రియములచే గ్రహింపబడునదియే జ్ఞానము అగుటచే నా సుషుప్తి సమయములో నీ పంచేంద్రియములు నిద్రితమగుచున్నవి గావున నా సుషుప్తిని గ్రహించుట కష్ట తరమే యగుచున్నది.

ఆ సుషుప్తిలో నీ పంచేంద్రియములుగాని, బుద్ధిగాని పనిచేయజాలవు. అట్టి యవస్థలో మనమెట్టిజ్ఞానము లేనివారమై యొక యజ్ఞాతావస్థలో నున్నట్లు భావింతుము. కావున కేవలము శిష్యునిపై గల వాత్సల్యముచే నాగురువు ఈ ప్రాజ్ఞుని వివరించుటకు మరియొక మంత్రమును చెప్పుచున్నాడు.

సుషుప్తిలోనుండు జ్ఞానము కేవలము ప్రజ్ఞానఘనము. అది "నాకు తెలియదు" అను అజ్ఞానమును తప్ప మరి దేనిని తెలుపజాలదు. ఇట్టి యవస్థనే వేదాంతములో "అవిద్య" యందురు. కావున వేదాంతులు 'సుషుప్తిలో ఆత్మ కారణ శరీరాభిమాని యగుచున్నది, లేక "అవిద్యావ్రతమైనది" యని చెప్పుచున్నారు.

ఇట్టి అజ్ఞానమును ప్రకాశింపజేయు ప్రజ్ఞానఘనరూప మగు ప్రాజ్ఞుని 'సర్వేశ్వరుడు' అని గురువు వర్ణించుచున్నాడు. ఆ చైతన్యమే యచట లేకపోయిన మనము చేతనులమే కాలేము గనుక అదియే సర్వేశ్వరుడు అనబడుచున్నది. అతడే సర్వజ్ఞుడు. దివ్యజ్యోతి, శుద్ధప్రకాశము, ప్రకాశింపజేయు జ్ఞానము, అగు ఆ జీవతత్త్వమే లేకున్న మనము జాగ్రత్స్వప్నావస్థలనేగాక సుషుప్త్యవస్థనుకూడ తెలిసికొనియుండలేము. అతడు సర్వాంతర్యామి యనువది స్వయంబోధకమైయున్నది. ఆ చైతన్యమే సర్వపదార్థములకు సంభూతికారణమైన యోని యగుచున్నది. మనలో నీ చైతన్యమే లేకున్న సూర్య చంద్రాది విశిష్టబాహ్య ప్రపంచముగాని, సంకల్ప వికల్పాత్మకమైన మనోజగత్తుగాని, యోచనారూపమైన జ్ఞానప్రపం

చముగాని మనకు లేనిదే యగుచున్నది. మన గ్రహణశక్తి ననుసరించియే యవి యస్తిత్వము కలిగియున్నవి. మనుష్యునకు కొమ్ములు గలవుగాని మనకా జ్ఞానము లేదనుటయు మానవునికి కొమ్ములు వాస్తవములో లేవనుటయు నొకటే యగుచున్నది. ఆ చైతన్యమే మనలో లేనియెడల నీ విషయ ప్రపంచమంతయు మానవుని కొమ్ములవలె మనకు లేనివే యగుచున్నది.

ఈ శుద్ధ చైతన్యము మన మనోబుద్ధీంద్రియము లందు ప్రసరించునపుడు, మనకీ విషయప్రపంచము, మనస్సులోని యనుభవములు, బుద్ధిలోని యోచనలు గలుగుచున్నవి. ఆ చైతన్యమే దేహమునుండి వెడలిన యా దేహమునకు నీయనుభవాదులు ఉండనే యుండవు. ఇట్లు వేదశాస్త్ర ప్రకారము ననే గాక నేటి విజ్ఞానశాస్త్ర ప్రకారమునకూడ బాహ్యాంతర జగత్తంతయు ఆ చైతన్యమునందే సృష్టి స్థితి లయములు గలదై, ఆ చైతన్యమును ఆ పరమాత్మవైపు మరలించినపుడు అది అచట లీనమగుచున్నది.

ఒక పలకల గాజుకడ్డీపై సూర్యకిరణమొకటి పడిన, అది ఆ కిరణముయొక్క నానా రంగులను పైకి ప్రసరింప జేయుచున్నది. ఆ ఏడు రంగులుకూడ ఆ గాజుకడ్డీయందు పడిన సూర్యకాంతినుండియే బయలువెడలినవి. ఆ రంగులు ఆ తెల్లని సూర్యకాంతి లోనే ఇమిడియున్నవి. అవి మరల యా కాంతిలోనే లీనమై పోవుచున్నవి. అయితే ఒకే తెల్లని కాంతికి నిన్ని రంగులు కలుగుట యా పలకల గాజుకడ్డీవలననే జరుగుచున్నది. అది యా కాంతిని ఆటంకపరచి యేడు రంగు

లుగా బయటకు వెదజల్లినది. అట్లే మనలోని చైతన్యమును మనోబుద్ధులనెడి గాజుకడ్డీద్వారా ప్రసరింపబడినదై నానా రూప జగత్తును బయల్పరచుచున్నది. ఇదియే వేదాంత మతము. కావున ఆధ్యాత్మికసాధన ద్వారా మనమీ మనో బుద్ధుల నధిగమించిన, దానిద్వారా పైకి ప్రసరించిన నానాత్వ విశిష్ట జగద్రూపచైతన్యము సదా మనకు బాహ్యాభ్యంతర మందున్న బ్రహ్మతత్త్వములో లీనమగుచున్నది. అప్పుడు మనమీ నానారూప జగత్తునంతయు అద్వైతమైన ఆత్మ తత్త్వముగా చూడగలము. ఈ భావమే యీ పై మంత్ర ములో సూచింపబడినది.

(ఇచటనుండి గౌడపాదుని కారికలు ప్రారంభమగుచున్నవి)

కా॥ బహిష్ప్రజ్ఞో విభుర్విశ్వో హ్యన్తః ప్రజ్ఞస్తు తైజసః।
ఘన ప్రజ్ఞస్తథా ప్రాజ్ఞ ఏక ఏవ త్రిధా స్మృతః ౧

విశ్వుడు బహిష్ప్రజ్ఞ కలవాడు. సర్వవ్యాపి. తైజ సుడు అంతఃప్రజ్ఞ కలవాడు. ప్రాజ్ఞుడు. ఘన ప్రజ్ఞుడు. ఇట్లా ఏకమైన ఆత్మయే మూడవస్థలయందు మూడు విధములుగా పరిగణింపబడుచున్నది.

ఈ శ్లోకము గౌడపాదుని కారికలలోనిది. బాగుగా అమర్పబడి గంభీరమైన భావముగల శాస్త్ర గ్రంథములను వర్ణించి వివరించుటకు సహాయపడిన కారికాకారుడగు గౌడపా దునితో ప్రప్రథమముగా నీ శ్లోకములోనే మనకు పరిచయము కలుగుచున్నది. ఇంతవరకు నీ మహాగ్రంథములోని పన్నెండు మంత్రములలో ఆరు మంత్రములను చర్చించియున్నాము.

ఆటువ మంత్రము ముగియగనే గంభీర భావసూచకములైన యా మంత్రార్థముల సంగ్రహమును మన కందజేయుటకై కారికాకారుడు మనయెదుట రంగముపై ప్రవేశించుచున్నాడు.

ఉపనిషత్తులే చాల సంగ్రహముగ నుండునవి. ఇదియే హైందవ శాస్త్రగ్రంథములలో మహర్షు లవలంభించిన విశేష శైలి. ఆ సంగ్రహత కారణముగా సాధారణ మానవునకు వాటి వివరణ యెక్కువగా కావలసియున్నది. అట్టి వివరణయే లేకున్న నవి అర్థ రహితము లగుటయేగాక అసందర్భములుగా కూడ తోచును.

కారిక భాష్యముకంటె భిన్నమైనది. దానికూర్పు, దాని ప్రయోజనముకూడ భిన్నమే యగుచున్నది. ప్రతి పదమునకు ప్రతి సూత్రమునకు కూడ సంపూర్ణ వివరణ, సమగ్ర వర్ణన నిచ్చుటయే భాష్యకారుని యుద్దేశమై యున్నది. కాని కారికా కారునికి ముఖ్యమైనవని తోచిన ప్రయోగములకు వివరణ నిచ్చుటతో తనపని ముగియుచున్నది. కావున సాధారణ మానవునకు కఠినముగను, వివరణములను కోరునవిగను నుండు పదములను అతడు స్పృశించనుకూడ లేదు. ఇది అతనిలోని లోపము కాదని కారికయొక్క ప్రయోజనమును తెలిసికొనిన మనకు అర్థము కాగలదు. 'ఒకజీవి గర్భము నుండి వెలువడినది మొదలుకొని శ్మశానమువరకు చేయు జీవితయాత్రలో క్షణక్షణము ఆతడు అనుభవములను ఆర్జించుచునే యున్నాడు' అను విషయమును సూచించుటయే శ్రుతి యొక్క యుద్దేశమని ఆచార్యులు మనకు వివరించిన వారి పని ముగియుచున్నది.

బాహ్య విషయప్రపంచముతో సంబంధముగాని, తదనుభవముగాని లేని క్షణమొక్కటియైనను మానవునికి లేదు. అనుభవము లంతమైన క్షణముననే యీ దేహమును మృతదేహమందుము.

పాశ్చాత్య వేదాంతులుగాని, అనేకములైన వేదాంత మతములుగాని, ఒక్క జాగ్రదవస్థయందు మాత్రము తమ దృష్టిని యానించి దానిపైననే యూహించి తమ ప్రణాళికలను తయారుచేసిరి. ఇంద్రియ విషయములుగల జాగ్రత్ప్రపంచముతో మాత్రము జీవితము కూడియుండ లేదు. జీవితములో జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు, తదనుభవములుకూడ నిమిడియున్నవి. మనము జాగ్రత్ప్రపంచమును మాత్రమే విడమరచి, అందుగల విషయ ప్రపంచమును, వానితో మనకుగల సంబంధమును తెలిసికొనుటకు ప్రయత్నించినయెడల నది జీవితమును ఏకాంశములో విలువ గట్టుటయే యగుచున్నది. ఒక రత్నమును ఏకభాగములో మాత్రము పరీక్షించి దానిని యెవరును విలువకట్టరు. ఎవరును అట్టిదానిని కొనవనుకూడ కొనరు. అన్నిభాగములలోను, అన్ని మెరుగులలోను, అన్ని మార్పులలోను దానినతడు పరీక్షించును. అట్లే ఒక వేదాంతి సంపూర్ణమైన వైరాగ్యముతో జీవితమును విలువగట్టుటకు పరీక్షించునపుడు దానిని యన్ని కోణములనుండి చూచి పూర్తిగా పరీక్షించుటకు ప్రయత్నించవలెను. మానవుడు తన నిత్యజీవితమును ఏచైతన్యముద్వారా గడుపుచున్నాడో, ఆ చైతన్యముయొక్క సర్వావస్థలు, తదనుభవములు మొదలగు వానినన్నిటిని పరిశీలించవలెను.

జీవితమును పరిపూర్ణముగా పరీక్షించి, విశేషపరిశీలనలను చేసిన పిమ్మట, ఆ గురువులు నిర్ణయములను చేసిరి. అట్లు నిర్ణయింపబడిన శాస్త్రీయ వాఙ్మయములలో మాండూక్యోపనిషత్తు బహుశా ప్రపంచములోకెల్ల ప్రప్రథమమైనదై యుండవచ్చును. కారికా కారుడు ఆ మహర్షియొక్క ముఖ్య సూచనలను ముచ్చటించుటకు ప్రయత్నించుచున్నాడు. ఇదివరకు జీవుని సమస్తాంశములు విపులముగా వివరింపబడెను. జాగ్రదవస్థలో పనిచేయు జీవునకును, స్వప్నసుషుప్తులలో పనిచేయు జీవునకును భేదముకలదు. కావున విశ్వునకును తైజస ప్రాజ్ఞులకును స్పష్టమైన భేదముకలదు. ఋషులు పరిశ్రమించి చేసిన యిట్టిసూక్ష్మపరిశీలనలచే జ్ఞాతమైన విషయము యొక్క ముఖ్యభావమును కారికా కారుడు మనకు తెలియ జెప్ప ప్రయత్నించుచున్నాడు. "ఆ ఏకతత్త్వమే యీ మూడవస్థలలోను భిన్నముగా తెలియబడుచున్నది" అను వారి నిర్ణయమును ఈ శ్లోకము దృఢపరచుచున్నది.

ఆ శుద్ధ చైతన్యము, జీవజ్యోతి, ఎల్లప్పుడు ఏకము, అద్వైతమేగాని యది స్థూలశరీరాభిమాని యగునపుడు బాహ్యవిషయ ప్రపంచజ్ఞానము కలదగుచున్నది. అప్పుడది జాగ్రదవస్థలో నున్నదని చెప్పెదము. అదే చైతన్యము సూక్ష్మశరీరాభిమాని యగునపుడు దానిని బాహ్యప్రపంచ సంబంధములేని స్వప్నమునుచూచు తైజసునిగా పేర్కొను చున్నాము. మరియు నా చైతన్యము స్థూల సూక్ష్మ శరీరాభి మానములను వదలి కారణ శరీరాభిమానియై సుషుప్త్యవస్థను అనుభవించునపుడు దానిని ప్రాజ్ఞుడని పేర్కొనుచున్నాము.

ఇట్లు మనలో ప్రతియొక్కరును నీ మూడవస్థలలోను విభిన్న తాదాత్మ్యమును పొందుటచే మనలో మనము మూడు ప్రత్యేకవ్యక్తిత్వములు గలవారమా అని సందేహింతుము కాని వాస్తవములో నీ మూడవస్థలయందును చేతనమై వెలుగు జీవజ్యోతి యొక్కటియే యగుచున్నది. అదియే "అహంకారము" లేక జీవుడు.

ఇది కేవలము సిద్ధాంతము మాత్రము కాదు. ఇది నిత్యము మనచే యనుభవింపబడునది. కేవలము గ్రుడ్డి నమ్మకముతో చెప్పునదికాదు. ఇది వివేకమును సవాలుచేయు వాస్తవిక ప్రకటన. క్రైస్తవ మహమ్మదీయ మతములలో వలె మన హిందూ వేదాంత శాస్త్రము అంధవిశ్వాసముతో తన ననుసరించువారిని యది యామోదించదు. అంతేగాక వివేకముతో తమ తార్కికబుద్ధిని యుపయోగించి స్వయముగా సమ్మతించువారినే తనవద్దకు ఆహ్వానించును. తన భక్తులు తప్పక అట్లుండవలయుననియే దాని తీవ్రకాంక్ష కూడనై యున్నది. ఈ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల మూడింటిలోను అనుభవించునది, వానిని తెలిసికొనునదికూడ ఆ ఒక్క చైతన్యతత్త్వమే యని రుజువుపరచుటకు తగినన్ని కారణములు గలవు.

ఏ ఒక్కరును ఇతరులయొక్క యనుభవములను స్మరింపలేరు. నా యనుభవములను నీవుగాని, నీ యనుభవములను నేనుగాని స్మరింపలేముకదా. పైగా నాయొక్క యనుభవములను నేనెంత సులభముగా జ్ఞాపక ముంచుకొన గలుగుచున్నానో, అట్లే నీయొక్క అనుభవములను నీవంత సులభ

ముగా జ్ఞాపకముంచుకొన గలుగుచున్నావు. కావున అనుభవించువాడు, స్మరించువాడు ఒకడే యై యుండుటయే స్మృతి ధర్మమగుచున్నది. ఇట్లు సామాన్యమై, అనుభూతమైన తార్కికభావమును నీ వంగీకరించిన యెడల "ఒకే దివ్య తత్త్వమీ మూడవస్థలను పాలించి యనుభవించుచున్నది" అను ప్రతిపాదన వెనుకనుండు యుపపత్తిని నీవు గ్రహించ గలుగుదువు.

నేను నిన్నటి జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను జ్ఞాపకముంచుకొనుచున్నానుకదా. కావుననే "నిన్న అట్లు చేసితిని, నిన్న రాత్రి కలగంటిని, అటుపిమ్మట నేను సుఖముగా నిద్రపోతిని" మొదలైన విషయములను మనము వివరించి చెప్ప గలుగుచున్నాము. అటువంటి యప్పుడు నీ మూడవస్థలలో నుండు సామాన్యతత్త్వమేది? అనిన అదియే "నేను". ఆ శుద్ధ చైతన్య తత్త్వము. ఇట్లే చైతన్యము మూడవస్థలలోను మూడు విభిన్నయనుభవములను పొందుచున్నట్లగపడుచు న్నప్పటికిని యా జీవ తత్త్వము, ఆ సత్యము, ఆ మూడింటి లోను "ఏకము" ఒక్కటే యైయున్నది అను భావమును మన బుద్ధిలో హత్తుకొనునట్లు చేయుటకే యీ శ్లోకములో కారికా కారుని ప్రయత్నమై యున్నది. అయితే యీ "సామాన్య తత్త్వమేది' యికముందు దానిని వివరించు మంత్రమును వివరించునపుడు చర్చించెదము.

కా॥ దక్షిణాక్షిముఖే విశ్వో మనస్యన్తస్తు తైజసః ।
ఆకాశే చ హృది ప్రాజ్ఞ స్త్రిధా దేహే వ్యవస్థితః ॥ ౨

వివరించి విపులీకరించుచున్నాడు. జాగ్రదవస్థాభిమాని యగు విశ్వుడు మన కుడి కంటిలో నున్నాడని విని యా ఋషుల యొక్క అసందర్భపు వాక్యములకు మనము ఆశ్చర్యపడుటయే కాక స్తంభించికూడ పోవుదుము. నవీనకాలపు విద్యావంతు డొకడు, తన త్వరిత ప్రయాణములో, రైలుబండిలో కాల క్షేపమునకుగాను నొక పుస్తకశాలలో పద పదార్థముతో వాచ్యార్థమునే యనువదించిన యిట్టి యుపనిషద్గ్రంథమును కొని చదువునపుడు వానికి నిట్టి యవస్థయే కలుగుచున్నది. శాస్త్రములు అర్థరహితములనియు, యెట్టి ధ్వనిభావములేక కేవలము పద చమత్కృతి మాత్రము గలవనియు, యాతని కొక దృఢాభిప్రాయ మేర్పడుచున్నది. మనబుద్ధి నుపయోగించి మనము దానిని పరీక్షించి గ్రహించుటకు ప్రయత్నింతము.

విశ్వుడు జాగ్రదవస్థయందు బాహ్యప్రపంచము ననుభవించుచున్నాడు. జాగ్రదవస్థలో మనకు స్థూల శరీరజ్ఞానమున్నది. దాని ద్వారములగు ఇంద్రియములద్వారా యీ బాహ్య విషయ ప్రపంచమును గ్రహించి యనుభవించుచున్నాము. ఈ దృశ్యప్రపంచమంతయు విశ్వునిచేత మాత్రమే తెలిసికొనబడుచున్నది. కావున నా విశ్వుడు ప్రత్యేకించి యే స్థానమునందున్నాడో మనకు తెలియ జేయుటకు గురువు ప్రయత్నించుచున్నాడు.

ఈ జీవి యొక ఆభరణమువలె నొక ప్రత్యేక స్థలము నందుండునదికాదు. అది నఖశిఖ పర్యంతము వ్యాపించి యున్నది. అయినప్పటికి జాగ్రదవస్థయంధు స్థూలశరీరమును

విశ్లేషించి చూచినయెడల, ఎచటనుండి సమస్తక్రియలు బయలువెడలుచున్నవో యా కేంద్రస్థానమును గ్రహించుటకు ప్రయత్నించినయెడల సమస్త జ్ఞానేంద్రియములలోను నేత్రములు చాలా ప్రముఖస్థానమును వహించుటయేకాక అవి సదా యుపయోగపడునవి యనికూడ తెలియవచ్చును. ఆ రెండు నేత్రములకు తారతమ్య పరీక్షచేసిన నేత్ర వైద్యుడు కూడ అంగీకరించునట్లు కుడికంటికే యెక్కువశక్తిగలదని తెలియగలదు. నేత్రములు లేనప్పుడు ప్రపంచజ్ఞానము లేకుండునంతగా మనకు మరియే యితరజ్ఞానేంద్రియము లేనప్పటికిని యుండదు. మనము చెవిటివారముగా నుండవచ్చు. కాలు చేతులు లేనివారుగానైన ఉండవచ్చునుగాని కన్నులున్న ప్రపంచమును సరిగాచూచి గ్రహించి తద్విషయక జ్ఞానమును అలవరచుకొనునంతగా, మనము గ్రుడ్డివారమైన నుండదు కదా. కావున, 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అన్నట్లు వివరించి చూచిన, జాగ్రతవస్థాభిమాని యగు విశ్వుడు విషయప్రపంచమును గ్రహించుటకు నేత్రములే యన్ని యింద్రియములకంటె మిక్కిలి ముఖ్యమైనవని తెలియగలదు. ఆ నేత్రములలోకూడ కుడికన్ను విశ్వుడు వ్యవహరించుటకు ప్రధాన కార్యాలయమై యున్నది. కావున మాండూక్యకారికలలో విశ్వుడు దక్షిణనేత్రము నధిష్ఠించి యున్నాడని చెప్పబడియున్నది.

తైజసుడు స్వప్నావస్థాభిమాని. అతడు స్వప్నములు మనస్సులో చూచుచున్నాడు కావున యతని యధిష్ఠానము మనస్సగుచున్నది. విశ్వతైజసులు సుషుప్తియందు లీనము

కాగానే అతడఖండమైన ప్రాజ్ఞుడగుచున్నాడు. కావున ప్రాజ్ఞునిస్థానము హృదయకుహరమని చెప్పబడుచున్నది.

మిథ్యవలె భాసించు మహర్షులయొక్క నిట్టి ప్రకటనలను విని నేటికాలపు జీవశాస్త్రజ్ఞులు దిగ్భ్రమ జెందెదరు. కాని మన మనుకున్నంతగా ఆ నాటి పురాణకాలపు ఋషులంత అజ్ఞానులుగారని వారు తెలిసికొనవలెను. వారికి శరీర శాస్త్రమును గురించి బాగుగా తెలియును. అంతియేగాక పాశ్చాత్యులు నేడు కనిపెట్టిన శాస్త్రములన్నియు నా ఋషులకు తెలిసియేయుండెను. పాశ్చాత్యులయొక్క వివిధ వైజ్ఞానికావిష్కరణలు, భూమ్యాకర్షణశక్తి మొదలగునవి యన్నియు నా యుపనిషదృషులకు తెలిసియే యున్నవని రుజువుపరచి చెప్పుటకు ఆ మహత్తరమైన యుపనిషత్తులలో తగినన్ని నిదర్శనములు ఉండియే యున్నవి. అయినప్పటికిని వారు హృదయాకాశమును గురించి చెప్పినచో 'హృదయమందు ఒక్క గాలిబుడగ యున్నను అదిమానవుని చంపును' అను విషయము యా మహర్షులకు తెలిసియుండకపోలేదు. కాని వారుచెప్పినదానికి కేవలము వాచ్యార్థమే యుద్దేశించి యుండలేదు. మానవునిలోని దివ్యత్వ మానవత్వ గుణములకు హృదయము స్థానమగుచున్నది. కరుణ, దాక్షిణ్యము, ప్రేమ, దయ మొదలగువానికి హృదయము స్థానమైన బుద్ధి తర్కవాదములకు స్థానమగుచున్నది. ఆ మహర్షులు హృదయమే బుద్ధికి స్థానమై యున్నదని భావించిరి. అట్లు భావించుటలో వారి యభిప్రాయమేమనగా 'మానవునిలోని తార్కిక పటిమ ఉజ్జ్వలమైన ప్రేమ, ఆనందముతోడి సహానము, దయార్ద్ర

మైన ఓర్పు మొదలైనవానిద్వారా బయలువెడల వలయు ననియే యనవచ్చును.

హృదయగుణములులేని కేవలబుద్ధి ప్రాచ్యదేశముల లోనేగాక పాశ్చాత్య దేశములలోకూడ మారణశస్త్రమని భావింపబడుచున్నది. కేవలము దత్తాంశములను, ప్రత్యక్ష ప్రమాణములను ఆశించి వ్యతిరేకమై, అసంస్కృతమైన బుద్ధి పాశవికమై హింసాత్మకమై ఆత్మఘాతుకమైన విషసదృశ మగును. సర్పములోని విషము దానినే చంపలేదనిన ఆ విషము కోరలనెడి సంచులలో జాగ్రత్తగా భద్రపరుపబడినది. అది యొకరిని కఱచినప్పుడే యా కోరలనుండి విషము పైకి గక్కును. లేకున్న ఆ పాము విషము ఆ పామునే చంపును కదా. అట్లే మానవుని తార్కికశక్తిని, వాదయుక్తిని హృద యమను సంచిలో భద్రపరుపకున్న యాతని వివేకము ఆత నినే నశింపచేయును. నేటి ప్రపంచములోని కీడునకంతయు ఇదియే కారణమై యున్నది. హృదయము నణచి బుద్ధి యభి వృద్ధి చెందినది. సాంస్కృతిక, సాంఘిక, ఆర్థికములు మొద లుకొని గృహ సంబంధ వ్యవహారములలో నంతయును హృద యరహిత కేవలబుద్ధినే యుపయోగించి యా వ్యవహారములను సరిదిద్ద ప్రయత్నించుచున్నాము. కేవలము హృదయరహిత విజ్ఞానముమీదనే యాధారపడి జీవించదలచు కొనుటచే, శాంతి భద్రతతోకూడిన వాతావరణములో సంస్కృతి నభి వృద్ధి పఱచుకొని, ఆదర్శమార్గములో ఆనందముగా జీవించు టకు అసమర్థుల మగుచున్నాము. కావుననే యిచట గౌడపా దుడు ఆ ప్రజ్ఞానము హృదయ కుహరములో నున్నది యని

చెప్పిన నది సోమాసయను భక్ష్యములోని కూరవలె హృదయమందు పొదగబడి యున్నదని భావము.

జాగ్రత్స్వప్న సుషుప్త్యభిమానులైన విశ్వతైజస ప్రాజ్ఞులయొక్క స్థితిస్థానములు కేవలము ధ్యానమునకుపయోగపడుటకై వివరింపబడినవి. ధ్యానించుటకు ఒక ప్రత్యేక స్థానము ఉండవలయును కదా !

కా॥ విశ్వోహి స్థూలభుఙ్నిత్యం తైజసః ప్రవివిక్తభుక్ ।
ఆనందభుక్తథా ప్రాజ్ఞస్త్రిధా భోగం నిబోధత ॥ ౩

వైశ్వానరుడు సదా స్థూలవిషయములనే యనుభవించుచున్నాడు. తైజసుడు సూక్ష్మవిషయ ప్రపంచమును అనుభవించుచున్నాడు. ప్రాజ్ఞుడు ఆనందము ననుభవించుచున్నాడు. ఇవి వీరి త్రివిధములైన యనుభవములు.

కా॥ స్థూలం తర్పయతే విశ్వం ప్రవివిక్తంతు తైజసం ।
ఆనందశ్చ తథా ప్రాజ్ఞం త్రిధా తృప్తిం నిబోధత॥ ౪

విశ్వుడు స్థూలవిషయములతో తృప్తిని జెందుచున్నాడు. తైజసుడు సూక్ష్మవిషయములందు తృప్తిని పొందుచున్నాడు. ప్రాజ్ఞుడు ఆనందమునంది తృప్తిజెందుచున్నాడు. ఇవి యీ ముప్వురు తృప్తినందు త్రివిధములు.

ఈ రెండుశ్లోకములయొక్క వివరణ యింతకుముందే ఆయా సందర్భములలో చర్చింపబడినది. అన్నిటిని సంపూర్ణముగా ఆకళించి గ్రహించుటకు ఉపోద్ఘాతములో నొక పట్టీని

తయారుచేసి యందు విభిన్నమైన యవస్థలు, తద్గత అనుభవములు, తత్తదభిమానులు, ఇత్యాదులన్నియు సుస్పష్టముగా చిత్రించి వివరింపబడినవి. ఈ విషయములిదివరకే వివరింపబడి యుండుట చేతనే శ్రీ శంకరులుకూడ వీనికి వేరే భాష్యము వ్రాయలేదు.

కా॥ త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా యశ్చ ప్రకీర్తితః ।
వేదైతదుభయం యస్తు స భుంజానో న లిప్యతే ॥ ౫

ఈ మూడవస్థలయందునుగల యనుభూతిని, యనుభవించువానిని యిందు వర్ణింపబడిన విధముగా యెవడు తెలిసికొనుచున్నాడో అట్టివాడు ఈ మూడవస్థలయందలి యనుభవములను అనుభవించుచున్నవాడైనప్పటికిని వానికి వశుడు కాడు.

ఉపనిషత్తు వర్ణించిన యీ మూడవస్థలను, తదభిమానులగు విశ్వ తైజస ప్రాజ్ఞులను కేవలము బుద్ధిద్వారా గ్రహించుటచేతగాని లేక శాస్త్రములవలె గురువువద్ద అభ్యసించుట మాత్రముచేతగాని మన విషయ ప్రపంచానుభవములుగాని మన కర్మలుగాని మనని యంటకుండ వదలిపోయి తద్వారా మనమా పరిపూర్ణస్థితి నందుకొనగలమని భావించరాదు. ఉదాహరణకు, ఉపనిషత్తు చెప్పినదంతయు మీరు విని యున్నారు. కేవలము వినుటమాత్రము చేతనే మీరా శాంత్యానంద స్థితిని యన్నిసమయములయందును అనుభవించలేరు కదా! ఆనందముతోడి ధ్యానముద్వారా అట్టి సహజానుభవమును మనము గ్రహించవలెను. కేవలము వంటను చెప్పు పుస్తకమును చదివినంతమాత్రమున ఆకలి తీరదుకదా!

ఇట్లు మనము జాగ్రత్స్వప్న సుషుప్తులయందలి జీవుని లీలలను గ్రహించితిమి. ఈ మూడవస్థల వెనుక శుద్ధచైతన్య మగు ఆత్మయనునది ఉండిననేగాని యిది పనిచేయలేదని గ్రహించి, సమాధియందు ఆత్మభావమే మన నైజతత్త్వమని తెలిసికొనిన, అటుపిమ్మట నీ మూడవస్థలయందలి యనుభవ ములు మనలను సుఖదుఃఖములందు ముంపజాలవు.

ఆ అనంత తత్త్వమును పరిమిత ఉదాహరణల ద్వారా సూచించుట యనునది వ్యర్థప్రయత్నమేగాక మన కత్యంత నిరాశా జనకముగా నుండును. అయినప్పటికిని మనము అం దుండియు అంటనట్టి యా మానసిక స్థితికి ఉదాహరణను ఈయదలచినచో 'జాగృతిని పూర్తిగా తెలిసికొనగలుగు స్వప్నావస్థ' యని చెప్పవచ్చును. నేను స్వప్నమును కనుగొను చుకూడ జాగ్రదవస్థానుభవములనే యనుభవించుచు దానిని మరచిపోవకుండిన, స్వప్నానుభవము లెట్టివైనను అవి నన్ను అంటజాలవుకదా. నేను రాజుగాభావింపబడినట్లు స్వప్నమును చూచుచున్నాను. కాని యీ యనుభవము నాకు సంతోష కరమగు చిన్న చిరునవ్వునైనను తేజాలదు. అట్లే స్వప్న సింహము నన్ను తరుముచుండినను, అది నా మీదికి యురుకు చున్నను నన్నది యొక యంగుళమైనను కదల్పజాలదు. ఏల ననగా నదియంతయు నా మానసిక సృష్టియేయని నాకు బాగుగా తెలిసియున్నది. మరియొక సుస్పష్ట యుదాహర ణము – సినీమాను ఒక థియేటరులో చూచుట యగుచున్నది. ఆ కథ సుఖాంతమైనను దుఃఖాంతమైనను మనము చలించక చూచుచుందుము. నిజముగా మనముచట నొకహత్యను చూచి

నను, దారిప్రక్కన హత్యను చూచినట్లుగా మనము చలించము, దుఃఖించము. మనము చూచునది కేవలము చలనచిత్రమేయనియు, అందుజరుగు హత్యాకాండతో మనకెట్టి సంబంధములేదనియు మనకు పూర్తిగా తెలియును. కాని మన ప్రక్కనుండు చిన్నబాలుడు ఆ హత్యాకాండతో నైక్యము జెంది తానాబాధ ననుభవించుచున్నట్లు భావించి దుఃఖపడును.

మనము ఆత్మజ్ఞానమునుపొంది, మనలోని సారాంశమగు ఆత్మతత్త్వము ననుభవించిన పిమ్మట, మరల నీ జాగ్రత్స్వప్న సుషుప్తుల ననుభవించుటకు వచ్చినను, తామరాకు మీది నీటివలె యంటీయంటక, యందు తగుల్కొనక, యందలి సుఖదుఃఖములను అనుభవింతుమని పురాతన పరమాచార్యులు ప్రకటించియున్నారు. శ్రీరామకృష్ణునకు తన కంఠమందలి వ్రణము తనలోని విశ్వానికి బాధాజనకమైనది. ఏసు యొక్క దుఃఖములు క్రీస్తునవికావు. అవియన్నియు ఏసునకు సంబంధించినవే యగుచున్నవి.

ఇట్లొకడు తాను వేరుగా నిలచియుండి చూచిన, తన చేతనే తనలో సృష్టింపబడిన తమాషావలె, ఎట్లీ ప్రపంచము తనకు వినోదము కలిగించుచున్నదో యనుదానిని యాతడు నిస్సంగముగా నుండి పరిశీలించగలుగుచున్నాడు. ఇట్టి అఖండానందముతో కూడిన శాంతి స్థితినే, "అనుభవించు చున్నప్పటికిని అంటడు" అను దానిచే సూచించుచున్నది.

కా॥ ప్రభవః సర్వభావానాం సతామితి వినిశ్చయః ।
సర్వం జనయతి ప్రాణశ్చేతోంశూన్పురుషః పృథక్

సత్తయిన కారణమునుండి కార్యముద్భవించుచున్న దనుట నిశ్చయమే కదా. ప్రాణము అచేతన పదార్థముల నభివ్యక్తపరచుచున్నది. పురుషుడు చేతన పదార్థములను, జీవులను ప్రత్యేకముగా ప్రత్యేక రూపములలో సృష్టించుచున్నాడు.

ఇచట గౌడపాదుడు జగత్ సృష్టిని వివరించుటకు మన స్థాయికి దిగుచున్నాడు. మనమా ఆత్మను గుఱించి తెలిసికొన ప్రారంభించునపుడు ముందుగా నీ వస్తు ప్రపంచము గుఱించి తెలిసికొనవలయును. "పలకలగాజు కడ్డీలో పడిన సూర్య కాంతివలె ఆ చైతన్యము మనస్సనెడి పలకలగాజు కడ్డీలో పడి యీ ప్రపంచమంతయు నానా రూపములు దాల్చుచున్నదే కాని వాస్తవములో నీ ప్రపంచము మిథ్య" యని తెలిసికొని విశ్వసించవలెను. మనస్సు చెదరియున్నంత కాలము మనమీ మిథ్యా ప్రపంచమునుండి దృష్టిని మరలించి, మనలోని ఆత్మను కనుగొనుటకై మనస్సును కేంద్రీకరించలేము. కావుననే ప్రతి యాచార్యునకును యీ ప్రపంచము ఎట్లు, ఎందుకు, ఏవిధముగా, ఎందుండి వచ్చినదను దానిని వివరించ వలసిన యావశ్యకత కలిగినది. శ్రీ గౌడపాదుడుకూడ యిది వరకున్న యాచార్యులు చెప్పిన ప్రపంచమును, తత్సృష్టినీ గుఱించిన వర్ణనలను ఇచట స్వేచ్ఛగా సంగ్రహించి చెప్పుచున్నాడు.

ఆ సంపూర్ణ సత్యతత్త్వము అతి చలనాత్మక సత్తాను, చైతన్యమును కలిగియున్నది. ఆ చలనాత్మకమైన సత్తాయే ప్రాణము. ఆ చైతన్యమే శుద్ధ చైతన్యతత్త్వము. మనచుట్టు

మనము నేడు చూచు ప్రపంచమంతయు చేతనాచేతనాత్మక మైన ప్రపంచమై యున్నది. రెండు విధములైన కార్యము లున్నప్పుడు మనము మన పరిమితమైన యనుభవము ద్వారా రెండు కార్యములకు రెండు విభిన్న కారణములుండునని తెలిసికొనుచున్నాము. రెండు విభిన్న కార్యములు ఒకే విధమైన కారణమునుండి యుద్భవింపజాలవు. చేతనము, అచేతనము అను నీ రెండును విభిన్న వ్యతిరేక కార్యములగుటచే వానికి రెండు విభిన్నసుస్పష్ట కారణములుండి తీరవలయును. ఆ కారణము లేవియో వివరించుటకు గౌడపాదు డిచట ప్రయత్నించుచున్నాడు. ఆత్మయొక్క చలనాత్మకమైన ప్రాణ తత్త్వము నుండి అచేతన పదార్థములును, చైతన్యతత్త్వమైన పురుషుని నుండి చేతనాత్మకమైన సమస్తప్రపంచమును ఉద్భవించినది.

కా॥ విభూతిం ప్రసవంత్వన్యే మన్యన్తే సృష్టిచింతకాః।
స్వప్నమాయా సరూపేతి సృష్టిరన్యైర్వికల్పితా॥ ౭

కొంతమంది సృష్టివాదులు యీ జగత్తు ఈశ్వర విభూతిచే సృష్టింపబడినదని తలచుచున్నారు. మరి కొంత మంది యీ జగత్సృష్టి స్వప్నమువంటిది, మాయస్వరూపము అని తలంచుచున్నారు.

ఇట్లు మన వేదాంత వాఙ్మయములో వివిధ మతస్థులును వివరించిన సృష్టి సిద్ధాంతమును వివరించుటలోనే గౌడపాదుడు తనకీ సృష్టి యందే నమ్మకములేదని ప్రథమ పాదమందే సూచించుచున్నాడు. అతని మతప్రకారము ఆ పరతత్త్వము అజము. ఆ పరమపురుషునినుండి యెన్నడు యీ

జగత్తు సృష్టింపబడలేదు. మనకు కనబడు ఈ వస్తు ప్రపంచ మంతయు మన మానసిక సృష్టిగాని మరేదియు కాదు. దీనినే "అజాతవాదము" అందురు. మాండూక్య కారికల ద్వారాను, యోగవాసిష్టముద్వారాను బోధింపబడిన ప్రాచీన వేదాంతము ఈ అజాత వాద మతమునే విశ్వసించుచున్నది. కాని శ్రీ శంకరులచే ప్రవచింపబడిన నవీన వేదాంతము ప్రకారము నిత్యము మన కన్నుల కగపడు నీ వస్తు ప్రపంచమంతయు సంబంధేన సత్యమగుచున్నది. మనము దీనిని సహృదయముతో నర్థము చేసికొనిన యీ రెండింటియందును మూలచ్ఛేదకమగు విరోధమేదియు లేదు.

అజాతవాదులుకూడ ఈ సృష్ట ప్రపంచము దీర్ఘస్వప్నమని చెప్పుచున్నారు. జాగ్రత్స్వప్నములయందలి తారతమ్యమును వివరించువాడై గౌడపాదుడుకూడ యిటుపైన యీ పై విషయమునే తార్కికముగాను, యుక్తి యుక్తముగాను "ఈ జాగ్రదావస్థ స్వప్నముకంటె యెక్కువ సత్యమైనది కాద" ని నిరూపించుటను చూడగలము. కాని యిచట సృష్టిని గుఱించి వివరించునపుడు మనమది దీర్ఘస్వప్నమని వచించినను సృష్టిచింతకులు స్వప్నజగత్తును మానసికభ్రమ కల్పితమని తలంచుటలేదు. పైగా వారు ఆ స్వప్నమున్నంత వఱకు అదికూడ వాస్తవమే యని తలంచు చున్నారు.

హిందూదేశములో మరియొక మతస్థులు కలరు. స్వప్నము యదార్థముగా సత్యము. స్వప్నమును చూచువాడు దానిని చూచునంతవఱకు నా స్వప్నము యదార్థమే యని వారి మతము. "గారడీవాని మాయ, త్రాడునందు సర్ప

భ్రమ, యివియన్నియు నా భ్రాంతి యున్నంతవఱకు నవి సత్యమే యగుచున్నవి. ఒక వస్తువు అసత్యమైనదైన యెడల యది మన బుద్ధికి గ్రాహ్యమే కాదు సరికదా యది మనలను విశ్వసించునట్లు చేయుట ఎట్లు సంభవించును?" అని వారు వాదించుచున్నారు. కావున యెంత అస్థిరమై, స్వల్ప కాల జీవియైనను, నొక వస్తువును గ్రహించి తద్ద్వారా యేదైన భావముగాని, యనుభవముగాని మనకుండు నంత వఱకు అది సత్యమే యగుచున్నదని వారి సిద్ధాంతము.

ఇట్టి భావముతోనే యిచట "సృష్టి స్వప్న సదృశము" అని వారు చెప్పుచున్నారు.

కా॥ ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిరితి సృష్టౌ వినిశ్చితః
కాలాత్ప్రసూతిం భూతానాం మన్యన్తే కాలచిన్తకాః॥ ౮

కొంతమంది సృష్టివాదులు భగవంతుని యిచ్ఛ ప్రకారము ఈ జగత్తు సృష్టింపబడినదని నిశ్చయించుచున్నారు. మరికొంతమంది కాలప్రభావముచేతనే యీ జగత్తు సృష్టింపబడినది అని కాలచింతకులు సృష్టికి కాలమునే కారణముగా నిర్ణయించు చున్నారు.

ఆనాడు ప్రచారములోనున్న జగత్సృష్టిని గుఱించిన మతములను యథాలాపముగా పరిగణించువాడై శ్రీ గౌడ పాదుడు "కొంతమంది ఈ జగత్తు ఈశ్వరుని యిచ్ఛామాత్ర ముచే సృష్టింపబడినదని చెప్పుచున్నారు" అనుచున్నాడు. మరి కొంతమంది కాలమే జగత్కారణమని విశ్వసించు

చున్నారు గావున సమస్త నామ రూపాత్మక ప్రపంచ మంతయు కాలముపైననే ఆధారపడియున్నది అని తలంచు చున్నారు.

సృష్టినిగుఱించిన యీ నిస్సార భావములనన్నిటిని తుదకు నిరాకరించి వేదాంతమును స్థాపించుటకే గౌడపాదు డిచట వానిని పేర్కొనుచున్నాడు. శిష్యుని బుద్ధిలోను మన స్సులోను వేదాంతభావము స్థిరముగా నాటుకొనుటకై యిది యొక యుత్తమ మతము. ఈ యుక్తి యెట్లు ప్రవర్తించెనో రాబోవు శ్లోకములో కనుగొనగలము.

కా॥ భోగార్థం సృష్టిరిత్యన్యే క్రీడార్థమితి చాపరే।
దేవస్యైష స్వభావోఽయమాప్తకామస్య కాస్పృహా॥ ౯

భగవంతుని భోగార్థము ఈ జగత్తు సృష్టింపబడినదని కొందరు భావించిన, మరికొందరు భగవంతుని క్రీడలకై యీ జగత్తు సృష్టింపబడినదని భావించు చున్నారు. కాని యిది ఆ దేవునియొక్క స్వభావమే యగుచున్నది. ఆప్తకాముడైన యాతనికి యెట్టి కోరికలు నుండవుకదా ?

మరికొంద రీ సృష్టివెనుక మరియొక యుద్దేశము కల దందురు. ఆ యీశ్వరుని భోగము కొఱకు అనగా మధ్యాహ్న వేళలో కాలక్షేపము కొఱకై యీ జగత్తు సృష్టింప బడినది యందురు. ఇట్లు ఆరు విధములైన మతములను వివ రించి, తుదకు తన మతమును వివరించుచు, వేదాంత మెందు లకు సృష్టిభావమునే నమ్ముటలేదో వివరించుచున్నాడు.

శ్రీ గౌడపాదుని మతప్రకారము సృష్టికి యుపపత్తి ప్రోక్తమైన వివరణ యేమనగా "అది యాత్మతత్త్వము యొక్క నైజమే యగుచున్నది" అని. ఏదియు తన సహజ తత్త్వమునుండి వేరుగా నుండజాలదు. కావున యీ పరిమిత ప్రపంచము ఆ పరమాత్మయొక్క లీలామాత్రమై యున్నది. ఉదాహరణద్వారా మనము దానిని మరికొంత స్పష్టముగా గ్రహించగలుగుదుము. సముద్రములోని తరంగములు - అవి సముద్రముచే సృష్టింపబడినవి కావు. కాని తరంగములను కలిగియుండుటయే సముద్రముయొక్క సహజ స్వభావమై యున్నది. ఆ తరంగములు మాత్రము సముద్రము కాజాలవు. కాని ప్రశాంతమైన సముద్రముయొక్క అగాధములే యీ సముద్రముయొక్క మూర్తరూపములగుచున్నవి. అట్లే ఉష్ణము అగ్నియొక్క సహజగుణము. ఉష్ణములేని అగ్ని మనకులేదు. అట్లే స్వప్రకాశ చైతన్యతత్త్వము ప్రాణముగాను, పురుషుడుగాను ఉండి చేతనాచేతనములుగా నభివ్యక్తమగుట దాని ధర్మమై - సహజగుణమై యున్నది.

సర్వసంపూర్ణమైన యీ పరబ్రహ్మతత్త్వమునకు ఎట్టి కోరికగాని, ఎట్టి వినోదముగాని ఉండజాలదుకదా! ఏదైన లోపించినచో దానిని గురించిన యిచ్ఛ ఒకనికి కలుగుచున్నది. ఇప్పుడు నేను కడుపునిండ భోజనముచేసి కొన్ని ఫలములను కూడ భుజించి యున్నయెడల, యెవరైనను నన్ను భోజనమునకు పిలిచిన, అది యెంత రుచికరముగనున్నను, నేను 'వద్దు! వద్దు! నాకు వద్దు!' అనెదను. ఏలయన ప్రస్తుతము భోజనేచ్ఛ నాకసంభవము. తదభావము నేను పొందలేదు. అనగా నాకు

కడుపునిండి యున్నది. అట్లే ఆ పరమాత్మకూడ తన పరిపూర్ణతలో నెట్టి యిచ్ఛను పొందలేదు.

నిష్కామతయే పరిపూర్ణస్థితియని ఉపనిషదృషులు కనుగొనిరి. ఇట్లు గౌడపాదుడు "ఆప్తకామునకు నెట్టి యిచ్ఛ గలదు ?" అని ప్రశ్నించుటద్వారా నా యీశ్వరునకు సృష్టికారణమును లేక సృజనేచ్ఛను అంటగట్టుట యెంత మూఢతనమో అని చూపి చెప్పుచున్నాడు. అనగా పరిపూర్ణతత్త్వమునకు ఎట్టి కోరిక లుండజాలవు గనుక యతడు లీలకై సృష్టించుట అసంభవమని జాతవాదులకు (జగత్తు సృష్టింపబడినదని తలచువారలకు) కారికాకారుడు చెప్పుచున్నాడు. కావుననే యతడు "ఆప్తకామునకు ఎట్టి స్పృహగలదు ?" అని ప్రశ్నించుచున్నాడు. మనమతనికి కోరికగలదన్నచో యదే నోటితో ఆ పరబ్రహ్మ పరిపూర్ణతత్త్వమును ప్రకటింపజాలము.

ఇట్టి చర్చతో గౌడపాదుడు ఆరు ఉపనిషన్మంత్రములను వివరించు తన కారికలను ముగించుచున్నాడు. ఇప్పుడు మనము ఉపనిషద్గ్రంథమునే చదువబోవుచున్నాము. ఈ ఏడవ మంత్రములో నా తురియావస్థయొక్క మహత్తరమైన వర్ణన, నిర్వచనము కలదు.

మం॥ నాంతఃప్రజ్ఞం న బహిష్ప్రజ్ఞం నోభయతః
ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నా ప్రజ్ఞం ।
అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్యమ లక్షణమచిన్త్య

మవ్యప్రదేశ్యమేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం
శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మాస
విజ్ఞేయః॥ ౭

అది అంతఃప్రజ్ఞముకాదు. బహిష్ప్రజ్ఞముకాదు. ఉభయతః ప్రజ్ఞకలది కాదు. ప్రజ్ఞాన ఘనముకాదు. ప్రజ్ఞయు కాదు. అప్రజ్ఞము కాదు. అది అదృష్టము. అవ్యవహార్యము. అగ్రాహ్యము. అలక్షణము. అచింత్యము. అవ్యపదేశ్యము. ఏకాత్మప్రత్యయ సారము. ప్రపంచోపశమము. శాంతము. శివము. అద్వైతము. అదియే చతుర్థపాదమని తలంచుచున్నారు. అదియే ఆత్మ. దీనినే తెలిసికొనవలయును.

భాషలోని పదములు కేవలము గుణవిశిష్టవస్తువులను మాత్రమే వర్ణించగలిగియున్నవి కావున ఆ పరమాత్మను అట్టి పదములచే వర్ణింపశక్యముకాదు. ఆ నిత్యతత్త్వమందు గుణక్రియలులేవు. శాస్త్రజ్ఞులు పదార్థములను గుణవిశిష్టముగా చెప్పియున్నారు. ఆ పదార్థములు అంతవంతములు అనగా అశాశ్వతములు. మన మా సత్యతత్త్వమును గుణవిశిష్టముగా వర్ణించినయెడల నిజముగా మనమా శాశ్వత తత్త్వమును అశాశ్వతముగా చేయుచున్నాము. అమృతమును మృతముగా చేయుచున్నాము ! కావున ఆ సత్యతత్త్వమును వర్ణించుటకు ఒకే మార్గము కలదు. అదియే "నేతి, నేతి – ఇదికాదు, ఇది కాదు" అనునది. ఇట్టిపద్ధతినే యీ యుపనిషత్తులో చక్కగా నవలంబించియున్నారు. తనలో గంభీరభావముల నిముడ్చుకొని, ధ్వనిగర్భితపదములతో నా పరతత్త్వమును ఈ యుపని

పత్తులో నిచట సూచించినట్లుగా మరియొచటను, మరి యే యితర భాషలోనుకూడ వర్ణించి చెప్పియుండలేదనియే అన వచ్చును.

మనము చూచి, గ్రహించి, యనుభవించిన విషయ ములను నిరాకరించుట ద్వారా యా సత్యతత్త్వమును సూచించు సమష్టివర్ణనను మనమిచట చూడగలము.

విషయప్రపంచము నంతయు మన యింద్రియముల ద్వారాను, తదనుభవములను, తద్భావములను మన మనో బుద్ధులద్వారాను గ్రహించి తెలిసికొనగలుగుచున్నాము. కాని నిత్యజీవితములో మనము చూచు సమస్త ప్రపంచమును, దానిని గ్రహింపగలుగు మనో బుద్ధులను సాధనములును చేరి విషయప్రపంచము అని చెప్పబడుచున్నది. అందుండు ఆత్మయే ఆ సత్యతత్త్వము – జీవశక్తి – దివ్యజ్యోతి. కావున ఆ పరమాత్మను ప్రదర్శించుటకు విషయములను, తదనుభవ ములను 'నేతి, నేతి – ఇదికాదు, ఇదికాదు' అని నిరాక రించుట యనునదొక్కటియే మార్గమగుచున్నది.

చీకటిలో నొక త్రాడుముక్క సర్పమువలెగాని, కట్టె పుల్లవలెగాని, లేక భూమిపగులువలెగాని, తోచవచ్చును. ఇట్టి భ్రమలో మునిగినవారికి సత్యమైన త్రాటిని చూపుటకు మార్గమొక్కటియేయున్నది. అదియే 'కాదు, కాదు' అనుట. అనగా సర్పముకాదు, భూమిపగులుకాదు, కట్టెపుల్లకాదు, ఇత్యాది. అనేకమైన శాస్త్రములలో నా సత్యతత్త్వము 'ఇది కాదు, ఇదికాదు' అను వాక్యములచేతనే లక్షింపబడినది.

ఉపనిషత్తులు మానవానుభవములను చర్చించుటకు గాను ఆత్మ నాలుగు పాదములు కలది యని ప్రకటించు చున్నవి. ఆ నాలుగింటిలో జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడుపాదములు. ఈ మంత్రములో నాలుగవపాదమగు తురీయావస్థను వివరించుటకు మహర్షి సమగ్ర సంపూర్ణ వర్ణనను చేయుచున్నాడు.

జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు, తదధికారులైన విశ్వ తైజసప్రాజ్ఞులు ఇంతకు ముందటి మూడు మంత్రములలో వారివారి విశిష్ట లక్షణములతో కూడ వర్ణింపబడిరి. కాని యా మహర్షి యీ నాలుగవ పాదమగు తురీయావస్థను వర్ణించు నపుడు ఒక సరిక్రొత్త పంథాను త్రొక్కెను. అదియే "ఇది కాదు, ఇదికాదు" అను పద్ధతి. ఎందుకట్టి మార్గము నవలం బించవలసి యున్నది అనుదానిని ఇదివరకే విపులముగా వివ రించితిమి. ఆ యాత్మను ఇంద్రియములచే గ్రహించలేము. మనస్సుచే భావించలేము. బుద్ధిచే నూహించలేము. ఈ విష యమును 'టెలిస్కోపు – దానిద్వారా చూచువాడు' అను ఉదాహరణద్వారా వివరించితిమి. టెలిస్కోపు చూచువాడు తనకంటె యితరవస్తువులను చూడగలడు గాని తనను తానే చూచుకొనలేడుకదా. అనగా యితరవస్తువులను చూచుటకు సాధనమైన టెలిస్కోపుతో తనను తానే చూచుకొనలేడు. అట్లే ఆత్మద్వారా గ్రహణశక్తిగలిగిన బుద్ధి ఆత్మవైపు తిరిగినంతనే తనకు ఆత్మతో విచ్ఛేదము కలుగుచున్నది. కావున నది జడమై పోవుచున్నది. ఇట్లు 'ఇదికాదు, ఇదికాదు' అను వ్యతిరేక భాషలోనే సత్యతత్త్వము నిరూపింపబడినది.

నాంతః ప్రజ్ఞం – ఆంతరిక జ్ఞానముకలది కాదు అనగా నది తైజసుడు కాదు అని చెప్పుచున్నది.

న బహిష్ప్రజ్ఞం – బాహ్యజ్ఞానము కలదికాదు అనగా నా తురీయావస్థ బాహ్యవిషయ జ్ఞానముగల విశ్వుడు కాదని చెప్పుచున్నది.

న ఉభయతఃప్రజ్ఞం – బహిష్ప్రజ్ఞుడైన విశ్వుడు అంతః ప్రజ్ఞుడైన తైజసుడును కాదు. ఇట్లే విశ్వతైజసులు కారని చెప్పినప్పుడు శిష్యుడు సహజముగానే నా తురీయావస్థ జాగ్రత్స్వప్నములకు మధ్యనుండు మరియొక యవస్థయని భావించవచ్చును. అట్టి జాగ్రత్తుస్వప్నము రెండునుకాని యవస్థను మనమందఱము తఱచు యనుభవించుచునే యుందుము. మధ్యాహ్నభోజనమవగానే మనము కొద్దికాలము ఇట్టి యవస్థనే యనుభవింతుము. కావున యట్టి మధ్యావస్థకూడ కాదని 'నోభయతః ప్రజ్ఞం' అను పదముచే శ్రుతి సూచించుచున్నది.

న ప్రజ్ఞానఘనం – అది ప్రజ్ఞానఘనమును కాదు. ఇది వరకు తురీయము విశ్వుడు, తైజసుడు, తన్మధ్యముడు కాదు అని చెప్పుటవలన సుషుప్త్యవస్థాధీనుడైన ప్రాజ్ఞుడేమోనని మనము భావించవచ్చును. కావున శ్రుతి యిచట యీ పదముచే ప్రాజ్ఞుడును కాదని చెప్పుచున్నది. కావున తురీయము జాగ్రత్స్వప్న సుషుప్తుల కతీతమని భావము.

న ప్రజ్ఞం – అది చేతనము కాదు. ఇంతవఱకు ఆ తురీయము, ఇదికాదు, అదికాదు అని వ్యతిరేక పరంపరచే అన్ని

టిని వారించుటచే శిష్యునకు అట్లయిన యది చేతనమై యుండునా యను సందేహము కలుగ వచ్చును. కాని యా తురీయము చేతనముకూడ కాదని "నప్రజ్ఞం" అను పదముచే శ్రుతి చెప్పుచున్నది. మరియు చేతనమనగానే దానికి వ్యతిరేకమైనది అచేతనము ఉండవలసివచ్చును. ఉదా:- సూర్యునిలో కాంతి. సూర్యునకు చీకటి తెలియదు కాబట్టి చీకటిలేక కాంతిని అర్థము చేసికొనలేము. అట్లే అచేతనమన్నది యొకటి యున్ననే చేతనము అనునది అర్థవంతమగును. కావున తురీయము చేతనము కాదు. అని యుక్తి యుక్తముగా శ్రుతి నిరాకరించుచున్నది. ఆ తురీయము చేతనాచేతనములను రెంటిని ప్రకాశింపజేయునదై యున్నది.

న అప్రజ్ఞం—అది అచేతనము కాదు. ఇంతకు ముందు అయిదు విధములుగా ఇదికాదు, ఇదికాదు, అని చెప్పుటచే అది కేవలము అచేతనమా అని తోచవచ్చును. ఏలననగా ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులు కాదు, చేతనము కాదు అని శ్రుతి మనకు చెప్పియున్నది. కావున యిప్పుడు ఆత్మ అచేతనము అను వాదమొక్కటే సంభవించుచున్నది. కాని యా యుపనిషదృషులు దానినికూడ "ఇదికాదు" అనియే నిరాకరించు చున్నారు.

సంగ్రహముగా సర్వ మానవులకు విదితమైన జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను దాటినదీ తురీయమని మంత్రములోని పూర్వార్థము చెప్పినది. అనగా మనకు వాడుకలో నున్న భాషలోని పదములతో ఆ నిత్య పరమాత్మను వర్ణించుట అశక్యమని తెలియుచున్నది.

ఆ ఆత్మనుగురించి మనకొక నిర్ణీత భావము కలుగుటకు గాను ఈ మంత్రములోని యుత్తరార్థమందలి పదములద్వారా కొంతైన వర్ణించి చెప్పుటకు ఆ ఋషి ప్రయత్నించుచున్నాడు. కాని యిక్కడకూడ వ్యతిరేక నిర్ణయముల ద్వారానే అనుకూల వర్ణనలను చేసి యున్నారని మనము గ్రహించవలెను. వాని తాత్పర్యము లత్యంత విశాలములగుటచే వానిని పూర్తిగా మనము గ్రహించుట యనగా తురీయావస్థ యొక్క తత్త్వమును సమగ్రముగా గ్రహించుటయే యగుచున్నది.

అదృష్టం — కనబడనిది. ఇచట ఆత్మ బాహ్యేంద్రియములకు కనబడనిది యని వర్ణింపబడినది. కనబడనిది యనగా కన్నులకు మాత్రము ప్రత్యక్షము కానిది యనియే కాక మిగిలిన జ్ఞానేంద్రియములకు కూడ గోచరము కానిది యని తెలియుచున్నది. అనగా రూపము మాత్రమేకాక శబ్ద స్పర్శాదులుకూడ లేనిది యని తెలియుచున్నది.

అవ్యవహార్యం — వ్యావహారిక సంబంధములేనిది. అనగా ఆ ఆత్మ సర్వవ్యాపి యగుటచే యదిలేని స్థానము లేనేలేదు. కావున దానికంటె యితరమైనది యుండుట అసంభవము. తనకంటె యితరమైనదే లేనప్పుడు ఆ ఆత్మకు సంబంధ బాంధవ్యములు లేకుండుట సహజమే కదా! సమస్త వ్యవహారములు ఆ ఆత్మయందే జరుగుచున్నవని యర్థము. ఉదాహరణకు ఆకాశమును తీసికొందము. ఆకాశమునకు దేనితోను సంబంధములేదు. కాని యన్ని సంబంధ వ్యవహారములు ఆ ఆకాశమునందే జరుగుచున్నవి. అట్లే ఆ సత్యతత్త్వముకూడ

సమస్త నామ రూపాత్మక ప్రపంచ వ్యవహారమునకు ఆధారమై యున్నది.

అగ్రాహ్యం – గ్రహింపశక్యముకానిది. ఈ పై రెండు పదములచేత ఆ ఆత్మ మనస్సుచేతకూడ గ్రహింపశక్యము కానిది యని తెలియుచున్నది. ఇంద్రియములద్వారా గ్రహింపబడిన వానినే మనస్సు గ్రహించగలుగుచున్నది. కావున ఆత్మ ఇంద్రియములచే గ్రహింపబడవలయు ననగా నది యొక విషయమై యుండవలెను. అది యీ పంచేంద్రియ ములకు విషయము కాకపోవుటచే ఆత్మను మనస్సుచే కూడ గ్రహింప శక్యముకాదు.

అలక్షణం – లక్షణములేనిది. ప్రత్యక్షముకాని విషయ ములను అనుమానముచే గ్రహించుచున్నాము. పొగద్వారా దూరముననున్న అగ్నిని తెలిసికొనుచున్నాము. ఇచట పొగ అగ్నికి కారణమై యున్నది. కార్యమైన పొగనుచూచి కారణ మైన యగ్నిని యూహించుచున్నాము. సంస్కృతములో కార్యమును 'లక్షణము' అనెదరు. ఆత్మను ఊహించి తెలిసి కొనుటకు అట్టిలక్షణములేవియు లేకపోవుటచే అది అలక్షణము.

అచింత్యం – చింతింప శక్యముకానిది. అదృశ్యమై, అవ్యవహార్యమై, అగ్రాహ్యమైన విషయము సహజముగానే చింతించుటకుకూడ శక్యముకాకున్నది కదా !

అవ్యపదేశ్యం – వర్ణింపశక్యముకానిది. మన యింద్రియ మనోబుద్ధులచే గ్రహించువస్తువునే వర్ణింపశక్య మగుచున్నది. కావున ఆ ఆత్మ వర్ణింపశక్యముకానిదే యగుచున్నది.

ఏక - ఆత్మ - ప్రత్యయ - సారం—ముఖ్యముగా నది శుద్ధచైతన్యరూప ఆత్మసారమే యగుచున్నది. పై విధముగా అన్నిటిని నిషేధించిన పిమ్మట ఆ పరమాత్మ వర్ణింపశక్యము కానిది యని చెప్పినపుడు యెంత తెలివైనవాడైనప్పటికిని శిష్యుడు తికమకపడి నిస్పృహ జెందియుండును. అట్టిభావమును గురువు శిష్యుని ముఖములో సుస్పష్టముగా చూచి యుండును. కావున శిష్యుడట్లు తికమక పడకుండుటకై గురువు ఆత్మజ్ఞానమును విపులముగా వివరింప ప్రయత్నించుచున్నాడు.

ఆత్మ శుద్ధచైతన్య స్వరూపము. శుద్ధజ్ఞానస్వరూపము. సాధారణముగా మన నిత్యజీవితములో మనము పదార్థముల జ్ఞానమును మాత్రమే కలిగియుందుము. ప్రపంచములోని పదార్థములన్నియు ఇంద్రియ గ్రాహ్యములుగానో, మనో గ్రాహ్యములుగానో, బుద్ధిగ్రాహ్యములుగానో మాత్రమే యుండును. ఉదాహరణకు శబ్దస్పర్శాదిగుణములు ఇంద్రియ గ్రాహ్యములుగను, భావములు, అనుభవములు మనోబుద్ధి గ్రాహ్యములుగను తెలిసికొనుచున్నాము కాని యీ మనో బుద్ధీంద్రియములు ఏ శక్తిచేత వీనిని గ్రహించగలుగుచున్న వని మాత్రము మనము తెలిసికొనుటలేదు.. ఈ ఆత్మవిషయ రహితమైన జ్ఞానస్వరూపమని గురువు చెప్పుచున్నాడు. అనగా ఈ యింద్రియాదులు తమ తమ విషయములను గ్రహించు టకుగాను శక్తినిచ్చు ఆ శుద్ధ చైతన్యమే ఆత్మయని భావము.

ఇట్లు సమస్త గుణములను లక్షణములను నిషేధించిన పిమ్మట గురువు ఆ విధిరూపమైతోచు ఆత్మగుణములను కొన్నిటిని పేర్కొనుచున్నాడు. ఇచటకూడ కొన్ని గుణము

లను విధించినట్లు పేర్కొన్నను వాస్తవములో ఆ ఆత్మ నిర్గుణమనియే మనము గ్రహించవలెను.

ప్రపంచోపశమం - దృశ్యప్రపంచము ఉపశాంతి పొందినట్టిది. ఆ తురీయము యీ దృగ్గోచరమైన ప్రపంచ మంతయు లేనిది. తురీయావస్థకుచేరు ద్వారబంధమువఱకు మాత్రము నానాత్వముగల యీ దృశ్యమాన ప్రపంచ మంతయు నున్నది. ప్రపంచమనగా నానాత్వవిశిష్ట విషయ ప్రపంచము. జాగ్రవస్థలోను స్వప్నావస్థలోను నీ ప్రపంచమును అనుభవపూర్వకముగను, సుషుప్తవస్థలో అజ్ఞానరూపముగను నీ నానాత్వవిశిష్ట ప్రపంచమును మనము తెలిసికొని యనుభ వించుచున్నాము. కాని మన మా తురీయావస్థను ప్రవేశించి నంతనే మనకీ సుఖదుఃఖములు, ఆద్యంతములు, జనన మరణ ములు మొదలైన పరిమితులతోకూడిన ప్రపంచమునకు ప్రవే శము లేదు. అనగా ద్వంద్వముతో కూడిన నీ ప్రపంచము నిర్ద్వంద్వమైన యీ తురీయావస్థను చేరగానే 'నశించునని భావము.

శాంతం - శాంతమైనది. మనలోని ఇచ్ఛారాగ ద్వేషాదులచే మనకు అశాంతి కలుగుచున్నదని మన మిది వరకే తెలిసికొంటిమి కావున రాగద్వేషాది ద్వంద్వములతో కూడిన ప్రపంచమునుండి విరమించినంతనే మనమా ప్రశాంత మైన సత్యతత్త్వమునందు ప్రవేశించగలుగుచున్నాము. అనగా అశాంతియుత ప్రపంచమును విడిచి శాంతియుత సత్యతత్త్వము ననుభవింపగలుగుచున్నామని భావము.

అద్వైతం - ద్వితీయములేనిది అనగా ఏకము అని భావము. భ్రాంతిచేత కల్పింపబడిన పాము త్రాటినుండి పోగానే కేవలము సత్యమైన త్రాడుమాత్రము మిగులు చున్నది. మనకీ నానాత్వభ్రమ జాగ్రత్స్వప్నములందే కలుగుచున్నది. సుషుప్తియందు మాత్రము బ్రహ్మానంద సదృశమైన యొక యనుభవము కలుగుచున్నది. కాని మనము మాత్రము దానిని తెలిసికొనలేకున్నాము. కాని మనమా తురీయావస్థను పొందినవెంటనే యీ నానాత్వరూప ప్రపంచము నశించుటచే కేవలము ద్వైతానుభూతిని పొందు చున్నాము.

ఇట్లు నిషేధరూపముగను, మరికొంత లక్షణ పూరకమ్ముగను ఆ తురీయావస్థను సూచించినపిమ్మట మహర్షి "అదియే తురీయము" అని ముగించుచున్నాడు. ఇట్లే మంత్రము ఆ ఆత్మతత్త్వము యొక్క మాహాత్మ్యమును వర్ణించునదైనప్పటికిని పూర్తిగా విధిరూపములోనే లక్షణ మును చెప్పలేక నిషేధపద్ధతిలోనే లక్షణమును చెప్పుచున్నది. ఇట్లు మనలోని విషయప్రపంచమును నిషేధించినపిమ్మట "ఆ తురీయావస్థయే ఆత్మ" యని సూచించి "దానిని తెలిసి కొనవలెనని" దృఢముగా చెప్పుచున్నాడు.

గురువుయొక్క యీ తుదిపదములలోని భావము చాల గంభీరమైనది, పవిత్రమైనదికూడ. ఆ పరమాత్మను లక్షణములద్వారా సూచించుటకు తగినంత ప్రయత్నము చేసిన తరువాత యాచార్యుడు శిష్యునితో "నీ వింతవరకు నీ బుద్ధిద్వారా గ్రహించినదానితో శాస్త్రాభ్యాసము పూర్తి

కాలేదు." అని చెప్పుచున్నాడు. శాస్త్రములు ప్రబోధ మాత్రముచేతనే గ్రహింపదగినవైనను, ఆ ప్రబుద్ధవిషయముపై మనము ధ్యానముకూడ చేయవలెను. అనగా శ్రవణము మాత్రముచాలదు. దానిని మననముకూడ చేయవలెను. తరువాత నిధిధ్యాస నభ్యసింపవలెను. అటుపిమ్మట సమాధి కుదురును.

గురుబోధానంతరమున ప్రతి విద్యార్థియు తనలోని బాహ్యావరణములనుండి విరమించుకొని, ఆంతరికమైన దివ్య కేంద్రమును కనుగొనినచో ఆ ఆత్మ తనలోనే తనకు వ్యక్తమగును. ఎడారిలో ఎండమావులెట్లు కొంచెముకూడ ఇసుకను తడపలేక యున్నవో అట్లే విషయప్రపంచముకూడ, ఆ తత్త్వమందు సత్తాలేని మిథ్యారూపమై యున్నది. కావున విద్యార్థి తనంతట తానే యికమీదట నా ఆత్మతత్త్వమును తెలిసికొని తనలోనే తాను అద్వైతానుభూతిని పొందవలెను. అటుపిమ్మట నాతనికి శాస్త్రబోధ కాని, శాస్త్రాభ్యాసము కాని నిరుపయోగమే యగుచున్నది. కావున ధ్యానమే లక్ష్యమును చేర్చు రాచబాట, మరియు ఆధ్యాత్మిక జీవితములోని అంతిమ ప్రాభవము.

కా॥ నివృత్తేః సర్వదుఃఖానామీశానః ప్రభురవ్యయః ।
అద్వైతః సర్వభావానాం దేవస్తుర్యో విభుః స్మృతః॥ ౧౦

అవ్యయమై, ప్రభువైన యీశ్వరతత్త్వమందు యీ సమస్తదుఃఖములు నివృత్తియగుచున్నవి. అది అద్వైతము. అదియే తురీయము. సర్వవ్యాపి. అది దివ్యము.

పూర్వమంత్రయొక్క విపుల వివరణచేత యీ కారిక లోని పదములు, ప్రయోగములు స్వయంవ్యక్తములై యున్నవి. ఉపనిషత్తులో చెప్పిన లక్షణములోని ముఖ్యాంశ మును సంగ్రహించి చెప్పుటకే కారికాకారుడు ప్రయత్నించు చున్నాడు.

ఈ ఉపనిషత్తు పూర్వమంత్రములో ఆ పరతత్త్వమును సాటిలేని పదములతో నిరూపించి తన అసాధారణ ప్రతిభను కనబరచినది. ఒక లక్షణమనగా ఒక వస్తువును సంపూర్ణముగ వివరించి మనకొక శబ్దచిత్రమును కల్పించుట యగుచున్నది. కావున యీ ఆత్మలక్షణము సంపూర్ణమైన శాస్త్రపద్ధతిలో చెప్పబడిలేదని మనకు తెలియుచున్నది. మరియు పూర్వ మంత్రము తురీయావస్థను వర్ణించుటయందు ధ్వని గర్భితపద ములను ఉపయోగించుటలో ఎంత సఫలతను పొందినదో ఆ పరమాత్మను వివరించుటలో నది అంతగా సాఫల్యమును పొందలేకపోయినది.

సహజముగానే యిందులో ప్రవేశములేని విద్యార్థికి దీని సరియైన భావమును గ్రహించుట కష్టమగుచున్నది. అట్టి సమయములోనే మన దృష్టిని మరల్చి, ఆలోచనలను, ఉప షత్తులను సరియైన మార్గములో పెట్టి, తద్ద్వారా ఆ పదముల యొక్క సుసంగతమైన భావములను కనుగొనునట్లు చేయుటకు మనకొక గురువు కావలసియున్నది. కారికాకారుడైన గౌడ పాదునకు మనలనట్టి సరియైన మార్గములో పెట్టుట విధియై యున్నది. కావున ఉపనిషత్తులయొక్క సరియైన యర్థమును

తెలిసికొనుటకుగాను మన బుద్ధిని త్రిప్పుటకై యాత డీ కారికలను వ్రాసియున్నాడు.

కా॥ కార్యకారణబద్ధౌ తావిష్యేతే విశ్వతైజసౌ ।
ప్రాజ్ఞః కారణబద్ధస్తు ద్వౌ తౌ తుర్యే న సిధ్యతః॥ ౧౧

విశ్వతైజసులు కార్యకారణములచేత బద్ధులైయున్నారు. కాని ప్రాజ్ఞుడు కారణమాత్రబద్ధుడై యున్నాడు. ఆ తురీయములో నీ కార్యకారణములు రెండును సిద్ధించవు.

కారణములో అవ్యక్తముగా కార్యమిమిడి యున్నది. ఆ కార్యము వ్యక్తముకాగానే కారణము మాయమై కార్యరూపమును పొందుచున్నది. జాగ్రదభిమానియగు విశ్వుడు కార్యకారణములచే నియతుడై యున్నాడు. ఆధ్యాత్మిక విషయములో అవిద్య – అనగా పరమాత్మ విషయకమైన "అజ్ఞానము," కారణమగుచున్నది. నిత్యసత్య సర్వవ్యాపి శుద్ధచైతన్యమే మనమని మనము తెలిసికొనక మనమందుండి విషయప్రపంచమును సృష్టించుకొనుచున్నాము. తరువాత యా విషయముతో నొక విధమైన సంగము నేర్పరచుకొని రాగద్వేషములతో కూడిన జాగ్రదవస్థలో ఆతురతలతోను, అలజడులతోను, సుఖదుఃఖములతోను మన జీవితమును నలగగొట్టుకొనుచున్నాము.

ఈ విధముగా విశ్వుడు కారణము (అవిద్య) కార్యము (విషయప్రపంచము) తానే యగుచున్నాడు. విషయ ప్రపంచమనగా ప్రపంచములోని పదార్థములు మాత్రమేగాక మన

యొక్క దేహమనోబుద్ధులుకూడ విషయప్రపంచమే యగుచున్నవి. మనలోని విశ్వుడు బాహ్యప్రపంచ విషయములచే మాత్రము బద్ధుడు కాక మనలోని మానసిక, ప్రాజ్ఞిక వ్యక్తిత్వములతో కూడ కట్టబడి కొట్టబడుచున్నాడు.

ఈ మంత్రములో సూచించిన యీ భావము క్రొత్తగా నిందుప్రవేశించిన విద్యార్థికి బుద్ధి సూక్ష్మత, ఆలోచనాశక్తి యున్ననే కాని ప్రస్ఫుటముకాదు. "తురీయము బాహ్యావిషయములను తెలియనిది, ఆంతరిక విషయములను తెలిసికొనని ది" అని గౌడపాదుడు చెప్పెననగా ఆ తురీయము విశ్వుడు కాదు, తైజసుడు కాదు అని యర్థము.

విశ్వుడు మాయచేతను, మాయాసృష్ట అహంకారము చేతను, భ్రమలచేతను బద్ధుడైయున్నాడు. తైజసుడు సూక్ష్మశరీరాభిమానియై, మనలోని యాత్మయందే కల్పితుడై సూక్ష్మ విషయానుభూతిని మాత్రమే పొందుచున్నాడు. అచట స్థూలప్రపంచము లేదు కావున స్వప్నావస్థకు తగిన సామగ్రితో అతడు కల్పింపబడినాడు. ఈ తైజసుడుకూడ కారణమగు అవిద్య, కార్యమగు సూక్ష్మ ప్రపంచము కలిగి కార్యకారణ బద్ధుడైయే యున్నాడు.

ఇట్లు విశ్వతైజసులు కార్యకారణ బద్ధులైయున్న ప్రాజ్ఞుడగు సుషుప్త్యభిమాని యెట్లు భిన్నుడై యున్నాడనిన ప్రాజ్ఞుడగు సుషుప్త్యభిమాని కేవల కారణమాత్రబద్ధుడైయున్నాడు, అని చెప్పవచ్చును. అచట అతనికి నానాత్వవిశిష్టమైన యీ స్థూలసూక్ష్మప్రపంచములు లేవు. అచట

ఒకే విధమైన భావమున్నది. "నాకు తెలియదు" అని మాత్రమే మనమెన్నిసార్లైనను చెప్పగలము కావున సుషుప్త్యవస్థలో సంపూర్ణ అజ్ఞానము లేక అవిద్య మాత్రమే యున్నది. ఆ పరమాత్మ విషయకమైన అజ్ఞానమే యీ నానాత్వవిశిష్ట ఆద్యంతయుత సమస్త ప్రపంచమునకు కారణమని మనమిది వరకే తెలిసికొనియున్నాము. కావున ప్రాజ్ఞుడు కేవలము యీ నానాత్వవిశిష్ట కార్యరూప ప్రపంచములేని కారణ మాత్రముచేతనే బద్ధుడై యున్నాడు.

విశ్వతైజసులు కార్యకారణబద్ధులై, ప్రాజ్ఞుడు కారణమాత్రబద్ధుడై యున్న తురీయము ఎటువంటిది? దానినే యీ శ్లోకము వివరించుచున్నది. ఆ తురీయము కార్యకారణములచే గాని, కారణమాత్రముచేగాని బద్ధమైనదికాదు. త్రాటికి సంబంధించినంతవఱకు పాముగాని, దానిపడగగాని, బుసలు గాని నిజమైనవికావు. ఏలన త్రాటిలో పాము ఎన్నడును లేదు. ఆపాము భ్రమచే త్రాటియందు ఆరోపితమై భాసించుచున్నది కావున ఆ సత్యతత్త్వము అట్టిభ్రమచే బద్ధముకానేరదు. ఎండమావులనీరు అచటి యిసుకను కొంచెమైనను తడపలేదు. అట్లే విశ్వతైజసప్రాజ్ఞులను బంధించిన యీ కార్యకారణము లేవియు ఆ సత్యతత్త్వమును మలినపఱచలేవు. దీనివలన విశ్వతైజసప్రాజ్ఞులనునవి సత్యతత్త్వమైన యీ తురీయమునందు భ్రమచే ఆరోపితమైనవేకాని సత్యములు కావు అని కారికాకారుడు చెప్పుచున్నాడు.

కా॥ నాత్మానం న పరాంశ్చైవ న సత్యం నాపి చానృతం
ప్రాజ్ఞః కించన సంవేత్తి తుర్యం తత్సర్వదృక్సదా॥ ౧౨

ప్రాజ్ఞునకు సత్యముగాని అసత్యముగాని, ఆత్మగాని అనాత్మగాని తెలియదు. తురీయమో సదాసమస్తమును చూచి తెలిసికొనునదై యున్నది.

ఇదివఱకు వివరించిన కారణమగు అవిద్య ఆ ఆత్మవిషయకమైన అజ్ఞానమే యగుచున్నది. ఇదియే భ్రాంతిమూలమైన విషయప్రపంచమును సృష్టించుచున్నది. ఇచట కార్యమనగా అన్యథాగ్రహణమని కూడ చెప్పవచ్చును. అనగా ఉన్నదానిని ఉన్నట్టుగా గాక అన్యవిధముగా తెలిసికొనుట. సత్యముయొక్క తత్త్వమును సరిగ గ్రహించకపోవుట చేతనే యీ అన్యథాగ్రహణము సంభవించుచున్నది. కావున విశ్వతైజసులిద్దరు అసలు తెలిసికొనక పోవుట – అనగా అజ్ఞానము చేతను, అన్యథాగ్రహించుటచేతను – అనగా భ్రాంతిచేతను బద్ధులైయున్నారని భావము. ప్రాజ్ఞుడైతే కేవలము అజ్ఞానబద్ధుడై మాత్రమే యున్నాడు. ఈ పై విషయములే యీ కారికలో వివరింపబడినవి.

ఆ తురీయములో అగ్రహణము – అనగా – అజ్ఞానముగాని అన్యథాగ్రహణముగాని లేదనిన ఆ తురీయమునకు యీ ప్రాజ్ఞునకు వాస్తవములోగల భేదమేమి యని మనకు సందేహము కలుగవచ్చును.

నిషేధముచేత లక్షణము చెప్పినపుడు శిష్యుడు సహజముగానే యేది నిషేధింపబడలేదో అదియే పరమాత్మ యని పొరబాటుగా గ్రహించుట సంభవించును. పూర్వమంత్రములో గౌడపాదుడు జాగ్రదవస్థ, స్వప్నావస్థ కాని స్థితి

తురీయమని చెప్పియున్నాడు. కావున శిష్యుడు, అట్టైన నది సుషుప్త్యవస్థయై యుండవచ్చు నేమోనని, యాతడు ప్రాజ్ఞుడై యేయుండి యుండవలయు నని ఒక నిశ్చయమునకు రావచ్చును. ఈ అపోహను నివారించుటకుగాను ఈ కారికలో ఆ తురీయమును ఉపపత్తిపూర్వకముగా మరికొంత వివరించు చున్నాడు.

సుషుప్తిరహితమైన ఆత్మతత్త్వమునకును విషయ ప్రపంచ రహితమైన సుషుప్తికిని యిచట స్పష్టముగా తారతమ్యమును చెప్పుచున్నాడు. వాస్తవములో సుషుప్తిని యర్థముచేసికొని గ్రహించుటయే మనకు కష్టమై యున్నది. ఆ యుపనిషత్తులు సుషుప్తిరహితమైన యా పరతత్త్వమును సూచించుటకు ప్రయత్నించునపుడు నిజముగా దానిని గ్రహించుట మనకసాధ్యమే యగుచున్నది.

సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞుడు సత్యమునుగాని, మిథ్యనుగాని, మంచినిగాని, చెడునుగాని, ఆత్మనుగాని, అనాత్మనుగాని దేనిని తెలిసికొనలేకున్నాడు. ఆ సుషుప్త్యవస్థ సర్వసంపూర్ణమైనదిగాని, శుద్ధచైతన్యరూపముగాని కాదు. సుషుప్తవస్థలో మనము కేవలము మూర్తీభవించిన యజ్ఞానమునే యనుభవించు చున్నాము.

చీకటిని చూచుట యనగా ప్రకాశమును చూడకుండుట యగుచున్నది. తురీయము నిత్యజ్ఞాన స్వరూపము. కావున చీకటి వెలుతురులవలె ప్రాజ్ఞతురీయములు పరస్పర విరుద్ధముగా నున్నవి. సుషుప్తవస్థలో "నాకేమియు తెలియలేదు" అని

తెలిసికొనుచున్నాము. తురీయావస్థలో నాకన్నియు తెలియు నని సదా భావించుచున్నాము. శుద్ధ జ్ఞానస్వరూపమే తురీయము గావున దాని నైజతత్త్వము జ్ఞానమే యగుచున్నది.

దీపమును ప్రకాశింపజేయుటకు మరియొక ప్రకాశము అవసరములేదు. అది తానే ప్రకాశస్వరూప మగుచున్నది. అట్లే జ్ఞానరూపమైన ఆత్మను తెలిసికొనుటకు మరియొక జ్ఞానమక్కరలేదు. తురీయము లేక ఆత్మ జ్ఞానస్వరూపము గావుననే కారికాకారుడు దానిని "సర్వదృక్ - సమస్తమును చూచునది" యని సూచించి చెప్పుచున్నాడు.

కా॥ ద్వైతస్యాగ్రహణం తుల్యముభయోః ప్రాజ్ఞతుర్యయోః ।
బీజనిద్రాయుతః ప్రాజ్ఞః సా చ తుర్యే న విద్యతే ॥ ౧౩

సుషుప్తిలోను తురీయములోను కూడ ద్వైతమును గ్రహించకుండుట సమానమే యగుచున్నది. అయితే ప్రాజ్ఞుని యందు కారణమైన అవిద్య నిద్రాణమై యున్నది. తురీయమందు అవిద్య లేనేలేదు.

పై రెండు శ్లోకములను చదివిన తరువాత దీర్ఘముగా ఆలోచించిన మనకొక సందేహము కలుగును. అట్టి సందేహమును ఇచట నివారించుచున్నాడు. సుషుప్తిలో మనకు ద్వైతభావము లేదని చెప్పియున్నాడు. అట్లే తురీయములోకూడ చైతన్యము పైకి చొచ్చుకొని వచ్చు విషయప్రపంచ మేదియు లేదు. ఇట్లు తురీయములోను, సుషుప్తిలోను కూడ అద్వైతభావము సమానమైన యెడల తురీయము సుషుప్తికంటె యే విధముగా భిన్నమైయున్నది? రెండింటిలోను అద్వైతభావము

సమానమగుటచే తురీయము సుషుప్తికంటె భిన్నమైనదికాదు. ప్రపంచములోని నాస్తికులు, అందును ముఖ్యముగా సామ్య వాదులు, తమ అపోహాలను బలపఱచుకొనుటకై, మఱియు కేవలము గుల్ల, కల్ల యని రుజువుపరచుటకుగాను యిట్టి మంత్ర ములకు పైపై యర్థములనే గ్రహించి కొన్ని నిర్ణయములను చేయుచున్నారు. అట్టివారు చాలమంది నా వద్దకు వచ్చి నన్ను యీ పై ప్రశ్న వేసినారు. వారికి సరియైన సమాధాన మిచ్చిన పిమ్మట 'వేదాంతము ప్రజానీకమునకు మానసిక, వైజ్ఞానిక మత్తులోని ఆనంద స్థితిని సూచించునది అగు చున్నది.' అని వారు భావించుచున్నారు. ఇట్టి కుతర్కము విషయమును సరిగ్గా అర్థముచేసికొనకపోవుటచే సంభవించు చున్నది. ఎంత సూక్ష్మమైనదైనప్పటికిని, కేవలము బుద్ధి మాత్రముచేతనే ఆ ఉపనిషత్తులయొక్క భావము గ్రహింప శక్యముకాదు. ఆ ఆశయములను స్వాయముగా, హృదయ భావముతో జీవించుట మాత్రము చేతనే ఆ వేదాంతము యొక్క భావము గ్రహింపశక్యమగుచున్నది.

ఇచట సుషుప్తికిని, తురీయమునకు గల భేదము స్పష్టముగా వివరింపబడినది. సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞుడు తత్త్వమును తెలిసికొనలేని అజ్ఞానదశలో నుండును. ఈ అజ్ఞా నమే విషయప్రపంచమునకు కారణమగుచున్నది. కాని తురీ యము "సర్వద్రష్ట" యైన తత్త్వమగుటచే అచట అజ్ఞానము లేదు కావున అది సుషుప్త్యవస్థ కానేరదు

ఆత్మానందానుభూతినందు క్షణములు సదా సంపూర్ణ ప్రకాశమానమై, జ్ఞానస్వరూపమై, సర్వవ్యాప్తమైనదగుటచే

అచట అజ్ఞానము నిలచుటకు తావులేదు. అదియే నిత్యసత్య జ్ఞానతత్త్వము. తురీయావస్థ ఒకదానికి పూర్వమైనదిగాని, మరియొకదానికి పరమైనదిగాని కాదు. అది సర్వదా ఉన్నదే కావున అది ఒకదానికి కారణముగాని కార్యముగాని కానేరదు. శుద్ధ జ్ఞానస్వరూపమగుటచే అందు కారణబద్ధమగు సుషుప్త్యవస్థ యుండజాలదు.

కా॥ స్వప్ననిద్రాయుతావాద్యౌ ప్రాజ్ఞస్త్వ స్వప్న నిద్రయా ।
న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యంతి నిశ్చితాః॥ ౧౪

విశ్వతైజసులు నిద్రాస్వప్నములతో కూడియున్నారు. ప్రాజ్ఞుడు స్వప్నరహితనిద్రతో కూడియున్నాడు. తత్త్వజ్ఞులు తురీయమందు నిద్రనుగాని స్వప్నమును గాని చూడరు.

ఆ పరమాత్మ స్థూలదేహాభిమానియై, నానాత్వ విశిష్ట బాహ్యప్రపంచమును చూచునపుడు అతడు జాగ్రదవస్థలో నున్న విశ్వుడగుచున్నాడు. అట్లే యా పరమాత్మ భౌతిక రూపమునుండి విరమించుకొనినపుడు ఆ విషయప్రపంచము అతనికి లేనిదే యగుచున్నది. ఇట్లు బాహ్యప్రపంచమునుండి విరమించుకొనిన యతడు స్వప్నావస్థను పొందినవాడై మనోబుద్ధులతో కూడిన సూక్ష్మశరీరాభిమాని యగు తైజసుడగుచున్నాడు. ఆ తైజసుడు స్వప్నప్రపంచమునందు సూక్ష్మ విషయానుభవములను పొందుచున్నాడు. విశ్వతైజసు లిద్దరు స్వప్ననిద్రాయుతులై యున్నారనగా వారు కార్యకారణ బద్ధులై యున్నారని కారికాకారుని భావము. కాని ప్రాజ్ఞుడు స్వప్నరహిత నిద్రామాత్రముచేతనే బద్ధుడై యున్నాడనగా

అన్యథాగ్రహణములేని అజ్ఞానము మాత్రమేగల కారణ రూపుడై యున్నాడు. అనగా నచట అన్యథాగ్రహణముగల జాగ్రత్స్వప్నములు లేనిదై, కేవలము అగ్రహణరూపమైన అజ్ఞానము – అనగా అవిద్య మాత్రమే యున్నది అని భావము.

ఇచట కారికాకారుడు మనకు పరిచితమైన జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలద్వారా మనకు అపరిచితమైన యా తురీయా వస్థను బోధించుటకై ప్రయత్నించుచున్నాడు. కావున మనకు అనుభవములోనున్న స్వప్నసుషుప్తులు ఆ తురీయములో లేవని చెప్పుచున్నాడు.

“ఇది కేవలము బుద్ధిబలముచేత యూహింపబడిన వేదాంతతత్త్వము మాత్రమే కాక, ఇది పలువురిచే తెలిసి కొనబడి, యనుభవించి జీవించిన తత్త్వము” అనియు, ‘మనముకూడ అనుభవింప యోగ్యమైనదనియు రుజువు పఱచు టకుగాను ఈ సత్యమును ఆ నాటి ఋషులు యనుభవించి తెలిసికొని యున్నారని కారికాకారుడు ప్రకటించుచున్నాడు. కావున మనమీ శ్లోకముద్వారా ఆ తురీయావస్థ మనము దైనందిన జీవితములో అనుభవించుచున్న జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు అతీతమైన యవస్థయని గ్రహించవలెను.

ఆ ఆత్మానుభవమనునది యొక విషయము కాక పోవుటచే అదియొకదానిచే గ్రహింపబడునది కాదు. తురీయము మనగా నిర్విషయకమై, అఖండమై, ఏకజాతీయమైన శుద్ధ జ్ఞానస్వరూపము. దీనిని గుఱించి మరికొన్నివివరములు తరు వాత శ్లోకములో కనుగొనగలము.

కా॥ అన్యథా గృహ్ణతః స్వప్నో నిద్రా తత్త్వమజానతః
విపర్యాసే తయోః క్షీణే తురీయం పదమశ్నుతే ॥ ౧౫

స్వప్నము తత్త్వమును అన్యథా గ్రహించుటచే గలుగు చున్నది. సుషుప్తితత్త్వమును తెలిసికొనకపోవుటచేత అనగా తత్త్వముయొక్క అజ్ఞానముచేత కలుగుచున్నది. ఇట్టి అన్యథా గ్రహణ, అగ్రహణరూప విపరీతజ్ఞానము నశించుటచేత తురీయము పొందబడుచున్నది.

ఆ తురీయావస్థను ఎప్పుడు పొందుచున్నాడను దానిని ఈ శ్లోకము వివరించుచున్నది. అన్యథాగ్రహణముగాని అనగా ఉన్నదానిని వేరొకవిధముగా గ్రహించుటగాని, అగ్రహణముగాని అనగా ఉన్నదానిని ఉన్నట్టు గ్రహించకపోవుట గాని లేనప్పుడు అనగా నిద్రా స్వప్నములు లేనప్పుడు భ్రమ నశించి తురీయము పొందబడుచున్నది. ఇచట స్వప్నమును మాత్రము చెప్పి జాగ్రదవస్థను చెప్పకపోవుటచే నా తత్త్వ దృష్టిలో ఈ జాగ్రత్స్వప్నములు రెండును సమానమే యని తెలియుచున్నది. అనగా త్రాటిని సర్పముగా భావించినను కట్టెపుల్లగా భావించినను తత్త్వమును అన్యథా గ్రహించుటయే యగుచున్నది. కావున యీ జాగ్రత్స్వప్నావస్థలలో రెండింటను మిథ్యాజ్ఞానము సమానమే యగుచున్నది.

తురీయము ఈ మూడింటికి అతీతమైనదని యీ శ్లోకము వివరించుచున్నది. నిద్రయనగా తత్త్వముయొక్క అజ్ఞానము. అట్టి అజ్ఞానమే యీ తత్త్వమును అన్యథా గ్రహించుటకు కారణమగుచున్నది. అనగా అజ్ఞానమువలన కార్య

రూపమైన జాగ్రత్స్వప్నములు కలుగుచున్నవి. ఇట్లు మనము కారణమైన అవిద్యను, కార్యరూపమైన నానాత్వ విశిష్ట ప్రపంచమును అతిక్రమించినయెడల తురీయావస్థలో ఆ సత్య తత్త్వమును అనుభవించగలుగు చున్నాము. కారణమైన అవిద్య సత్యతత్త్వమును తెలిసికొనినంతనే నశించును. కారణము నశించగానే కార్యరూపమైన దృశ్యప్రపంచ మంతయు లేనిదగుచున్నది.

కా॥ అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే ।
అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా ॥ ౧౬

అనాదిమాయచేత సుప్తమైన జీవుడు జాగృతుడు కాగానే యాతడు తనను అజునిగను, నిద్రాస్వప్నములులేని వానినిగను, అద్వైతునిగను తెలిసికొనుచున్నాడు.

వేదాంత సాధనచేతను, ధ్యానముచేతను ఆ దివ్యచైతన్యమును తెలిసికొని ప్రబుద్ధులైనంతనే మనముకూడ ఆత్మీయముగా నా తత్త్వమును అనుభవించగలుగుచున్నామని మనకు నమ్మకము కలిగింప కారికాకారుడు ప్రయత్నించుచున్నాడు. ఇట్లు మాటిమాటికి కారికాకారుడు మనకభయమిచ్చుటచే ఈ యుపనిషత్సత్యములు కేవలము ఊహాగానములు కావనియు ప్రతిసాధకునకు నిత్యజీవితములో అనుభవ యోగ్యములే యనియు తెలియుచున్నది.

మానవు డిప్పుడు 'ఆ ఆత్మతత్త్వము సర్వవ్యాపియగు శుద్ధచైతన్యము' అని తెలిసికొనలేని భ్రమరూపమైన సుషుప్తిలోనున్నాడు. ఇట్టి సుషుప్తి సృష్టికాలమునుండి యనాదిగా

యతనియందున్నది. అనగా అనాదికాలమునుండి యిప్పటి వరకు మనము సుషుప్త్యవస్థలోనే నివసించుచున్నాము అనిన ఆ సత్యతత్త్వమును తెలిసికొనలేని నిద్రలోనే యున్నాము అని భావము. ఇట్టి యీ జీవుడు తన యనాది నిద్రనుండి మేల్కొనినచో అనిద్రమై, అనాదియై, అద్వైతమైన ఆ ఆత్మ తత్త్వమును తెలిసికొని జాగృతిని పొందుచున్నాడు.

అస్వప్నం - స్వప్నము లేనిది యనగా అన్యథాజ్ఞానములేనిది. ఈ భావమే యుపనిషత్తులలోకూడ చెప్పబడి యున్నది. ముఖ్యముగా నా ఋషులు "ఉత్తిష్ఠత - జాగ్రత" యని ప్రబోధించుచున్నారు. మనమట్లు ప్రబుద్ధులైన భ్రమ మూలకమైన స్వప్నావస్థ నశించుచున్నది. ఇట్లు తత్త్వమును గ్రహించినచో మనకీ సుఖదుఃఖములు, ఆద్యంతములు, జనన మరణములు గల ప్రపంచమే లేనిదగుచున్నది. అనగా అహంకారరూపజీవుడు సంపూర్ణముగా శాశ్వతముగా నశించిపోవు చున్నాడు.

సంసారమంతయు అహంకారరూప జీవునకే కలదు. అహంకారము నశించిన సంసారము నశించును. అహంకారము ఎట్లు సమకూడెనో, దానివలన భ్రమాత్మకమైన భిన్నభావము మనకెట్లు కలిగినదో అనునది యిదివఱకే వివరింపబడినది. ఇట్లు మనమా ఆత్మతత్త్వమును గ్రహించినంతనే, అవిద్య తత్కార్యమైన భ్రమాదులు నశించుచున్నవి.

కా॥ ప్రపంచో యది వర్తేత నివర్తేత న సంశయః ।
మాయామాత్ర మిదం ద్వైతమద్వైతం పరమార్థతః ॥ ౧౭

ప్రపంచమే యదార్థమైన యది నశించియే యుండును. ఈ ద్వైతమంతయు మాయ మాత్రమే. అద్వైతమొక్కటియే పరమార్థము.

పూర్వమంత్రములో నానాత్వవిశిష్టప్రపంచము అదృశ్యమైనంతనే మన మనుభవించుటకు ఆ అద్వైత తత్త్వము మాత్రమే మిగిలియున్నదని తెలిసికొంటిమి. సాధారణ సాధకుడిచట సందేహమును పొందవచ్చును. కావున యిచట ఆ విషయము వివరింపబడుచున్నది. ఆ ప్రపంచము నిజముగానే అస్తిత్వము కలిగియుండినయెడల అప్పుడీ సంశయము న్యాయమైనదే-యగుచున్నది. ప్రపంచస్థితియే భ్రాంతిమూలకమగుటచే త్రాటియందు సర్పభ్రాంతివలె అది లేనిదే యగుచున్నది. కావుననే సత్యతత్త్వజ్ఞానము కలిగినంతనే అది అదృశ్యమగుచున్నది.

ప్రత్యక్షముగా చూచుచున్న నానాత్వ విశిష్ట ప్రపంచమునేనమ్మి, అట్లు చూడని యీ యద్వైత యాత్మతత్త్వమును నమ్మజాలని వారికిది ప్రత్యుత్తరమై యున్నది. శ్రీ శంకరాచార్యులు తమభాష్యములో నీ విషయమును రజ్జు సర్పభ్రాంతి యుదాహరణ ద్వారా వివరించుచున్నారు. త్రాటియందు సర్పమును చూచుచున్నను, సత్యమైన రజ్జుజ్ఞానము కలిగినంతనే అద్వితీయమైన రజ్జువొకటియే మనకు గోచరించును. అట్లే భ్రాంతమైన యీ ప్రపంచమును చూచుచున్నను, సత్యమైన ఆ ఆత్మతత్త్వమును గ్రహించినంతనే యద్వైతమైన యీ తత్త్వమొక్కటియే మనకు గోచరించును. శ్లోకములోని పూర్వార్థమున అనుకూల తర్కము కలదు. "ప్రపంచములేదు.

అదియున్నయెడల నశించెడిది. నశించలేదు కావున యది లేనిదే యగుచున్నది'' అని. ఇట్టి నానాత్వవిశిష్ట ప్రపంచము నిజముగా ఉన్నయెడల తప్పక నశించెడిదే. కాని యది యా సత్యతత్త్వములో యుండియుండలేదు. ద్వైతము భ్రాంతి మూలము. అద్వైతమే సత్యము.

కా॥ వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్ ।
ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం న విద్యతే॥ ౧౮

ఎవరైన యిట్టి భావములను సంకల్పించిన యెడల యీ వికల్పములుకూడ నివృత్తియై యుండును. కాని యీ వాదము కేవలము ఉపదేశముకొఱకు మాత్రమే యగుచున్నది. తత్త్వమును తెలిసికొనిన పిమ్మట యీ ద్వైతము ఉండదు.

పూర్వమంత్రమును వివరించినంతనే యొక పూర్వపక్షి లేచి "అయ్యా! మీరుచెప్పినట్లు ప్రపంచమంతయు మిథ్య - భ్రాంతిమూలము మాత్రమే యైనయెడల, బోధించు గురువు, బోధింపబడు శిష్యుడు, బోధనాగ్రంథము అన్నియు మిథ్య యేనా? అంతయు భ్రమయేనా?" అని ప్రశ్నించుచున్నాడు.

ఆ వేదాంతియు అదే సమాధానము నిచ్చుచున్నాడు. ఆత్మబోధకలిగిన సమయములో ఈ శిష్యుడు, గురువు, శాస్త్రము అన్నియు మిథ్యయే. ఆ పరమాత్మయందు గురువు లేడు, శిష్యుడు లేడు, శాస్త్రము లేదు. ఈ మూడును కేవలము ఉపదేశముకొఱకే యైయున్నవి. ఆ పరమాత్మను పొంది యందలి పూర్ణత్వమును అనుభవించునంతవఱకే యివి

యన్నియు యుపయోగపడుచున్నవి. ఆ సత్యతత్త్వము నను భవించు క్షణములో యీ నానాత్వము అతనిచే గ్రహింప బడదు. ఆత్మయందు విషయములేవియు నుండజాలవు. అది నిర్విషయము.

ఇచట పూర్వార్థము కొంత తర్కమును కలిగియున్నది. సాధారణముగా వేదాంతచర్చలలో నిట్టి తర్కమును నుప యోగించెదరు. "ఈ ప్రపంచమే యొక యూహామాత్రమైన వికల్పమైన వెంటనే యది నివారితమైయే యుండెడిది. కావున అది ఊహామాత్రము కాదు." ఈ వాదముచేత అద్వైతులకు అనంగీకారమైన ప్రపంచ అస్తిత్వము స్థిరపరుపబడినది. గౌడ పాదుని అద్వైతసిద్ధాంతమునకు రంధ్రాన్వేషకులైన కొంత మంది విమర్శకులు దీనిని యపార్థము చేసికొనిరని తెలియు చున్నది. "ఈ ప్రపంచము ఎవరిచేతనైనను సృష్టింపబడిన యెడల నిది నశించియే యుండును కాని యీ సృష్టి యాభాస మాత్రమే యై యున్నది. సత్యము కాదు. ధ్యానము ద్వారా ఆ పరమాత్మను తెలిసికొనిన యెడల ద్వైతభావమే యుండదు" అని యిచటి తాత్పర్యార్థమై యున్నది. ఈ శ్లోక ములోని యుత్తరార్థము "పరమాత్మను తెలిసికొనినంతనే ప్రపంచము అంతమగుచున్నది" యను విషయమును రుజువు చేయుచున్నది.

మం॥ సోఽయమాత్మాఽధ్యక్షర మోంకారోఽధిమాత్రం
పాదా మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో
మకార ఇతి॥

ఆ ఆత్మయే అక్షరముల దృష్ట్యా ఓంకారమగు చున్నది. ఆ ఓంకారము దాని మాత్రలద్వారాను ధ్వనుల ద్వారాను పాదములుగా విభజింపబడినది. ఆ పాదములే అందలి మాత్రలు. అందలి మాత్రలే యీ పాదములు. అందలి అక్షరములు అకార, ఉకార, మకారములు.

ఇప్పుడు ఓంకారముపై చర్చచేయుటకై యుపనిషన్మంత్రము మరల ప్రారంభించుచున్నది. పూర్వమంత్రములలో ఈ 'ఓం'ను గుఱించి విపులముగా వివరింపబడినది. ఆత్మయొక్క చతుష్పాదములతో సంబంధించినంతవఱకు ఈ "ఓం" వర్ణిత మైనది. ఇప్పుడా "ఓం" లోని మూడక్షరములకు సంబంధించిన వఱకు వాటి సూచనలు వివరింపబడుచున్నవి. ఇంతకు పూర్వముకూడ 'ఓం' లోని మూడక్షరములమీద వరుసగా చైతన్యముయొక్క మూడవస్థలగు జాగ్రత్స్వప్న సుషుప్తులను ఆరోపించుటకు ప్రయత్నించితిమి. ఇట్లింతవఱకు 'ఓం' ను దానియొక్క పాదముల విషయమై వివరించితిమి. ఇప్పుడు దాని యక్షరముల యర్థమును తెలిసికొనుటకు ప్రయత్నించు చున్నాము.

ఇచట నీయుపనిషత్తు ఆ మూడక్షరములు లేక యీ త్రిమాత్రలే యీ మూడు పాదములని నిస్సంశయముగా దృఢ పఱచుచున్నది.

మం॥ జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా
మాత్రాఽఽప్తే రాదిమత్త్వాద్వాఽఽప్నోతి హ వై
సర్వాన్ కామానాదిశ్చ భవతి య ఏవం వేద ॥ ౯

జాగ్రదవస్థాభిమాని యగు వైశ్వానరుడు ఓంకారము లోని ప్రథమాక్షరమైన 'అ' కారము. ఈ రెండును ఆదియై నవి యగుటచేతను సర్వవ్యాపి యగుటచేతను సమాన భావము కలిగియున్నవి. ఇట్లీ రెంటిని సమానముగా నెవడు తెలిసికొనుచున్నాడో యాతడు అందరిలోను ప్రథముడైన ముఖ్యుడుగానై సర్వకామములను పొందుచున్నాడు.

స్థూలదేహముతో నైక్యము పొందినపుడాయాత్మ బాహ్యప్రపంచ దృష్టిగలదై స్థూలదేహాభిమానియగు వైశ్వానరునియొక్క యనుభవములను పొందుచున్నది. ఆ జాగ్రదవస్థాభిమానియగు విశ్వానరుడే ధ్యాన సౌలభ్యమునకై 'అ' అను ధ్వనిపై యారోపింపబడినది.

ఒక విషయముపై యొక భావమును ఆరోపించుట యనునది విగ్రహారాధన యను రహస్యపద్ధతి కలదగుచున్నది. ఒక గుండ్రని రాతిపై శివుని ప్రతిష్ఠించినాము. అటుపిమ్మట నొక భక్తుడు ఆ రాతిని భక్తితో సమీపించినపుడు అచట నొక దివ్యత్వమును అనుభవించుచున్నాడు. అంత నాతడు కైలాసాధిపతియగు శివుని సాన్నిధ్యములో నున్నట్లే భావించుచున్నాడు. అట్లే మారణసాధనమగు శిలువయందు క్రైస్తవుడొకడు క్రీస్తుయొక్క దివ్యభావమును చూచుచున్నాడు. కావున క్రైస్తవులు శిలువనెచట చూచినను దివ్యానుభూతిని పొందినవారై ఏసుప్రభువుయొక్క ఆశీర్వాదము నందినట్లు భావించుచున్నారు.

అట్లే నిర్గుణబ్రహ్మ నారాధించు వేదాంతవిద్యార్థికి కూడ ప్రాథమికదశలో నొక ఏకాగ్రభావము కుదురుటకై

నొక యాధారము ధ్యానమునకు ఆవశ్యకమై యున్నది. అందు కొఱకే శ్రుతి యిచట 'ఓం' ధ్వనిపై ధ్యానమునుగూర్చి వివరించుచున్నది. 'ఓం' యొక మూర్తిగాక ధ్వనియగుటచే నది కొంచెము కష్టతరమైన ధ్యానసాధన యగుచున్నది.

విషయవిభాగములకు బదులుగా 'ఓం' ధ్వనిలోని యక్షరభాగములను, దానిపై యారోపితమైన మానవ వ్యక్తిత్వమును మనకు వివరింపబడుచున్నది. ఇట్లా యా యక్షరములపై నా యా వ్యక్తిత్వముల నారోపించుటచే వేదాంతములో క్రొత్తగా ప్రవేశించిన విద్యార్థి తన సూక్ష్మదేహముయొక్క ప్రధానభావమునే తాను ఈ ఓంకారముపై యారోపించి ధ్యానముచేయ నేర్చుకొనుచున్నాడు. ఆ ధ్యానపద్ధతియే యీ మంత్రములోను రాబోవు రెండు మంత్రములలోను విపులీకరింపబడినది.

మనము రెండువస్తువులను పోల్చిచెప్పదలచిన ఉపమానోపమేయములకు రెండింటికిని మధ్య నొక సామాన్య ధర్మముండి యుండవలెను. అట్టి సామాన్య ధర్మమే లేకున్న రెండింటికి పోలికచెప్పుటకే వీలులేదు. "పాలు తేనెవలెనున్నవి" యని యనముగాని "వెన్నెల తెల్లగా పాలవలెనున్నది" యందుము. అట్లే శ్రుతి జాగ్రదవస్థాభిమాని యగు విశ్వుని "ఓం" కారములోని 'అ' అను అక్షరముతో పోల్చినపుడు కూడ నొక సామాన్యధర్మమును చెప్పుచున్నది. 'అ' అక్షరములోను విశ్వునిలోను సమానధర్మమేమనగా "సర్వవ్యాపిత్వము" మరియు "అన్నిటికిని ఆద్యమై యుండుట."

సర్వధ్వనులకు 'అ' ధ్వని మూలము. మానవుడు కేవలము తననోటిని విప్పి కొంతగాలిని పైకి వదలిన చాలును. 'అ' ధ్వని యుద్భవించుచున్నది. ఈ ఆద్యక్షరమైన 'అ' అన్ని భాషలలోను కనబడుచునే యున్నది. శిశువు జన్మించి నంతనే తాను ప్రపంచములో ప్రవేశించినట్లు ప్రకటనచేయుటకు కూడ 'అ' ధ్వనినే యుచ్చరించును. కావున 'అ' అనునది యక్షరములలోకెల్ల ఆద్యమై యున్నది. ఇట్లే యన్ని యవస్థలలోను జాగ్రదవస్థ ఆద్యమైయున్నది. స్వప్నము జాగ్రదవస్థలో తాననుభవించిన యనుభవముల పునర్మ్రుదణయే యగుచున్నది కావున యనుభవములలోకెల్ల ఆద్యమైనది జాగ్రదవస్థ యగుచున్నది.

'అ' ధ్వనిచేతనే సర్వశబ్దములు వ్యాప్తమై యున్నవి కావున సర్వవ్యాపిత్వముకూడ సరిపోవుచున్నది. విశ్వుడు విరాడ్రూప మందినపుడు ఆకాశమే యతని శిరస్సు యని శ్రుతిలో వర్ణింపబడియున్నది కావున వైశ్వానరుడు సర్వత్ర వ్యాపించియున్నాడు.

ఇట్లు యీ యైక్యమును తెలిసికొనినవాడు మహాత్ముడని శ్రుతి చెప్పుచున్నది. 'ఓం' లోని 'అ' కారమును వైశ్వానరునితో ఏకీభవింపజేసి యెవడైతే 'అ' కారమును ధ్యానించునో వాని కోరికలన్నియు సంపూర్ణముగా తీరునని శ్రుతి తెలుపుచున్నది. మరియు నట్టివాడు ప్రపంచమానవులలో నగ్రగణ్యుడగుచున్నాడు. తన తరములోనే యాతడు గౌరవింపబడుచున్నాడు. ఆధ్యాత్మికసాధనలకు ఉత్సాహమును

కలిగించి సాధనయందు ప్రవృత్తికలుగునట్లు చేయుటకై యుపనిషత్తులు ఫలశ్రుతిని నుపాయముగా నలవరచుకొన్నవి.

కాని దీనిని వినినంతమాత్రమునే యిట్లు సాధకుని యిందు ప్రవర్తింపజేయుట ఋషులయొక్క వక్రమార్గమని మనము భావించెదముకాని నవీనమనస్తత్వశాస్త్రప్రకారము చూచినచో నిత్యజీవితములో మానవుని వ్యక్తిత్వము నభివృద్ధి పఱచుకొనుటకు నిది యావశ్యకమని తెలియుచున్నది. జాగ్రతుడైన విశ్వునియందు ఇట్లు 'ఓం' కారమును జపింపదలచిన అతని మనోబుద్ధులు తప్పక పుష్టినొంది తీరును. తత్ఫలితముగ నతడు నతిచురుకుగను, సమతాభావముతోను గడుపగలుగుచున్నాడు. అట్టి వ్యక్తి కామలోభములతోకూడిన నేటి నవీన యుగములో సఫలుడై కృతకృత్యుడగునని చెప్పుటకు ఎట్టి వేదాంతియు నవసరములేదు. సాధారణమానవుడై యుండిన యట్టి సాధకుడు సంపూర్ణజ్ఞానియగుటలో సందేహము లేదు. మనలోని నిషిద్ధభావములవలననే మనము అశక్తులముగను అసమర్థులముగను నీచమానవులుగను తయారగుచున్నాము. కాని ఒక మానవునిలోని పూర్వవాసనలను, మానసికలోపములను తొలగించి ప్రోత్సహించిన యెడల నాతడు తప్పక సర్వసమర్థుడై, సర్వశక్తిమంతుడై, జ్ఞానియై, జీవితములోని సమస్తపథములలోను సాఫల్యమునంది కృతకృత్యుడగుచున్నాడు.

మం॥ స్వప్నస్థానస్తైజస ఉకారో ద్వితీయ మాత్రోత్కర్షా
దుభయత్వాదోత్కర్షతి హ వై జ్ఞానసంతతిం
సమానశ్చ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి
య ఏవం వేద. ॥ ౧౦

స్వప్నావస్థాభిమానియగు తైజసుడు 'ఓం' కారము లోని రెండవయక్షరమగు 'ఉ' కారము సమానములు. ఉత్కర్ష రెండింటి మధ్యనుండుట అనునవి వీనికి గల సామ్యగుణములు. దీనిని తెలిసికొనినవాడు ఉత్తమజ్ఞాని యగుచున్నాడు. ఆతడు గౌరవముగా చూడబడుచున్నాడు. ఆతని కులములో బ్రహ్మ జ్ఞానికానివాడు పుట్టజాలడు.

విగ్రహారాధన పద్ధతినే వర్ణించుచు, 'ఓం' లోనున్న రెండవయక్షరమైన 'ఉ' పైని మెద్దానిని యారోపించి ధ్యానించవలెనో వివరించుచున్నాడు. స్వప్నావస్థలోనుండి స్వాప్నికవిషయముల ననుభవించుచు స్వప్నమును చూచు ఆ తైజసుడు యీ 'ఉ' అక్షరముపై యారోపించి ధ్యానించ వలెను. అట్టి ధ్యానమునకు వీలగునట్లుగా ఋషులు యీ రెంటియొక్క సమానధర్మములను వివరించుచున్నారు.

ఆ సమానధర్మములలో మొదటిది ఉత్కర్ష. అకారము తరువాత వచ్చుటచే 'ఉ' కారము ఉత్కృష్టమైనది. అట్లే జాగ్రదవస్థకంటె సూక్ష్మమగుటచే స్వప్నావస్థ ఉత్కృష్ట మైనది. విశ్వుడు తన జాగ్రదవస్థలో కలిగిన యనుభవములను సేకరించి మనస్సులో భద్రపరచుకొనుచున్నాడు. ఆ యనుభ వములే స్వప్నావస్థలో పిశాచములవలె సూక్ష్మరూపమును ధరించి స్వప్నరూపములో బయలువెడలుచున్నవి.

రెండవధర్మమేమనగా 'ఉ' కారము అకారమకారము లకు మధ్యనున్నది. అట్లే స్వప్నావస్థకూడ జాగ్రత్స్వప్నము లకు మధ్యనున్నది. కావున యిట్టి 'ఉ' కారముపై తైజసుని

నారోపించి యెవడు ధ్యానించుచున్నాడో వాని మనో బుద్ధులు పుష్టిచెంది యభివృద్ధిపొందినవై యాతనిని సమ్యక్ జ్ఞానిగా తయారుచేయుచున్నవి. ధనాశతో నిండిన యీ దినములలోకూడ అట్టి మేధావులకు సంఘములో ఉన్నతస్థానము ఉండియే యున్నది కదా. డాలరే దేవుడై యుండు పాశ్చాత్య దేశములలోకూడ అట్టి మేధావుల మేధస్సు ప్రశంసింపబడుచునే యున్నది. వేదకాలమునాడు సామాన్యప్రజానీకమునకు కూడ ఆ పరతత్త్వవిషయకమైన జ్ఞానముండి యుండెడిది. కావుననే నాటి ఆర్య సంస్కృతి ఆధ్యాత్మిక జీవితవిలువలపై ఆధారపడి యుండినది. కావున గృహస్థునకు ఈ 'ఓం' మంత్రోపాసన వంశగౌరవమును, ఆధ్యాత్మిక సంస్కృతిని నిలువబెట్టుటచే అది యానాటివారికి మిక్కిలి ప్రోత్సాహకరముగ నుండెడిది.

నేటికికూడ తండ్రి యింజనీరు అయిన పుత్రుని ఇంజనీరుగాను, యాతడు డాక్టరైన తన పుత్రుని డాక్టరుగాను తయారుచేయవలయుననియే కోరుచుండును. అనగా తన వృత్తిని తన పుత్రుడు అందుకొనిన తాను సఫలుడైనట్లు భావించును. ఇట్టి మన స్తత్వము ననుసరించియే యుపనిషత్తు 'ఓం' మంత్రోపాసన చేసినవాని వంశంలో ఆధ్యాత్మిక జ్ఞానశూన్యుడు, సంస్కృతీ విహీనుడు పుట్టబోడని చెప్పుచున్నది.

మం॥ సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకారస్తృతీయా మాత్రా మితేరపీతేర్వా । మినోతి హ వా ఇదం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేదా ॥ ౧౧

పూర్వ మంత్రములను రెంటిని శ్రద్ధగా ననుసరించిన వారికి 'మ' కారముతో సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞుని నైక్యము ఎట్లో తెలియగలదు. ఇచటకూడ నీ మకార ప్రాజ్ఞుల నడుమ రెండుసమానధర్మములు కానవచ్చుచున్నవి. 'మితి' యనగా కొలత, యని యర్థము. ఉదాహరణ - ఒక అవున్సునీళ్ళను కొలుచుటకు ఒక అవున్సుగ్లాసు కావలెను కదా. ఇదివరకు కొలవని నీటిలోనుండి కొంత నీటిని తీసి అవున్సుగ్లాసును నింపెదము. అవున్సుగ్లాసు నిండగానే దానిని మరియొక పాత్రలోనికి వంపెదము. ఇచట అవున్సుగ్లాసు దృష్ట్యా నీరు నింపబడుచున్నది. మరల మరియొక పాత్రలో వంపబడుచున్నది. ఓం కారములోని యీ మకారము సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞునితో పోల్చబడుచున్నది. అకార, ఉకారములు ఓం ను ఉచ్చరించునపుడు మకారములో లీనమగు చున్నవి. మరల మనము ఓం ను ఉచ్చరించునపుడు ఆ అకార ఉకారములు మకారమునుండి బయలువెడలినట్లు గోచరించు చున్నది. అట్లే సుషుప్త్యవస్థలో జాగ్రత్స్వప్నములు లీనమై అద్వితీయమైన జ్ఞానమును కలిగియుండును. మరల మేల్కాంచి నపుడు యిట్టి యభేధమైన ఏకాంతావస్థనుండి యీ జాగ్రత్స్వప్నములు పైకుబికి బయలువెడలినట్లుండును. ఇట్టి సామ్యము చేతనే మకారమును సుషుప్తిని యొక మానముతో పోల్చ గలుగుచున్నాము. మరియొక సామ్య మేమనగా మకారము లోను సుషుప్తిలోనుకూడ నానాత్వము, విభేధములు నశించి ఏకత్వమే తోచుచున్నది. ఈ విధముగా దీనిని యర్థము చేసి కొనగలిగినవాడు సమస్తమును సవ్యముగా అర్థముచేసికొన

గలుగుటయేగాక బాహ్యాభ్యంతరములయందు జరుగు విషయ ములనుబాగుగా పరిశీలించి యొక సరియైన నిర్ణయమునకు రా గలుగుచున్నాడు. ఎట్టి విషమ పరిస్థితి యైనను ఆతనికి సులభ సాధ్యమగుచున్నది. ఎట్టి దురవగాహమైన విద్యయైనను ఆతనికిసులభ గ్రాహ్యమగుచున్నది. అతడు గ్రహింపలేనిదే యుండదు.

కా॥ విశ్వస్యాత్వ వివక్షాయా మాది సామాన్యముత్కటం ।
మాత్రా సంప్రతిపత్తౌ స్యాదాప్తి సామాన్యమేవచ ॥ ౧౯

విశ్వునకు ఓంకారములోని 'అ' కారముతో సామ్యము చెప్పవలసివచ్చినపుడు, ఆ రెండింటికి మధ్య 'సర్వవ్యాపిత్వము' 'ఆదిమత్వము' అను రెండును సామాన్యగుణములగు చున్నవి.

ఋషులు చెప్పిన ఓం మంత్రోపాసనా పాఠమును మనకిప్పుడు గౌడపాదుడు సంగ్రహించి చెప్పుచున్నాడు. ఇట్లా ఉపనిషన్మంత్రములను సంగ్రహించుటయే కాక కొంత మార్పుకూడ చేసినట్లగపడుచున్నది. ఉపనిషత్తులో అకార మును విశ్వునితో పోల్చినపుడు ఆ రెండును 'ఆద్యత్వము' లేక సర్వవ్యాపిత్వము గలవి అని చెప్పియున్నారు. కాని గౌడపాదుడు అవి ప్రథమములు మరియు సర్వవ్యాపకములు అని పోలిక చెప్పునపుడు 'లేక' అను అర్థమునకు బదులుగా 'మరియు' అను అర్థమును వివరించెను.

ఇట్టి వివరణలోగల భేదములే కొంతమంది విమర్శ కులు "కారికలే ముందు వ్రాయబడినవి, అటుతరువాతనే ఉప

నిషత్తు వ్రాయబడినది'' అని నిర్ణయించుటకు అవకాశమును కలిగించుచున్నవి. ఇది సత్యము కాదు. ఇట్టి ఉద్రేకముతో కూడిన నిర్ణయములు మన పవిత్ర భారతదేశమునకు తగవు. ఉపనిషత్తులలో 'చ' యనగా 'మరియు' అను అర్థము గలదు.

ఉపనిషత్తులలోని ఉదాత్తభావములను, గంభీర సూచనలను పాఠకులకు స్పష్టముగా విడమరచి వివరించుటయే కారికాకారుని పనియైయున్నది. అతి జాగ్రత్తగా ఉపనిషత్తులను పరిశీలించువారుకూడ యీ 'చ' అనుదానికి "అది లేక ఇది'' యను యర్థమునే సాధారణముగా గ్రహించెదరుగాని 'మరియు' అను అర్థమును వారు గ్రహించలేరు. కావున గౌడపాదుడు ఈ శ్లోకములో ఉపనిషత్తులోని సూచనలను స్పష్టముగా వివరించువాడై కొంతవరకు ఉపనిషదర్థముకంటె భిన్నమువలె కనపడునట్లు వ్యాఖ్యానించి యున్నాడు. అందుచే కారికలు ఉపనిషత్తులకంటె అర్వాచీనమైనవని చెప్పుట గుఱ్ఱమునకు ముందుభాగమున బండెని, సారథిని యుంచినట్లగుచున్నది. ఇట్టి పనిని కొంతమంది విమర్శకులు చేసియున్నారు!!

కా॥ తైజసస్యోత్వ విజ్ఞాన ఉత్కర్షో దృశ్యతే స్ఫుటం ।
మాత్రా సంప్రతిపత్తౌస్యాదుభయత్వం తథావిధం॥ ౨౦

తైజసునకు ఓం కారములోని 'ఉ' కారమునకు, మధ్య 'ఉత్కర్ష, రెండింటికి మధ్యనుండుట' అను రెండు సమాన ధర్మములు స్పష్టముగా గోచరించుచున్నవి.

కా॥ మకారభావే ప్రాజ్ఞస్య మాన సామాన్యముత్కటం ।
మాత్రా సంప్రతి పత్తౌతు లయ సామాన్యమేవ చ॥ ౨౧

ప్రాజ్ఞునకును మకారమునకును సమానధర్మములు గలవు. అవి "మానము" మరియు అన్నియు అందు "లయమగుట" అను రెండు సమానధర్మములు.

కా॥ త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।
సపూజ్యః సర్వభూతానాం వంద్యశ్చైవ మహామునిః॥ ౨౨

ఇట్లు ఈ జాగ్రత్స్వప్న సుషుప్తులకు ఓంకారములోని అకార, ఉకార మకారములకు మధ్యగల సామ్యమును ఎవడు నిస్సంశయముగా తెలిసికొనుచున్నాడో ఆతడే పూజ్యుడు. ఆతడు సర్వప్రాణులకు వంద్యుడు.

ఈ పై మూడుశ్లోకములలోని భావమును ఇదివరకే విపులముగా వివరించియుండుటచేత బుద్ధిపూర్వకముగానే యీ శ్లోకములకు వ్యాఖ్యానము వ్రాయుటకు పూనుకొనలేదు.

కా॥ అకారో నయతే విశ్వముకారశ్చాపి తైజసం ।
మకారశ్చ పునః ప్రాజ్ఞం నామాత్రే విద్యతే గతిః॥ ౨౩

అకారమును ధ్యానించినవాడు విశ్వుని, ఉకారమును ధ్యానించువాడు తైజసుని, మకారమును ధ్యానించువాడు ప్రాజ్ఞుని పొందుచున్నారు. మాత్రారహితమైన నిశ్శబ్దతను ధ్యానించువాడు దేనిని పొందుటలేదు.

ఈ శ్లోకములో ఓంకారములోని మూడుమాత్రలపై ధ్యానించుటవలన కలుగు ప్రయోజనములను సంగ్రహించి చెప్పబడియున్నది. కాని ఒక ఓంకారమును పూర్తిగా ఉచ్చరించి మరియొక ఓంకారమును ఉచ్చరించులోపుగా ఆ మధ్యలో

మనకు ఒక మాత్రారహితమైన మౌనము కలుగుచున్నది. అట్టి మౌనముపై ధ్యానముంచినవానికి ప్రాపంచిక విషయమైన ప్రయోజనమేదియు కలుగజాలదుగాని యాధ్యాత్మిక లాభము మాత్రము చాలా ఎక్కువగా కలుగును. అదియే పరమాత్మయొక్క అనుగ్రహము. అది రాబోవు మంత్రములో వివరింపబడును.

మం॥ అమాత్రశ్చతుర్థో వ్యవహార్యః ప్రపంచోపశమః
శివోఽద్వైత ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనా
ఽఽత్మానం య ఏవం వేద ॥ ౧౨

మాత్రారహితమై, అవ్యవహార్యమై, ప్రపంచోపశమము కలిగి, శివమై, అద్వైతమైన ఓంకారమే చతుర్థము. అదియే ఆత్మ. దీనిని తెలిసికొనినవాడు ఆ పరమాత్మలో లీనమగుచున్నాడు. అనగా జీవాత్మ పరమాత్మతో నైక్యము జెందుచున్నది.

ఇప్పటివరకు ఓంకారములోని మాత్రలను అనగా అకార, ఉకార, మకారములను, వానిపై ఆరోపింపబడు విశ్వ తైజస ప్రాజ్ఞులను గుఱించిన ధ్యానమును గూర్చి యుపనిషత్తు వివరించియున్నది. కాని ఒక ఓంకారమును ఉచ్చరించిన పిమ్మట రెండవ ఓంకారమును ఉచ్చరించులోపల, ఆ రెండు ఓంకారములమధ్య గలుగు ఆనందమయ నిశ్శబ్దమును ఓం మంత్రమును అశ్రద్ధగా జపించువాడు సాధారణముగా గ్రహించలేడు. ఒక ధ్యాని యా రెండు ఓంకారములను ఉచ్చరించునప్పుడు ఆ నిశ్శబ్దము సూక్ష్మమై ఎంత అగ్రాహ్య

మైనప్పటికిని, తప్పని సరిగా అచట యుండియే యున్నది. మాత్రారహితమైన యా ఓంకారమును, ఆ పరమ నిశ్శబ్దత యొక్క అనుగ్రహమునుకూడ శిష్యునికై యా యుపనిష దృషి బోధించుచున్నాడు.

ఇతః పూర్వము ఉపనిషన్మంత్రములద్వారా మనము నిత్యము అనుభవించు "మనలోని చైతన్యము స్థూల శరీరాభి మానియైనపుడు జాగ్రదవస్థానుభవములను పొందుచుండు విశ్వుడుగను, జాగ్రదవస్థనుండి మరలినపుడు స్వప్నవిషయముల ననుభవించు సూక్ష్మశరీరాభిమానియగు తైజసుడుగను, యీ రెంటినుండి విరమించుకొనినపుడు కేవలము అజ్ఞానము ననుభ వించు కారణశరీరాభిమానియై, సుషుప్త్యవస్థ ననుభవించు ప్రాజ్ఞుడుగను అగుచున్నాడని" తెలిసికొని యుంటిమి.

తురీయమై, సచ్చిదానందస్వరూపమైన యా పర బ్రహ్మ యందు ఈ విశ్వతైజసప్రాజ్ఞు లారోపింపబడిరని యిప్పుడు చెప్పబడుచున్నది.

ఇంతవరకు వివరింపబడిన ధ్యానమార్గముయొక్క ఉద్దే శము ఓం కారములోని త్రిమాత్రలయొక్కయు, దానిపై యారోపింపబడిన విశ్వతైజసప్రాజ్ఞులయొక్కయు ధ్యానమును గూర్చి తెలిసికొనుటయే యగుచున్నది. ఇప్పుడు మాత్రా తీతమై, తురీయరూపమైన "ఓం" ను ఆత్మప్రతీకముగా తెలుపుచు అదియే సాధకుని లక్ష్యమని సూచించుచున్నది.

మాత్రారహితమైన ఓంకారమనగా రెండు ఓం కారములయొక్క యుచ్చారణకు నడుమ తప్పనిసరిగా నుండు

నిశ్శబ్దమని యర్థము. అది అగ్రాహ్యమగుచున్నది. మన యింద్రియములు నిశ్శబ్దమునుండి యెట్టి భావమును గ్రహించు శక్తి లేనివగుచున్నవి కావున అది అగ్రాహ్యము. మనస్సు కూడ దానిని గ్రహించలేదు. కావున లక్షణములోని "అవ్యవహారము" యను పదము, ఇట్టి మాత్రారహితమైన 'ఓం' మనస్సుచేత గ్రహింపశక్యము కానిది యను దానిని సూచించుచున్నది. మాత్రారహితమైన ఆ 'ఓం' ఇంద్రియాదులచేతను, మనస్సుచేతను గ్రహింపశక్యము కానిదనగా అది తప్పక ఆనందమయమైన అద్వైతావస్థయని చెప్పవచ్చును. ఏలననగా నానాత్వముతో కూడిన అశాశ్వత విషయములద్వారా అవిచ్ఛిన్నానందమును పొందగోరుట వలననే ప్రపంచములోని సమస్త అలజడులు, కలతలు కలుగుచున్నవి. కావున అద్వైతము లేక కేవలము ద్వైతము మాత్రమెచట నున్నదో అచట భయము, హృదయకంపము, అసంతృప్తి మొదలైనవన్నియు కలుగుచున్నవి. అందుచేత నిశ్శబ్దమైన ఓంకారమే తురీయావస్థయనియు, దానినే యనుభవించవలయుననియు గురువు శిష్యునకు ఉపదేశించుచున్నాడు. పూర్వమంత్రములో చెప్పినట్లుగానే యీ మంత్రములోకూడ ఫలశ్రుతిని చెప్పుచున్నాడు. మాత్రారహితమైన నిశ్శబ్ద ఓంకారముపై ధ్యానించువానికి యీ ద్వైతభావము పోయి, ఆ దివ్యానుభూతిలో ఆతడు లీనమై నిత్యసత్య పరమాత్మస్వరూపుడగుచున్నాడని చెప్పుచున్నాడు. ఇచట మనోబుద్ధులనభివృద్ధిపరచునట్టి ప్రయోజనములేవియు లేవు. ఇది మనోబుద్ధ్యతీతమైన యవస్థ. ఎచట ప్రపంచముపశమించుచున్నదో

అదియే యీ యనుభవము. అయితే యీ ధ్యానము మాత్రము నిష్ప్రయోజనము కాజాలదు. దేనిపై ఒకడు ధ్యానించుచున్నాడో ఆతడు అదియే యగుచున్నాడనునది ప్రకృతిసిద్ధ నిత్యసత్యము. కావున యిట్టి ధ్యానముద్వారా ఆ సాధకుడు మనోబుద్ధులనధిగమించి సర్వసంపూర్ణమై, సర్వ వ్యాపియైన యా యద్వైత పరమాత్మగా తన్ను భావించు కొనుచున్నాడు.

ఈ భావమే యితరమైన యుపనిషత్తులలోకూడ అనేక సార్లు చెప్పబడియున్నది. భూతభవిష్యత్కాలములను మఱచి వర్తమాన కాలమందలి యా దివ్యక్షణమందు ఒక్కసారియైనను నివసించుటకుగాను ఆ ఋషులు సాధకుని యిట్టి తీవ్రధ్యానమునందుటకు తరుముచుండిరి. జీవితములో ఒక్క క్షణమైనను యితరకాలధ్యాస లేకుండ ఆ సాధకుని స్వతంత్ర ముగా నుంచుటకే వారి యీ ప్రయత్నము. క్షణములోని ప్రతిభాగములోనుకూడ ఆ ఆత్మతత్త్వము ఇమిడియే యున్నది.

శాశ్వతమైన యా పరమాత్మ మరియొక స్థలమందు గాని, మరియొక కాలమందుగాని లేదు. అది ఈ స్థలమునందే, యీ సమయమందే యున్నది. మనకిచ్చిన ప్రతిక్షణము చాల పవిత్రమైనది. మనమా పరమాత్మయందు నివసించుటకు ప్రతి క్షణము అవకాశమును ఇచ్చుచున్నది కాని మనమట్లు నివ సించుటలేదు. జీవితములోని భూతకాలపు మృతక్షణములనెడు శ్మశానములో దేవులాడుచున్నైనా యున్నాము లేదా భవిష్యత్కాలమందలి ఆశలందు, అపేక్షలయందు, ప్రణాళి

కల నిర్మాణములందు సంచరించు బుద్ధిగలవారమైనా అయి యున్నాము.

రెండు ఓంకారములను ఉచ్చరించునపుడు మధ్యనున్న నిశ్శబ్దమును గ్రహించుటకు ప్రయిత్నించిన మన మనోబుద్ధులు ఏకాగ్రమై, నిశితమై స్థిరమగుచున్నవి. ఇట్లు మనము ధ్యానించునపుడు కాలము అంతమొంది మనము మెల్లగా పైకి తేలిపోవుచున్నట్లు తోచును. మానవుడు తన మర్త్యత్వమున్న, పరిమితత్వమును, దుఃఖములను, నిస్పృహను, అంతమొందించు కొనవలెననిన పై విధమైన ధ్యానమును తక్షణము కాకున్న కొంతకాలమునకైనను అలవఱచు కొనవలయు ననియే యుద్దేశమై యున్నది. నిట్టూర్పులు, నిరాశలు, కన్నీరు, దుఃఖములు దాడిచేయజాలని శాంతి సామ్రాజ్య మదియే. అదియే సర్వజ్ఞము, సర్వశక్తివంతము, సర్వ సంపూర్ణము.

ఇంతటితో మాండూక్యోపనిషత్తు ముగియుచున్నది. ఇటుపైని గ్రంథమంతయు ఉపనిషత్తులోని కరుకైన సూచనలను వివరించుటకుగాను శ్రీ గౌడపాదుడు వ్రాసిన కారికలతోనే నిండియున్నది. ఈ యుపనిషదృషి యీ పన్నెండు మంత్రములలోను సమస్తశాస్త్రముల సారాంశమును సంగ్రహించి, యుత్తమ యుపనిషద్గ్రంథముగా మనముందర యుంచినాడు. ఇంక పోనుపోను గౌడపాదుని కారికలు మనకెంత యుపయోగకరమైనవో, అవి లేకపోయినయెడల మనము యుపనిషదర్థమును గ్రహించుటకు కూడ యెంత యసమర్థుల మగుదుమో తెలియగలదు.

కా॥ ఓంకారం పాదశో విద్యాత్ పాదామాత్రా న సంశయః ।
ఓంకారం పాదశో జ్ఞాత్వా న కించిదపి చిన్తయేత్॥ ౨౪

ఓంకారములోని ప్రతిపాదమును ప్రత్యేకముగా తెలిసికొనవలయును. ఆ పాదములు నిస్సంశయముగా మాత్రలే యగుచున్నవి. ఇట్లు ఓంకారమును సంపూర్ణముగా తెలిసికొనిన పిమ్మట మరిదేనిని చింతించకూడదు.

శాస్త్ర మనగా సత్యతత్త్వమును వివరించుటకై విపులమైన లక్షణములను గలిగియుండు గ్రంథము. ప్రకరణమనగా కఠినవిషయముల వివరణయేగాక, సాధకులకు తమ మార్గమందు మార్గదర్శియైకూడ నుండు గ్రంథము. ఓంకారముపై యెట్లు ధ్యానించవలెనో విపులముగా వివరించువాడై, యీ యధ్యాయమునందలి ముగింపుశ్లోకములను గౌడపాదు డిచట వ్రాయుచున్నాడు.

ఇప్పటివరకు ఉన్నమంత్రములు, వానిని వివరించు కారికలుకూడ సాధకునిలోని వివిధ వ్యక్తిత్వములు, ఓంకారములోని త్రివిధమైన మాత్రలనుకూడ మనకు బయల్పరచి చెప్పియున్నవి. ఆత్మకు ప్రతీకమైన నిశ్శబ్ద ఓంకారమునుకూడ తెలిసికొంటిమి. ఇప్పుడు గౌడపాదుడు ధ్యాన విధానమును నిర్దేశించి చెప్పుచున్నాడు.

ధ్యానములో సాధకుడు నిరంతరముగా ఓంకారమును ఉచ్చరించవలెననియు, అట్లుచేయునపుడు అందులోని మాత్రాధ్వని తారస్థాయినుండి మంద్రస్థాయికి వచ్చి, తుదకు అంతరించి పోవుటను గమనించవలెననియు గురువు శిష్యునకు

చెప్పుచున్నాడు. "అకార, ఉకార, మకారముల నుచ్చరించు నపుడు, ఆయా యక్షరములందు క్రమముగా విశ్వతైజస ప్రాజ్ఞులను ఆరోపింపవలెను. అవి క్రమముగా మరలనొకదానిలో నొకటి లీనమై పోవుటను గమనించుచు, మాత్రారహితమైన నిశ్శబ్ద స్థితియందు తానైక్యము పొందవలెను" అని గురువు చెప్పుచున్నాడు. ఈ పని యంత సులభమైనదికాదు. ఈ మార్గము చాలా కఠినమైనదియు, సూక్ష్మమైనదియునై యున్నది. ఈ మార్గమందు ప్రవర్తించుటకు ముందు చాలా ప్రయత్నము ఆవశ్యకమై యున్నది. మానసికమై, వైజ్ఞానికములైన యీ ప్రయత్నము లెట్టివో రాబోవు మంత్రములో గురువు బోధించుచున్నాడు. ఆ దివ్య నిశ్శబ్దతను చేరినపిమ్మట శిష్యుని మనస్సులో ఎట్టి యితర భావతరంగములు ఉండ రాదని మాత్రము ప్రస్తుతము తెలిసికొనిన చాలును. ఆ నిశ్శబ్ద నీరవస్థితిలో స్థిరపడినవెనుక ప్రాకృత సంస్కారములచేత మలినము కావింపబడిన భావములేవియు ఆ మనస్సులో నుద్భవించకూడదని యాతడు తెలిసికొనిన చాలును. ఇతరమైన దానిని మరిదేనిని యోచించకుండ చైతన్యముతోకూడిన మనస్సును స్థిరముగాను, నిశ్చలముగాను నుంచవలెను.

కా॥ యుంజీత ప్రణవే చేతః ప్రణవం బ్రహ్మ నిర్భయం ।
ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్ ॥ —౨౫

ఆ ప్రణవనాదములో నీ మనస్సును ముంచివేయుము. ఆ ప్రణవధ్వనితో నీ మనస్సును ఐక్యము చేయుము. నిర్భయ

మైన బ్రహ్మయే ఆ ఓంకారము. ఆ ఓంకారముతో ఐక్యము పొందినవానికి యెట్టి భయమును ఉండజాలదు.

ఈ ఆధ్యాత్మిక సాధన తన మనస్సులో ఆలోచనలు ఉద్భవించకుండుటకును, ఉద్భవించునట్టి యోచనలను తగ్గించుటకును ప్రయత్నమై యున్నదని యిదివరకే వివరింపబడి యున్నది. ఇట్లనన్య ధ్యానముతో ఆ ఓంకారమును జపించిన యెడల తుదకు సాధకుడు అన్యధ్యాస వదలి యా ఓంకారమందే తన మనస్సును లీనముచేయగలడు.

ఆ యా యోచనా పరంపరలా మనస్సును చేరు నిరంతరతనుబట్టి మనయొక్క యనుభవములుండును. ఒక యోచన యొక సెకండులో ఇరువది వేల సార్లు వచ్చి, మరియొక యోచన పదివేలసార్లేవచ్చిన యీ యిరువది వేలసార్లు వచ్చిన యోచనానుభవము పదివేలసార్లు వచ్చినదానికంటె రెట్టింపుగాను, విస్పష్టముగాను ఉండును. ఇట్లు ప్రపంచములోని సమస్త జ్ఞానములలో మనలను గుఱించిన జ్ఞానమంత సంపూర్ణమైనది మనకు మరి యొకటి లేదు. మనకుగల జ్ఞానములన్నిటిలోను మనలోని జీవాత్మజ్ఞానమే మనకు ఎక్కువగానున్నది. "నేను ఉన్నాను"అను భావమే మన హృదయములో తఱచు వచ్చుచుండును గావున అహంకారరూప జీవజ్ఞానమే మనకు ఎక్కువగానున్నది. కావున 'అహం' భావము వచ్చునంత తఱచుగా ఓంకారమునే మనము ధ్యానించిన మనలో ఆ 'అహం' నశించి మనమా ఓంకారమును పూర్ణముగా ననుభవించి యర్థము చేసికొనకలుగుచున్నాము. "ఓంకారమునందు మనస్సును సంధించవలెను." అని చెప్పుటలో ఈ

కారికయొక్క భావ మిదియే యగుచున్నది. ఇట్లా ఓంకారముతో మనస్సు ఐక్యము చెందినపుడు, పూర్వము వివరించినట్లుగా ఆ ఓంకారమే బ్రహ్మయగుటవలన మనము బ్రహ్మానుభవమును పొందగలుగుచున్నాము.

ఇట్లు నిత్యసత్యతత్త్వమైన యా పరమాత్మజ్ఞానమలవడిన మీదట 'అహంబ్రహ్మాస్మి' యని తెలిసికొనినంతనే ఆ పరమాత్మయే యీ నానాత్వమునకు కారణమని తెలియుచున్నది. అంత ఉన్నది అద్వైతమొక్కటియే యగుటచే మనలోని భయము నశించుచున్నది. సర్వభయములకు కారణము ద్వైతభావమే కదా ! అద్వైతములో ద్వైతము ఉండజాలదు. కావున యట్టి యేకత్వస్థితియందు స్థిరపడిన వాడు మాత్రమే నిర్భయుడై యుండగలడు.

మరియు మనస్సులోని యలజడియే భయమగుచున్నది. మనస్సు ఉండిననే కదా యలజడి కలుగును. సంకల్పములు ఇంద్రియాదులలో కలుగుటలేదు కదా ! అవి కేవలము మనోక్షేత్రమందే యుద్భవించుచున్నవి. ఆ మనస్సును ఓం కారమందు ఏకాగ్రము చేసిన నింక నచట సంకల్పవికల్పములకు కేంద్రమైన మనస్సు నిలువజాలదు. మనస్సు లేనిచోట యెట్టి భయమును ఉండదుకదా !

ఇచట భయమునకు భీతి యను సంకుచితార్థము మాత్రమే వివక్షితము కాలేదు. రాగద్వేషములు, ఆశలు, ఆతురతలు మొదలైన మానసికమైన యలజడులన్నియు భయమే మూలకారణముగా గలవి యగుచున్నవి. ఉదాహ

రణకు ధనములేకున్న జీవనమెట్లు జరుగును ! అను భయమే ధనాశను కలిగించుచున్నది. నిత్యము ఆవశ్యకములైన వాస గ్రాసవసనాదులను ఆశించుటకూడ అవి లేకున్న కలుగు బాధ వలని భయముచేతనే యగుచున్నది. ఆకలివలన భీతిచే ఆహార వాంఛ, నిలుచుటకు నీడకై గృహవాంఛ, దిగంబరత్వభీతిచే వసనముల కోరిక కలుగుచున్నది కదా ! ఈ మనస్సును ఓం కారమందు నిలిపి, తదర్థమును ధ్యానించుటచేత ఆ సాధకు నికి యిట్టి రాగద్వేషాదులనుండియు, నియమితపరిమితుల నుండియు రక్షణకలుగుచున్నది.

కా॥ ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరః స్మృతః
అపూర్వోఽనన్తరోఽబాహ్యోఽనపరః ప్రణవోఽవ్యయః ॥

ఓంకారమే అపరబ్రహ్మ. మరియు ఆ ఓంకారమే పరబ్రహ్మయు అగుచున్నది. ఆ ప్రణవము అపూర్వము. అనం తరము. అబాహ్యము. అనపరము. అవ్యయము కూడ అగు చున్నది.

గౌడపాదుడు, వసిష్టుడు మొదలైన సనాతన అద్వైత సిద్ధాంత మతములవారేగాక, మరియొక అద్వైత వేదాంత మతమువారున్నారు. వారీ దృశ్యప్రపంచమునకు సంబంధా పేక్ష యా సత్యత్వము కలదని చెప్పుచున్నారు. వారీ ప్రపంచ మును అపరబ్రహ్మముగా వ్యవహరించెదరు. అనగా పర బ్రహ్మయే నామరూపాది గుణయుక్తుడై యీ ప్రపంచరూప ములో భాసించునట్లుండునని వారి భావము. కావున యీ అపరబ్రహ్మ వేదాంతము ప్రకారము ఉపాసకునికి ఆరాధ్య

మగుచున్నది. వారి తరువాత వారి వేదాంత భాషలో ఈ అపరబ్రహ్మయే సగుణబ్రహ్మగా వ్యవహరింపబడెను. సనాతన వేదాంతులగు వసిష్టగౌడపాదులు ఈ సగుణ బ్రహ్మను అంగీకరించరు సరికదా యీ సృష్టియంతయు యధార్థములో ఎప్పుడును లేనిదే యగుచున్నదని వారు నొక్కి వక్కాణించుచున్నారు. అట్టి జగన్మిథ్యావాదుల ప్రకారము రజ్జువునకు సర్పమునకును యద్విధమైన సంబంధమును లేనేలేదు. ఆ మిథ్యాసర్పము యద్విధముగాను రజ్జువుయొక్క అపరావతారమని చెప్పలేముకదా! కాని శ్రీశంకరులవారిచేత, తదనుచరులచేత స్థాపింపబడిన నవీన వేదాంతము ప్రకారము వారు యీ రెండింటికిని కొంత సంబంధమును అంగీకరించియే యున్నారు. అంతమాత్రముననే మనము శ్రీ శంకరులీ ప్రపంచమును సత్యముగా నమ్మిరని భావింపరాదు. వాస్తవములో పై రెండు మతములును స్పర్థతో కూడినవి కాక యొకదానికొకటి యనుమోదకముగా ఉన్నవే యగుచున్నవి. ఈ దృశ్యప్రపంచము ద్వారా సాధకుని యా సత్యతత్త్వములోనికి చేర్చుటయే శ్రీ శంకరులు చేయు ప్రయత్నమై యున్నది.

ప్రణవము అనగా ఓంకారము ఆ పరమాత్మకు మాత్రమే ప్రతీకముగా కాక యీ అపరబ్రహ్మమైన దృశ్యప్రపంచమునకు కూడ ప్రతీకమై యున్నదని గౌడపాదుడు మరల మరల నొక్కి చెప్పుచున్నాడు. ఆ సర్వవ్యాపి సత్యతత్త్వము, ఆ శాశ్వత ఆత్మతత్త్వము కారికాకారునిచే నిచట ఏరి కోరి కూర్చిన సుందర పదజాలముచే చక్కగా సూచింపబడుచున్నది. ఆ పదములు చాలవఱకు శాస్త్రవాఙ్మయము

లోనివే యని చెప్పవచ్చును. ఆ పదములయొక్క సూక్ష్మ పరిశీలన ద్వారా వాటియొక్క సొగసును, చమత్కారమును, సామర్థ్యమును గ్రహించగలుగుచున్నాము.

అపూర్వ - ముందు లేనిది. బ్రహ్మకు మొదలు లేద నగా బ్రహ్మ కారణము లేనివాడు - నిష్కారణుడు అని యర్థము. ఏదైనను సరే యది జాతమైనది, సృష్టమైనది యైన యెడల దానికి ముందు ఒక కారణము ఉండి తీరవలెను. కాని యీ బ్రహ్మ నిష్కారణుడు, అజుడు, అమృతుడు, అవికారుడు కూడ అగుచున్నాడు. ఆ బ్రహ్మ స్వయముగా కారణరహితు డైనప్పటికిని, యాతడీ సృష్ట ప్రపంచమునకు కారణమై యుండ వచ్చునని సాధకుని మదిలో నొక సంశయము కలుగవచ్చును. కాబట్టి సమస్త కార్యములు ఆ బ్రహ్మయందు లేనివే యని చెప్పుచు యీ ప్రపంచమనునదే దానియందు లేదని శ్రుతి నిషేధించుచున్నది. ఆ బ్రహ్మ కారణముగా ఎట్టి కార్యము జన్మించలేదను దృఢభావము "అనపర" యను నీ సామాన్య పదముయొక్క అర్థముద్వారా మనకు కలుగుచున్నది.

అనంతర - దానికంటె మరియొకటి వేరే లేనిది. ఈ పదము ద్వారా గౌడపాదుడు "ఆ పరబ్రహ్మ సర్వవ్యాపి యగుటచే తద్భిన్నముగా యితరమైన దేదియు లేదు" అని సూచించుచున్నాడు. అనగా దానియొక్క అద్వైత శాశ్వత తత్త్వమును నియమితపఱచి నివారింపజేయునట్టి విజాతీయ వస్తు తత్త్వమేదియు అందు లేదని భావము. దానికంటె భిన్నమైన పదార్థము తానుకాక వేరొకటి యా బ్రహ్మయందు లేదు. అది ఏక జాతీయమైన యఖండమగుటచే దానియందు స్వగత

భేదముకూడ లేదు. కావున నిష్కారణమై, నిష్క్రియమై, సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైన ఆత్మయన్నది యున్నయెడల తప్పక ఆ యాత్మ అవ్యయమైనదే యగుచున్నది.

కా॥ సర్వస్య ప్రణవో హ్యాదిర్మధ్యమన్తస్తథైవ చ।
ఏవం హి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదనన్తరం ॥ ౨౭

ఓంకారమే ఆది, మధ్య అంతములు అగుచున్నది. ఇట్లే ఓంకారమును తెలిసికొనిన వాడు వెనువెంటనే ఆ పరమాత్మ తత్త్వమును పొందుచున్నాడు.

రజ్జువును చూచి సర్పముగా భ్రమించినయెడల ఆ సర్పముయొక్క సర్వావయవములు సత్యమైన రజ్జువుకంటె భిన్నములు కావు. మరియు ఆ సర్పమంతయు రజ్జువుతప్ప యితరమైన దేదియు కాదు. సర్పములోని ప్రతి స్వల్పభాగము రజ్జువు ఆధారముగా గలదియే యగుచున్నది. అంతేకాక ఆ సర్పము రజ్జువునుండి తప్ప మరియొక స్థలమునుండి బయలు వెడలలేదు. మనము భ్రాంతిలో నున్నంతకాలము మనకా రజ్జువునందు సర్పభ్రాంతి కలిగియున్నది. కాని మనకాభ్రాంతి నశించగానే అనగా మనకు సత్యమైన రజ్జువుయొక్క జ్ఞానము కలుగగానే సర్పభ్రాంతి నశించుచున్నది. మరియు ఆ భ్రాంత సర్పము ఈ రజ్జువునందే లీనమై మాయమగుచున్నది. అట్లే బ్రహ్మకు ప్రతీకమైన యీ ప్రణవమే ఆది మధ్యాన్తాతీతమైన యీ పరమాత్మయై యున్నది. ఇట్లు ఆది మధ్యాన్త రూపమైన యీ జీవన లీలకు ఆధార మీ ఓంకారమే యని

తెలిసికొనిన పిమ్మట యీ జ్ఞాత స్వయముగా బ్రహ్మయే యగుచున్నాడు. "జ్ఞానము" అను పదముయొక్క అర్థమునకు వేదాంతములోను, వ్యవహారములోను చాలా భేదమున్నది. వేదాంతములో జ్ఞానమనగా ఆత్మను కనుగొని ఆత్మస్వరూపుడగుట. అది బుద్ధిగ్రాహ్యమైనదియు కాదు, శాస్త్రజ్ఞానము చేత బోధింపబడునదియు కాదు. కావున కేవలము శాస్త్రములు చదివి యర్థము చేసికొన కలిగినంత మాత్రమున పండితుడు పరిపూర్ణత నందుకొనలేడు. నెమ్మదిగాను స్థిరముగాను ధ్యానముచేత పవిత్రములైన మనోబుద్ధులను సర్వవ్యాపక శుద్ధ చైతన్యస్థానమునకు లేవనెత్తగలిగి యీ జీవితపు విలువల కనుగుణముగా జీవించిననేగాని కేవల శాస్త్రపాఠముచేత ఒకడు పరిపూర్ణత నందలేడు. జ్ఞానమనగా వేదాంతములో "ఆత్మజ్ఞానము" అని యర్థము.

కా॥ ప్రణవం హీశ్వరం విద్యాత్ సర్వస్య హృది సంస్థితం ।
సర్వవ్యాపిన మోంకారం మత్వా ధీరో న శోచతి॥ ౨౮

సమస్త ప్రాణులయొక్క హృదయ కుహరమునందును నివసించు ఈశ్వరునిగా ఓంకారమును తెలిసికొనుము. ఇట్లు ఓంకారమును సర్వవ్యాపిగా తెలిసికొనినవాడు ధీరుడు. ఆతడు ఎప్పుడును దుఃఖించడు.

ఓం కారముయొక్క ఉద్దేశమును అది జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను సూచించుచున్నదను విషయమును, ఓం కారముల మధ్యనుండు అమాత్ర ఓంకారమే తురీయమనియు

చెప్పుటకొఱకు ఈ అధ్యాయమునంతయు రచింపబడినది. సర్వ ప్రాణులయొక్క హృదయ కుహరములయందు వ్యవహరించు జీవశక్తిని ఓంకారము తనలో నిముడ్చుకొని యున్నది. ఈ విషయమే ఓంకారముయొక్క విశాలభావములోను, సంపూర్ణ సూచనలోను స్ఫురించుచున్నదని గౌడపాదుడు ప్రకటించుట సహజముగనే యున్నది. నారదభక్తి సూత్రములలోకూడ భగవంతుడు సర్వాంతర్యామి యని వర్ణించియున్నారు. ఇట్లే ఓంకారమే సర్వహృదయాంతర్వర్తియై సమస్త ప్రపంచమును పాలించు ప్రభువైన ఈశ్వరుడని చెప్పబడియున్నది. ఈ భావమే గీతలోకూడ వర్ణితమైనది.

ఆ పరమాత్మను సమస్తరూపములందు జూచుటయే ఆత్మ పరిపూర్ణత్వము లేక ఆత్మజ్ఞానము అనబడుచున్నది. పరిపూర్ణతనందినవాడు తన చుట్టును పరిపూర్ణతనే చూచును. కావున మనలో పరిపూర్ణతా జ్ఞానము కలుగుట యనిన సర్వ వ్యాపి పరిపూర్ణమగు ఆత్మజ్ఞానము కలిగియుండుటయే యగు చున్నది. జ్ఞాని దృష్టిలో సర్వము సుందరముగాను, క్రమబద్ధము గాను సమీకృతముగాను అగుచున్నది. అసమీచీనమందు సమీచీనమును, అసుందరమందు సౌందర్యమును, దుఃఖము నుండి పరిపూర్ణ ఆత్మానందమును అతడు పొందుచున్నాడు. ఆ జ్ఞాని దేనిని గ్రహించినను, అదియంతయు ఆనందమైన ఆ సత్యతత్త్వము మూలముగా గలదే యని తెలిసికొను చున్నాడు. ఈ విధముగా ఈ ఓంకారభావమును సర్వవ్యాప్తి పరబ్రహ్మగా తెలిసికొనినంతనే యాతనికి జీవితములో దుఃఖించుటకు అవకాశమే కలుగదు. బుద్ధిలో వివేచనాశక్తి

యభివృద్ధిపొందినప్పుడే ఆత్మవివేచన బాహ్యాభ్యంతరములందు కలుగుచున్నది కావున యట్టి వానికి దుఃఖాదులు లేవని దృఢముగా శ్రుతి చెప్పుచున్నది. తర్క-వాదములనెడు శిలా పర్వతములను ఛేదించి తత్త్వమును చేర్చునట్టి మార్గమే యీ వేదాంతమగుచున్నది.

కా॥ అమాత్రో ఽ నన్త మాత్రశ్చ ద్వైతస్యోపశమః శివః ।
ఓంకారో విదితో యేన స మునిర్నేతరో జనః ॥ -౨౯

అమాత్రము, అనంతమాత్రయు కలిగిన ఓంకారము ద్వైతము ఉపశమించుటచే శివము శాంతమునై యున్నది. ఈ విధముగా ఓంకారమును తెలిసికొనినవాడే ముని. ఇతరుడు కాడు.

అమాత్ర యనగా తురీయమును సూచించు నిశ్శబ్ద ఓం కారము. మాత్ర యనగా పరిమాణము. అనంతమైన పరిమాణము గలది అనంతమాత్ర - యగుచున్నది. అనగా "ఒక కొలతబద్దతో కొలిచి చెప్పునట్టి పరిమితి లేనిదని తాత్పర్యము." అని శ్రీ శంకరులు చెప్పుచున్నారు. అచట నానాత్వవిశిష్టమై భ్రాంతిమూలకమైన యీ ప్రపంచ మంత మొందుటచేత అది సర్వమంగళకరమైనది. (శివం) అటు పిమ్మట సాధకుడు తన నా సర్వవ్యాపి శుద్ధచైతన్యరూపముగా తెలిసికొనుటచే అతడచట యీ ప్రాపంచిక సుఖ దుఃఖాదు లేవియు లేనివాడగుచున్నాడు.

కేవలము శబ్దమాత్రమనియేగాక, పైని వివరించిన విధముగా నెవడు ఓంకారమును అర్థముచేసికొనుచున్నాడో

ఆతడే నిజమైన ఆత్మజ్ఞాని యగుచున్నాడు. శ్రుతి చెప్పిన దానిని దృఢపరచుటకును, తన శిష్యుల ననుగ్రహించుటకును, కేవల పుస్తకజ్ఞానముచే జ్ఞానులు కావచ్చునని భావించువారికి తెలియపరచుటకును గౌడపాదుడు "అతడే ఆత్మజ్ఞాని – ఇతరులు కారు" అని తదితరులను నిషేధించుచున్నాడు.

ఒకడు తన తరములో ఎంత గౌరవింపబడువాడైనను, ఎంతమేధావంతుడైనను, కేవలము ప్రవచనములచేతను, ప్రతిభచేతను, ప్రతిభాయుత రచనలచేతను, శాస్త్రజ్ఞానమాత్రము చేతను, వేదాంతసిద్ధాంతములను బోధించుటచేతను మాత్రము తాను దివ్యత్వమును పొందలేడు.

ఓంకారముచే సూచింపబడిన యీ సర్వవ్యాపి నిత్య సత్య జ్ఞానతత్త్వమును తనయందు కనుగొనినవాడే జ్ఞాని యగుచున్నాడు. ఈ వాక్యముతో గౌడపాదుడు మాండూక్యోపనిషత్తులోని ప్రథమాధ్యాయమందలి తన కారికలను ముగించుచున్నాడు.

# అధ్యాయము ౨

## వైతథ్య ప్రకరణము

ఈ ప్రకరణములో గౌడపాదుడు దృశ్యప్రపంచము యొక్క మిథ్యాత్వమును గూర్చి చర్చించుచున్నాడు. "ప్రథమాధ్యాయములో ద్వైతము లేదని ప్రకటించినప్పటి కిని అది ఆగమము లేక శాస్త్రము ద్వారానే చెప్పబడినది" అని శ్రీ శంకరాచార్యులు ప్రథమ ద్వితీయాధ్యాయములకు గల సంబంధక్రమమును వర్ణించునప్పుడు చెప్పియున్నారు. ప్రథమాధ్యాయములో చెప్పిన మిథ్యాత్వము తర్కవాదముల ద్వారా బలపరుపబడినది. వాద ప్రతివాదములద్వారా జగ న్మిథ్యాత్వము స్థాపించుటకు ఈ ప్రకరణము ప్రయత్నించు చున్నది.

జాగ్రత్ప్రపంచమును స్వప్న ప్రపంచముతో పోల్చి యీ రెండవస్థలలోను కలుగు అనుభవములకు భేదము లేదని ప్రత్యక్షముగాను, తార్కికముగాను నిర్ణయించుటకే యీ అధ్యాయములోని ముఖ్య ప్రయత్నమై యున్నది. జాగ్రదవస్థ సత్యమైన, స్వప్న ప్రపంచము కూడ సత్యమే యగుచున్నది. ఒకవేళ మనము స్వప్నప్రపంచము మాయా సృష్టమనిన యంతవఱకు జాగ్రత్ప్రపంచముకూడ మిథ్యా మాత్రమే యగుచున్నది. ఈ సిద్ధాంతమును ఋజువు పరచుటకుగాను గౌడపాదుడు యీ రెండు అవస్థలయందలి మన యనుభవము లను సూక్ష్మముగా పరిశీలించిన విషయములను, అనంతము లైన తర్కవాదములను మనముంచర నుంచుచున్నాడు.

స్వప్నము మిథ్యయనిన ఒప్పుకొందుము గాని జాగ్రత్ప్రపంచముకూడ మిథ్యయని యొప్పుకొనుటకు మనము వెను దీయుదుము. మనము జీవితమును పాక్షిక దృష్టితో చూచుటకు అలవాటు పడియున్నాము. కావున మనకు జీవితమనగా జాగ్రదవస్థయందలి యనుభవములే యగుచున్నవి. మన జీవితమునందంతయు ప్రతిదినము మనము జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడవస్థల ననుభవించుచున్నను, జాగ్రదవస్థను, అందలి యనుభవములను తప్ప మిగిలిన స్వప్నసుషుప్తులను అందలి యనుభవములను విస్మరించుచున్నాము, అలక్ష్యము కూడ చేయుచున్నాము. ఒక్క జాగ్రదవస్థానుభవములతోనే మనము జీవితమును కొలుచుటచేత గౌడపాదుని నిర్ణయములు మనకు నవీనముగా నుండుటయే కాకుండ, ఒక్కొక్కసారి మన సుఖకరమైన జీవితపు విలువలకు ప్రతిపక్షిగా కూడ నుండును. కాని గౌడపాదుడు తన నిర్ణయములకు తగిన న్యాయబలము లేకుండ నుండలేదు. అతడు దయాశాలి, సత్యశీలి. వేదాంతము యొక్క పని రంగమునకు తగినట్లు ఆడుట కాదు. సాధారణ మానవుని నీచమైన జీవితపు విలువలకు వాదములను న్యాయనిర్ణయములను ఇచ్చుట కూడ కాదు. తన కాలమునాడు అమలులోనున్న అసత్యపు విలువలను సమర్థించుటకు అతడు న్యాయవాది కాజాలడు. తాను సత్యమును కనుగొని యితరులను ఆ స్థానమునకు ఉద్ధరించుటయే అతని ముఖ్యకార్యమై యున్నది. ఆనాటి నమ్మకములకు తన సిద్ధాంతమెంత వ్యతిరేకముగానున్నను, ఎంత అసాంఘికముగా నున్నను, మొగమాటములకు పోక తాను కనుగొని జీవిం

చిన యనుభవములనే వేదాంతి లోకమునకు వెల్లడిచేయును. ఈ భావమును మనస్సులో పెట్టుకొనినచో మొండియైన ద్వైతవాదికూడ, అద్వైతి యొక్క సాహస స్థితిని, నిర్మొగమాటపు స్వభావమును బాగుగా అర్థముచేసికొనగలడు.

వేదాంత వాఙ్మయములో జీవితమును ఇంత విపులముగాను, సంపూర్ణముగాను చర్చించి, వివరించిన గ్రంథము మాండూక్యోపనిషత్తు కంటె మరియొకటి ప్రపంచములో లేదనే చెప్పవచ్చును. మానవ చరిత్రలో, ఏ యుగమందు కూడ యీ భావము మాత్రము నవీనమై యుండలేదు. యుగయుగమునందు, భూగోళముపై నుండు వేదాంతులందరు, ఒకసారి కాకపోయిన యింకొకసారియైన యీ భావమునకే వచ్చి చేరిరి, వారు దానిని ఒక అనిశ్చయమైన సందేహముగా వదలి పెట్టిరి. ఆ సందేహము జాగ్రదవస్థకు మాత్రము సంబంధించినదిగా ఉన్నది.

మన శాస్త్రములలో జనకునికి సంబంధించిన ఒక కథ గలదు. జనకమహారాజొకనాడు తాను క్షామబాధితుడై బీదవాడైనట్లు కలగనెను. ఆ కలనుండి మేల్కొనినంతనే యాతనికి 'తాను నిజముగా మహారాజగు జనకుడా, లేక ఆ బీదవాడగు జనకుడా' యని తెలిసికొన యాశ కలిగెను. ఇట్లే చీనాదేశమందలి యొక యోగి కథ కూడ కలదు. ఆ యోగి 'నేనొక సీతాకోక చిలుకనైనట్లు నిన్న కలగంటిని. నేను నిజముగా మానవుడనై సీతాకోకచిలుకనైనట్లు కలగంటున్నానా లేక సీతాకోకచిలుకనై మానవుడైనట్లు కలగంటినా? యని నాకు తెలియకున్నది' అని చెప్పెను. జాగ్రదవస్థకు

స్వప్నావస్థకంటె యెక్కువ సత్యత్వమున్నదనెడు యుపపత్తు లేవైన యున్న యవి చాలా అల్పములని మనమీ అధ్యాయమును చదివిన తెలియగలదు.

కా॥ వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహుర్మనీషిణః ।
అన్తః స్థానాత్తు భావానాం సంవృతత్వేన హేతునా॥ ౧

దేహాంతర్భాగమున నుండుటచేతను, పరిమిత స్థానమందుండుటచేతను స్వప్నజగత్తులోని సమస్త పదార్థములు మిథ్య యని ధీమంతులు చెప్పుచున్నారు.

వైతథ్య ప్రకరణమును ప్రారంభించువాడై సత్యము వలె తోచు స్వప్నావస్థవలె జాగ్రదవస్థకూడ మిథ్యయే యను తన సిద్ధాంతమును గౌడపాదు డిచట ప్రకటించుచున్నాడు.

పూర్వాధ్యాయములో మహర్షులచే ప్రకటింపబడిన జగన్మిథ్యాత్వమును గౌడపాదు డిచట కేవలము ప్రకటనలచే మాత్రమేగాక తార్కికముగా కూడ దానిని రుజువుచేయ ప్రయత్నించుచున్నాడు.

జాగ్రత్స్వప్నావస్థల యభేదమును చెప్పు తన మహా సిద్ధాంతమును సాంప్రదాయము ననుసరించి 'ధీశాలురు చెప్పిరి' అని గౌడపాదుడు వారి ముఖముద్వారా వెల్లడిచేయు చున్నాడు. హిందూశాస్త్రములలో ఇది యొక పవిత్ర ఆచారము. విశ్వాసనీయమై అధికారయుతమైన మహర్షుల యొక్క కర్తృత్వము లేక వేదాంతసత్యములు ప్రకటింపబడవు.

నేటికాలమున వేదాంతులు తమ వేదాంత సిద్ధాంతములను తమ పేరుతోనే ప్రకటించుచున్నారు. అందును చాలమంది తమ స్వంత యనుభవముల ననుసరించి వారి సిద్ధాంతములను ప్రకటించుచున్నారు. ఇది హిందూమతములో గణనీయ మైనదిగా నంగీకరింపబడదు. ఒక వ్యక్తియొక్క యనుభవమై నంతమాత్రమున నది వేదాంతముగా నంగీకారమును పొంద జాలదు. ప్రస్తుతము గౌడపాదుని యనుభవము ప్రకారము జగత్తు మిథ్యయైన సాధారణ మానవునకు జగత్తు సత్యమై తోచవచ్చును. కావున, అతని మాటలకు గల అధికారమునకు మనకు మరికొన్ని సాక్ష్యములు కావలెను గాని కేవలము తన యొక్కని యనుభవమని యాతడు చెప్పినంత మాత్రమున మనము విశ్వసింపలేము.

ఒక్కని యనుభవమును మనము వేదాంతముగా నంగీక రించిన మరియొకని యనుభవమును కూడ నట్లే యంగీక రించవలెను కదా. మరియు ఒక దానికి మరియొక దానికంటె యెందుకు ప్రాధాన్యమిచ్చుచున్నామో కూడ మనము గ్రహించవలెను. కావుననే తఱచు మనము శాస్త్రములలో "నా గురువునకు వారి గురువు చెప్పినట్లుగా నా గురువు నాకు బోధించెను." అని గురువులు శిష్యులకు బోధించు చుండుటను కనుగొనుచుందుము. కావున మనము గురుశిష్య పరంపరాయాతమైన సిద్ధాంతములనే ఆగమములుగా నంగీక రించుచున్నాము. అట్టి యాచారమునే దృఢపరచుచున్నవాడై "మనీషిణః- ధీశాలురు" స్వప్నజగత్తు మిథ్యయనుచున్నారని గౌడపాదుడు ప్రారంభశ్లోకములోనే చెప్పుచున్నాడు. ఈ

వాదములు తగినంత తర్కము, హేతువు లేక యుండలేదు. ఆ మంత్రములోని పదములే తన్నిర్ణాయకములుగా నున్నవి.

అంతః స్థానాత్—లోపల యుండుటవలన. స్వప్నము మిథ్యయని చెప్పుటలో కారణము ఆ స్వప్నమందలి వస్తువులు దేహాంతర్గతమై యుండుట యొకటి. ఒక వ్యక్తి తన నేత్రములను మూసుకొనుచున్నాడు. అప్పుడతనికి బాహ్యప్రపంచవిషయక జ్ఞానముగాని, తన స్వంత శరీర విషయక జ్ఞానముగాని యుండదు. అట్టి స్వప్నస్థ తైజసునికి స్వప్నమనెడి మహాభూతము తన వస్తుప్రపంచముతో నెదురగుచున్నది. సహజముగానే అవియన్నియు దేహములోనే చూడబడుచున్నవి. ఒక మానవ దేహములో మనము సాధారణముగా స్వప్నమందు చూచు నదీవనపర్వతాదులకు గాని, రథ తురగాది వాహనములకుగాని తగినంత స్థలము లేదని మనకందరికి తెలిసియే యున్నది. స్థూలపదార్థ విషయముల నటునుండనిండు. వాస్తవములో మన దేహమందు తలవెంట్రుక పట్టునంత ఖాళీ స్థలముకూడ లేదు.

సంవృతత్త్వేన హేతునా — పరిమిత ప్రదేశము నందుండుటచేత, స్వప్నజగత్తు మిథ్య యనుటకు మరియొక కారణమిచట చెప్పబడినది. స్వప్నజగత్తులో చూచి యనుభవించు వస్తువులు వాస్తవముగా తోచినను మానవ దేహమందు అట్టి వస్తువులుండుటకు తగినంత ప్రదేశము ఉండుట అసంభవము కదా. ఇట్లు ఈ దేహము పరిమితప్రదేశము కలదగుటచే ఆ స్వప్నము మిథ్య యగుచున్నది.

కా॥ అదీర్ఘత్వాచ్చ కాలస్య గత్వా దేశాన్న పశ్యతి।
ప్రతిబుద్ధశ్చ వై సర్వస్తస్మిన్ దేశే న విద్యతే ॥ ౨

కాలము అతి స్వల్పమగుటచే స్వప్నముచూచు వ్యక్తి స్వయముగా ఆ ప్రదేశములకు పోయి చూడలేడు. మరియు నాతడు మేలుకొనిన పిమ్మట స్వప్నములో చూచిన యా దూర ప్రదేశములలో ఉండుట లేదు.

సంస్కృత వేదాంత గ్రంథములందు, పాఠకులు అన్ని విధముల తమ గ్రంథముల ననుసరించి గ్రహించుటకుగాను ఆ గ్రంథకర్తలు నిరంతరము ఒక పరిపుష్టమైన పద్ధతి నవలంబించెదరు. తాము చెప్పు వాక్యములకు పూర్వపక్షములు కలుగకుండ ముందుగా తామే యట్టి పూర్వపక్షములను శంకించుకొని స్వగతమువలె జవాబు చెప్పుకొని పోదురు. అట్టి సంభావ్యమైన పూర్వపక్షమును శంకించుకొని గౌడపాదుడు స్వయముగా యీ శ్లోకములో ప్రత్యుత్తర మిచ్చుచున్నాడు.

పూర్వశ్లోకములో దేహాంతర్భాగమున స్వప్నజగత్తునందలి వస్తువులకు తగినంత స్థలము లేకపోవుటచే ఆ స్వప్నము సత్యముకాదు మిథ్యయని గౌడపాదుడు చెప్పెను. అంతట పూర్వపక్షి యిట్లు ఆక్షేపించుచున్నాడు. "స్వప్నద్రష్ట యగు తైజసుడు ఆ వస్తువులను దూరదేశములలో చూచుచున్నాడు. ఆ దూర ప్రదేశములందా వస్తువులు ఉండుట సంభవమే కదా. కావున యా వస్తువులు దేహమందే యిమిడి యుండలేవు అను వాదన సరియైనది కాదు" అనుచున్నాడు.

గౌడపాదు డిట్లు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు "అట్లన తగదు. స్వప్నమును చూచువాడు తద్గత పదార్థములను వందల కొలది మైళ్ళదూరమున చూచుచున్నట్లు భావించవచ్చును కాని యాతని స్థూల శరీరము పండుకొనినచోటనే యుంటు న్నది కాని యది కదలుట లేదు. అనగా నతడు సూక్ష్మ శరీ రముతో సంచరించుచున్నాడు గాని స్థూల శరీరముతో కాదు. కాలమును బట్టి చూచిన జాగ్రత్స్వప్నములమధ్య అత్యల్ప కాలమే యుంటున్నది కావున అంత స్వల్పకాలమున అంత దూరము పోయివచ్చుట యసంభవమే యగుచున్నది. ఏతా వాతా ఆ స్వప్నము దూరదేశగత అనుభవముల దృష్ట్యా కూడ మిథ్యయే యగుచున్నది. మరియు, స్వప్నములో స్నేహితుని యింటిలో భోజనము చేయుచు మేలుకొనిన యాతడు తన పడకమీదనే యుండునుగాని స్నేహితుని యింటి భోజనశాలలో ఉండడు కదా! కావున నొకవ్యక్తి స్వప్నములో ఉత్తర ధృవమునకు పోయినను, పొరుగింటికి పోయినను, మేలుకొనగానే యాతడు తన పడకగదిలో తన పడకపైననే యుండును. స్వప్నములో మనము దూర దేశముల యందు సంచరించుచున్నట్లు అనుభవములను పొందినను అవి యన్నియు మన మనస్సులోనే యను భవింపబడుచున్నవి. కాబట్టియే స్వప్నము మిథ్య" యని గౌడ పాదుడు పూర్వపక్షుల వాదమును ఖండించ ప్రయత్నించు చున్నాడు. ఇట్లు దేశకాలదృష్ట్యాకూడ స్వప్నముయొక్క మిథ్యాత్వము ఋజువుపఱచబడినది. దేశకాలముల యొక్క

సత్యత్వమును నమ్మువారు స్వప్న వ్యవహారములు కేవలము మిథ్య యని యొప్పుకొనక తీరదు.

కా॥ అభావశ్చ రథాదీనాం శ్రూయతే న్యాయపూర్వకం।
వైతథ్యం తేన వై ప్రాప్తం స్వప్న ఆహుః ప్రకాశితం ॥ 3

హేతువాదముచేతను, తర్కవాదముచేతను కూడ స్వప్నములో చూచు రథాదులకు మిథ్యాత్వమును శ్రుతి ప్రకటించుచున్నది. కావున శ్రుతియే స్వయముగా స్వప్న జగత్తునకు మిథ్యాత్వమును స్థాపించుచున్నది యని మహర్షులు చెప్పుచున్నారు.

బృహదారణ్యకోపనిషత్తులో స్వప్నమందు చూడబడిన రథాదులు సత్యము కావు అని చెప్పబడియున్నది. గౌడపాదుడు దానినే యిచట యుదాహరించుచున్నాడు. స్వప్నము కూడ సత్యమని నమ్మువారికి యిది మరియొక జవాబై యున్నది.

భౌతిక పదార్థములను విశ్లేషించి, సంపూర్ణ వైరాగ్యముతో వానిని పరిశీలించిన యీ మహర్షులు ప్రత్యక్షమైన ప్రతివస్తువు మిథ్యయే యని చెప్పియున్నారు. బ్రహ్మజ్ఞానావళి యను తన గ్రంథములో శ్రీ శంకరులు కూడ యీ భావమునే సూటిగా వెల్లడించినారు. జ్ఞాతప్రపంచము, జ్ఞేయప్రపంచము, అని వస్తుప్రపంచము రెండు విధములుగా విభజింపబడినది. జ్ఞాత సత్య తత్త్వమనియు, జ్ఞేయము దానియందారోపింపబడినదనియు వేదాంతము వెల్లడించుచున్నది. కావున స్వప్న ప్రపంచము మాత్రమే మిథ్యకాదు. జాగ్రత్స్వప్నమందు

జ్ఞేయమైన సమస్తవిషయములు ఆరోపితములే కావున మిథ్యయే యని శ్రీ శంకరులు చెప్పియున్నారు. ఈ మతము ప్రకారము చూచిన దేహమనోబుద్ధులు కూడ జ్ఞేయములే యగుచున్నవి. కావున అవి యన్నియు పరమాత్మ యందారోపితమైన పదార్థములే యగుచున్నవి.

కా॥ అంతః స్థానాత్తు భేదానాం తస్మాజ్జాగరితే స్మృతం ।
యథా తత్ర తథాస్వప్నే సంవృతత్వేన భిద్యతే ॥ ४

ఆ వస్తువులు అస్తిత్వము గలవిగా మనము గ్రహించుటచే స్వప్నమందలి పదార్థము లన్నియు అసత్యములే యగుచున్నవి. ఆ కారణముచేతనే జాగ్రదవస్థయందలి పదార్థములు కూడా మిథ్య యగుచున్నవి. కావున జాగ్రదవస్థ యందలి వస్తువుల ప్రకృతి స్వభావము స్వప్నమందలి వస్తుస్వభావము ఒకటే యగుచున్నది. కాని వానికి ఒక్క భేదము మాత్ర మున్నది. స్వప్నమందలి వస్తువులు దేహాంతర్గతములై గ్రహింపబడుటచే పరిమితప్రదేశము నందున్నవగు చున్నవి.

పూర్వశ్లోకమును తెలిసికొనినపిమ్మట యీ శ్లోకము చాలా సులభముగా నర్థమవును. ఇందులోని విషయములు ఇదివఱకే చర్చింపబడినవి కాని యిచట శ్రీ శంకరుని భాష్యమందలి యొక చక్కని వాదము కలదు. అది యిట్లు :-

జాగ్రదవస్థలో చూడబడు పదార్థములు మిథ్యయైనవి. ప్రతిజ్ఞ - స్థిరపఱచవలసిన ప్రతిపాదన - అవి దృశ్యమానమగుచున్నవి కావున.

హేతువు :– కారణము. స్వప్నప్రపంచమువలెయున్నది కావున.

దృష్టాన్త :– ఉదాహరణము. స్వప్నములో చూడబడు పదార్థము లన్నియు మిథ్యాత్వము కలవి కావున జాగ్రత్ప్రపంచమందలి పదార్థములు కూడా చూడబడుటచే మిథ్య యగుచున్నవి.

ఉపనయ :– ప్రతిపాదనకును దృష్టాంతమునకును మధ్య గల సంబంధము కావున జాగ్రదవస్థయందుకూడ పదార్థముల మిథ్యాత్వము వెల్లడియగుచున్నది. నిగమన–మరల చెప్పుట.

ఇచ్చట శ్రీ శంకరులు "జాగ్రత్స్వప్నములు రెండింటి యందును దృశ్యమానము, తత్ఫలితమగు మిథ్యాత్వము సమానమే" యను నిర్ణయమునకు వచ్చుచున్నారు.

కా॥ స్వప్నజాగరితస్థానే హ్యేకమాహుర్మనీషిణః ।
భేదానాం హి సమత్వేన ప్రసిద్ధేనైవ హేతునా ॥ 5

ఇదివరకు చెప్పబడిన కారణములచేతను, జాగ్రత్స్వప్నములందు గ్రహింపబడు వస్తువులకుగల సామ్యము చేతను జాగ్రత్స్వప్నములు రెండును సమమే యని ధీమంతులు చెప్పుచున్నారు.

ఆ మహర్షు లిదివఱకే యనుమానప్రమాణముచే సాధించిన నిర్ణయములనే యీ శ్లోకార్థము వివరించి చెప్పుచున్నది. జాగ్రత్స్వప్నముల రెండింటి యందును విషయానుభవము జ్ఞాతృజ్ఞేయ సంబంధముపై ఆధారపడియున్నది.

ఈ విషయజగత్తు పరమాత్మయం దారోపితమైనదనియు, ఆ పరమాత్మకంటె భిన్నమైన యస్తిత్వము ఈ జగత్తునకు వేరే లేదనియు వేదాంత సిద్ధాంతమై యున్నది. కావున దృశ్యమాన పదార్థములన్నియు మనస్సుయొక్క మాయా కల్పితములే యగుచున్నవి. ఆత్మ యొక్కటియే నిత్య సత్యము.

కా॥ ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా।
వితథైః సదృశాః సన్తోఽవితథా ఇవ లక్షితాః ॥ ౬

ఆది యందు, అంతమందు కూడ యేది లేదో అది మధ్యయందుకూడ లేనిదే యగుచున్నది. మనము చూచు పదార్థములన్నియు మాయా సదృశములే యైనప్పటికిని యవి మనకు సత్యమువలె భాసించుచున్నవి.

జాగ్రదవస్థయందు గ్రహింపబడు పదార్థములు మిథ్య యనుటకు గౌడపాదుడు మరియొక కారణమును చూపుచున్నాడు. ఆది యందు లేనివస్తువు అంతమందు కూడ లేనిదైయున్న, అది తప్పక మధ్యనుకూడ లేనిదే యగుచున్నది. రజ్జువునందు సర్పము ఆదియందు లేదు. రజ్జు జ్ఞానము కలిగిన పిమ్మట లేదు. కావున మధ్యలోకూడ లేనిదే యగుచున్నది. ఆదియందు లేక, సత్యజ్ఞానానంతరము లేక, మధ్యనుమాత్రము ఉన్నట్లు తోచిన యది మనస్సుయొక్క భ్రమమాత్రమేయగుచున్నది.

జాగ్రదవస్థయందలి పదార్థములుకూడ యట్టివే యగుచున్నవి. ఎవరైతే ఆ పరమాత్మయొక్క సత్యజ్ఞానానుభవ

మును పొందినారో వారి దృష్ట్యా యీ జాగ్రత్ప్రపంచము లేనిదే యగుచున్నది. కావున గౌడపాదుడు జాగ్రత్ప్రపంచమునందలి వస్తువులుకూడ మిథ్య యనియు అవి దీర్ఘస్వప్న దృశ్యములనియు ప్రకటించుచున్నాడు.

కా॥ సప్రయోజనతా తేషాం స్వప్నే విప్రతిపద్యతే।
తస్మాదాద్యన్తవత్త్వేన మిథ్యైవ ఖలు తే స్మృతాః॥ ౭

జాగ్రత్ప్రపంచమునందలి పదార్థములు స్వప్నమందు యద్విధముగాను మనకు ప్రయోజనపడుటలేదు. కావున యీ జాగ్రత్స్వప్నముల రెండింటికిని ఆద్యంతములు యుండుటచేనవి రెండును కేవలము మిథ్యామాత్రములే యగుచున్నవి.

ఇచట మరియొక పూర్వపక్షి యిట్లు ఆక్షేపించుచున్నాడు. అతని మతప్రకారము జగత్తు సత్యము. గౌడపాదుడు జాగ్రదవస్థయందలి దృశ్యప్రపంచము మిథ్య యనగానే యాతడొక్కసారిగా దిగ్భ్రమజెంది యదరిపడెను. ఆతడు జగత్తు సత్యమని నిరూపించుటకు మరియొక యుపపత్తిని చూపుచున్నాడు. స్వప్నముతో పోల్చిన జాగ్రదవస్థ యందలి ప్రపంచము సత్యము అని చెప్పుటకు జాగ్రదవస్థలో ఒక విశేష గుణము కలదు. జాగ్రదవస్థయందలి ఆహారము ఆకలిని తీర్చుచున్నది. త్రాగిన పానీయము దాహమును అణచుచున్నది. తానెక్కిన బండి తనను తన కాంతయొక్క గృహమును చేర్చుచున్నది. కాని స్వప్నమందలి ఆహారపానీయములు అట్టివి కావుకదా! కావున స్వప్నముతో పోల్చిచూచినపుడు జాగ్రదవస్థ సత్యమని పూర్వపక్షి వాదించుచున్నాడు.

గౌడపాదుడీ వాదము నిట్లు ఖండించుచున్నాడు. స్వప్న జగత్తు నందలి యాహారాదులు జాగ్రదవస్థయం దెట్లు నిరుప యోగము లగుచున్నవో అట్లే జాగ్రదవస్థయందలి పదార్థ ములు కూడ స్వప్నమందు నిరుపయోగము లగుచున్నవికదా! ఉదాహరణకు జాగ్రదవస్థయందలి ఆహారము జాగ్రదవస్థయం దలి ఆకలిని తీర్చుచున్నది, కాని స్వప్నావస్థలోని యాకలిని తీర్చలేదుకదా. సుష్ఠుగా భోజనముచేసి నిద్రించు వ్యక్తి స్వప్న ములో క్షుధాపీడితుడై బాధపడుచున్నాడు. జాగ్రదవస్థలో సంతృప్తినిచ్చు సామర్థ్యముగల ఆ ఆహారము స్వప్నావస్థలో అసమర్థమై నిరుపయోగమైనదికదా. కావున ఆహారము ఆకలిని తీర్చునను విషయ మిచట నివారితమైనది. కాని స్వప్నములోని ఆహారము ఆ స్వప్నములోని ఆకలిని నిజముగానే తీర్చుచున్నది. అందుచేత అది స్వప్నస్థునికి ప్రయోజనకారియై, సంతృప్తి నిచ్చునదై యున్నది. ఇట్లు ఆద్యంతములు గలవగుటచే జ్ఞేయ వస్తువులన్నియు మిథ్యయగుచున్నవి. స్వప్నావస్థలో జాగ్రదవ స్థానుభవము లెట్లు మిథ్యయగుచున్నవో జాగ్రదవస్థలో అనుభవించు విషయములు కూడ స్వప్నములో అట్లే మిథ్య యగుచున్నవి. ఈ విధముగా జాగ్రత్స్వప్నములు రెండును మిథ్యయే యగుచున్నవి స్వప్నప్రపంచమునకున్నంత సత్య త్వమే జాగ్రత్ప్రపంచమునకు కూడ కలదు.

కా॥ అపూర్వం స్థానిధర్మో హి యథా స్వర్గనివాసినాం।
తానయం ప్రేక్షతే గత్వా యథైవేహ సుశిక్షితః॥ ౮

సాధారణముగా జాగ్రదవస్థలో చూడని స్వర్గవాసుల రూపములవంటి యపూర్వ పదార్థములను స్వప్నమందు స్వప్న

ద్రష్ట చూచియున్నచో యవి యా యా స్థానధర్మములని తెలిసికొనవలెను. ఇతఃపూర్వమా విషయములను గుఱించి బాగుగా తెలిసికొనినవాడై యా యా ప్రదేశములకు వెళ్ళి యా యా విషయములను సుపరిచితములవలె యాతడు చూచు చున్నాడు.

ఇచట ప్రతివాదులు వేదాంతులు చెప్పిన యుదాహరణ సరికాదని యాక్షేపించుచున్నారు. వేదాంతము స్వప్నమువలె జాగ్రదవస్థకూడ మిథ్యయని సమర్థించుచున్నది. ప్రతివాదులకుకూడ స్వప్నము మిథ్యయే కాని జాగ్రదవస్థను సంపూర్ణముగా స్వప్నముతో పోల్చుటకు వారు సమ్మతించరు. సశరీరముగా ఆకాశమునకు ఎగురుట, నాలుగు తొండములు గల ఏనుగు మొదలైన అసంభవదృశ్యములను స్వప్నములో చూచినట్లు యితరులవలన వినుచున్నాము. ఇట్టి అసంభవ దృశ్యములను చూచుటచే స్వప్నము మిథ్యయై స్వప్న దృశ్యములుకూడ సత్యదూరములే యగుచున్నవి. జాగ్రదవస్థలోని ప్రపంచమునకు తీరు తెన్ను గలిగి, క్రమమై ప్రకృతి బద్ధమై యున్నది కావున జాగ్రదవస్థను స్వప్నముతో పోల్చుట సరికాదు అని ప్రతివాదులు వాదించుచున్నారు.

గౌడపాదుడీ యాక్షేపణలకు నిష్కర్షగా ప్రత్యుత్తర మిచ్చుచున్నాడు. స్వప్నములోని విచిత్ర దృశ్యములు ఆ స్వప్నమును చూచు తైజసునియొక్క మనస్సులోని విలక్షణ భావములవలన కలుగుచున్నవి. స్థూలశరీరాభిమానమును విడిచిపెట్టి సూక్ష్మశరీరాభిమానియై, మనోమయ విజ్ఞానమయ కోశములతో నైక్యము పొందువాడు తైజసుడనబడును. అప్పుడతని

బుద్ధి మూడు వంతులు అచేతనావస్థలో మునిగి నిద్రలో జడమై పోవుచున్నది. అట్లు అత్యల్పమైన వివేకశక్తి కలిగియుండుటచే మనస్సు కట్లు తెగి తప్పించుకొనిన కుక్కవలె స్వేచ్ఛగా సంచరించ నారంభించును. ఇచట మనోభావములు తమను సక్రమ పద్ధతిలోనుంచు బుద్ధిగాని వివేకముగాని లేనివగుటచే మనస్సు చేతనే పాలింపబడి కనుగొనబడుచున్నవి. ఇట్టి వివేకహీనత చేతనే యట్టి విలక్షణ దృశ్యములు మనస్సులో కలుగుచున్నవి. ఇట్టి స్థితియందు తైజసుని మనస్సు విలక్షణత కలిగియున్నదనియు కావుననే యది విలక్షణదృశ్యములకు కారణమగుచున్నదనియు తెలియుచున్నది.

ఇట్టి విలక్షణతకు గౌడపాదుడు స్వర్గవాసులను ఉదాహరణగా నిచ్చుచున్నాడు. ఇంద్రునికి వేయికన్నులు, బ్రహ్మకు నాలుగు తలలు, జగద్రక్షకుడగు విష్ణువునకు నాలుగుచేతులు, శివునికి మూడుకన్నులు ఉన్నట్టు వర్ణించబడియున్నది. ఆ యా లోకములలో వారు వారుండు పరిస్థితులను పదవులనుబట్టి యివి యన్నియు సమర్థింపబడుచున్నవి. అట్లే విశ్వుడు తన స్వప్నావస్థలో తదనుభవముల కనుగుణముగా నా యా భ్రాంత భావములను పొంది విలక్షణదృశ్యములను చూచుచున్నాడు. కావున మనలోని జీవి, స్థూలశరీరాభిమానియగు విశ్వుడైన బాహ్యజగత్తును, సూక్ష్మశరీరాభిమానియగు తైజసునితో తాదాత్మ్యము నందినపుడు విలక్షణ స్వప్నానుభవములను అనుభవించుచున్నాడు.

ఈ పై విషయము ఒక చక్కని యుదాహరణద్వారా వివరింపబడినది. దూరదేశమునకుపోయి అచటి వింతగొలుపు

విలక్షణ ఆచారవ్యవహారముల ననుభవించుచున్న వ్యక్తివలె జీవుడు జాగ్రత్స్వప్న సుషుప్తుల యందు సంచరించుచు తత్తద్విషయానుభవములను యనుభవించుచున్నాడు. సంగ్రహముగా చెప్పిన జాగ్రదవస్థ కూడ స్వప్నమువలెనే మిథ్య యని చెప్పు వేదాంతి మతమును ఆక్షేపించు పూర్వపక్షి వాదము మిక్కిలి బలహీనమైనదే యగుచున్నది. దానికి తగినంత బలము లేదనే చెప్పవచ్చును.

కా॥ స్వప్నవృత్తావపి త్వన్తశ్చేతసా కల్పితం త్వసత్ ।
బహిశ్చేతో గృహీతం సద్దృష్టం వైతథ్యమేతయోః ॥ ౯

కా॥ జాగద్వృత్తావపి త్వన్తశ్చేతసా కల్పితం త్వసత్
బహిశ్చేతో గృహీతం సద్యుక్తం వైతథ్యమేతయోః॥ ౧౦

స్వప్నములో కూడ స్వప్నమును చూచువాడు తాను మనస్సులో భావించినదానిని అసత్యముగాను, ఎదుట ఆ స్వప్న జగత్తులో చూచినదానిని సత్యముగాను భావించుచున్నాడు. వాస్తవములో యీ రెండును స్వప్నజగత్తునకు సంబంధించినవగుటచే మిథ్యయే యగుచున్నవి. అట్లే జాగ్రదవస్థయందు కూడ జీవి తాను మనస్సులో భావించినదానిని అసత్యముగను, బాహ్యజగత్తునందు తన యెదుట చూచుదానిని సత్యముగను భావించుచున్నాడు. కాని యీ రెండునుకూడ బాగుగా యోచించి చూచిన అసత్యములనియే చెప్పవచ్చును.

జీవితములోని రెండు విభాగములగు వస్తు ప్రపంచమును, భావప్రపంచమును, ఈ రెండుశ్లోకములద్వారా కారికా

కారుడు మనకు వివరించుచున్నాడు. స్వప్నములో తైజసుడు తన భావప్రపంచములో మునిగిపోవుచున్నాడు. ఆ స్వప్నజగత్తులో తాను చూచినదంతయు సత్యమే యనియు, తానూహించి భావించినదిమాత్రము మిథ్యయనియు నాతడు తలంచుచున్నాడు.

ఇచట అసత్ అనగా అభావము అని యర్థముకాదు. అసత్ అనగా మిథ్య యని అర్థము. భావప్రపంచములో నీవు భావించు లడ్డులతో పోల్చినప్పుడు నీ యెదుట బల్లపై పళ్ళెరములోఉన్న లడ్డులు సత్యమే యగుచున్నవి. ఇట్లు కారికాకారుడువాస్తవిక ప్రపంచమునకును భావప్రపంచమునకును సుస్పష్టమైన భేదమును చూపుచున్నాడు. ఇట్లు వ్యత్యాసమును కనబఱచిన పిమ్మట స్వప్నజగత్తులో కూడ మనకు వస్తుప్రపంచమనియు, భావప్రపంచమనియు రెండు ప్రపంచములు కలవనియు, అందు స్వప్నద్రష్టయగు తైజసుడు అచటి వస్తుప్రపంచము సత్యమనియు, భావప్రపంచము మిథ్యయనియు భావించి యలక్ష్యముగా దాటిపోవుచున్నాడు. మేల్కాంచిన పిమ్మట యాతడు తాను స్వప్నములో కాంచిన వస్తు, భావప్రపంచములు రెండును మిథ్యామాత్రములే యనియు కేవలమవి స్వప్నమే యనియు తెలిసికొనుచున్నాడు.

అట్లే జాగ్రదవస్థలోకూడ ఇంద్రియ గ్రాహ్యమగు వస్తుప్రపంచము, దానికి విలువనిచ్చు మనోబుద్ధిగ్రాహ్యమగు భావప్రపంచము, రెండును కలవు. తన యూహాలన్నియు మనోవాసనలే యగుచున్నవి కావున సాధారణ మానవుడు అవి అసత్యములు అని యంగీకరించుచున్నాడు. అట్లంగీకరిం

చియు దానితో యీ బాహ్య వస్తు ప్రపంచమును పోల్చి నపుడు ఇంద్రియగ్రాహ్యమైన బాహ్యప్రపంచమునకు అధిక తర సత్యత్వమును అంటగట్టుచున్నాడు. స్వప్నములోని వస్తు భావ ప్రపంచములును, జాగ్రదవస్థలోని వస్తుభావ ప్రపంచ ములును ఆ పరమాత్మతో పోల్చినపుడు మిథ్యయే యగు చున్నవని చెప్పుచున్నాడు.

జాగ్రత్ప్రపంచమునందు అతిస్వల్పభేదమును సూచించు ప్రతివాదికి యీ శ్లోకార్థము ప్రత్యుత్తరమై యున్నది. జగత్సత్యవాదికి ఇంద్రియగ్రాహ్యబాహ్య ప్రపంచములో, సత్యమైన వస్తుప్రపంచము, అసత్యమైన భావప్రపంచము అని రెండు విధము లున్నవి కదా. అట్లే స్వప్నప్రపంచములో కూడ స్వప్నస్థునికి సత్యమైన వస్తుప్రపంచము, అసత్యమైన భావప్రపంచము ఉన్నదని గౌడపాదుడు చెప్పుచున్నాడు. అట్లు స్వప్నములోని వస్తుభావప్రపంచములు రెండును మిథ్యయే యైనయెడల జాగ్రదవస్థయందు కూడ అదేవిధముగా వస్తుభావ ప్రపంచములు రెండును మిథ్యయే కావలెను.

కా॥ ఉభయోరపి వైతథ్యం భేదానాం స్థానయోర్యది ।
క ఏతాన్ బుధ్యతే భేదాన్ కో వై తేషాం వికల్పకః ॥ ౧౧

జాగ్రత్స్వప్నముల రెండింటి యందునుగల విషయ ప్రపంచ మంతయు మిథ్యయే యైనయెడల దానిని తెలిసికొను వాడు, అట్టి దానిని యూహించి వికల్పము చేయువాడు ఎవడై యున్నాడు ?

ఈ శ్లోకార్థము ప్రతివాది ముఖమునుండి వెలువడినది. వస్తుభావప్రపంచములు రెండును జాగ్రత్స్వప్నముల రెండింటను మిథ్యయే యైనయెడల, అవి మిథ్యయని తెలిసికొనువాడు వానివెనుక ఒకడుండవలెనుకదా; మరియు ఇట్లు సర్వము మిథ్యయైన సత్యమైన దొకటి యుండియే తీరవలెను; ఈ వస్తువులను గ్రహించువాడు, భావముల ననుభవించువాడు, యోచనలను తెలిసికొనువాడు, అగు నాతడెవడు? అనునదే ప్రతివాది సమస్యయై యున్నది. ఆతని యాక్షేపణలోని భావమిది – వేదాంతులు ఏదో ఒక సత్యతత్త్వమును గూర్చి వివరించకుండిన వారు తమ స్వంత ఆత్మనే లేదని నిషేధించువారగుచున్నారు. స్మృతి యుండవలెననిన స్మరించు వాడొకడుండవలెను. అట్లే జ్ఞానమునకు జ్ఞాత యొకడున్ననే యా జ్ఞానము పనిచేయగలదు. అనుభవించువాడు స్మరించువాడు కూడ ఒక్కడేయై యున్ననేగాని స్మృతి పనిచేయలేదు. అట్లే సమర్థుడైన జ్ఞాత యున్ననేగాని వస్తుజ్ఞానము కూడ కలుగజాలదు. కావున ప్రతివాదమేమనగా ఈ జగన్మిథ్యాత్వమును తెలిసికొను జ్ఞాత ఎవ్వడై యున్నాడనునదే యై యున్నది. సామాన్యవస్తుతత్త్వమును యథార్థముగా గ్రహించు బుద్ధిసామర్థ్యమును సత్యమని యంగీకరించు జగత్సత్యవాదులచే వేదాంతులమతము ఆక్షేపింపబడుచున్నది

కా॥ కల్పయత్యాత్మనాత్మానమాత్మా దేవః స్వమాయయా ।
స ఏవ బుధ్యతే భేదానితి వేదాంత నిశ్చయః॥ ౧౨

"ఆత్మీయ మాయాప్రభావము చేతనే ఆత్మ యీ వస్తు ప్రపంచమును కల్పించుకొనుచున్నది. ఇట్లు తనలో

తానే కల్పించుకొనిన బాహ్యాభ్యంతర జగత్తులను జీవుడు అనుభవించుచున్నాడు. మరియు ఆ ఆత్మయే తన్ను తాను తెలిసికొనుచున్నది." ఇదియే వేదాంతుల నిశ్చయము.

పూర్వశ్లోకములో ప్రతివాది బాహ్యాభ్యంతర ప్రపంచములను గ్రహించి యనుభవించు జ్ఞాత యెవడని ప్రశ్నించి యున్నాడు. ఈ శ్లోకములో గౌడపాదుడా ప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు. వేదాంతములో – ఈ ప్రపంచమంతయు మిథ్యయనియు, అది పరమాత్మయందారోపితమైనదనియు, – చెప్పబడియున్నది. "శుద్ధ చైతన్యమగు పరమాత్మ తన మాయచే మోహితుడై తనకంటె భిన్నము కాని ప్రపంచమును స్వయముగానే కల్పించుకొనెను. మరియు తాను సర్వవ్యాపి యగుటచే జ్ఞాతకూడ తానేయై యున్నాడని" వేదాంతమతము చెప్పుచున్నది. "తన మాయచే తానే నానారూపములుగా బయలువెడలుట" అను నీ భావమును ఒక్కసారిగా అర్థముచేసికొనుట కొంచెము కష్టమగుచున్నది. కాని మన స్వప్నానుభవములను పరిశీలించిన యిది స్పష్టమగును. తనను తాను మరచిన క్షణముననే స్వప్నము ప్రారంభమగుచున్నది – అనగా తైజసుడు తన స్వప్నజీవితమును ప్రారంభించుచున్నాడు. ఈ విస్మృతియు, స్వప్నజగత్తులోని నానావస్తువులను గ్రహించు శక్తియు అతనికి మరియొక స్థలము నుండి వచ్చినవి కావు. తనను తాను భ్రమింపజేసుకొను శక్తి తనయందు నైజముగా ఉన్నదే యనగా తననుండి బయలు వెడలినదే యగుచున్నది.

అతడు తన మాయకు వశుడై తన నిత్యతత్త్వమును మఱచి, శూన్యప్రపంచమును చేరి, యచట భ్రమకల్పిత స్వప్నమందు నానారూప వస్తుప్రపంచమును చూచుచున్నాడు. స్వప్నములో ఆ యా నిర్ణీతప్రదేశములలో ఆ యా విధమైన జీవితమును తాను గడపవలయునని యాతడు తలచుచున్నాడు. కావున యాతడేరకముగా ఆ స్వప్నజీవితమును గడపినను, ఆ స్వప్నమందలి ప్రతిచిన్నయంశమును తనకంటె వేరైనది కాదు కదా! స్వప్నమందు చూచు నదీవన పర్వతాదులు, ఆకాశనక్షత్ర చంద్రాదులు, శత్రుమిత్రాదులు అన్నియు తైజసుని మనస్సుకంటె భిన్నమైనవి కావు. అట్లే జాగ్రదవస్థయందు కూడ అగుచున్నది. సత్యమును తెలిసికొనకపోయినంతనే, మన సహజతత్త్వవిషయకమైన అజ్ఞానము కలుగుచున్నది. అట్టి అజ్ఞానముద్వారా మనము సత్యాభాసమగు దృశ్యప్రపంచము నొకదానిని కల్పించుకొనుచున్నాము. అది జాగ్రదవస్థ యున్నంతకాలము విశ్వునికి సత్యమై భాసించుచున్నది. వాస్తవములో ఆ సర్వవ్యాపి సత్యతత్త్వము కంటె భిన్నముగా మరియొకవస్తువేదియు లేనేలేదు. ఆ అద్వైతబ్రహ్మతత్త్వముపై యీ ప్రపంచము కేవలము ఆరోపితము మాత్రమే యగుచున్నది.

ప్రప్రథమముగా గౌడపాదుడు మనము చూచు యీ వస్తుప్రపంచమునకు ఏదో కొంత వివరణను ఇచట చేయనారంభించినాడు. మాండూక్యోపనిషత్తులోగాని, కారికలలోగాని సత్యమువలె భాసించు ఈ సృష్టప్రపంచమంతయు మిథ్యయనియు, త్రికాలములందును అది సత్యముగాక మిథ్యయే

యగుచున్నదనియు, సిద్ధాంతము చేయబడియున్నది. కాని కొన్ని విశిష్టక్షణములలో ఆ గౌడపాదుడుకూడ మన అంతస్థుకు దిగివచ్చినట్టి యనుగ్రహము కలవాడగుచున్నాడు. కావుననే మనము చూచి గ్రహించు ఈ నానాత్వవిశిష్టప్రపంచమును గూర్చి, యది యెట్లు భ్రమకల్పితమైనదో యని వివరించుచున్నాడు. ఈ శ్లోకము మన వాఙ్మయములో చాల ప్రసిద్ధమైనది. చాలమంది ప్రవక్తలు, గ్రంథకర్తలు, వేదాంతులు, దీనిని తఱచు ఉదహరించుచుందురు.

ఇట్లు సృష్టిసిద్ధాంతమును వివరించినను, యీ దృశ్యప్రపంచమునకు ద్రష్ట, భోక్త, జ్ఞాత యెవడను ప్రశ్న ప్రత్యుత్తరములేక యట్లే యున్నది. దానికే గౌడపాదుడిచట ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు. శుద్ధచైతన్యమగు ఆ పరమాత్మయే, జ్ఞాత యని చెప్పుచున్నాడు. బాహ్యాభ్యంతరములయందెచ్చటనైనను నుండు భ్రమను ప్రకాశింపజేయువాడు కూడ ఆ పరమాత్మయే యగుచున్నాడు.

వాస్తవములో ఆ పరమాత్మయే సమస్తమును ప్రకాశింపజేయువాడనియు, ఆకాశమందలి సూర్యచంద్రాదులు కూడ ఆతని ప్రకాశమువలననే ప్రకాశించుచున్నవనియు, (తస్య భాసా సర్వమిదం విభాతి) యనేక యుపనిషత్తులు చెప్పుచునే యున్నవి. మనలో ఆ చైతన్యమే లేకయున్న మనకా సూర్యచంద్రాదులు లేనివారే యగుచున్నారు కదా. మనలో నున్న జ్ఞానప్రకాశ సహాయముతోనే మనమా సూర్యుని ప్రకాశింపజేయుచున్నాము. మనలోని ఆ జీవచైతన్యము వెడలిపోయినప్పుడా సూర్యుడు కూడ జడ పదార్థమే యగు

చున్నాడు. అట్లే మనయందుండు ఆ జీవతత్త్వము లేచిపోయిన ఆ సూర్యచంద్రాదులు శూన్యత్వమును పొందుచున్నారు. ఇట్లు ఆ చైతన్యమే సర్వమును ప్రకాశింపజేయు జ్ఞానతత్త్వమై యున్నది.

వేదాంతము ప్రకారము ఇంద్రియ గ్రాహ్యమైన బాహ్యవస్తు జగత్తును, మనోబుద్ధిగ్రాహ్యమైన భావాదులను కూడ ఆ చైతన్యమే ప్రకాశింపజేయుచున్నది. మన స్వప్నజగత్తును మన జాగ్రత్ప్రపంచమును తత్తదనుభవములను గ్రహింపజేయునది మనలోని చైతన్యమే యగుచున్నది.

కా॥ వికరోత్యపరాన్ భావానన్తశ్చిత్తే వ్యవస్థితాన్।
నియతాంశ్చ బహిశ్చిత్త ఏవం కల్పయతే ప్రభుః ॥ ౧౩

ప్రభువైన ఆత్మ బాహ్యదృష్టి గలిగినప్పుడు, ఇదివరకు తన మనస్సులో వాసనారూపములు లేదా సంస్కారరూపములు, లేదా వాంఛారూపములోనున్న బాహ్యాభ్యంతర వస్తుప్రపంచమును తన మనస్సుతో కల్పించుకొనుచున్నాడు. మరియు ఆ మనస్సును అంతర్ముఖము చేసినపుడు భావప్రపంచమును కల్పించుకొనుచున్నాడు.

ఇట్లు మాయాసృష్టప్రపంచమునకు జ్ఞాత యెవడు ? అను విషయమును వివరించువాడై గౌడపాదుడు పరమాత్మయే జ్ఞాత, ద్రష్టయని దృఢపఱచుచున్నాడు. వేదాంత విద్యార్థులమైన మనము ఇచట యీ శ్లోకమునకు అపార్థము గ్రహింపకుండ జాగ్రత్తపడవలెను. "ఆ పరమాత్మ తన మనస్సును బహిర్ముఖముచేసి" యని యీ శ్లోకములో చెప్పబడినది.

వాస్తవములో ఆత్మకు మనస్సనునదే లేదు. మనస్సు ఆత్మ యందారోపితమైనదే యగుచున్నది. అట్టి మనస్సు బహిర్ముఖమైనపుడు బాహ్యవిషయప్రపంచమును చూచుచున్నది. ఆత్మ సర్వవ్యాపికూడనై యున్నది. అనగా నిచట యథార్థభావము "మనోబుద్ధినియమిత జీవాత్మ తన మనస్సనెడి పలకల గాజు ముక్క ద్వారా యీ నానావర్ణవర్ణిత చిత్రజగత్తును చూచుచున్నది. అదియే ద్రష్టయై యున్నది" అని చెప్పవచ్చును.

ఆ పరమాత్మ మనోబుద్ధినియమితమై జీవాత్మ యనబడుచున్నది. ఆ జీవాత్మ తన వాసనలనెడు జాలరంధ్రముల ద్వారా యీ నానాత్వవిశిష్టజగత్తును చూచుచున్నదై, అందు తన వాసనల కనుగుణముగా రాగద్వేషాదుల నారోపించి, ఆ యా యనుభవములను తా ననుభవించుచున్నది. ఇట్టి మిథ్యానుభవముల మొత్తమునే మనము జాగ్రదవస్థ యనుచున్నాము. అసలు ఆ చైతన్యమునుండి మరలించిన మనోబుద్ధీంద్రియములు స్వయముగా ఎట్టి ప్రపంచమును సృష్టించలేవు. తదనుభవములను పొందను లేవు. ఈ మాయకు, తత్సృష్ట యనుభవములకు అన్నిటికిని జీవతత్త్వమైన యీ శుద్ధచైతన్యమే మూలాధారమగుచున్నది. ఈ బహిర్ముఖత్వమే ప్రపంచమునకు కారణమగుచున్నది. ఈ భావ మితర యుపనిషత్తులలో చక్కగా వర్ణింపబడినది. ముఖ్యముగా కఠోపనిషత్తులో "ఈ బహిర్ముఖత్వమే భ్రాంతికి మూలమనియు, తన్నివారణకు అంతర్ముఖత్వమే ఔషధమనియు" చెప్పబడి యున్నది. ఎప్పుడైతే యీ చైతన్యము దేహమనోబుద్ధుల యందలి తాదాత్మ్యమును విడనాడుచున్నదో అప్పుడది ఆత్మ

జ్ఞానము కలదై తన్ను తాను తెలిసికొనుచున్నది. ఇదియే ఆత్మజ్ఞానము. ప్రపంచము మన జ్ఞానవిషయము కాకుండుటకు అనగా ప్రపంచమును మనము ప్రత్యేకముగా చూడకుండ నుండుటకు ఇది యొక పద్ధతియై యున్నది.

కా॥ చిత్తకాలా హి యేఽన్తస్తు ద్వయకాలాశ్చ యే బహిః ।
కల్పితా ఏవ తే సర్వే విశేషో నాన్యహేతుకః ॥ ౧౪

భావప్రపంచమునందు మనలో గ్రహించువస్తువులు ఆ భావమున్నంతవఱకే యుంటున్నవి. బాహ్యప్రపంచమందు మనము గ్రహించు వస్తువులు రెండుకాలములకు సంబంధించిన విగా యున్నవి. ఇంతకంటె యీ భావవస్తుప్రపంచముల రెం డింటికిని విస్పష్టమైన భేదమేదియు లేదు. ఈ రెండున్ను వాస్తవములో కల్పనామాత్రములేయై యున్నవి.

ఇంతగా వివరించినను వేదాంతమతమును విశ్వసించని ప్రతివాది యింకను జాగ్రత్స్వప్నములకు విస్పష్టవిభేదమున్న దని వాదించుచున్నాడు. ఆంతరికభావములు ఒకే సమయ మందుద్భవించిన బాహ్య ప్రపంచవిషయములు రెండు సమ యములకు సంబంధించినవై యున్నవి. — మనకు గ్రహణా జ్ఞానమున్నంతవఱకు ఒక వస్తువు మన మనస్సులో ఉండును. కాని బాహ్యవస్తువులు ఇతరులు దానిని గ్రహించినను గ్రహిం పకున్నను మరియొక సమయము వరకు ఉండును. ఉదాహార ణకు మనము స్వప్నమును చూచుచున్నాము. కాని మన మనస్సు ఆ స్వప్నమునందున్నంత వరకే ఆ స్వప్నముకూడ నిలచియుంటున్నది. ఇంక బాహ్యప్రపంచమందు అట్లుకాదు. ఒక వస్తువు యొక్క అస్తిత్వము మరియొక వస్తువుయొక్క

అస్తిత్వమునకు సంబంధించిన కాలమును బట్టి నిర్ణయింప బడును. "సురేంద్రుడు బౌనుబస్సు వచ్చువఱకు ఇక్కడ నిలచును" అని చెప్పుదుము. ఇక్కడ సురేంద్రుని యొక్క పోకడ మరియొక వస్తువగు బౌనుబస్సుయొక్క రాక మీాద ఆధారపడియున్నది. ఆ బస్సుయొక్క రాక మరియొక్క సమయమందు జరుగుచున్నది. ఇట్లు కాలభేదమునుబట్టి ప్రతి వాదులు జాగ్రత్స్వప్నములకు తలవెంద్రుకవాసి భేదమును కల్పించుచున్నారు. కాలము, తదంతరము అను రెండు సమ యములపై ఆధారపడియుండుటచే వారి మత ప్రకారము స్వప్నముకంటె జాగ్రత్ప్రపంచము సత్యతరమై యున్నది. మనస్సులో ఒకభావము ఉన్నంతవఱకే యచట స్వప్నము సంభవించుచున్నది కావున స్వప్నము ఏకకాలగతమనియు, జాగ్రత్తునందు విషయములు భావమున్నను లేకున్నను వస్తువు అచట యుండుటచే జాగ్రదవస్థ ద్వికాలగతమనియు, కావు ననే జాగ్రత్ ప్రపంచము సత్యతరమనియు వారి వాదనమై యున్నది.

గౌడపాదుడీ వాదమును అతి సులభముగా ఒక్క దెబ్బతో కొట్టిపారవేయుచున్నాడు. జాగ్రదవస్థలోని విషయ ములను నిర్వచించునట్లున్న రెండుకాలములున్ను కేవలము మనోభావనలు మాత్రమే యగుచున్నవి కాని యితరము కాదు. కావున స్వప్నమువలెనే జాగ్రదవస్థకూడ భావనాకల్పి తమే యగుచున్నది. అందుచే జాగ్రత్స్వప్నముల మధ్య భేద మున్నదని చెప్పుటకు తగినంత కారణము లేదని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

కా॥ అవ్యక్తా ఏవ యేఽన్తస్తు స్ఫుటా ఏవ చయే బహిః।
కల్పితా ఏవ తే సర్వే విశేషస్త్విన్ద్రియాన్తరే ॥ 15

మనోభావములు అవ్యక్తమై మనస్సునందే యుంటున్నవి. బాహ్యమందు అవి వ్యక్తమై స్ఫుటముగా ప్రత్యక్ష విషయములుగా తోచుచున్నవి. కాని ఈ రెండును కేవలము మనోభావములే యగుచున్నవి. అయితే బాహ్యమందలి వస్తువులు ఇంద్రియములచే ప్రత్యక్షముగా గ్రహింపబడునట్లు తోచుచున్నది కావున ఈ ఇంద్రియములే యీ భావవస్తు ప్రపంచముల మధ్యనుండు భేదమైయున్నవి. వాస్తవములు రెండును భావనాకల్పితములే యగుచున్నవి.

అభ్యన్తరమైన స్వప్నప్రపంచమునకును, బాహ్యమైన వస్తుప్రపంచమునకును మధ్య భేదమున్నదని చెప్పుటకు ప్రతివాది యిచట మరియొక యాక్షేపణను చూపుచున్నాడు. స్వప్నములోని వస్తువులు అవ్యక్తముగా నున్నవి. బాహ్య ప్రపంచములోని వస్తువులు స్ఫుటముగా వ్యక్తమైయున్నవి. కాబట్టి బాహ్యప్రపంచము స్వప్నముకంటె సత్యతరమైయున్నది.

వ్యక్తములైనను, అవ్యక్తములైనను వస్తువులన్నియు మనోగత భావనాకల్పితములే యని గౌడపాదుడు బదులు చెప్పుచున్నాడు. వ్యక్తావ్యక్తభేదములు ఇంద్రియములవలన కలిగినవేగాని యితరమైన వానివలన కలిగినవి కాదు. మనోప్రపంచములోనా వస్తువులు అవ్యక్తముగానున్న ఇంద్రియగ్రాహ్య బాహ్యప్రపంచమునందు ఆ వస్తువులు

సువ్యక్తమగుచున్నవి. స్వప్నప్రపంచమును చూచుచున్న ప్పుడు ఆ యా వస్తువులు, మసకమసకగాను, అస్ఫుటముగాను, ఆవృతమైనట్లు కనబడును. అచట వివేకించు సాధనమగు బుద్ధి లేకపోవుటచే, ఆ వస్తువులు కేవలము మనస్సుచేతనే చూడబడుచున్నవి కావున అవి యట్లు అస్పష్టముగా అగపడు చున్నవి. జాగ్రదవస్థలో బాహ్యప్రపంచమందలి వస్తువులు విశ్వునియొక్క ప్రత్యేకమైన జ్ఞానసాధనలగు ఇంద్రియముల ద్వారా చూడబడుచున్నవి కావున అవి సుస్పష్టముగా నగ పడుచున్నవి. ఆ జాగ్రదవస్థయందు ఇంద్రియములు జాగృతమై చురుకైన బుద్ధిచే నడువబడుచున్నవి. కావున నట్టి వస్తువులు ప్రస్ఫుటముగా నగపడుట సహజమే కదా! అందుచే యవి మనకు అధికసత్యతరములై గోచరించుచున్నవి. కాని వాస్తవ ములో జాగ్రత్స్వప్న జగత్తులు రెండును లేనివే యగుచున్నవి. అవి రెండును మనః కల్పితములే యగుటవలన అవి మిథ్య మాత్రమే యగుచున్నవి.

కా॥ జీవం కల్పయతే పూర్వం తతో భావాన్ పృథగ్విధాన్।
భాహ్యానాధ్యాత్మికాంశ్చైవ యథా విద్యస్తథాస్మృతిః॥ ౧౬

ప్రప్రథమముగా జీవుడు ఉద్భవించుచున్నాడు. అటు పిమ్మట అనేకభావములు కల్పితములగుచున్నవి. ఆ భావములు బాహ్యమైనవి ఆధ్యాత్మికమైనవి యై రెండు విధము లుగా నున్నవి. "యద్భావం తద్భవతి" యను విధముగా జ్ఞానము ననుసరించి స్మృతి కలుగుచున్నది.

అంతర్గతమై, బహిర్గతమైన ప్రతివస్తువు కేవలము భావనామాత్ర కల్పితములైన, యీ భావనలకు మూలకారణమైనది యేది? వేదాంతి చెప్పినప్రకారము "స్వప్నమువలె జాగ్రత్ప్రపంచము కూడ భావనా కల్పితమే" యను విషయమును ఒప్పుకొనినట్లు ప్రతివాది ప్రశ్నించుచున్నాడు. ఇప్పుడతడు వేదాంతుల మతమును కొంచెము గ్రహించుచున్నట్లు తోచుచున్నది. "ఓ వేదాంతీ! బాహ్యాభ్యంతర్గత వస్తు ప్రపంచమంతయు మనస్సునందలి మాయామాత్ర కల్పితమే యైనయెడల ఈ కల్పనకు మూలకారణమేమి! మనస్సు కేవలము అచేతనమై, జడమై, మృతపదార్థమైనదగుటవలన కేవలము అట్టి మనస్సు మూలకారణము కాజాలదు. ఆత్మ జ్ఞానస్వరూపము గావున అట్టి ఆత్మయందు భ్రమగాని అజ్ఞానముగాని యుండజాలదు. కావున ఆత్మకూడ యిట్టి కల్పనకు మూలకారణము కాజాలదు.

ఆత్మయందు ప్రప్రథమముగా ప్రత్యగాత్మ లేక జీవాత్మ భావన కల్పితమైనది. మనస్సు బయల్వెడలినపుడు, ఆ మానస సరోవరమునందలి తరంగములలో పరమాత్మ ప్రతిబింబించినపుడు మనకీ ప్రత్యేక ఆత్మభావన కలుగుచున్నది. అంత మనము జీవులము అని భావించుచున్నాము. సత్యమువలె భాసించు ఈ జీవియొక్క ఆచారశీలప్రవర్తనలు తాను ప్రతిబింబించిన మానసికస్థితి కనుగుణముగా మారుచుండును కావున ఆ పరమాత్మ మనోప్రతిబింబితమైనపుడు జీవుడగుచున్నాడు. ఇతడే కర్తయు భోక్తయు అగుచున్నాడు. మరియు ఈతడే బద్ధుడు, ముక్తుడు, సాధకుడు, సిద్ధుడు కూడ అగు

చున్నాడు. ఈ జీవాత్మ భావన ఆత్మయందు దారోపితమైనది. ఈ భ్రమ యనేక భ్రమలకు కారణమగుచున్నది. మరియు నిది యావరణమును దట్టముగా దిట్టపఱచి మన సహజతత్త్వము నుండి మనలను దూరముగా తీసికొనిపోవుచున్నది. చివరకు దానిని విశ్లేషించిచూడగా యీ విధముగా తోచుచున్నది. "ఈ భ్రాంతజీవుడు స్వయం సృష్టప్రపంచమును క్రమబద్ధముగాను, విభిన్నమైనదిగాను, నామరూపాత్మకమైనదిగాను తన యింద్రియములద్వారాను, మనస్సుద్వారాను తెలిసికొని దానిని చూచుచున్నాడు". ఇట్లే భావవస్తుప్రపంచములు ప్రత్యేకవ్యక్తియొక్క పూర్వవాసనలచే నిర్ణయింపబడు చున్నవి అని ప్రతివాదులకు ప్రత్యుత్తరమిచ్చుచు గౌడపాదుడు పై విషయమునే "యథా విద్యా తథా స్మృతిః – జ్ఞాన మెట్లున్నదో స్మృతి యట్లున్నది" అని చాల చురుకుగా చెప్పుచున్నాడు. ఇదియే మహత్తరమైన మన తత్త్వశాస్త్రము. దీనిలో అనంతములైన భావములు అజ్ఞాతముగా నిమిడి యున్నవి.

కర్మముతో బంధించు కారణ మూలను ఈ క్రింది విధముగా వివరించవచ్చును. సినీమాను గుఱించి వినని పల్లెటూరివానికి అనేకరకములైన కోరికలు కలుగవచ్చును గాని యీ కోరికల పట్టీలో "సినీమా చూడవలెను" అను కోరిక మాత్రము ఉండదు. ఆ పల్లెవాడు పట్టణమునకు వచ్చిన యత డచట తఱచుగా సినీమామాటలనే వినుచున్నాడు. అంత నతనికి సినీమాజ్ఞానము కలుగుచున్నది. పిమ్మట యతడు సినీమాను చూచుటకు పోవుచున్నాడు. దానిని చూచి యొక

విధమైన ధ్యానందము ననుభవించి యందుండి బయటకు వచ్చుచున్నాడు. అంత నతనికి సినీమా సుఖమును గూర్చిన జ్ఞానము కలుగుచున్నది. అట్టి జ్ఞానముచే ప్రేరేపింపబడినవాడై యటుపిమ్మట యతడు తఱుచుగా సినీమా థియేటర్‌కు పరు గెత్తుచున్నాడు. ఇట్లాతని స్మృతి అనుభూతజ్ఞానముచే స్వాధీన పఱచుకొని త్రిప్పబడుచున్నది. వెంటనే యాతడీ రెండింటికిని కార్యకారణ సంబంధమును కల్పించుచున్నాడు. సినీమాకు పోవుట కారణము, తద్దర్శనసుఖము కార్యము అగుచున్నది. కొంతకాలమైన పిమ్మట కార్యమును నెరవేర్చదలుచుకొని నపుడు కారణమునకై ప్రాకులాడి కార్యము సిద్ధించువఱకా కారణముతో పెనుగులాడును.

అట్లే ఆహార సంపాదనము వలన గలుగు సంతృప్తి జ్ఞానము మనలను ప్రపంచములో పాటుపడి, సంపాదించి, సంచిత మొనర్చునట్లు చేయును. అట్లు చేయుటవలన సంపూర్ణాహా రము మనలను సంతృప్తి పఱచుచున్నదను భావము మనకు కలుగును. సమస్త కామములయందును, కామప్రేరిత కర్మల యందును ఇట్టి భావము కలుగుట నిత్యమై యున్నది. ఇట్లు విశ్లేషించి చూచిన వస్తుజ్ఞానమెట్లున్నదో స్మృతియు యట్లే యున్నదని స్పష్టమగుచున్నది. అట్టి జ్ఞానమేదియు లేకున్న మనకెట్టి స్మృతియు యుండనేయుండదు. ఇట్లు మన స్మృతులు మన పూర్వజ్ఞానముచే నియమితమైయున్నవి యను విషయము యదార్థమగుచున్నది.

కా॥ అనిశ్చితా యథా రజ్జు రన్ధకారే వికల్పితా ।
సర్పధారాదిభిర్భావై స్తద్వదాత్మా వికల్పితః॥ ౧౭

మసక చీకటిలో అజ్ఞానముచే రజ్జువును చూచి సర్ప మనిగాని, నీటిచారయనిగాని యెట్లు భ్రమించుచున్నామో అట్లే ఆత్మకూడ అజ్ఞానముచే అనేకవిధములుగా వికల్పితమగు చున్నది.

జీవాత్మ భావనయే యితర భావములకు, భావనలకు మూలకారణము. అట్లైన యీ జీవాత్మభావనకు మూలకారణ మేమి ? ప్రసిద్ధమైన వేదాంతోదాహరణ ద్వారా యీ ప్రశ్నకు ప్రత్యుత్తరమును చెప్పుచున్నాడు. రజ్జువు యొక్క వాస్తవజ్ఞానము లేనప్పుడు మసకచీకటిలో దానిని సర్పముగా భ్రమించెదము. ఈ సర్పము యొక్క ఆకారాదులు మనస్సు లోని భ్రమ కల్పితములే. అంతేగాక యవి సత్యమైన రజ్జువు నందు ఆరోపింపబడినవి. ఈ వివిధభావములు ఆ రజ్జువుయొక్క సత్యజ్ఞానము లేకపోవుటచేతనే కలుగుచున్నవి. రజ్జుజ్ఞానమే మన యందుండి యుండిన సర్పభ్రాంతి మన కెన్నటికిని కలిగియే యుండదు.

అదే విధముగా ఆ ఆత్మ ప్రాణముగను, బుద్ధిగను, మనస్సుగను, దేహముగను మరియు అనేక విధములుగను భావింపబడుచున్నది. అట్టి దట్టమైన అజ్ఞానాంధకారములో ఆ ఆత్మపై మన సుఖదుఃఖములు, జ్ఞానాజ్ఞానములు, జయాప జయములు, ఆశానిరాశలు మొదలగువానిని యారోపించు చున్నాము. వాస్తవములో ఆ ఆత్మకే గుణము లేవియు లేవు. అవి యన్నియు కేవలము ఆరోపితములు మాత్రమే యగు చున్నవి.

మనలోని సర్వవ్యాపి సత్యతత్త్వముయొక్క సహజ స్వభావమును తెలిసికొనకపోవుటచేతనే యిట్టి భ్రమలు మనకు కలుగుచున్నవి ఇదియే సమస్త యుపనిషత్తులలోను తప్పిదము లోని పునశ్చరణ చేయు వాక్యార్థమై యున్నది. మనకా పర మాత్మయొక్క సహజతత్త్వము తెలియగానే, "జనన మర ణాదులన్నియు ఆరోపితమైన మనస్సువే కాని ఆత్మవి కావు" అని మనము తెలిసికొనుచున్నాము.

రజ్జువును జూచి సర్పమని భ్రమపడినపుడు అచట కన బడు పడగ, బుస, విషపుకోరలు, నునుపైనదేహము ఇత్యాదు లన్నియు ఆరోపితమైన సర్పమునకు సంబంధించినవేకాని రజ్జువునందున్నవి కావుగదా. మనమా రజ్జువునందు సర్ప మును జూచినంతమాత్రమున రజ్జువులోని యే ఒక్క భాగ మును అట్టి వికారమును పొందుటలేదు.

కా॥ నిశ్చితాయాం యథా రజ్జ్వాం వికల్పో వినివర్తతే।
రజ్జురేవేతి చాద్వైతం తద్వదాత్మవినిశ్చయః॥ ౧౮

సత్యమైన రజ్జువుయొక్క నిశ్చయజ్ఞానము కలుగగనే మిగిలిన భ్రమలన్నియు తొలగిపోయి స్థిరమైనదియు, అద్వయ మైనదియు నగు రజ్జుజ్ఞానము మాత్రమే మిగులుచున్నది. అట్లే ఆత్మజ్ఞానము కలిగిన యీ మాయాకల్పిత జగత్తం తయు నశించి శుద్ధజ్ఞానరూపమగు ఆత్మయే మిగులుచున్నది.

రజ్జువునందు సర్పభ్రాంతి సత్యమైన రజ్జుజ్ఞానము లేనంతవఱకే యుంటున్నది. మనయందలి అజ్ఞానమునకు కారణమును వివరించి యాలోచించి, దానివెనుకనుండు సత్య

మైన రజ్జువును మనము కనుగొనిన వెంటనే యందున్న యారో
పములన్నియు ఒక్కసారిగా మాయమగుచున్నవి.

అదేవిధముగా ఆ ఆత్మజ్ఞానము కలిగినంతనే మంత్ర
దండము స్పృశించినదో యనునట్లు అందలి ఆరోపములన్నియు
అంతరించి మాయమగుచున్నవి. వివేకముతో విశ్లేషించి, మన
దృష్టిని విషయములనుండి మరల్చి, యటుపిమ్మట యీ దేహ
మనోబుద్ధులను దాటి అంతర్ముఖము చేసిన, మన చైతన్యము
తనయందే లగ్నమై తన్ను తాను తెలిసికొనుచున్నది. అట్టి
సమయమున జ్ఞానము స్వయంప్రకాశమగుచున్నది. ఇట్లే జీవ
జ్యోతియగు ఆత్మతత్త్వము సమస్తమైన జీవాత్మ భావనలకు
ఆధారమై మనయందే యున్నదని తెలియగానే మనము యీ
భ్రమలకు, భ్రమ జనిత జగత్తునకు కూడ వశులముగాము.

కా॥ ప్రాణాదిభిరనన్తైశ్చ భావైరేతైర్వికల్పితః ।
మాయైషా తస్య దేవస్య యయా సంమోహితః స్వయం॥ ౧౯

తన మాయచేత తానే సంమోహితమైనదో యనునట్లు
స్వయంప్రకాశమైన ఆత్మ అజ్ఞానముచేత ఆవృతము కాగానే
మనకు ప్రాణాదులే ఆత్మయని తోచుచున్నది.

అద్వైతులు తప్ప మిగిలిన యన్ని వేదాంతమతముల
వారును. జగత్సత్యవాదులే యగుచున్నారు. కావుననే ప్రతి
వేదాంతియు యీ సృష్టి యెట్లు, యెందుకు, ఎచటనుండి
కలిగినది యను విషయమును వివరింపవలసివచ్చెను. అందుచే
సృష్టిసిద్ధాంతములు, తద్దర్శనములు, ఆత్మజ్ఞానమునుపొందించు
పద్ధతులు లేకుండ, వేదాంతగ్రంథమేదియు ముగియుటలేదు.

ఆ యా మతభేదములను, వానియొక్క వివిధమైన వివరణలను చూపుటకై ఆ జగత్సృష్టివాదులయొక్క మతములు కొన్ని యిచట పేర్కొనబడుచున్నవి. వానిని యిచట పరిహాసించి పరాస్తము చేయుటకును, ఖండించి నిరాకరించుటకును యిట్లు వరుసగా సమకూర్చి గౌడపాదుడు పేర్కొనుచున్నాడు. ఆ పరమాత్మదృష్ట్యా యీ సృష్టి సిద్ధాంతములేవియు నిలువ జాలవు.

ఆ పరమాత్మ లేక ఆ పరబ్రహ్మ ప్రాణము, పురుషుడు ఇత్యాది నానారూపములను ధరించినదని ద్వైతులు భావించు చున్నారు. కొందరి మతప్రకారము "ఆత్మలోని చలనశక్తి యగు ప్రాణమను పదార్థముతో ఈ యచేతన ప్రపంచము సృష్టింపబడినదనియు, ఆ పరమాత్మయందలి చైతన్యతత్త్వ మైన పురుషుడే చేతనాత్మకమైన ప్రపంచమును సృష్టించె ననియు," సిద్ధాంతమై యున్నది. ఇట్లు ద్వైతులచే పరమాత్మ విషయకమైన యనేక భావనలు వెలువరింపబడినవి. ఆ పర మాత్మ తత్త్వమే మనసహజధర్మమనియు ఈ భావనలన్నియు భ్రాంతులమైన మనయొక్క భావనలు మాత్రమే యనియు వేదాంతులు జవాబిచ్చు చున్నారు.

ఉపనిషత్తులలో కూడ అనేక సృష్టిసిద్ధాంతములను గురించి చెప్పియుండుటను మనము వినియున్నాము. కొన్ని శ్రుతులలో పంచభూతములను పేర్కొనియున్న మరికొన్ని శ్రుతులలో మూడుభూతములనే పేర్కొనియున్నారు. బ్రహ్మ యందొక స్పందన కలిగిన దనియు, అది యిట్లు సృష్టిరూప ములో పరిణమించినదనియు మరికొన్ని శ్రుతులలో చెప్పబడి

యున్నది. మరికొంతమంది యీ సృష్టిహాఠాత్సంభవమని వివరించియున్నారు.

అయితే సృష్టియంతయు మాయయనియు, తత్పరిణామము అంతకంటె భ్రమయనియు నమ్మె వేదాంతమతమునకు వాస్తవములో యీ సృష్టిసిద్ధాంతములు ముఖ్యములే కావు. అయినను ప్రారంభదశలోనున్న సాధకునకు నీ దృశ్యమాన ప్రపంచమునకేదో యొక వివరణను చెప్పవలయును కదా! కావున యా సాధకుల మనస్తత్వము ప్రకారము ఏదో ఒక కారణము చెప్పబడుచుండెడిది. ప్రారంభదశయందున్న సాధకునకు ఈ జగత్తు సర్వథా సత్యమే యగుచున్నది. ఇట్లు కల్పితకారణమును చెప్పి తుట్టతుదకు ఉపనిషత్తులా సాధకుని పరబ్రహ్మ తత్త్వమునకు చేర్చుచున్నవి. అక్కడనుండి యాతడు చూచినపుడు ఈ నానాత్వవిశిష్ట ప్రపంచమంతయు మాయామాత్రమే యగుచున్నది. తన కాలమందు ప్రచారములోనున్న ముప్పదియైదు విధముల సృష్టిసిద్ధాంతములను రాబోవు శ్లోకములలో గౌడపాదుడు పేర్కొనుచున్నాడు. అవియన్నియు వేదాంత దృష్టిగలవి కావు. అందులో కొన్ని యా నాటి జనసామాన్యముల యొక్క విశ్వాసములై యుండినవి. వీనినన్నిటిని క్రమపఱచి వరుసగా పేర్కొనుటకుకూడ గౌడపాదుడు ఆగినట్లులేదు. తాను వ్రాయుటకు పూనుకొనినపుడు తనకెట్లు తోచిన యట్లు వ్రాసివేసెను. శ్లోకములోని ఛందస్సునకనుగుణముగా నుండుటకు యేయే మతముల పేర్లు సరిపోయిన ఆ యా మతములనే క్రమముగా పేర్కొనుటకు బహుశా యతడు తలచియుండును. దీనినిబట్టి

చూడ పరమద్రష్ట యగు గౌడపాదుడా మతముల విషయమై యెంత యుదాసీనుడో తెలియుచున్నది. నిజమే రజ్జువునందు చూచిన భ్రాంతసర్పమును గుఱించి చరిత్ర వ్రాయవలయుననిన యెవనికంత శ్రద్ధయుండును?

ఇట్లు యీ వివిధమత వివరణభాగములు అంతగా పరిగణింపదగినవి కాకపోవుటచేతనే శ్రీ శంకరులు కూడ వీనికి వ్యాఖ్యానము వ్రాయుటకు పూనుకొనలేదు. అనవసర భాగ ములకు వ్యాఖ్యానము వ్రాయకుండ దాటిపోవుట యాయనకు పరిపాటియే కదా. ఏది యెట్లున్నను నేటి విజ్ఞానవంతులకు అవియన్నియు కుతూహలమును కలిగించును కావున మనమిచట కొంచెము ఆగి వానిని కొంత పరిశీలింతము. ఇట్లు పరిశీలించు టచే ఈ వేదాంతము, కేవలము ఒక ధీశాలియొక్క మేధ యందు అప్పటికప్పుడు పుట్టి ప్రజాసామాన్యము యొక్క భావములద్వారా వ్యాపారమును కొనసాగించు సిద్ధాంతము మాత్రము కాదని మనకు తెలియగలదు. మరియు జీవిత మననేమి? దాని ముఖ్యోద్దేశమేమి యను విషయములను గుఱించి నిరాటంకముగా నిశ్చిత నిర్ణయములనుచేయు నుద్దేశ ముతో జీవిత సమస్యలను బాగుగా యోచించి, యోచించిన వానిని విశ్లేషించి, విశ్లేషించిన వానిని పరిశీలించుటకొఱకై తరతరములనుండి మహాధీశాలు రనేకులు తమ జీవితములను ధారపోసిరనికూడ మనకు తెలియగలదు.

కా॥ ప్రాణ ఇతి ప్రాణవిదో భూతానీతి చ తద్విదః ।
గుణ ఇతి గుణవిదస్తత్వానీతి చ తద్విదః ॥ ౨౦

ప్రాణవిదులు ఆ ఆత్మను ప్రాణమనుచున్నారు. పంచ భూతములను తెలిసికొనినవారు ఆ భూతములే ఆత్మయను చున్నారు. గుణవిదులు ఆత్మ గుణమనుచున్నారు. తత్త్వ విదులు ఆత్మ తత్త్వమనుచున్నారు.

పూర్వము చెప్పినట్లుగా గౌడపాదుడు ద్వైతులు వివ రించు నానాసృష్టి సిద్ధాంతములను ఇచట పేర్కొనుచున్నాడు. ఈ ద్వైత ప్రపంచమును వివరించు సిద్ధాంతములు మొత్తము ముప్పదియైదు కలవు.

ఈ నామరూపాత్మక జగత్తునకు వెనుకనున్న సత్య తత్త్వము "ప్రాణము" అని వైశేషికులు విశ్వసించుచున్నారు. ప్రాణమనగా మనము ముక్కు ద్వారా పీల్చు ప్రాణవాయువని యిచటి యర్థముకాదు. వేదాంతార్థము ప్రకారము సమిష్టి సూక్ష్మశరీరియగు హిరణ్యగర్భుడు (సృష్టికర్త) యిచట ప్రాణ పదముచే సూచింపబడుచున్నాడు. వేదాంతములో ఇతనిని "సూత్రాత్మ" అందురు. ఈ హిరణ్యగర్భుడే పరమాత్మ యని నమ్మువారు కొంతమంది కలరు. వారిని వేదాంతులు "హిరణ్యగర్భకులు" అని పేర్కొనుచున్నారు.

ప్రతిశ్లోకములోను నాలుగు మతములను సూచించుట గౌడపాదుని పద్ధతియై యున్నది. కావున ప్రతిశ్లోకార్థము లోను రెండు మతములును ప్రతిపాదములోను ఒక మతమును సూచించియున్నాడు.

ఇట్లు పూర్వార్థములోని రెండవ పాదములో చార్వాక మతము సూచింపబడియున్నది. పంచభూతములనుండి జగత్తు సృష్టింపబడినదని వీరిమతము. ఇట్టి ప్రత్యేకభౌతికవాదులు

"లోకాయతులు" అనబడుచున్నారు. కేవలము స్థూలవస్తువులనే గ్రహించునట్టి వీరు సూక్ష్మమగు ఆకాశమనున దొకటి యున్నదని కూడ యంగీకరించరు. వీరి మతసిద్ధాంతము మనకు చాల కుతూహలమును కలిగించును. వీరి మతప్రకారము ఈ ప్రపంచము పంచభూతముల నుండి కాక నాలుగుభూతముల నుండియే యుద్భవించినది యగుచున్నది.

త్రిగుణములనుండి యీ జగత్తు ఉద్భవించినదని "సాంఖ్యులు" నమ్ముచున్నారు. సత్వరజస్తమోగుణములు త్రిగుణములు. ఈ త్రిగుణములు సమానపాళ్ళలో నుండినప్పుడు అవ్యక్తమై మహద్రూపములోనుండు లయమే వీరి మత ప్రకారము "ప్రళయము" అగుచున్నది. ఈ మూడు గుణములలో ఏదేని హెచ్చుతగ్గులు వచ్చిన పేకముక్కల మేడవలె అది బహుధాభిన్నమై నామరూపాత్మకమైన ప్రపంచమగుచున్నది.

మరియొక మతమువారు శైవులు. వారు దక్షిణహిందూ దేశములో ఎక్కువగా ప్రభావము కలిగియుండిరి. వారు పరమాత్మ - ఆత్మ, అవిద్య, శివుడు–అను నీ మూడు తత్త్వములతో కూడియున్నదని నమ్ముచున్నారు.

కా॥ పాదా ఇతి పాదవిదో విషయా ఇతి తద్విదః।
లోకా ఇతి లోకవిదో దేవా ఇతి చ తద్విదః॥ ౨౧

ఆత్మయొక్క పాదములను తెలిసినవారు ఆ పాదములే ఆత్మయనుచున్నారు. ఇంద్రియములనెఱిగినవారు ఇంద్రియ

ములే ఆత్మయనుచున్నారు. లోకవిదులు లోకములే ఆత్మ యనుచున్నారు. దేవతలను తెలిసికొనినవారు ఆ దేవతలే ఆత్మ యనుచున్నారు.

ఓం ఉపాసనను వర్ణించినపుడు పాదములనుగూర్చి విపులముగా వివరించినాము. ఆ మూడు పాదముల కలయికను వీరు ఆత్మయను చున్నారు. అనగా జాగ్రత్స్వప్నసుషుప్త్యభిమానులగు విశ్వతైజసప్రాజ్ఞులతో కూడినది పరమాత్మ యని వీరి మతము.

వాత్స్యాయనాది మతములవారు శబ్దస్పర్శాది విషయ సుఖానందమే బ్రహ్మానందమని నమ్ముచున్నారు.

పౌరాణికులకు భూః, భువః, సువః అను మూడు లోకముల కలయికయే ఆత్మతత్త్వమగుచున్నది.

మీమాంసకులు కర్మకాండను నమ్మువారు. వారికి ఇంద్రాగ్ని మొదలైన దేవతలే శాశ్వత సత్యతత్త్వములు. వారి దేవతలను కర్మఫలప్రదులని భావించు చున్నారు.

కా॥ వేదా ఇతి వేదవిదో యజ్ఞా ఇతి చ తద్విదః।
భోక్తేతి చ భోక్తృవిదో భోజ్యమితి చ తద్విదః॥ ౨౨

వేదవిదులు వేదములే పరమాత్మ యనియు, యజ్ఞవిదులు యజ్ఞమే పరమాత్మయనియు, భోక్తృవిదులు భోక్తయే పరమాత్మయనియు, భోజ్యవిదులు భోజ్యమే పరమాత్మ యనియు విశ్వసించుచున్నారు.

తనకాలమందు ప్రబలియున్న మరి నాలుగు మతముల నిచట గౌడపాదుడు పేర్కొనుచున్నాడు. సమస్త ప్రపంచమునకు వేదములే సర్వాధారమని చెప్పు "వేదవిదులు" గలరు. మరియొక మతమువారు "బోధాయనులు." యజ్ఞములే ఆ పరతత్త్వమని వారు నమ్ముచున్నారు. భక్తిప్రపత్తులతో శాస్త్రోక్తముగా చేయబడిన యజ్ఞములే యీ భూతప్రపంచమునకు కారణమని వారి సిద్ధాంతము. ఇది వేదాంతము ప్రకారము సత్యము కాజాలదు. ఉద్దిష్ట దేవత, ఆహుతి, హోత యను మూడు భాగములుగలిగి పరిమిత విషయములతో కూడిన యజ్ఞము అపరిమిత, అనంత, సత్యతత్త్వమైన యీ పరమాత్మ నుండి యుద్భవించినది కాజాలదు. అందలి ప్రతియొక్క భాగము అనిత్యములైన వగుటచే, అనిత్యవస్తువులెంత పవిత్రమైనవైనను, ఆ నిత్యసత్యతత్త్వమును కలిగింపజాలవు.

సాంఖ్యులు ఆ ఆత్మను 'భోక్త' యనెదరు. ఆత్మ కర్త కాదు కాని భోక్తమాత్రమగుచున్నది. "ఆత్మభోక్తయగుచున్నాడు" అనుటచే యీ సాంఖ్యమతమే సూచింపబడినది.

"సూపకారు" లనబడు మరియొక మతమువారు గలరు. వారు "భోజ్యము–అనుభవింపబడునది" ఆత్మయనెదరు. ఇది "హోటలువానికి యచట పక్వము చేయబడు తినుబండారముల కంటె మరియొక దేవుడు లేడు!" అని చెప్పుటవలెయున్నది.

కా॥ సూక్ష్మ ఇతి సూక్ష్మవిదః స్థూల ఇతి చ తద్విదః।
మూర్త ఇతి మూర్తవిదో ఽ మూర్త ఇతి చ తద్విదః॥ ౨౩

సూక్ష్మవిదులు సూక్ష్మమే ఆత్మయనియు, స్థూల విదులు స్థూలమే ఆత్మయనియు, మూర్తవిదులు మూర్తియే ఆత్మయనియు, అమూర్తవిదులు అమూర్తియే ఆత్మయనియు భాషించుచున్నారు.

ఈ శ్లోకములో నైయాయికులనబడు తార్కికులు పేర్కొనబడుచున్నారు. ఆ పరమాత్మ జగద్రూపములో పరిణమించినదని వీరు నమ్ముచున్నారు. ఈ పరిణామము కూడ అణుపరిణామము, మధ్యమపరిణామము, విభుపరిణామము అని మూడువిధములు. ఆత్మయొక్క యాకారమును బట్టి ఇట్లు మూడువిధములుగా విభజించిరి. ఆ పరమాత్మ సూక్ష్మమై హృదయకుహరములోని యతిసూక్ష్మ ప్రదేశమును ఆవరించి యున్నదని వారి మతము. ఈ అణుపరిణామమునే 'సూక్ష్మము' అని శ్లోకములో సూచించియున్నారు.

"లోకాయతులని" వేరొకమతస్థులు కలరు. వారు స్థూలశరీరమే ఆత్మయని నమ్ముచున్నారు. ఇట్టి భౌతికవాదులు ఆత్మను గుఱించి వారు వారు చేసిన పరిగణనల ప్రకారము, మూడు విధములుగా నున్నారు. మనయొక్క శరీరమే ఆత్మ యని వాదించువారు దేహాత్మవాదులు. ఇంద్రియములే ఆత్మ యని వాదించు వారు ఇంద్రియాత్మవాదులు. మనస్సే ఆత్మ యని నమ్మువారు మన-ఆత్మవాదులు.

మరియు "ఆగమికులు" అను వారున్నారు. వారా పరమాత్మకొక నిర్ణీతరూపమును కల్పించుచున్నారు. త్రిశూల ధారియగు శివుడుగనో, చక్రధారియగు విష్ణువుగనో, మురళీ

ధరుడగు కృష్ణుడుగనో, కోదండధారి యగు రాముడుగనో, ఆ ఆత్మతత్త్వమునకు రూపము కల్పించి వారారాధించుచున్నారు.

ఇంక బౌద్ధులలో "శూన్యవాదులు" అను మరియొక తెగవారు గలరు. వారికి శూన్యమే పరమాత్మ. ఆ శూన్యము నుండియే యీ నామరూపాత్మక జగత్తు ఉద్భవించినది.

కా॥ కాల ఇతి కాలవిదో దిశ ఇతి చ తద్విదః।
వాదా ఇతి తద్విదో భువనానీతి తద్విదః ౨౪

కాలమే పరమాత్మ యని కాలవిదులును, దిక్కులే పరమాత్మ యని దిగ్వేదులును, వాదమే పరమాత్మ యని వాదవిదులును, భువనములే పరమాత్మ యని భువనవిదులును విశ్వసించుచున్నారు.

జ్యోతిష్కులు, ఖగోళశాస్త్రజ్ఞులుకూడ "శాశ్వతతత్త్వమగు కాలమునుండియే యీ జగత్తు ఉద్భవించి యందే స్థితిగలదై మరల 'యీకాలమునందే లయమగుచున్నదని" నమ్ముచున్నారు. ఈ మతమును ఖండించుటకు ఎవడును గొప్ప వేదాంతి కానక్కరలేదు. మన ప్రతియొక్కరి యనుభవములోను 'కాలము మార్పునకు కొలబద్ద" యని తెలియును. అట్టి మార్పుగల కాలము మార్పులేని నిత్యసత్యము కాజాలదు.

"స్వరోదయవాదులు" అని మరియొక మతము వారు కలరు. వీరు పక్షులయొక్క బల్లులయొక్క స్వరములనుబట్టి, భవిష్యత్తును చెప్పగల శకునశాస్త్రజ్ఞులు. వారా ధ్వనినిబట్టి,

ధ్వనివచ్చిన దిక్కునుబట్టి, ఏవోకొన్ని లెక్కలువేసి యొక విశేషమును తెలిసికొనుచున్నారు. దిక్కులే జగదాధారమని వీరి నమ్మకము.

"వాదవిదులు" అని మరియొక మతము వారు కలరు. వారువాదమే ఆత్మయనుచున్నారు. కొంతమంది యనువాద కులు వాదమునకు వాదన యని యర్థము చెప్పియున్నారు. కాని శాస్త్రదృష్ట్యా ఇది అసందర్భముగానున్నది. ఆనంద గిరి-ధాతువాదులు, మంత్రవాదులు, అని యర్థమును చెప్పి యున్నారు. వీరు ధాతు, మంత్రౌషధముల ద్వారా ఇంద్ర జాలము చేయువారు. అట్టివారి ఐంద్రజాలిక విద్యయే యిచట 'వాద' యను పదముయొక్క యర్థమై యున్నది. అట్టి ధాతు వాదులకు వారి విద్యయే యీ అస్థిరప్రపంచమునందు స్థిర తత్త్వమై యున్నది.

"భువనకోశవాదులు" అని మరియొక మతము వారు కలరు. పురాణములో చెప్పబడిన చతుర్దశభువనములే వారికి సత్యతత్త్వమై యున్నవి.

కా॥ మన ఇతి మనోవిదో బుద్ధిరితి చ తద్విదః ।
చిత్తమితి చిత్తవిదో ధర్మాధర్మౌ చ తద్విదః ॥ ౨౫

మనోవిదులు మనస్సే ఆత్మయనియు, బుద్ధివిదులు బుద్ధియే ఆత్మయనియు, చిత్తవిదులు చిత్తమే ఆత్మయనియు ధర్మాధర్మవిదులు ధర్మాధర్మములే ఆత్మయనియు నమ్ము చున్నారు.

ఈ శ్లోకములో సృష్టినిగుఱించి వివరించు మరి నాలుగు మతములు కలవు. అజ్ఞానములో రమించు వారి మతములు నిజముగా పరిహాసాస్పదములై యున్నవి.

మనస్సే ప్రపంచము మనస్సులేనియెడల ప్రపంచమే లేదు. కావున మనస్సే ప్రపంచమున కాధారమగు ఆ పరతత్త్వమని మనోవిదులు నమ్ముచున్నారు. మరికొందరు అనగా బౌద్ధులు విజ్ఞానమే బ్రహ్మ యని నమ్ముచున్నారు. సుషుప్తి యందు మనోబుద్ధులు లేని వగుచున్నవి కనుక వారి ఆత్మ తత్త్వము అప్పుడప్పుడు అస్తిత్వమునుండి సెలవు తీసుకొని పోవుచున్నదని వారు మఱచుచున్నారు!!

మరికొంతమంది బౌద్ధులు "యోగాచారులు" అనబడుచున్నారు. 'చిత్' యనునదే బ్రహ్మ యని వారి మతము. మనస్సుగ్రహించి, బుద్ధి వివేచించినను, ఈ 'చిత్' అనునది లేకపోయిన బుద్ధి వివేకించలేదు, మనస్సు గ్రహించలేదు. కావున ఈ 'చిత్' యనునదే ఆత్మతత్త్వమని వారి మతము.

ఇట్లే శ్లోకములో భౌతికవాదులైన మూడు మతముల వారిని గుఱించి చెప్పబడియున్నది. అంతఃకరణ యొక్క యే యే భాగములందు వారు తత్త్వము నారోపించుచున్నారో దానినిబట్టి వారి మతముల యందలి విశిష్టభేదము కలుగుచున్నది. ఒక మతమువారు సంకల్పవికల్పాత్మకమైన మనస్సునందు ఆత్మతత్త్వము నారోపించిన, మరియొకరు నిశ్చయాత్మకమగు బుద్ధియందు ఆత్మతత్త్వమును ఆరోపించుచున్నారు.

మూఁడవవారు ప్రకాశింపజేయు స్వభావముగల చిత్తమునందు ఆత్మతత్త్వమును ఆరోపించుచున్నారు. కాని జీవజ్యోతియగు చైతన్యతత్త్వము ఆ మనస్సునుండి వెడలిపోయినపుడు ఆ మనస్సు అచేతనమై జడమగుచున్నది. తెలిసికొనిన వాఁడెవ డును ఈ పై వాదములను అంగీకరించలేడు.

కట్టకడపటిదిగా యీ శ్లోకములో మీమాంసక మత మును గూర్చి చెప్పబడియున్నది. మీమాంసకులు ధర్మా ధర్మములు (పుణ్యాపాపములు) సమస్త జగత్తునకు ఆధారమని నమ్ముచున్నారు. పూర్వకర్మచేత సృష్టి, స్థితి, లయాత్మక మగు జగత్తు సృష్టింపబడినదనియు అట్లే వర్తమానమందలి మన కర్మలు భవిష్యత్తును నిర్ణయించుచున్నవనియు వారి మతము.

ఈ ధర్మముగాని యధర్మముగాని పరస్పరసంబంధము చేతనే అస్తిత్వము కలిగియున్నవి. కావున వారి ఆత్మతత్త్వము సదా వ్యతిరేక తత్త్వముపై ఆధారపడియుండును. అట్టి పరస్పర సాపేక్షకములగు నీ ద్వంద్వము లెన్నటికిని అద్వైత నిత్య తత్త్వము కాజాలవు. ఒకే రాజ్యమును ఇద్దరు పాలించుచున్న వారిద్దరిని రాజు లనలేము. ఒకడు మరియొకని రాజత్వమును పరిమితపఱచుచున్నాడు.

కా॥ పంచవింశక ఇత్యేకే షడ్వింశః ఇతి చాపరే ।
ఏకత్రింశక ఇత్యాహు రనన్త ఇతి చాపరే ॥ ౨౬

పంచవింశతితత్త్వములు గలది ఆత్మయని యొకరనిన షడ్వింశతత్త్వములు గలదే ఆత్మయని మరియొకరు అను

చున్నారు. మరికొందరు ఏకత్రింశక తత్త్వములు గలది ఆత్మ యనుచున్నారు. ఇంక కొందరు ఆత్మ అనంతతత్త్వము గలది యనుచున్నారు.

గణితమే ప్రధానముగాగల ఈ మతమువారి నందరిని ఏర్చికూర్చి తన శైలిలో నిముడ్చుటను బట్టియే గౌడపాదునకు వారిని గుఱించి యెంత అవహేళనాదృష్టిగలదో యిచట స్పష్టముగా మనకు తెలియుచున్నది.

పంచవింశతితత్త్వముల కలయికయే ఆ పరమాత్మ తత్త్వమని సాంఖ్యులు నమ్ముచున్నారు. వారి మతప్రకారము మూలప్రకృతి వికారమును పొందుచున్నది అట్లు వికారము చెంది మహత్తుగను, అహంకారముగను, పంచతన్మాత్రలు గాను మారుచున్నది. ఈ ఏడును ప్రకృతియొక్క 'సప్త వికృతులు' అనబడుచున్నవి. ఈ ఏడును మరికొంతమార్పును చెందుచున్నవి. మహత్తు పంచజ్ఞానేంద్రియము లగుచున్నది. అహంకారము పంచకర్మేంద్రియము లగుచున్నది. పంచ తన్మాత్రలు పంచేంద్రియ విషయము లగుచున్నవి. అనగా ఇంద్రియము లందలి సత్త్వభావము లగుచున్నవి. ఇవన్నియు చేరి మానవుని మనస్సగు చున్నవి. ఇట్లు మొత్తమువిూద పదహారు వికారములు కలుగుచున్నవి. మూలప్రకృతి, సప్త వికృతులు, షోడశవికారములు, పురుషుడు (పరమాత్మ) అన్నియు కలిపి పంచవింశతి తత్త్వములు. ఇవియే యీ జగత్తునకు ఆధారమని సాంఖ్యులు నమ్ముచున్నారు.

పతంజలి యోగశాస్త్రముప్రకారము పై పంచవింశతి తత్త్వములకు "ఈశ్వరతత్త్వము" అను మరొకదానిని కలిపి

ఇరువదియాఱు తత్త్వములు సృష్టికి ఆధారమని వారు నమ్ము చున్నారు.

"పాశుపతులు" అని మరియొక విధమైన మతస్థులు గలరు. వారు ముప్పదియొక్క తత్త్వములు సృష్టికారణ మనెదరు. కాని మనము వారి శాస్త్రగ్రంథములను సూక్ష్మ ముగా పరిశీలించిన ముప్పదియాఱు కూడ ఉన్నవనవచ్చును. అవి (1) శివ (2) సుఖ (3) సదాశివ (4) ఈశ్వర (5) విద్య (6) పురుష (7) మాయ (8) కాలము (9) నియతి (10) కలా (11) అవిద్య (12) రాగము (13) అవ్యక్తము (14) మహత్తు (15) అహంకారము (16) మనస్సు పంచజ్ఞానేంద్రియములు (21) పంచకర్మేంద్రియములు (26) పంచతన్మాత్రలు (31) పంచభూతములు-(36) కాల, నియతి, కలా, అవిద్య, రాగములను అయిదింటిని (అవి మాయను సూచించునవేకావున) విడిచిపెట్టిన 31 తత్త్వములే యగు చున్నవని బహుశా వారు చెప్పియుందురు. ఇంకను మరి కొందరు ఆ సత్యతత్త్వము అనంతతత్త్వ యుక్తమని నమ్ము వారున్నారు.

కా॥ లోకాంల్లోక విదః ప్రాహురాశ్రమా ఇతి తద్విదః ।
స్త్రీపుం నపుంసకం లైఙ్గః పరాపర మథాపరే ॥ ౨౭

ఇతరులను సంతోషపెట్టుటనేర్చిన "లౌకికులు" "సంతోషకవిద్య"యే పరమాత్మ యనుచున్నారు. ఆశ్ర మముల ననుసరించు ఆశ్రమవిదులు ఆశ్రమములే ఆత్మయను చున్నారు. వైయాకరణులకు స్త్రీపుంనపుంసక భేదముగల

లింగమే ఆత్మ యగుచున్నది. మరికొంతమంది పర–అపర ఉపాసనమే ఆత్మ యనుచున్నారు.

సంఘసేవకులు రాజకీయవేత్తలు మొదలైన 'లౌకికులు' వారి శక్తినంతయు లోకము నానందింపజేయు మానవసేవకే ఉపయోగించుచున్నారు కావున సమస్తజనులకు ఆనందమునిచ్చు మానవసేవయే ఆ ఆత్మతత్త్వమని వారు నమ్ముచున్నారు.

పురాణప్రసిద్ధులగు దక్షుడు మొదలైనవారు "ఆశ్రమ ధర్మములు" క్రియాత్మకమైన యీ జగత్తులో ప్రతియొక్కడును తనకు నిర్దిష్టమైన యాశ్రమములోనుండి ఆ యా యాశ్రమ ధర్మములను యథోక్తముగా నిర్వర్తించుటయే గణింపతగిన ఆత్మతత్త్వమని వారు విశ్వసించుచున్నారు.

"వైయాకరణులకు" స్త్రీ పుం నపుంసక రూప లింగమే తత్త్వమై యున్నది. వేదాంతమతములోనే మరియొక తెగ వారున్నారు. వారు "పరాబ్రహ్మ, అపరాబ్రహ్మ" యని బ్రహ్మతత్త్వమును రెండుగా విభజించియున్నారు. అపరా బ్రహ్మ జగద్రూపము నందినదనియు, పరాబ్రహ్మ తత్కారణమైనదనియు వారు నమ్ముచున్నారు.

శ్లో॥ సృష్టిరితి సృష్టివిదో లయ ఇతి చ తద్విదః।
స్థితిరితి స్థితివిదః సర్వే చేహ తు సర్వదా॥ ౨౮

సృష్టివిదులు సృష్టియే యాత్మయనియు, లయవిదులు లయమే ఆత్మయనియు, స్థితివిదులు స్థితియే ఆత్మయనియు, వాదించుచున్నారు. వాస్తవములో ఇవన్నియు ఆత్మయందు కలిగిన భావనా కల్పితములే యగుచున్నవి.

తన కాలమందు ప్రబలియున్న వివిధమతముల పట్టీని గౌడపాదుడీ శ్లోకముతో ముగించుచున్నాడు. పౌరాణికులు మూడువిధములుగా నున్నారు. "ప్రపంచము క్షణక్షణముగా నిరంతరము సృష్టింపబడుచున్నది." అను వారు సృష్టివిదులు. అట్లే ఈ ప్రపంచము క్షణక్షణము లయమందుచున్నదనువారు "లయవిదులు". మరియు యీ ప్రపంచము క్షణక్షణము స్థితిగలదనువారు "స్థితివిదులు." అని మూడు విధములుగా విభజింపబడిరి. ఇట్లు ముువ్వురు మూడు విధములుగా సృష్టిస్థితి లయములే ఆధారభూతమగు ఆత్మయనుచున్నారు.

కా॥ యం భావం దర్శయేద్యస్య తం భావం స తు పశ్యతి।
తం చావతి స భూత్వాఽసౌ తద్గ్రహః సముపైతి తం॥౨౯

తన గురువు చెప్పినదానినే యా యా సాధకుడు తెలిసికొని యనుసరించుచున్నాడు. ఆ యా సాధకునకు తత్తత్ భావానుగుణముగా ఆత్మ ఆయా రూపములో ప్రత్యక్షమగును. అట్టి భావమును గ్రహించి యాతడదియే తత్త్వమని దానిని పొందుచున్నాడు.

ఇట్లు సర్వవిధములగు సృష్టివాదులను, వారి మతములను పేర్కొని ఒక్కసారిగా వాటినన్నిటిని కలిపి గౌడపాదుడిచట భోగిమంటలో వేయుచున్నాడు. ఆత్మకు గుణ క్రియాదుల నంటగట్టు వివిధమతములును వివేకబుద్ధిచేత ఎగరకొట్టబడినవి. ఇట్టి కుక్కగొడుగువంటి మతములను కలిగి వానికై వారిలోవారు వాదోపవాదములు చేసికొనువారందరు మానసికతత్త్వమునకు సంబంధించిన అజ్ఞానమునకు ఆహుతులగుచున్నారు.

ఏ భావముగాని, వివరణగాని గురువుచే తత్త్వమని శిష్యునకు యేది చెప్పబడుచున్నదో దానినే ఆ శిష్యుడు ఏకతత్త్వమైన ఆత్మగా తెలిసికొనుచున్నాడు. అటుపిమ్మట ఆ దేవతాభావమందు తీవ్రకాంక్ష గలవాడగుచున్నాడు. ఇట్టి తీవ్రత వానిని యితరమత విషయమైన అభిప్రాయమును గాని, యితర తత్త్వమునుగాని తెలిసికోలేని యంధునిగాచేయు చున్నది. ఆ గురువు చెప్పినదానినే తత్త్వమని నమ్ముటయే గాక, దానినే విశ్వాసముతో అనుసరించి, అనేక సందర్భ ములయందా తత్త్వమును ఆత్మీయముగా అనుభవించు చున్నాడు.

ఇట్టివానికి ఉదాహరణ లీ లోకములో చాల యున్నవి. చరిత్ర యిట్టి సత్యసూచనలతో నిండియున్నది. వివిధ రకము లైన దేవతలను ప్రజలు నమ్మిన సమయముకూడ ఒకప్పుడు ఉండెడిది. ఆ యా దేవతలనే కాక వారి యుగములోని వివిధ ఆదర్శములను కూడ నమ్మినవారున్నారని చరిత్ర చెప్పుచున్నది. ఇప్పటికిని హిమాలయ ప్రాంతములోని దూరపుమూలలలో నుండు గ్రామములందు పురాణములలో పేర్కొనని గ్రామ దేవతల నారాధించువారు కలరు. ఆ దేవతలు బౌద్ధమతము నకు సంబంధించిన వారుకూడ కాదు. ఇప్పటికిని వారా గ్రామ దేవతలకు భయపడెదరు. మరియు వారు దృఢనమ్మకముతో ఇంద్రునిగాని సూర్యునిగాని తీవ్రముగా ప్రార్థించిన వారికి వానకాలమందు సూర్యుడును, క్షామకాలమందు వర్షమును కలుగుచునే యున్నవి !

మానవుడు హృదయపూర్వకముగా అనుసరించి, శక్తి సామర్థ్యములతోను శ్రద్ధాభక్తులతోను ఒక దానిని భావించిన తప్పక యట్టి మహత్తరఫలములను పొందగలడనుట యథార్థము. "నీవు భావించినట్లే నీవు అగుదువు" అనునది శాశ్వతమైన జీవిత ధర్మము.

సృష్టించుటకుగాని, నశింపజేయుటకుగాని ప్రతివానికిని సామర్థ్యము కలదు. యుక్తియుక్తమై శక్తివంతమైన మంచి భావములను భావించిన మనము తప్పక శాంత్యానందముల నిచ్చు తత్త్వమును పొందుచున్నాము. అట్లే మిథ్యాభావములను భావించిన అవియు ఫలవంతము లగుచున్నవి. కాని తత్ఫలితముగా మనము దుఃఖకరమగు ఫలమునే పొందవలసి వచ్చును.

ఇంతవరకు వివరించిన వివిధసిద్ధాంతములను ఇంతగా ఈ శ్లోకములో వివేకముతో పరిశీలించుటచూడగా ఆ మతము లన్నిటిని కేంద్రీకరించి ఒక్కసారిగా అంటించుటకు రగిల్చిన అగ్నికణమువలె యున్నదని చెప్పవచ్చును. మన మనస్సులోని యభిప్రాయముల ననుసరించి, ఆత్మయందా యా గుణముల నారోపించి, తదనుగుణముగా ఆ ఆత్మతత్త్వమును సమర్థింప ప్రయత్నించుచుందుము. వీధిలోనున్న కిల్లీ కొట్టులోని యద్దము నకు స్వయముగా ఎట్టి ప్రత్యేకమైన విశిష్టతయు లేదు. ఆ వీధిలో పోవు బండ్లను, ఆ కొట్టుపైకివచ్చు బేరగానిని కూడ ఒకే విధముగా ప్రతిఫలింపజేయును. దానిని చూచి ఓంద్రించు గాడిదను, మౌనముగా నడచు బట్టెగొడ్డును కూడ అది సమానముగానే ప్రతిఫలింపజేయును. అదేవిధముగా సమస్తము

నకును ఆ సత్యతత్త్వమగు ఆత్మయొక్కటియే ఆధారము. మనస్సు ఏ విధముగా భావించిన యట్టివానినే యందు తోపింపజేయును.

కాని ఇట్లు పరిపరివిధముల పరుగెత్తు మనస్సును అణచిన అతీత స్థితియందాత్మను దర్శించినపుడా తత్త్వముయొక్క సహజధర్మము అభివ్యక్తము కాగలదు. పవిత్రమై ఏకాగ్రము చేయబడిన మనస్సుద్వారా శ్రద్ధతో ఆత్మతత్త్వమును కను గొన ప్రయత్నించిన అచట ఆత్మయొక్క నైజతత్త్వము తెలియగలదు. మనమీ వస్తుభావనలనుండి విడివడిన కొలది యీ జ్ఞానము అధికాధికముగా ప్రతిష్ఠితమగుచున్నది. ఈ తత్త్వదృష్టి మనస్సుద్వారా కలుగునది కాదు కనుక మనస్సు లోని వాసనలేవియు అందుండవు. కావున యివి యేవియు ఆ తత్త్వమును వికారపఱచలేవు.

ఇదియే వేదాంతపద్ధతి యగుటచే, వేదాంతరీత్యా అద్వైతజ్ఞానము యీ వివాదముల కన్నిటికిని యతీతమై యున్నది. ఈ వివాదము సర్పమునందు రజ్జువును చూచుటకు ప్రయత్నించుట వంటిది యగుచున్నది. నామరూపాత్మక ప్రపంచమంతయు ఆత్మయందారోపితమైనదే యగుచున్నది. రజ్జువును రజ్జువుగా చూడవలెననిన మన భ్రాంతిని నశింపచేసి కొనవలెను. అదేవిధముగా ఆ ఆత్మతత్త్వము భ్రాంతిమూల మగు మన మనోబుద్ధులంతరించినంతనే తెలిసికొనబడుచున్నది కావుననే మహామేధావులైన జ్ఞానులు వేదాంత సిద్ధమైన ఆత్మానుభవము ననుభవించి, దానిప్రకారము ఆ ఆత్మయం

దీ జగత్తు లేనే లేదని వెల్లడించిరి. ప్రపంచసమస్యను పరిష్కరించుటకు పరమాత్మజ్ఞానమొక్కటియే మార్గమై యున్నది.

కా॥ ఏతై రేషోఽపృథగ్భావైః పృథగేవేతి లక్షితః।
ఏవం యో వేద తత్త్వేన కల్పయేత్సోఽవిశంకితః ౩౦

ఈ వస్తు ప్రపంచమునుండి ఆ ఆత్మ వేరైనట్లు కనబడుచున్నప్పటికిని వాస్తవములో అది వేరుకాదు. ఈ విషయమును బాగుగా తెలిసికొనినవాడు వేదములయొక్క యదార్థ భావమును నిస్సంశయముగా గ్రహించ గలుగుచున్నాడు.

ద్వైతులయొక్క వివిధమతములు వారి దృష్ట్యా అవి న్యాయసమ్మతములే యగుచున్నవి. కాని ఉపనిషత్తులు అద్వయమై, నిత్యసత్యమైన ఆత్మతత్త్వమునే ఏకగ్రీవముగా ప్రకటించుచున్నవి. అట్టి ఆత్మజ్ఞానమును పొందిన పరమ గురువులు ప్రపంచమందంతటను పర్యటించి, ఆత్మతత్త్వమును స్థిరపరచి, అందలి తమ యనుభవములను వెల్లడించిరి.

అట్లయిన "ఆ ఆత్మతత్త్వము బహుతత్త్వమూలకము అని తమలో తాము వాదించుకొను ద్వైతుల వాదనలకు కారణమేమి ?" అనిన గౌడపాదుడిట్లు వివరముగా ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు. ఆత్మ యీ ప్రపంచముకంటె వేరుగా తోచినను వాస్తవములో అది వేరైనది కాదు. ఈ ద్వైతులు సిద్ధాంతీకరించిన ప్రాణాదులు ఆత్మకంటె ఎద్విధముగాను భిన్నములు కావు. సర్పము రజ్జువుకంటె భిన్నముకాదు. కాని భ్రమలో మనమా సర్పమును భిన్నముగా చూచుటయేగాక తత్ భిన్నమైన రజ్జువును మనము వేరుగా చూచుటలేదు.

ఉన్నదంతయు ఆత్మ ఒక్కటే యను సత్యమును తెలిసికొనినవాడే మహాజ్ఞాని. అట్టివాడే వేదాంతమతము ననుసరించి ఉపనిషత్సిద్ధాంతములకు సరియైన అర్థమునుచెప్పి వివరింపగలుగుచున్నాడు. కేవలము బుద్ధిసామర్థ్యముచే తదర్థమును తెలిసికొనుటకు వచ్చిన యితరులందరకు ఈ యుపనిషత్తులు కేవలము శాస్త్రజ్ఞానమును మాత్ర మీయగలవు. కావున అట్టివారు జ్ఞానులవలె ఉపనిషదర్థమును అధికారపూర్వకముగా ఎన్నటికిని వివరింపలేరు. అనగా ఆ అద్వైతతత్త్వము ననుభవించినవారే వేదాంతమును ప్రతిపాదించు ఈ ఉపనిషద్గ్రంథములను వివరించి, తదర్థమును చర్చించి, విశదముగను, విశ్వాసము కలుగునట్లుగను బోధించగలరని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

కా॥ స్వప్నమాయా యథాదృష్టే గంధర్వనగరం యథా।
తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః॥ ౩౧

వేదాంతులు ఈ విశ్వమును స్వప్నమువలెను, గంధర్వనగరమువలెను మిథ్యగా చూచుచున్నారు.

ఇచట జగన్మిథ్యాత్వమును కారణముద్వారా గౌడపాదుడు వివరించుచున్నాడు. ఈ బాహ్యప్రపంచములో ప్రత్యక్షముగా మనము చూచు విషయములకు ఏదో ఒక వివరణ యుండవలయును కదా. ఈశ్లోకములో అట్టియొక వివరణ నిచ్చుటకే ప్రయత్నించుచున్నాడు. ప్రథమాధ్యాయములో జగన్మిథ్యాత్వము శాస్త్రప్రమాణముద్వారా నిరూపింపబడినది. ఈ అధ్యాయములో నిదివరకు ప్రతిజ్ఞచేసినట్లుగా ఆ జగన్మి

థ్యాత్వమును యుక్తిచేతను, హేతువాదములచేతను, వివేక విచక్షణలద్వారాను నిరూపించుచున్నాడు. ఈ ప్రపంచము మిథ్యయైన అజ్ఞానముచే గ్రహింపబడు ఈ ప్రపంచమిథ్యాత్వ మునకు ఒక వివరణ యుండవలెను.

మనము ప్రశాంతముగా కూర్చొని విస్పష్టముగానాలో చించునపుడు మానసికభ్రమలో చూచు పదార్థములు సత్యము కావని తెలిసికొనిన సందర్భములు మనజీవితములో ఎన్నియో కలవు. కావున యీ దృశ్యప్రపంచమునకు వేదాంతవివరణ యేమనగా యీ దృశ్యప్రపంచమంతయు మనమనోమాయా కల్పితమే యగుచున్నదని. ఇట్టి భావమును సాధకుని హృద యములో హత్తుకొనుటకుగాను ఇచట యుదాహరణలు చూపు చున్నాడు.

స్వప్నములో మనము సత్యాధారములేని యనేక యను భూతుల నందుచున్నాము. ఐనను స్వప్నమునుచూచుచున్నంత వఱకు అందలి యనుభవములన్నియు జాగ్రత్తువలెనే సత్యముగా తోచును. గారడీవాడు గారడీచేసి అసంభవములగు దృశ్యము లను చూపునపుడు, అది మంత్రగాని మాయ యని తెలిసి కూడ తాత్కాలికముగా అది సత్యమని నమ్మెదము. కొంత మంది ఆకాశమునందలి మేఘములను చూచినపుడు మేఘముల యాకారములనుబట్టి మేడలు, మిద్దెలు, మానవసంచారముగల గ్రామములు, అంగడివస్తువులు ఇత్యాది యనేక యాకారము లను అచట వారు భావించెదరు. దీనినే మనము గంధర్వనగర మని యందుము. ఇవన్నియు కేవలము ఊహామాత్రములే

యైనను, భ్రాంతుని దృష్ట్యా తాత్కాలికముగా ఆతనికవి సత్యమువలె భాసించును.

ఉపనిషత్తులలో సూచింపబడిన తత్త్వమును తెలిసికొనిన వారు అనగా ఆత్మజ్ఞానులు ఇట్టి నిర్ణయమునకే వచ్చిరి. దేహ మనోబుద్ధుల నధిగమించిన తరువాత వారు ఆత్మజ్ఞానమునందు చున్నారు. అట్టి ఆత్మజ్ఞానస్థితినుండి చూచిన ఈ నానాత్వ విశిష్ట ప్రపంచమంతయు లేనిదే యగుచున్నది. కావున జ్ఞాను లగు ఆ మహర్షులు ఆ పరమాత్మయందీ ప్రపంచము లేదని ఏకగ్రీవముగా ప్రకటించిరి. కాని యీ దేహమనోబుద్ధుల ద్వారా యీ ప్రపంచమునుచూచు మనము మాత్రము ఈ ప్రపంచమును సత్యముగానే గ్రహించుచున్నాము.

ఇట్లు సత్యమువలె తోచు ఈ ప్రపంచమునకు కారికా కారుడిచట యొకవివరణను ఇచ్చియున్నాడు. చూచినదంతయు సత్యమని నమ్మజాలము. ఈ దృశ్యప్రపంచమంతయు ఆ పర మాత్మయందారోపితమైనదే యగుచున్నది. శ్రద్ధావివేకము లతో చూచు సాధకునకుమాత్రము ఈ దృశ్యప్రపంచము భేద దృష్టికలిగించు మనోబుద్ధి సాధనలద్వారా చూచినపుడే అస్తిత్వము కలిగియున్నదనియు, అట్టి మనోబుద్ధు లంతరించిన ఆ ప్రపంచముకూడ లేనిదే యగుచున్నదనియు తెలియగలదు.

కా॥ న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో నచ సాధకః।
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా ౩-౨

ఉత్పత్తిగాని, లయముగానిలేదు. బంధముగాని, సాధ కుడుగాని, ముముక్షువుగాని, ముక్తుడుగాని లేరు. ఇదియే పరమ

సత్యము. వేదాంతమందలి ఇట్టి శ్లోకములయొక్క యథార్థ భావములను వివరించి బోధించుటకే సాధారణ సాధకునకు ఒక గురువు కావలసియున్నది. ముద్రణాలయములు ప్రబలిన యీ రోజులలో అట్టి వేదాంతగ్రంథములు దారిప్రక్కన, ప్రతిరైల్వే షాపులోను దొరకుచునే యున్నవి. నేటి విద్యావంతుడైన బుద్ధిశాలి యొకడు ఆ పుస్తకములలో నిట్టి శ్లోకములను చదివి నపుడు 'తానే ఆత్మతత్త్వమనియు, తాను చేయవలసిన కర్తవ్య ముగాని, తాను పొందవలసిన లక్ష్యముగాని యితరమైనది లేదనియు,' ఇత్యాది ఆత్మఘాతుక నిర్ణయములకు వచ్చు చున్నాడు.

మనమింకను అసంపూర్ణులమే. కావున మనము పొంద వలసినది చాలయున్నది. ఇటువంటప్పుడు మనము 'ఉండుట' అనునది "అగుట" యను దానిని ప్రతిఘటించునదిగా నున్న యెడల నది చాల ప్రమాదకరమైన భావమగుచున్నది. మనము మిక్కిలి యసంపూర్ణస్థితిలో ఉన్నాము. పరమ గురువుయొక్క ఆంతరిక జీవితమందు ప్రజ్వలించు తీవ్ర సమ యములలో ఇటువంటి శ్లోకములు వారి ముఖమునుండి బయలువెడలుచున్నవి. కావున స్వానుభవముతో రచింపబడిన యిట్టి శ్లోకములయొక్క భావమును గ్రహించవలెనని శిష్యుడు, వేదాంతమార్గములో నడచి యా బ్రహ్మానంద మును చవిచూచిన గురువులెవరైన నేడుండిన యట్టి గురువుల వద్దకు పోయి వారిని సేవించి వారిద్వారా ఆతడు ఆ శ్లోకముల నభ్యసించి వానియొక్క యథార్థభావమును తెలిసికొనవలెను.

గౌడపాదుడు మన యంతస్థుకు వచ్చి మనతో సమానముగా మాటలాడుట చాలా యరుదని మనము మరువరాదు. అతడు శిష్యుల అంతస్థుకు వచ్చుటకు నిరాకరించువాడును, విశేషించి తీక్ష్ణమైనవాడును, అగు గురువై యున్నాడు. అతని క్లాసురూము (తరగతి) పరిపూర్ణతా ప్రవాహముతో నిండియుండును. అతడు తన ఉపన్యాస శాలయందు ఎత్తైన వేదికపై నిలుచుండి, శ్రేష్టమైన తన యంతస్థుకు రమ్మని తన శిష్యులకు చేతితో సంజ్ఞచేసి పిలుచును. గౌడపాదుని గ్రంథము - ఆ తత్త్వమార్గము ననుసరించి, తత్త్వమును చేరుటకై తత్త్వమునుండి తత్త్వముయొక్క పిలుపై యున్నది. ఈ గ్రంథమంతయు ఆ తత్త్వమార్గమునే వివరించుచున్నది. మరియు ఆ మార్గము తత్త్వముయొక్క దేశమునకు సంబంధించిన భాషలోనే వర్ణింపబడియున్నది. కావున ఆ తత్త్వముయొక్క భాషను, ఈ మనఅజ్ఞానపు భాషను రెండింటిని తెలిసిన వ్యాఖ్యాతలయొక్క వ్యాఖ్యానము, వారి వివరణ లేకుండ ఎవ్వరును ఈ కారికలను సంపూర్ణముగా అర్థము చేసికొనలేరు.

ఆ ఆత్మతత్త్వము దృష్ట్వా యీ శ్లోకార్థము చాల యదార్థమైనది. ఆ పరమాత్మ తత్త్వమును చేరినవానికి ఉత్పత్తిగాని, లయముగాని, బంధముగాని లేదు. ఆ తత్త్వమును చేరినపిమ్మట సాధనగాని, సాధించు అభిలాషగాని, సాధించితిమని సంతృప్తిగాని యేదియు ఉండజాలదు. ఆ ముక్తి సామ్రాజ్యమునందు ప్రవేశించిన పిమ్మట యతడు యీ మాయా పరిధులను అధిగమించుచున్నాడు కావున అతని

కచట ఈమాయాసృష్ట ప్రపంచముగాని, దేహమనోబుద్ధులచే కోరబడు కోరికలుగాని ఏవియు నుండజాలవు. ఆత్మను తెలిసి కొని తానాత్మయే యగుటవలన అట్టి సర్వవ్యాపి దివ్యసత్య తత్త్వమగు ఆత్మయే తానగుచున్నాడు.

బద్ధుడను, ముక్తుడను అను జ్ఞానము అహంకారియగు జీవునికే గలవు. మనోబుద్ధులంతరించుటచే ఆ దివ్యమానవుని యందు జీవాత్మ వ్యక్తముకాదు. జీవశక్తి తమలో అభి వ్యక్తము కానియెడల కేవలము సాధనలు దేనిని సాధించలేవు. బల్బుయొక్క ఉదాహరణను తీసికొందము. విద్యుచ్ఛక్తి యందు ప్రసరించనిదే ఆ బల్బు దానంతట అది ప్రకాశించ లేదుకదా. అట్లే మనోబుద్ధులను సాధనలద్వారా ఆ జీవ తత్త్వము ప్రసరించిననే అవి జీవుడగుచున్నవి.

బద్ధుడను భావన జీవునిదే కావున ముక్తుడను అను భావనకూడ జీవునకే కలుగుచున్నది. ఆ పరమాత్మ దృష్ట్యా మనమందరమును సమస్త క్షణములయందును సదా ముక్తు లమే యగుచున్నాము. ఆత్మకు బంధకము లేదు. ఆ పర మాత్మకు సాధించవలసిన ముక్తిలేదు. అది సదా ముక్తమే యగుచున్నది. కాని ఆ ఆత్మకు భౌతికావరణ కలిగినప్పుడది తాను ప్రత్యేకజీవుడనని భావించుచున్నది. ఇట్టి భావనచేతనే తన్నుతాను బంధించుకొన్నదై తాను బద్ధుడనని, పరిమిత వ్యక్తిత్వము కలవాడనని భావించుకొనుచున్నది. ఇట్లు మనస్సే తన పరిస్థితిని సరిగా అర్థము చేసికొనకున్నది కావున భూతమువంటి జీవభావముతోనున్న ఈ మనస్సునకు ముక్తి యనెడి హోదాపు కావలసియున్నది.

ఇప్పటివరకు జరిగిన వాదములను బాగుగాను శ్రద్ధగాను అనుసరించిన యెడల వారెంత సంశయాళువులైనప్పటికిని, ఈ నామరూపాత్మక జగత్తంతయు రజ్జువునందు సర్పమారోపింపబడినట్లు, ఆ పరమాత్మయందారోపింపబడినదే యని తెలియగలదు. అట్లయిన ఈ నామరూపాత్మక జగత్తువలెనే దానికాధారభూతమగు ఆత్మకూడ ఎందుకసత్యమై యుండకూడదు ? అను సందేహము కలుగుచున్నది. అనగా నిచట ప్రతివాది ఆధారభూతమైనదే సత్యమా అని సందేహించుచున్నాడు. ఇట్టి సందేహమును నివారించుటకొఱకే గౌడపాదుడిచట, నిశ్చయముగను, నిష్కర్షగను "ఇదియే బ్రహ్మ - సత్యము" అని చెప్పుచున్నాడు.

ఆ తత్త్వము అసత్యమై, అస్ఫుటమైన యూహా మాత్రముకాదు. అది సమస్త భావనలకు అతీతము. సమస్త సాధకుల ప్రయత్నము, సమస్తసాధకుల లక్ష్యముకూడ యిట్టి యూహాగానముల నాలాపించు ఆ మనస్సు నంతమొందించుటయే యగుచున్నది. ఆ పరమాత్మను ఆవరించి, ఆ జ్ఞాన ప్రకాశమును చెదరజేయు నీ యూహలు, యోచనలు కూడ ఆ మనోబుద్ధులవలననే కలుగుచున్నవి వాని నధిగమించిన అట్లు తనను చంచలపఱచుటకు సాధనలగు ఆ మనోబుద్ధులు లేకపోవుటచేత ఆ యూహలు, భావనలు, అధ్యారోపములు మొదలైనవన్నియు కరిగి మాయమగుచున్నవి. అంత వెంటనే ఆ ఆత్మతత్త్వము ప్రస్ఫుటముగా ప్రత్యక్షమగుచున్నది,

కా॥ భావైరసద్భిరేవాఽయమద్వయేన చ కల్పితః ।
భావా అప్యద్వయే నైవ తస్మాదద్వయతా శివా ॥ 33

ఈ ఆత్మను అసత్యమైన వస్తుప్రపంచముగాను అద్వైత మైనదిగాను రెండువిధముల భావించుచున్నాము. ఈ వస్తువు లన్నియు ఆ అద్వైతమైన ఆత్మలోనే భావింపబడుచున్నవి కనుక ఆ అద్వైతమే అత్యంతము శివము అగుచున్నవి.

ఒక ప్రయాణికుడు ఎండమావులలోని నీటిలో చిఱు తరగలు, బుడగలు, తరంగములనుకూడ చూచుచున్నాడు. కాని అవి యేవియు సత్యమైనవి కావు. వానికన్నిటికిని ఆధార మైన, అడుగుననున్న ఎడారిమాత్రమే సత్యము. అట్లే మిథ్యా ప్రపంచమును గుఱించిన మనభావములు, 'బ్రహ్మ అద్వయం' అను వేదాంత నిర్ణయములు అన్నియు కేవలము భావనా కల్పి తములే యని గౌడపాదు డిచట చెప్పుచున్నాడు. వాస్త వములో ఆ పరమాత్మకు ఎట్టిగుణమును అంటగట్టలేము. ఆ పరమాత్మకు గుణములనంటగట్టి నిర్వచించిన యెడల ఆ పర మాత్మను పదార్థపుస్థాయికి దించిన వారమే యగుదుము. అనగా ఆ పరమాత్మను అశాశ్వత, పరిమిత, నశ్వర, చల తత్త్వముగా చేయుటయే యగుచున్నది. ఆ పరమాత్మను అద్వైతముగా నిర్వచించుట 'పరబ్రహ్మ పరిపూర్ణ తత్త్వమని' సూచించుటయే యగుచున్నది. ఈ ప్రపంచముతో పోల్చి నపుడు మాత్రమె ఆ పరమాత్మ అద్వైతము అనబడు చున్నది. ఆ పరమాత్మజ్ఞానము కలిగినంతనే అచట ద్వైత భావన యుండదు కాబట్టి యీ ద్వైతమే అసత్యమగుచున్నది. అటువంటప్పుడు తదపేక్షయా కలుగు అద్వైతము అను పద మునకు అస్తిత్వమే లేదు. ఆ పరమాత్మయే ద్వైతజ్ఞానము నకు, అద్వైతజ్ఞానమునకు రెండింటికిని ఆధారము. కావున

యీ రెండువిధముల జ్ఞానమును తెలియజేయునది ఆ శుద్ధ చైతన్యరూప జ్ఞానమొక్కటియే యగుచున్నది. మనలోని దివ్యజ్యోతి, జీవతత్త్వము అగు ఈ శుద్ధ చైతన్యమే, సర్వవ్యాపి యగు నిత్యసత్య పరమాత్మ తత్త్వమగుచున్నది. మనలో నున్న యిట్టి పరమాత్మను తెలిసికొనుటకు, ప్రపంచము వైపు సంచరించుచున్నమనస్సును ఉపసంహరించుకొని, అంతర్ముఖము చేయవలెను. మరియు ఈ తత్త్వమార్గము ననుసరించుటకు ముందుగా ఈ ప్రపంచమును తెలిసికొనుచున్న మన మనో బుద్ధులవెనుక ఏకమై, అద్వైతమైన బ్రహ్మతత్త్వ మున్నదని గ్రహించవలెను. ఇట్టి భావము మనకు కలుగగానే ఆ ఏకత్వ మును గ్రహించు మనస్సు మూడువంతులు మూలస్థానమును చేరుచున్నది. తన్నుతాను కనుగొనుటలో ఆ మనస్సు ఆవిరియై పోవుచున్నది. ఇట్లా మనస్సు అంతరించగానే ఆత్మానందాను భవము మాత్రమే మిగులుచున్నది.

కా॥ నాఽఽత్మభావేన నానేదం నస్వేనాపి కథంచన ।
నపృథఙ్నాపృథక్కించిత్ ఇతి తత్త్వవిదో విదుః ॥ ౩౪

ఈ నానాత్వవిశిష్ట ప్రపంచము పరమాత్మతో తాదాత్మ్యము పొందియు లేదు. పరమాత్మకంటె భిన్నము గాను లేదు. కావున ప్రపంచముయొక్క అస్తిత్వము పరమాత్మ కంటె భిన్నమైన స్వతంత్రరూపమని చెప్పలేము. లేదా ఆ పరమాత్మతో ఐక్యము పొందిన ఏకరూపమే అని కూడ చెప్పలేము అని తత్త్వవిదులు చెప్పుచున్నారు.

అసత్యమైన భ్రాంతసర్పము రజ్జువుకంటె భిన్నముగా నుండజాలదు. ఆ రజ్జువు సర్పము కాదు. ఆ సర్పము రజ్జువు కాదు. అయినను రజ్జువు లేకుండ సర్పము నిలువజాలదు. వాస్తవములో ఆ సర్పము రజ్జువేగాని మఱేదియు కాదు. అట్లే ఆ పరమాత్మకంటె యీ ప్రపంచము భిన్నము కాదు. అయినప్పటికిని ప్రపంచము సత్యము కాదు. ఆ పరమాత్మ యీ ప్రపంచము కాజాలదు. కాని ఆ పరమాత్మ యాధారములేక యీ ప్రపంచమునకు ప్రత్యేక అస్తిత్వము లేదు.

ఈ నానాత్వవిశిష్ట ప్రపంచమును సూచించుటకు "ఇదం" అను పదము చాల యుక్తముగా నున్నది. ఈ "ఇదం–ఇది" అను పదమునకు పర్యాయపదము లేదనియే చెప్పవచ్చును. కావున "ఇది" అను దానిచే తెలిసికొను జ్ఞానమంతయు విషయప్రపంచమునకు సంబంధించినదే యగుచున్నది. ఈ ప్రపంచము – విషయప్రపంచమనియు, ఆత్మీయ ప్రపంచమనియు రెండు విధములుగా విభజింపబడియున్నదని యిదివఱకే చెప్పియున్నాము. ఈ విషయప్రపంచమంతయు ఆ పరమాత్మయం దారోపితమే యనియు, ఆ సత్యతత్త్వ మొక్కటియే ఆత్మతత్త్వమనియు ఉపనిషదృషులు మాటిమాటికి మనకు చెప్పుచునేయున్నారు. కావున "ఇది, అది" అను పదములచే సూచింపబడి మనము గ్రహించునవన్నియు ఈ వస్తుప్రపంచమునకు సంబంధించినవే యగుచున్నవి.

దూరమున ఉన్న ఆ పర్వతములు, ఆ వనములు, ఆ నదులు మొదలైనవి మాత్రమే ఆ సత్యమని భావింపనవసరము లేదు. ఈ నా దేహము, ఈ నా మనోభావములు, ఈ నా బుద్ధి

లోని అజ్ఞానము అన్నియు ఈ వస్తుప్రపంచమునకు సంబంధించినవే యగుచున్నవి. ఒక్కొక్కసారి మనము బాహ్యవస్తువుల కంటె మన దేహమనోబుద్ధులు సత్యమని నమ్ముటకు అభిలషించెదము. అవి ఆత్మకు సమీపముగా నున్నట్లు తోచుచున్నవి కావున అట్లు నమ్మవలసి వచ్చుచున్నది. అయినను బాహ్యమై, భౌతికమైన యావరణ లేనట్టి శుద్ధ పరమాత్మను శ్రద్ధగా అన్వేషించి కనుగొనదలచు సాధకుడు ఈ మనోబుద్ధులనుకూడ వదలివేసి ఆ ఆత్మను కనుగొనవలెను. అట్టి ఆత్మజ్ఞానస్థితినుండి యీ ప్రపంచమును చూచిన సర్వత్ర ఆత్మ తప్ప మరి యే యితరపదార్థము అతనికి గోచరించదు.

ఈ ప్రతిపాదనను వినీ వినగానే ప్రతివాదును వాస్తవమని తప్పక నమ్మవలయుననెడి నిర్బంధమేమియు లేదు. మన మనస్సునందు ద్వైతభావన యెంతలోతుగా నాటుకొనిపోయినదో శ్రీ గౌడపాదునికి తెలియును. అంతియేగాక యీ మనోబుద్ధులతో చూచు మనము సర్వవ్యాపియైన ఆ నిత్యసత్య అద్వైతతత్త్వమును గ్రహించుట అంత సులభము కాదనికూడ యతడు సానుభూతితో తెలిసికొనుచున్నాడు.

కావుననే "అట్టి ఆత్మయందు ఈ జగత్తనునది లేనే లేదనియు అట్టి పరిపూర్ణ జ్ఞానస్థితిని పొందుటకు మానవునకు అవకాశము కలదనియు ఆత్మజ్ఞానులగు మహర్షులు మరల మరల నొక్కి వక్కాణించుచున్నారు. అని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

గౌడపాదుడు స్వయముగా జ్ఞానియై, ఆ ఆత్మజ్ఞానానుభవమును పొందియు "ఇట్లు తత్త్వవిదులు వక్కాణించు

చున్నారు " అనుచున్నాడేగాని యీ యనుభవము " తన స్వంతము" అని చెప్పుకొనకపోవుట నిజముగా గమనించతగిన విషయమే.

ప్రత్యేకవ్యక్తియొక్క స్వానుభవమని చెప్పినంత మాత్రమున ఎట్టి వేదాంతసిద్ధాంతము కూడ అందరికిని అంగీకారయోగ్యముకాదని యిదివఱకే చెప్పితిమి. అందుచే గౌడపాదుడు హిందూశాస్త్రగ్రంథముల సంప్రదాయము ననుసరించువాడై యీ యనుభవములు తనవి యని గాక గురుపరంపరాయాతమని పేర్కొనుచున్నాడు.

కా॥ వీతరాగ భయక్రోధై ర్మునిభిర్వేద పారగైః ।
నిర్వికల్పో హ్యాయం దృష్టః ప్రపంచోపశమోఽద్వయః॥ 35

రాగభయక్రోధాదులను విడిచిపెట్టి, వేదపారగులైనట్టి మహామునులచేత యీ ఆత్మ నిర్వికల్పమనియు, అద్వయ మనియు ప్రపంచరహితమనియు స్థిరపరుపబడినది.

ఇప్పుడు మనము తీసికొనిన గ్రంథము ప్రకరణగ్రంథము లేక ఉపదేశగ్రంథమైయున్నది. కావున ఇది ఆదర్శములను సిద్ధాంతములను సంపూర్ణముగాను విపులముగాను వివరించు శాస్త్రగ్రంథము కాదు. అయినప్పటికిని యీ గ్రంథ సంప్రదాయానుసారము. ఈ ప్రకరణగ్రంథములో సాధకునకు కావలసిన సాధనవిధానములను ఆ ఋషులు తప్పక వివరించవలసి వచ్చెను. మరియు భారతదేశమందు వేదాంతమనగా కేవలము అంధవిశ్వాసముతో కూడిన ఆధ్యాత్మికప్రచారము

మాత్రముకాదని యిదివరకెన్నియోసారులు చెప్పియున్నాము. ఆ వేదాంతులు చెప్పు విషయము లెంత గొప్పవై యుదార మైనవైనప్పటికిని అవి నిత్యజీవితములో ఉపయోగపడిననే గాని, వారు సూచించు ఆ మహత్తర లక్ష్యమును చేర్చు ఒక సాధనకూడ అందు చెప్పియుండిననేగాని ఆ సిద్ధాంతములను, వినిన దానిని యాచరణలోపెట్టు స్వభావముగల ఆర్యులు అంగీకరించరు. కావున ఆత్మపరిపూర్ణతనొందు పద్ధతిని వివరించకుండ హిందూ వేదాంతమేదియు సంపూర్ణము అగుటలేదు.

ఈ దృష్టితోనే భౌతికవాదులైన చార్వాకులమతము కూడ షణ్మతములలో ఒకటిగ పరిగణింపబడినది. వారు దేహమే ఆత్మయనియు, ఇంద్రియానందమే లక్ష్యమనియు కేవలము సిద్ధాంతీకరించుటయేకాక ఆ లక్ష్యమును చేరు సాధనను కూడ విపులముగా వివరించియున్నారు.

ప్రకరణగ్రంథ లక్షణమున కనుగుణముగా నిచట గౌడపాదుడు వేదాంత విద్యార్థులకు సాధనావిధానమును ఉపదేశించుచున్నాడు. ప్రతి యధ్యాయము విస్పష్టమై విపులమైన యుపదేశములతోనే సమాప్తినందుచున్నది. సాధకుడీ మాయాప్రపంచము నధిగమించి, ఆ అద్వైత బ్రహ్మతత్త్వమును తెలిసికొనుటకు వీలైన సాధనాపద్ధతిని యీ శ్లోకము లోను, రాబోవు మూడు శ్లోకములలోను కూడ విపులమై నిశ్చయాత్మకమైన రీతిలో వివరించియున్నాడు.

ఉపనిషత్తులలో సూచింపబడిన తత్త్వమును కనుగొనిన. తత్త్వవేత్తలయొక్క ప్రతిపాదనలను పూర్వశ్లోకములో చెప్పి

నాడు. అదే భావమును కొనసాగించువాడై గౌడపాదుడు ఆ మహర్షులు సూచించిన పరతత్త్వస్థితికి మనము కూడ చేరుటకు అనువగు మనోబుద్ధుల యభివృద్ధికి కావలసిన లక్షణముల నిచట వివరించుచున్నాడు. ఆ మహర్షులు జీవించిన ఆధ్యాత్మికమైన విలువలను ఇచట విపులముగా వివరించుచున్నాడు.

సనాతనులైన యీ ఆత్మజ్ఞానులు రాగభయక్రోధాదులు లేనివారు. ఆభ్యంతర జగత్తులోని వ్యతిరేకపు భావనలుగల మానసికతత్త్వమే మన యొక్క అజ్ఞానమునకు భ్రాంతికి చిహ్నమై యున్నది. మనలోని పశుత్వముయొక్క అంచనాప్రకారము ఆ క్షణమందు మనలోనున్న అజ్ఞానమును కొలవవచ్చును. వ్యతిరేకభావనారూపములోనున్న మనలోని అజ్ఞానము, మన మానసికవైజ్ఞానిక వ్యక్తిత్వముద్వారా రాగద్వేషాదిరూపములో అభివ్యక్తమగుచున్నది. మన అనురాగమే పాశవిక ప్రవృత్తులకు బీజమై యున్నది. "బాహ్యేంద్రియ విషయప్రపంచమే సత్యము" అను విశ్వాసము మనకు ఆ విషయములయందనురాగము కలుగునట్లు చేయుచున్నది.

ప్రపంచములో ఎవడును యింతవరకు తన క్రీనీడపై యనురక్తుడైనట్లు కనబడలేదు. అతనికి ఆ నీడ సత్యము కాదని తెలియును. అట్టి మన నీడవలెనే బాహ్యవిషయ ప్రపంచ మందలి వస్తువులన్నియు అసత్యములని మనము భావించిన మనకా విషయములందు వాంఛ గలుగదు. వాంఛలేనిచోట ద్వేషము ఉండజాలదు. అనురాగములోనే ద్వేషము వృద్ధి పొందుచున్నది. ద్వేషము క్రోధము అను నీ రెండును ఒక తెగకు చెందినవి. అనురాగమున్నచోట భయముకూడ

నుండును. ఉపనిషత్తులు పరమాత్మ యొక్కటియే నిర్భయ మైనది అను సత్యమును ఘోషపెట్టి చెప్పుచున్నవి. రెండవది యున్నచోటనే భయముకూడ ఉండును.

ప్రస్తుతము మనకు తెలిసిన నిర్భయస్థితి ఏకత్వానుభవముగల సుషుప్తిస్థితి మాత్రమే. మరియొకటి యున్నచోట భయమున్నది. కావున యిట్టి రాగ, భయ, క్రోధాదులను జయించుటయే సాధనను ప్రారంభించుట యగుచున్నది. మరియు నివి స్వయముగా సాధనాసాఫల్యము లగుచున్నవి. సాధారణముగా ఆధ్యాత్మికతా పరిపూర్ణతకు సాధనలని చెప్పబడిన ఉపవాస తపస్సులద్వారాను, సేవాభక్త్యాదులవలనను, ఈ తత్త్వమును పొందలేము. మనకు ఉపనిషత్తులయొక్క సరియైన భావము తెలిసిననేగాని పైనిచెప్పిన యీ సాధారణ సాధనలేవియు మనలో మూలకారణములై యున్న అజ్ఞానపు చిహ్నములను తొలగించలేవు. కావుననే యీ జ్ఞానులను "వేదపారగులు" అనుచున్నారు. (వేదపారగులు–వేదముల యొక్క పారమును పొందినవారు. సమగ్రముగా వేదార్థమును గ్రహించినవారు).

ఏ సాధకుడైనను జ్ఞానమార్గము ననుసరించుటకు సాహసించినయెడల, అతడు ప్రప్రథమముగా ఆ ఉపనిషత్తులను సమగ్రముగా చదివి సంపూర్ణముగా అర్థము చేసికొనవలెను. ఇదియే యీ శ్లోకములో సాధకులకొఱకై చేయబడిన పవిత్ర రహస్య సూచన.

ఉపనిషద్వాక్యములయొక్క యథార్థ భావమును గ్రహించి, గ్రహించినదానినిబాగుగా మననముచేసి, ధ్యానము

ద్వారా ఆంతరికమైన నిషిద్ధభావనలగు రాగద్వేషాదులను జయించవలెను. అట్లు జయించిన, శక్త్యనుసారముగా ఆతడు అణచరాని తన మనోభావనలపై విజయమును పొందు చున్నాడు. వాస్తవములో మిథ్యాభావనలే మన అపజయము నకు, మన భయమునకు కారణము లగుచున్నవి. ఇట్లు మన మానసిక సంకల్పములను జయించిన, మనస్సును జయిం చిన వారమగుచున్నాము. అట్టి మనోజయము నందినక్షణ ములో ఆత్మజ్ఞానము కలుగుచున్నది.

పూర్వశ్లోకములో ఈ మాయాప్రపంచమును సూచించు టకు 'ఇదం' అను పదము ఉపయోగింపబడినది. అట్టి విశిష్ట పదము వేదాంతవాఙ్మయములో నెంతటి పరిపూర్ణకళాసౌం దర్యము కలిగియున్నదో కూడ మనము తెలిసికొంటిమి. మహామేధావియొక్క కలమునుండి వెలువడి యాత్మను సూచించు పదము మరియొక టిచట గలదు. ఇచట ఆత్మను తెలుపుటకు 'ఆత్మ' అనుపదమునుగాక, ఆ పదముతో సమాన శక్తిసామర్థ్యములు, గాంభీర్యము గల 'అయం' అను పదమును గౌడపాదు డుపయోగించినాడు. 'అయం' అనుపదము ఆత్మను ఎట్లు సూచించుచున్నదో ఇదివరకే చర్చించి వివరించితిమి. ఆత్మయే మనకు ఆత్మీయమైనదగుటచే "అయం-ఇది" అను పదముచే సూచింపదగు దగ్గరవస్తువు మరేదియు లేదు. ఇట్టి ఆత్మీయమైన యా బ్రహ్మను దూరమును సూచించు 'అది' అను పదముతో సూచించవలెననిన, యీ బ్రహ్మకంటె దగ్గరదగు మరియొకవస్తువేదియు మనకు లేదు. కావున యీ బ్రహ్మను 'అయం' అని సూచించుట అతియుక్తముగానున్నది. మరియు

'ఇదం' అను పదము ఎదుటనున్నవస్తువును సూచించుచున్నది కావున మన యెదుటనున్న వస్తుప్రపంచమునకు సూచనగా దీనిని ఉపయోగించుట యుక్తమే యగుచున్నది. 'అయం' అను పదము అతిసన్నిహితమైనదానిని సూచించుటచే అది ఆత్మను సూచించుటకై యుక్తముగానే యుపయోగింపబడినది.

ఇట్లు కేంద్రమునకు కేంద్రమగు ఈ ఆత్మ దేహమనోబుద్ధులను సంపూర్ణముగా జయించినవానికే తెలియుచున్నది. ఏ తరమునందైనను జీవించు ఉత్కృష్టవీరులకే దేహమనోబుద్ధులపై విజయము సాధ్యమగుచున్నది. మౌంట్ ఎవరెస్టును జయించుటకు కావలసిన ధైర్యసాహసాదులకంటె వేయింతలు ధైర్యసాహసములు, పరిశ్రమ దీనికవసరమై యున్నది. దీనితో పోల్చిన త్రిలోకాధిపత్యమునకై పోట్లాడు పోరాటము కూడ బాలకేళియే యగుచున్నది. అయితే యిట్టి మహాబలవత్తరములగు మనోబుద్ధులను జయించుటవలన యెట్టి ఫలము కలుగ గలదని ముఖ్యముగా సంశయాత్ములకు ఒక సంశయము కలుగ గలదు. ఈ శ్లోకములో చెప్పిన, ఆత్మయొక్క విశేషణముల ద్వారా యీ సందేహమును నివారించుచున్నాడు.

ఆత్మకు 'ప్రపంచోపశమం' అని విశేషణమును చెప్పియున్నాడు. అనగా యీ నానాత్వవిశిష్టప్రపంచము అందు లేదని యర్థము. ఎచటకు మన కన్నీరు ప్రవహించలేదో, ఎచట మన దుఃఖములు ఆ బ్రహ్మానందమును కలతనొందించలేవో అట్టిస్థితియే యుపనిషత్తులు సూచించు లక్ష్యమై యున్నది. ఇట్లు ఆత్మతత్త్వమును తెలిసికొనిన తరువాత

ఒకడు తనకు తానే భ్రాంతుడై యనుభవించు బాధాకరమైన జీవితదుఃఖములనెడు బంధములను త్రెంపుకొని పరిమిత మర్త్యత్వమునుండి విడిపించుకొనుచున్నాడు. అంతట అతడు నిత్యముక్త బ్రహ్మతత్త్వమును చేరుచున్నాడు. ఆ అద్వైత సామ్రాజ్యములో ఈ నానాత్వవిశిష్టప్రపంచము ఉండదు. కావున ఆ ఆత్మ "ఏకమేవాఽద్వయం బ్రహ్మ" అగుచున్నది.

కా॥ తస్మాదేవం విదిత్వైనం అద్వైతే యోజయేత్స్మృతిం।
అద్వైతం సమనుప్రాప్య జడవల్లోక మాచరేత్ ॥ ౩౬

కావున ఇట్టి బ్రహ్మను తెలిసికొని, ఆ అద్వైతబ్రహ్మ తత్త్వమందే మనస్సును లగ్నము చేయవలెను. అట్లు చేసిన పిమ్మట యీ లోకమందు జడునివలె సంచరించవలెను.

'తస్మాత్—కాబట్టి' అను పదము ద్వారా పూర్వ శ్లోకమునకును ఈ శ్లోకమునకును గల సంబంధము స్పష్టమగు చున్నది. పూర్వశ్లోకములో చెప్పిన భావమునే యిచట ముగించుచున్నాడు. "వేదపారగులైన యీ మహర్షులట్లు మనోబుద్ధుల నధిగమించి యీ పరతత్త్వమునందు ప్రతిష్ఠితు లైరి. 'కావున' సాధకులుకూడ అట్లే వారి యుపనిషత్తులను శాస్త్రోక్తముగా చదివి, వివేకముతో పరిశీలించి, మనోబుద్ధులను పవిత్రము చేసికొని, తద్ద్వారా ఆ యతీత స్థితిని పొంద వలెను.

ఇట్టి మహత్తర భావనలను మనన నిధి ధ్యాసల ద్వారా బాగుగా జీర్ణించుకొనిన ధ్యానియొక్క మనస్సు రాగద్వేషా దుల నుండి విముక్తి నొందుచున్నది. అట్టి క్షణముననే అతడు

ఆత్మానందము ననుభవించుచున్నాడు" అని యిచట తాత్ప ర్యమై యున్నది. జ్ఞానమార్గము ననుసరించువారికి శాస్త్ర జ్ఞానమెంత ప్రధానమో యీ శ్లోకములో వివరింపబడినది. మతశాస్త్రాదులను తెలియనివాడు జ్ఞానమార్గమును విశ్వాస ముతో అనుసరించలేడు. శ్రీ శంకరులు, ఇతర మహర్షులు, మరియు అనేకమంది యీ శాస్త్రజ్ఞానము మిక్కిలి ప్రధాన మని దాని ప్రాధాన్యమును దృఢపఱచి చెప్పిరి. మరియు వారిలో చాలమంది శాస్త్రాభ్యాసము మాత్రమే జ్ఞానమార్గము ననుసరించి లక్ష్యమును చేరుటకు యుక్తమైన ప్రయత్న మనియు తలంచుచున్నారు.

"ఇట్లా ఆత్మతత్త్వమును శాస్త్రజ్ఞానముద్వారా, వివే కముద్వారా తెలిసికొని నీ మనస్సును ఆ అద్వైతతత్త్వ మందు నెలకొల్పుము. అట్టి అద్వైతబ్రహ్మతత్త్వమును గుఱించి వినుము. వినినదానిని మననము చేయుము. అట్లు మననము చేయుకొలది "యీ నామరూపాత్మకప్రపంచము వెనుక అద్వయమై, నిత్యసత్యమైన బ్రహ్మతత్త్వమొకటి యుండుట యదార్థము" అని నీకు నమ్మకము కలుగుచున్నది. జ్ఞానముద్వారా యిట్టి నమ్మకము కుదిరిన, నీ దేహమును మనస్సునుకూడ యట్టి విశ్వాసమున కనుగుణముగా సరిదిద్దు కొని జీవింపుము." అని యీ శ్లోకార్థము హెచ్చరించు చున్నది.

ఈ శ్లోకములోని యుత్తరార్థమునకు సాధారణముగా చాలమంది వాచ్యార్థమునే గ్రహించుచున్నారు. మరియు కొంతమంది పండితులీ శ్లోకార్థమునకు అపవ్యాఖ్యానముకూడ

చేసియున్నారు. వారి వ్యాఖ్యానము "ఆత్మజ్ఞానము పొందిన పిమ్మట ఆ వ్యక్తి యొక్క శిలావిగ్రహమువలె యుండవలె ననియు, అట్టివానికి తన తరమువారిపై సానుభూతిగాని, తన సాటి మానవులకు మార్గదర్శకముగా నుండునట్టి కోర్కెలుగాని హక్కులుగాని లేవనియు, అతడు జడీభూతుడై యుండవలయు ననియు గౌడపాదుడు చెప్పుచున్నాడు" అని యీ పండితుల వ్యాఖ్యానమై యున్నది.

పరిపూర్ణతనందిన నిజమైన గురువులు నిస్సంగులై ప్రపంచములోనికి వచ్చి తమ భక్తకోటికి ఆ యుపనిషత్తుల యధార్థభావమును తమ ఆత్మజ్ఞానముతో బోధించుట యీ పండితులకు ప్రతికూలమై యున్నది కావున వారీ శ్లోకములకు ఇట్టి అపార్థమును అంటగట్టుచున్నారు. సామాన్యజనులకిట్లు ఆ పరమగురువులు బోధించుటచే, వారా శాస్త్రములయొక్క యధార్థజ్ఞానమును పొంది తద్వారా మతమును సంపూర్ణముగా తెలిసికొనినయెడల, వారికి అవిద్య నశించుచున్నది. అవిద్యావంతులయొక్క అంధవిశ్వాసముతో వ్యాపారముచేసి లాభమును పొందదలచు స్వార్థపరులైన పండితులు తమకిక యెట్టి లాభమును కలుగ బోదను భీతిచే యీ యుపనిషత్తుల శ్లోకములకు బహుశా యిట్టి యసందర్భపు వ్యాఖ్యానములు కల్పించి యుందురు.

వాస్తవములో అట్టి మహాత్ములు మన యీ సంస్కృతికి చేసిన సేవాసంఘటనలతోనే చరిత్ర నిండియున్నది. చరిత్రను తఱచి చూచుకొలది ప్రపంచ సంస్కృతి యొక్క యభివృద్ధి యంతయు ఆధ్యాత్మిక తత్త్వవేత్తలగు ఆ మహాత్ములచేతనే

దని మనకు తెలియగలదు. ఈ మహాత్ము లుపదేశించిన జీవితపు విలువలను, మహత్తర సత్యములను ప్రపంచమునుండి తీసివేసిన, మూర్ఖులై, అనాగరికులై, పాశవికప్రవృత్తులు గలిగి పరస్పరము పోరాడుకొనుచు, పోటీలతోను, నైచ్యముతోను నిండిన అధ్వాన్నమైన మానవసంఘమే మనకు మిగులుచున్నది.

మరి "జడునివలె యాచరింపుము" అని చెప్పుటలో ఆ మహర్షి యొక్క యభిప్రాయమేమి ? "ప్రపంచములోని శోచనీయసమస్యలను అబలవలె భావోద్వేగము కలవాడవై నీరసదృష్టితో చూడకుము, మరియు పురుషునివలె తాత్త్వికమైన వేదాంతమును కేవలము ఆవేశముతో చేపట్టకుము" అనియే ఇచటి భావము. అద్వైత జ్ఞానమందిన యట్టి మహాత్ముడు – సుఖదుఃఖములందు సముడై, వాని కారణములను వివేకముతో వివేచించి, విరక్తుడై, శాంత్యానందములుగలుగు సమాధిస్థితిని పొందుచున్నాడనియే భావము. కావుననే యతడు అధికారపూర్వకముగను, శక్తిసామర్థ్యములతోను, దృఢవిశ్వాసముతోను, ప్రపంచములోని ప్రధానలోపములను, వానికిగల ఆధ్యాత్మిక చికిత్సలను ప్రకటించుచున్నాడు. మరియు, అట్టి పరిపూర్ణమానవుడు ఆధ్యాత్మికబలమునకు శక్తి కేంద్రమై యున్నాడు. వాస్తవములో అతనికి అసాధ్యమైన కార్యమేదియు ఈ ప్రపంచములో లేదు. అట్టివాడు రసావిష్టుడైనను, భావప్రేరితుడైనను తనతరమువారి ప్రారబ్ధమును సరిదిద్దు విశ్వప్రణాళికాచక్రమునకు తాను మరియొక ఆకును వేయువాడే యగుచున్నాడు.

ఒకడు పూర్తిగా రసావిష్టుడైన యతని హృదయము అతి శీఘ్రములోనే ఉబ్బిపోయి పెరిగిపోవును. అట్టి ఉబ్బి వ్యాప్తమైన హృదయము ఎంత ప్రమాదకరమో ఎవరికి తెలియును!! తన స్వరూపమునకే ఉపద్రవము కలిగించునట్టి హృదయముయొక్క యీ పొంగు వివేకమును అణిచిపెట్టివేయును!! కావున యిట్టి అధికవృద్ధి పరిపూర్ణమానవుని సౌందర్యమును చెఱచి యాతనిని విరూపునిగా చేయుచున్నది. "పరిపూర్ణతనందిన సాధకుడు ఉబ్బిపోయిన హృదయముతో ప్రపంచములో మునిగిపోకూడదు" అని యీ పరమగురువు నొక్కి వక్కాణించుచున్నాడు. ఇచట జడభరతుని యుదాహరణ చక్కగా సరిపోవుచున్నది. పరిపూర్ణతనందియు అతడు హరిణశాబకము మీది కరుణచే హృదయము ఉప్పొంగినవాడై మనస్సును ప్రపంచములోనికి వ్యాప్తముచేసి అందే మునిగిపోయినాడు!!

మరియు ఆలంకారికముగా "జడము" అను పదమునకు అర్థము సమన్వయించిచూచిన మిక్కిలి జడమైన పదార్థములే మానవునకు అనుగ్రహరూపము లగుచున్నవి. దేశములోని వనపర్వతాదులు, ఎడారులు, మైదానములు భూమికి చాల ఉపయోగకరమైనవని భూగోళశాస్త్రప్రకారము మనకు తెలియును. అత్యంత అచేతన పదార్థములై యవి నిరుపయోగమైనటుల కనబడుచున్నప్పటికిని మౌనముతో ఈ మానవజాతిని నిరంతరము అనుగ్రహించుచునే యున్నవి.

అట్లే జ్ఞానియైన దివ్యమానవుడుకూడ ఉదాసీనుడై జడునివలె మౌనముగా యుండవలయును కాని తన యాశయములను బలవంతముగా ప్రజలపై రుద్ది తద్వారా అంతర్జా

తీయ, జాతీయ, సాంఘిక విప్లవాదులను రేకెత్తించరాదు. నిరుపయోగమై జరిగిపోవుచుండు చారిత్రక సంఘటనలలోను, తాత్కాలికమైన సంవాదములలోను, అతడు తన పవిత్రమైన శక్తిని వెచ్చించి వ్యర్థపుచ్చకూడదు. దానికి బదులు దివ్య తత్త్వమునంది, ఆధ్యాత్మికతా పరిపూర్ణులైన యీ మహాత్ములు - జీవితమున కాధారమైన యీ పరతత్త్వమును ప్రకటించి, నాయకులై, మార్గదర్శకులై, తన తరమువారికా సాంస్కృతిక పరిణామమునుగూర్చి మృదువుగా నచ్చచెప్పి, తత్ఫలితముగా ఆధ్యాత్మికాభివృద్ధిని తీసుకొనిరా ప్రయత్నించవలెను.

కా॥ నిస్తుతిర్నిర్నమస్కారో నిఃస్వధాకార ఏవచ।
చలాచలనికేతశ్చ యతిర్యాదృచ్ఛికో భవేత్॥ 32

యతియైనవాడు స్తుతులకు నమస్కారములకు వశుడు కాకూడదు. వైదికమైన అవైదికమైన కర్మకాండలో తగుల్కొనకూడదు. తన దేహమునకు కేవలము ఆత్మయే అధారముగా గలిగి యుండవలెను. ఆకలిదప్పులకు యథాలాభముగా పొందినవానితో సంతృప్తి పడుచుకొని దేహరక్షణ చేసుకొనవలెను.

పరిపూర్ణమానవుడు ఈ విధముగా తన లక్ష్యమగు ఆ పరమాత్మ తత్త్వమును పొంది, యట్టి యున్నతదృష్టితో మానవసేవ చేయుచున్నవాడై తన విశ్వాసములందు దృఢముగాను స్థిరముగాను జీవించవలెను. అట్టి మహాజ్ఞానిపై కరుణ లేని సంఘములో ఆ మహాత్ముడెట్లు జీవించవలెను ? ఆ విష

యమునే సూచించువాడై "యిట్టి పరిపూర్ణమానవుడు శాంతి మరణములో తన దేహము అంతమొందువఱకు సంపూర్ణ వైరాగ్యముతో జీవించవలెను" అని చెప్పుచున్నాడు. ఈ శ్లోకము వేదాంత వాఙ్మయము నందంతటను సాటిలేనిదై యున్నది. ఇదే భావము ప్రతియుపనిషత్తులోను పదేపదే యనేకసార్లు పునరుక్తమై యున్నది.

ఒక వ్యక్తి తన కాలపు సంఘమునుండి స్తుతులను, నమస్కారములను కోరునపుడే అది యుపచరింపబడుచున్నది. కాని యెప్పుడైతే యొక డీ రెండింటిని త్యజించుచున్నాడో అప్పుడతడు తన సంఘమూ సత్యపథమునుండి జారిపడునప్పుడెల్ల దానిని ధైర్యముగాను గౌరవముతోను స్వేచ్ఛగా సేవింప గలుగుచున్నాడు. ఉదాహరణకు, ఒక రాజకీయవాది ఎన్ని కలకై నిలువబడినాడనుకొందుము. తన వినిర్మల విస్పష్టబుద్ధికి ఒక విషయము ఎంత అసందర్భముగాతోచినను, ప్రజలయొక్క యిచ్ఛకు వ్యతిరేకముగా నడువలేడుకదా! తన సభికులను తగినంతవఱకు అతడు సంతృప్తిపఱచవలెను. ఇట్లు అతడు తన యుగమునకు బానిసయై పోవుచున్నాడు. కాని పరిపూర్ణ మానవుడు ఎల్లప్పుడు తాను స్వేచ్ఛాబాలుడే యగుచున్నాడు. సరియైన కోర్కెలను కోరమని యతడు తన సభికులకు బోధించు చున్నాడు. అతడట్లు చేయుటచేత జీవముతో బందీకృతుడై కొరతవేయబడుచున్నాడు. మహాత్మునివలె జీవించి యాతడు మహాత్ముని వలెనే మృత్యువు నెదుర్కొనుచున్నాడు. అటు పిమ్మట అందరును అతనిని పరమ గురువుగా అంగీకరించు చున్నారు.

ఆ జ్ఞానికి సర్వకర్మలు సాఫల్యమునందుటచేత ఆతడు చేయవలసిన నిత్యనైమిత్తిక కర్మలేవియు ఉండవు. ఎం. ఏ క్లాసులోని విద్యార్థి ప్రతిదినము ఎక్కములను వల్లెవేయ నక్కరలేదుకదా. మనస్సును ఏకాగ్రముచేయుటకు కర్మ కాండ శిక్షణాలయమై యున్నది. మహాజ్ఞాని మనస్సునుకూడ అధిగమించుచున్నాడు. అట్టి వానికి మనస్సే లేనప్పుడు శిక్షణనిచ్చు కర్మకాండయొక్క యావశ్యకత యేమున్నది ? వాస్తవములో అతడు కర్మలను చేయుటకూడ మిక్కిలి యసం భావ్యము వేదాంత ధర్మము చెప్పుచున్నది.

అయితే అట్టివానికి శరీరవిషయమై యెట్టిభావము ఉండవలయును ? శరీరమున్నంతవఱకు వాసగ్రాసవసనాదులు కావలయును కదా ? తాను జ్ఞానియై, తనకు చేయవలసిన విధు లేవియు లేనిచో ఆశించుటకు హక్కులుకూడ అతనికి లేవు కదా ? హక్కులు లేనప్పుడు ఆ స్థితికూడ ఉండదు. దేశము యొక్క ధర్మశాసనము ఆతనిని దేశములో నివసించు జీవిగా పరిగణింపవలసినపని లేదు. అట్టివానిని జనాభాలెక్కలోకూడ వేయనవసరములేదు. అట్లు లెక్కలో వేసినను అతడు మన దేశములో ఒక నిష్ప్రయోజకుడుగాను, నిరక్షర కుక్షిగాను పరిగణింపబడుచున్నాడు !

పైవానికి ప్రత్యుత్తరముగా శాస్త్రమిట్లు చెప్పు చున్నది. అట్టి మహాజ్ఞానికి ఆత్మయే దేహమునకు రక్షణముగా నున్నది. చలమైన ఈ దేహము అచలమైన యీ ఆత్మకు నివాసస్థానమై యున్నది. కావున జ్ఞాని నశ్వరమగు తన దేహ మనోబుద్ధులనే ఆత్మరక్షణార్థము ఉపయోగించు

కొనుచున్నాడు. ఇట్లు నివాసము సూచించడమైనది. ఇక భోజన వసనాదులెట్లు? అట్టిజ్ఞాని భోజనవసనాదులకై యదృచ్ఛా లాభముగా వచ్చినవానిపై యాధారపడియుండును. అతడు స్వయముగా కోరడు. అవకాశము కలిగినపుడు అనుభవించును. యతి యనగా ఆధ్యాత్మిక సాధనలను చేయువాడు అని అర్థము. కేవలము ఆత్మజ్ఞానియే కాదు, ఒక సాధకుడు కూడ. ఆట్లు తాను అడుగకుండ, ఆశించకుండ యాదృచ్ఛికముగా వచ్చు అవకాశముల పైననే యాధారపడియుండవలెనని యీ శ్లోకార్థము చెప్పుచున్నది. అట్టివారికి అనంతమైన కోరికలు, అకాంక్షలు ఉండకూడదు.

కా॥ తత్త్వమాధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వాతు బాహ్యతః।
తత్త్వీభూతస్తదారామః తత్త్వాదప్రచ్యుతో భవేత్॥ ౩౮

ఆ తత్త్వమును ఆంతరికముగా దేహాభ్యంతరమందును, బాహ్యావిషయప్రపంచమును చూచినవాడు ఆ తత్త్వముతో ఐక్యము పొందుచున్నాడు. అంత తత్త్వమందే రమించుచున్నాడు. అట్టి తత్త్వమునుండి ఎప్పుడును జారిపోకూడదు.

పూర్వశ్లోకములోని భావమునే యిచట పొడిగించుచున్నాడు. సాధకునకు తన ప్రయాణములోని తుది మజిలీని సూచించి, ఆత్మజ్ఞానియొక్క ఆనందానందానుభమునకు కారణమును తెలిసికొను ఒక కీలకమును కూడ యీ శ్లోకములో చెప్పుచున్నాడు. బాహ్యాభ్యంతరములందు ఆత్మతత్త్వమునే చూచుచుండుటచే యాతడు ఆత్మగానే యగుచున్నాడు. బాహ్యాభ్యంతరజ్ఞానము మనస్సుచే కల్పితమైనది. ఆత్మదృష్ట్యా

ఈ బాహ్యాభ్యంతరజ్ఞానము నధిగమించి, అట్లే భావవస్తు ప్రపంచముల రెండింటియందు ఈ మనస్సునుకూడ అధిగమించిన అతనికి ఈ బాహ్యాభ్యంతర జగత్తులందు రెండింటను ఆ శుద్ధ చైతన్యతత్త్వమొక్కటియే ఏకమై గోచరించుచున్నది.

సంగ్రహముగా చెప్పిన ఆత్మజ్ఞానము కలిగినంతనే యీ వస్తుప్రపంచమంతయు మాయాసృష్టియనియు, బాహ్యాభ్యంతరములందు సర్వత్ర ఆత్మతత్త్వమొక్కటియే యున్నదనియు అతనికి గోచరించుచున్నది. ఈ సందర్భములో ఆత్మజ్ఞాన మనగా అంతరాత్మను తెలిసికొనుట యని మీరు గమనించవలెను. కావున ఒక మహాత్ముడు "ప్రపంచమంతయు చెడ్డది, నేనుమాత్రము ఆత్మజ్ఞానమందితిని" అని చెప్పిన ఆతడు అసత్యవాదియే యగుచున్నాడు.

"ఒకవ్యక్తియొక్క దేహాభ్యాంతరమునయున్న ఆత్మయే సర్వవ్యాపియగు పరమాత్మ" అని తెలిసికొనుటయే ఆత్మజ్ఞానమని యిచట స్పష్టముగా చెప్పుచున్నది.

అట్టి ఆత్మజ్ఞానికి యింద్రియ విషయ ప్రపంచమంతయు స్వప్నతుల్యమగుటచే, ఆ విషయము లేవియు ఆనందమునకు కారణములు కాజాలవు. అచట అనుభవించుటకు ఆత్మానందము ఉన్నను, దానిని గ్రహించి యనుభవించు సాధనలగు ఇంద్రియ మనోబుద్ధులు తనకు లేకపోవుటచే అత డట్టి ఆత్మానందమును కూడ అనుభవించలేడు. ఆ జ్ఞాని దృష్ట్యా గ్రహించుటకు వస్తువులు లేవు. వస్తువులదృష్ట్యా గ్రహించు సాధనలగు మనోబుద్ధులు లేవు. అయినను, ఆ మహాత్మునియొక్క

అస్తిత్వరూపమగు ఆ అతీతానందమును వర్ణించుటలో శాస్త్రములు విసుగుచెందుటలేదు.

అట్టి అతీతానుభవము ననుభవించుటకు ఒక జ్ఞానిలో అనుభవింపబడు వస్తువేది ? అనుభవించు 'భోక్త' యెవడు ? అను సందేహ మిచట కలుగుచున్నది. దీని కిచట విశదమైన ప్రత్యుత్తరమీయబడినది. అతడే ఆనందస్వరూపుడు. ఆనంద మాపరమాత్మనుండి కలుగుచున్నది. ఈ సందర్భములో జ్ఞాతృ జ్ఞేయ సంబంధము లేదని మనము తెలిసికొనవలెను. ఇచట భోక్త, భోజ్యము, భోగము అను విభేదములు లేవు. ఈ ఆనందమే ఆత్మానందము. అనగా ఒకడు ఆ ఆత్మానందములో, ఆ బ్రహ్మానందములో లీనమై పోవుచున్నాడు. ఆత్మ ఆనంద స్వరూపమగుటచే ఆత్మతత్త్వమగుటయే ఆనంద రూపమగుట యగుచున్నది.

"తన కిపుడు సహజమైన యా బ్రహ్మానందస్థితినుండి యట్టి దివ్యమానవుడు ఎన్నటికిని దిగజారడు". అనియే యీ తుదిరెండు శ్లోకములలో చెప్పబడియున్నది. ఆ పరమాత్మనుండి ప్రత్యేకపఱచు జీవాత్మభావన యాతనికి లేనేలేదు. ఒక్కసారి యీ యనంత ఆత్మతత్త్వమును పొందిన పిమ్మట అచటనుండి యతనికి పతనము లేదు, కావున యొక వ్యక్తి తన పరిణామములో సాఫల్యమునంది, పరిపూర్ణత్వము నందిన యెడల, ఆతడు సర్వవ్యాపియగు ఆత్మ తత్త్వమే యగుచున్నాడు.

ఇంతటితో రెండవ అధ్యాయము సమాప్తము.

# అధ్యాయము 3

## అద్వైత ప్రకరణము

ముందటి రెండు అధ్యాయములలోను కారికాకారుడు తన భావములకు విపులమైన వివరణచేసెను. ప్రథమాధ్యాయములో అద్వైతతత్త్వమును శాస్త్రాధారముతో వివరించెను. రెండవ అధ్యాయములో జగన్మిథ్యాత్వమును నిరూపించుటకు తగినన్ని వాదప్రతివాదములు జరిగినవి. ఇప్పుడీ యధ్యాయములో ఆ అద్వైతతత్త్వము మిథ్యకాదని దృఢముగా నిర్ణయించి చెప్పుటకు వాదోపవాదములు జరుగుచున్నవి.

రెండవ అధ్యాయము జగన్మిథ్యాత్వమును నిర్ణయించిన యీ మూడవ అధ్యాయము అద్వైత బ్రహ్మతత్త్వము మాత్రము మిథ్యకాదని నిరూపించుచున్నది. ఆ పరమాత్మయొక్క నిత్యసత్యతత్త్వమును ఇచట నిరూపించుచున్నాడు. దీనిని సమర్థించుటకు అనేక శాస్త్రములనుండి యుదాహరణలను ఇచ్చుచున్నాడు. ఇది ఉపదేశ గ్రంథమగుటచేత యీ అధ్యాయములోకూడ ధ్యానస్థితిని గురించి యనేకసూచనలు చేయబడినవి.

ఇందు ఆత్మజ్ఞానమును పొందుటకు "అస్పర్శయోగము"ను నొక నవీనపద్ధతి కలదు. ఈ యోగము వేదాంత వాఙ్మయముననే ఒక అపురూపపద్ధతి యని చెప్పవచ్చును. గౌడపాదునిలో బౌద్ధమత లక్షణములున్నవని భావించువారు 'అస్పర్శయోగము' అను నీ పదము బౌద్ధమతమునుండి

గ్రహింపపడినదని తలచుచున్నారు. కాని యిది వేదాంత విద్యార్థికి అంత యంగీకార్యము కాదు. ఆ విషయము వచ్చినపుడు దానిని చర్చించెదము. ఈ అధ్యాయము 'జగన్మిథ్యా వాదము' అను గౌడపాదుని ప్రచండనినాదముతో ముగియుచున్నది. ఈ ముగింపు శ్లోకములలో కారికలలోని తత్త్వమంతయు సంగ్రహించి చెప్పబడినది, "జీవుడు" యథార్థముగా ఎప్పుడును పుట్టనేలేదు. జీవుని సృష్టికి కారణము అసలే లేదు. ఎచటనుండి యేదియు జాతకము కాదో అదియే సత్యతత్త్వమగు పరమాత్మ.

# అద్వైత ప్రకరణము

కా॥ ఉపాసనాశ్రితో ధర్మో జాతే బ్రహ్మణి వర్తతే।
ప్రాగుత్పత్తేరజం సర్వం తేనాసౌ కృపణః స్మృతః॥ ౧

ఉపాసనా మార్గముననుసరించిన ఉపాసకుడు స్వయంభూవైన బ్రహ్మతో తనకు సంబంధము కలదని భావించుకొనుచున్నాడు. జగదుత్పత్తికి పూర్వము ఉన్నదంతయు అజమగు బ్రహ్మతత్త్వమే యని తలచుచున్నాడు కావున అతడు "కృపణుడు" అని చెప్పబడుచున్నాడు.

భక్తునికన్న భిన్నముగా ఒక భగవంతుడున్నాడనియు, ఆ భగవంతుని భక్తిహృదయముతో నొకభక్తుడు ఆరాధించుచున్నాడనియు ఉపాసకుల మతము. కాని యీ పై రెండు విషయములను నిర్దాక్షిణ్యముగా ఆక్షేపించుటతో ఈ అధ్యాయము ప్రారంభమగుచున్నది. అంతమాత్రమున సులభమైన భక్తిమార్గములో లోపములు కలవనియు, అది లక్ష్యమును చేర్చుటకు అసమర్థమగుచున్నదనియు మనము దురభిప్రాయ పడకూడదు. భక్తిమార్గమును త్రోక్కకుండ ఎట్టి వేదాంతియు వేదాంతముయొక్క మహాత్మ్యమును ప్రశంసించలేదు. ఈ మనోబుద్ధులకు సంబంధించినంత వఱకు సాధ్యమైనంత పరిపూర్ణమైన పరిణతిని పొంది, వేదాంతమునందు ఉన్నతిని పొందిన విద్యార్థికొఱకే యీ వేదాంతగ్రంథములు ఉద్దేశింపబడియున్నవి. పరిపూర్ణ పరిణతి నొందిన విద్యార్థులు కేవలము భక్తి మార్గమందే తగుల్కొనియున్న జీవితము

నందు తమకు గలిగిన యవకాశమును వారు వ్యర్థముచేసి కొనినవారగుదురు. పరిపక్వతజెందు సమయమందు, ఉన్నత స్థానమునందుకొనుటకై యీ తగ్గుస్థాయి సాధనలను అతడు త్యజించవలసియే యున్నది.

ఒక విద్యార్థి యొక తరగతిలో ఉత్తీర్ణుడైన పిమ్మట సంవత్సరాంతమున పై తరగతికి పోవలసియున్నది. కాని యాతడు యా తరగతి యుపాధ్యాయుని యందుండు ఆదర భావముచెతనో లేక తాను కూర్చుండు స్థానముపైగల మక్కువ చేతనో పై తరగతికి పోవుటకు నిరాకరించిన యతనిని బలవంత ముగానైన యా పై తరగతికి తరుమవలెను కదా. అట్లు చేయ కున్న ఆ విద్యార్థి తన సమయమును వ్యర్థపుచ్చుటయేగాక తన తరగతిలోని విద్యార్థులను కూడ అనవసరముగా కలవర పఱచును. అట్లే భక్తిసాధనయందు త్తీర్ణుడైన సాధకుని యున్నతమైన జ్ఞానసాధనకు ప్రోత్సహించవలసియున్నది. అట్టి ఉద్దేశముతోనే యిచట భక్తిమార్గమును ఆక్షేపింప పూను కొనుచున్నాడు.

పరిపూర్ణతజెంది పరిపక్వత నందిన పిమ్మట కూడ కర్మ, భక్తిమార్గములను మాత్రమే యనుసరించుచు అందే స్థిరపడిపోయియుండుట నిజముగా మన ప్రయత్నములను సాధన లను వ్యర్థపఱచుకొనుటయే యగుచున్నది. కావున యట్టి సాధనలయందుగల తమ మాయామోహమును విడిచిపెట్టి, ఉన్నతమగు జ్ఞానసాధనలవైపు మనస్సును మరలించవలెనని సఫలతజెందిన విద్యార్థులకు యీ శ్లోకము హెచ్చరించు చున్నది.

అయితే యీ సిద్ధాంతము గౌడపాదుడు తన బుద్ధిబలముతో స్వయముగా యీ విషయమును నిర్దేశించలేదు. "మీరారాధించునది సత్యతత్త్వము కాదు" అని లెక్కలేనన్ని ఉపనిషత్తులు రూఢిగా నిర్ణయించినట్లు తగినన్ని సాక్ష్యములు కలవు.

భగవంతుడు సంపూర్ణముగాను, అంశతః కూడ భక్తునితో సంబంధము కలిగియున్నాడనియు, మరియు తన భక్తునికొఱకై యీ భగవంతుడే నానాత్వముగల యీ ప్రపంచరూపములో అవతరించినాడనియు భక్తిమతము చెప్పుచున్నది. ఇందులో సహజమైన వైరుధ్యము కలదు. ఆ పరమాత్మయే యీ ప్రపంచముగా అవతరించిన యీ భక్తుడు కూడ ఆ పరమాత్మలో ఒక భాగమై యుండవలెనుకదా. ఇట్టి సృష్టి సిద్ధాంతమును అంగీకరించినపిమ్మట, తనకంటె భిన్నుడైన భగవంతుని గొల్చుభక్తిని వాదము స్వవచోవ్యాఘాతమును కల్పించుటయే కాక అతని మతములోని అసంపూర్ణతను సూచించుచున్నది. ఈ భావమే ఈ శ్లోకములోని నిందా విషయమై యున్నది.

వేదాంతము వివేచనాశక్తిగల వివేకమార్గము అగుచున్నది. యుక్తియుక్తమగు తర్కముద్వారా మన మనోబుద్ధులను నశింపజేసి, మనలోనుండు ఆత్మను మరల కనుగొనుటకు ఈ వేదాంతమొక మార్గమైయున్నది. "మిథ్యావాదములు మిమ్ము అంధకారములోనికి ఈడ్చుకొని పోవును. కావున సద్వాదములను చేసి సరియైన మార్గములో స్థిరముగా యోచించుడు" అని జ్ఞానమార్గముననుసరించు సాధకులకు

గురువులు దృఢముగా చెప్పుచున్నారు. పై భక్త్యాది భావము లందు విశ్వాసముగలవారిని గౌడపాదుడు "కృపణాః – సంకు చితబుద్ధిగలవారు" అని చెప్పుచున్నాడు. ఈ 'కృపణ' పద మునకు లోభి యను అర్థముకూడ కలదు. అట్టివాడు వేదాంత ములో ఆ పరమగురువులచేత "కృపణుడు" అని పిలువబడు చున్నాడనగా, స్వేచ్ఛగా సమస్తమును తనలో యిముడ్చు కొనుటకు వీలుగా తన మనస్సు వైశాల్యమును పొందుటకు అతడంగీకరించుట లేదనియే తాత్పర్యము. తన జీవభావ మందలి పృథక్త్వమును విడిచిపెట్టి అనంతపరమాత్మలో లీన మగుటకు సిద్ధపడలేకున్నాడు అను భావములో యీ పదమునకు లోభత్వమను అర్థముకూడ సార్థకమగుచున్నది.

మరియు ఈ భగవదుపాసకులు 'ఆ పరమాత్మ అజము' అనుట మిక్కిలి పరిహాసాస్పదముగా నున్నది. ఆ పరమాత్మయే నిత్యమై, శుద్ధమై, అజమైనయెడల అతడు ఈ నానాత్వ విశిష్ట ప్రపంచరూపములో ఉద్భవించియు తన సత్యతత్త్వములో అజుడై యుండుట అత్యంతము అసంభవమై యున్నది కదా! మరియు తననుండి యీ ప్రపంచమును ఆతడు సృష్టించి యుండినయెడల నీ ప్రపంచము అతనియొక్క సహజగుణము లతో కూడి యుండవలెను కదా! ఇంతవఱకు అంగీకరించిన పిమ్మట, "ఆ భగవంతుడు ఆరాధింపదగినవాడు, నేనాతని అంశమును, అతడు పరిపూర్ణుడు కావున నేనతని యనుగ్రహ మునుపొందవలెను" అను ఈ సిద్ధాంతమంతయు అపాయకర మైనదియే కాక సాధకుడు అభివృద్ధిజెంది పెంపొందుటకు ప్రతి బంధకముగాకూడ యున్నది.

భక్తి యను పదమునకు 'ఉపాసన' యనునది పర్యాయ పదముగా నిచట యుపయోగింపబడినది. వేదములలో సర్వత్ర ఉపాసన యను పదమే యుపయోగింపబడినది కాని యందు భక్తియను పదము ఎచటను లేదు. భక్తియనుపదము వ్యాసునిచే కనుగొనబడి పురాణములలో విపులముగా వ్యాప్తి జెందినది. ఉపాసనకు బుద్ధిలోను మనస్సులోను సమత్వము (నిశ్చలత) ఎక్కువగా ఉండవలెను. ఒక సాధకుడు తన పరిమిత స్థితిని విశ్వమందంతటను వ్యాపింపజేసి విశాలపఱచుటయే ఉపాసన యగుచున్నది. జీవితము శాంతముగా గడచుచు, బహిఃప్రకృతినుండి యాతడు కోరదగినవి పరిమితముగా నున్నప్పుడు ఇట్టి ప్రక్రియ లభ్యమగుచున్నది. కళాసాహిత్యములు దేశములో శాంతిసమృద్ధులు ఉన్నప్పుడే యభివృద్ధి చెందుచున్నవి. అట్లే ప్రపంచములో అభివృద్ధియున్నప్పుడు ఉపాసనకూడ ఆధ్యాత్మికతాభివృద్ధిని కలిగించ గలదు. ప్రజల యుత్పత్తి యధికమగుటచే భూమి క్రుంగిపోవునపుడును, క్షామాదులచే యెండి భూమిలో యుత్పత్తిలేక యుండునప్పుడును, అడవులలోని వృక్షములన్నియు నశించి, శిలాంతర్భాగములైనప్పుడును సుఖరహిత నిర్బంధ సమయములు సంభవించును. అట్టి సమయములలో తొందరగా త్రోయబడు ఘడియలందు ఆధ్యాత్మిక సాధకులకు ఉపాసన సాధ్యము కాదు. ఈ విషయమును తగిన సమయములో గ్రహించిన వ్యాసుడు పురాణముల ద్వారా మనకు భక్తిమార్గమును చూపెను. భక్త్యారాధనకే ఉపాసన యను పదమును గౌడపాదు డిచట ఉపయోగించెను.

కా॥ అతో వక్ష్యామ్యకార్పణ్యమజాతి సమతాం గతం।
యథా న జాయతే కించిత్ జాయమానం సమన్తతః॥ ౨

కావున నే నిప్పుడు అజమై, అఖండమై, అనంతమైన బ్రహ్మతత్త్వమును వివరించి చెప్పెదను. దానినుండి నానాత్వవిశిష్ట ప్రపంచము జన్మించినట్లగపడుచున్నప్పటికిని వాస్తవములో దానినుండి యేదియు జన్మించలేదు. అట్టి బ్రహ్మతత్త్వమునే నేను వివరించుచున్నాను.

పై కారణములచే గౌడపాదుడు ఆ ఆత్మతత్త్వమును వివరించి చెప్పెదనని యనుచున్నాడు. మనోబుద్ధులనెడు సాధనలద్వారా పనిచేయు చైతన్యమునే మనబుద్ధి గ్రహించి తెలిసికొనగలదు. కావున మన నిత్యజీవితములో ఆ పరబ్రహ్మను అతని సమాజతత్త్వములో గ్రహించలేము. మనము భౌతికావరణములతో నైక్యము పొందియున్నంతవఱకు ఆ శుద్ధ జ్ఞానము మనకు లభ్యముకాదు. అణుమాత్రమైనను మనమీ భౌతికావరణతోడి యైక్యమొందిన యట్టి యైక్యము, పరమాత్మనావరించునట్టి పర్వతాకారమగు అహంకారయుత మనస్సును సృష్టించగలదు. అహంకారరూపజీవభావమున్నంత వరకు ఆ పరమాత్మ ఆవరణాంతర్గతమైయే యుండును.

'మనోబుద్ధుల మార్గము ననుసరించి, స్థూలశరీరాభిమానముతో చూచునపుడు మనమీ ప్రపంచమును కనుగొనగలుగుచున్నాము.' అను విషయము నిదివఱకే వివరించితిమి.

స్వప్నమునుచూచు తైజసునివలె మనము నానాత్వవిశిష్ట స్వప్నప్రపంచమునే తెలిసికొనకలుగుచున్నాము. కాని

మనకా శుద్ధచైతన్యముయొక్క జ్ఞానము కలిగినంతనే, మనము బాహ్యమందుగాని, అభ్యంతరమందు, ఎటుచూచినను అజమై, అఖండమైన సమత్వమునే యనుభవించుచున్నాము.

సమత్వమనగా ఆ పరమాత్మ సర్వవ్యాపి యఖండ తత్త్వమని యర్థము. సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేనిది యని తాత్పర్యము. ఇట్టి భేదములున్న యది నశ్వరమైన దగుచున్నది. ఇట్టి భేదములను నిషేధించి, ఆత్మయొక్క సర్వవ్యాపకత్వమును, నిత్యత్వమును నిరూపించుటకై, యీ గురువు 'సమ' మను పదమును ప్రత్యేకించి యెన్నుకొనెను.

"ఆ పరమాత్మ సర్వవ్యాపియై నిత్యమైనది అయిన యెడల, మర్త్యులమైన మనము మనచుట్టు ఈ ప్రపంచము నెట్లు చూడగలుగుచున్నాము ?" అను ప్రశ్నకు "ఆ ఆత్మ తత్త్వము తప్ప వాస్తవములో మరియొకటి ఏదియు లేదు" అనియే ప్రత్యుత్తరమై యున్నది.

ఈ నామరూపాత్మకమైన ప్రపంచమంతయు మనస్సు యొక్క భ్రాంతిచేత కల్పితమైన స్వప్నమే యగుచున్నది. ఆ బ్రహ్మతత్త్వము సర్వవ్యాపి యగుటచేతను ప్రపంచము కేవలము మనస్సుయొక్క భ్రాంతికల్పితమగుటచేతను యీ ప్రపంచము మిథ్య యగుచున్నది. "జాయమానం సమన్తతః—సర్వత్ర సృష్టింపబడినట్లున్నప్పటికిని" అను వాక్యముచే యీ పై భావము చక్కగా వ్యక్తమైనది.

కా॥ ఆత్మా హ్యాకాశ వజ్జీవై ర్ఘటాకా శై రివోదితః ।
ఘటాదివచ్చ సంఘాతై ర్జాతావే తన్నిదర్శనం ॥ 3

ఆకాశమువంటి సర్వవ్యాపి ఆత్మ నానారూపములను ధరించినపుడు వానిని ఘటాకాశముతో పోల్చవచ్చును. మరియు ఈ ఘటాకాశము ఆ మహాకాశమునుండి యుద్భవించినదని చెప్పినట్లు వివిధమైన స్థూలరూపములు ఆ ఆత్మనుండి యుద్భవించినవని చెప్పుచున్నారు. ఇదియే యీ వ్యక్తప్రపంచమునకు నిదర్శనమై యున్నది.

ఆ పరమాత్మతో ఈ జీవుని సంబంధమును వివరించుటకు వేదాంతములో 'మహాకాశము- ఘటాకాశము' అను ఉదాహరణలు చాల ప్రసిద్ధమై యున్నవి. సమస్త వేదాంత మతములోను ఈ యుపమానము సాటిలేనిదై యున్నది.

కొన్ని నిర్ణీత సామ్యములుండుటచే ఆ పరమాత్మ ఆకాశముతో పోల్చబడినది. ఆ పరమాత్మ ఆకాశమువలె ఉన్నది యన్నప్పుడు సూర్యచంద్రాదిగ్రహములు, మేఘములు మొదలైన యితర సూక్ష్మపదార్థములు ఆ పరమాత్మయందున్నవని మనము భావింపరాదు. ఈ రెండింటికిని ముఖ్యమైన సమానధర్మములు మూడు (1) రెండును సూక్ష్మమైనవి. (2) రెండును అఖండమైనవి. మరియు (3) రెండును అస్పర్శములు. ఏ పరమాత్మయైతే యీ త్రిగుణములను కలిగి యున్నదో యట్టి పరమాత్మ నామరూపములను పొంది జీవిడై యున్నదని భావించవలసి వచ్చును. వాస్తవములో ఇది సత్యముకాదు. అయినను అందరును ద్వైతమును అనుభవించుచునే యున్నారు. ఈ ద్వైతమెట్లు వచ్చినదని భ్రాంతుడైన సాధకుడు సంశయించుచున్నాడు. సాటిలేని యీ యాకాశో

పమానముద్వారా ఆ పరమగురువు శిష్యుని సంశయమును నివారించుచున్నాడు.

ఆకాశము – అఖండము, అవిభక్తము, అహార్యము, అయినప్పటికిని వ్యవహారములో ఒక ఘటములోనుండు ఆకాశమునకును, మరియొక ఘటములోనుండు ఆకాశమునకును మనము భేదము కల్పించుచున్నాము. ఇట్టి కల్పనచే పరిమాణములో వైరుధ్యము వచ్చుచున్నది. పదిశేర్ల నేయిపట్టు పాత్రను ఒక శేరు నేతిని కొలుచుటకుగాను ఉపయోగింపలేము కదా ! ఆ రెండింటికిని స్పష్టముగా భేదము కనబడుచున్నది.

ఘటాకాశము తానా ఘటముతో నైక్యమును పొంది ఘటమధ్యమందున్నట్లు భ్రమచెందినపుడు తాను ప్రత్యేకమైన ఆకాశమని భావించుచున్నది. తన కాధారమగు ఆ ఘట పదార్థమే ఆ మహాకాశములో నిలుచుచున్నదనియు, ఘటములోను ఘటము వెలుపలనుకూడ ఆ ఆకాశము ఒకటేయై యున్నదనియు, ఆ ఘటాకాశము తెలిసికొని యుండినయెడల తనకా ప్రత్యేకమైన 'అహం' భావముకాని, తత్ఫలితమగు పరిమితులు, దుఃఖములు మొదలైనవిగాని లేవని తెలిసికొనును కదా !

ఉప్పుపాత్రలో నుండు ఆకాశము చక్కెరపాత్రలో నుండు ఆకాశముపై అసూయ వహించినదనుకొనుడు. అంత ఆ ఉప్పుకుండలోని యాకాశము "నా దురదృష్టమువలన నేనిందులో ఉన్నాను, ఆ చక్కెరకుండలోని ఆకాశము ఎంత అదృష్టశాలి. అది సంపూర్ణముగా మాధుర్యమునే యనుభ

వించుచున్నది." అని తలంచుచున్నది. అంత ఆ ఉమ్మిపాత్ర లోని యాకాశమును చూచి ఆ మహాకాశముతో నైక్య జ్ఞానము కలిగిన పరమాకాశము "ఆ కుండ కేవలము మధ్య వచ్చినది. వాస్తవములో ఆకాశము సదా అస్పర్శము, అఖండము" అని చెప్పుచున్నది. ఘటమందలి పదార్థములేవైనప్పటికిని అందలి ఆకాశము మాత్రము పవిత్రమైనది, శాశ్వతమైనది యగుచున్నది.

అట్లే నాలోనుండు "నేను" అనుదానికి వెనుకనున్నది సర్వవ్యాపి యగు ఆ ఆత్మ ఒక్కటియే. అయినప్పటికిని నా అజ్ఞానములో ఈ 'నేను' దేహ మనోబుద్ధులతో నైక్యము జెంది జీవుడై, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలో విశ్వతైజస ప్రాజ్ఞరూపుడై దుఃఖములనే యనుభవించుచున్నాడు. కావున మిథ్యయైన యీ భౌతికావరణలతోడి తాదాత్మ్యమును విడనాడి, తనలోని ఆత్మతత్త్వమును తెలిసికొనవలెను. ఆ ఆత్మయే యీ సమస్త భౌతికావరణములకు ఆధారమనియు, అదియే తెలిసికొని యనుభవింపదగిన ఆత్మయనియు, దానిని తెలిసికొనుటయే జీవితలక్ష్యమనియు వేదాంతము చెప్పుచున్నది.

ఆ పరమాత్మనుండి యీ నామరూపాత్మకమైన ప్రపంచము సృష్టింపబడినదని చెప్పుట కేవలము యీ మిథ్యాభాషయే అనువుగా ఉపయోగపడుచున్నది. అట్లు చెప్పుట ఉమ్మిపాత్ర లోని యాకాశము ఆ మహాకాశమునుండి సృష్టింపబడినదని చెప్పుటవంటిదే యగుచున్నది.

కా॥ ఘటాదిషు ప్రలీనేషు ఘటాకాశాదయో యథా।
ఆకాశే సంప్రలీయన్తే తద్వజ్జీవా ఇహాఽఽత్మని॥ ४

ఘటము నశించగానే ఘటాకాశము ఆ మహాకాశములో లీనమైనట్లు ఈ ప్రత్యేకజీవభావము పోగానే అ ఆత్మలో లీనమగుచున్నారు.

ఇట్లు మనమీ మాయామోహములోపడి జీవత్వాభిమానమును పొందినపిమ్మట మనకా పరమాత్మను మరల కనుగొను అవకాశమున్నదా? అని యడిగినదానికి ప్రత్యుత్తరముగా ఈ శ్లోకములో యిదివరకు చెప్పిన యుదాహరణనే చెప్పి గౌడపాదుడు మరల మనకు విపులముగా వివరించుచున్నాడు

ఆ పరిమితులు తత్సంబంధములు నశించినంతనే వానితోడి యైక్యభావముకూడ నశించియే తీరవలెను. ఘటము పగిలినంతనే ఘటాకాశము తక్షణము ఆ మహాకాశముగా అగుచున్నది. అట్లే ఏ సాధనలతో నైక్యము పొందుటచేనాలో యీ జీవత్వభావమంకురించినదో ఆ సాధనలు నశించగానే యీ జీవభావము కూడ నశించుచున్నది. కావున మనోబుద్ధులనధిగమించినంతనే తత్సృష్టమైన స్వప్నభూతజీవభావము స్వప్నాద్యవస్థలతోను, తత్ఫలితములగు భ్రమలతోను కలిసి మొత్తముగా నశించుచున్నది.

ఇట్టి జీవుడు నశించగనే ఆ యాత్మ యచటనే ప్రకాశించుచుండును. మనోబుద్ధులనతిక్రమించిన ఆ శుద్ధచైతన్యము ననుభవించగలుగు తురీయావస్థను చేరుచున్నాము. జీవభావము అంతరించిన మానవుడు తనలోని దివ్యత్వమును కనుగొనుచున్నాడు. ప్రత్యేక వ్యక్తిగత "అహం" నశించినంతనే విశ్వవ్యాపి "అహం" అభివ్యక్తమగుచున్నది.

కా॥ యథైకస్మిన్ ఘటాకాశే రజోధూమాదిభిర్యుతే ।
న సర్వే సంప్రయుజ్యన్తే తద్వజ్జీవాః సుఖాదిభిః ॥ ౫

ఒక ఘటములోని ఘటాకాశమును ధూళి ధూమముల చేత మలినపఱచినంతనే ప్రపంచములోని సమస్త ఘటాకాశములను మలినపఱచుటలేదుకదా! అట్లే ఒక వ్యక్తియొక్క సుఖదుఃఖములు సర్వమానవులయొక్క సుఖదుఃఖములు కాజాలవు. ఒకని మానసికానుభవములు ఇతరుల మానసికానుభవములు కాజాలవు.

ఇచట ఒక పూర్వపక్షి గౌడపాదుని వాదమును ఖండించ ప్రయత్నించుచున్నాడు. ఆ పూర్వపక్షి ఏకజీవ వాదమునకు చెందినవాడు. ప్రత్యేక జీవులన్నియు ఒకటే యనియు, అవన్నియు కలిసిన ఒక మహాజీవుడుగా అగుచున్నాడనియు వీరి మతము. జీవులన్నియు ప్రత్యేకముగా కనబడుచున్నప్పటికిని ఒకటే యనియు, ఆ మహాజీవుడే బ్రహ్మయనియు వీరి యభిప్రాయము. శిక్షణ పొందని బుద్ధికి యీ మతము వేదాంతమును పోలియున్నట్లు అగబడినను, ముఖ్యసిద్ధాంతములలోనే యీ మతము వేదాంతముతో భిన్నమగుచున్నది. ఈభేదములు చాల గొప్పభావములను సూచించుచున్నవి. అయినను వేదాంతము ప్రకారము అవి మిక్కిలి పరస్పర విరుద్ధములైన సిద్ధాంతములై యున్నవి. దీనికి వ్యతిరేకముగా వేదాంతులు ఏకాత్మవాదమును నమ్ముచున్నారు. ఒక చైతన్యము సర్వవ్యాపియై యున్నదని చెప్పుటయు, ఒకే మహాజీవుడు సర్వవ్యాపియై యున్నాడని చెప్పుటయే సమానము కాదుకదా! కాని యీ పూర్వపక్షులిట్లు వాదించుచున్నారు: "ఆత్మ

యొకటే యైన యెడల, ఒక మహర్షిగాని, యోగిగాని ఆ ఆత్మను కనుగొనిన మనకందరకు కూడ ఆ ఆత్మజ్ఞానము కలిగి యుండవలయును కదా ! ఏలయన మీ మతము ప్రకారము అన్ని ఆత్మలు ఒక్కటియే. కావున ఒక్క ఆత్మ కనుగొన బడినంతనే యన్ని యాత్మలు వాటంతట అవి అప్రయత్నము గానే కనుగొనబడవలయును కదా ?'' అని.

ఈ పై వాదనలు సత్యమువలె ఆభాసించుచున్నవి కాని, అవి వివేకమునకుగాని, తర్కమునకు గాని నిలచునవి కావు. ఇది సాధారణ బాహ్యదృష్టికికూడ అసందర్భముగా తోచుచున్నదని చెప్పుటకు ఇచట మనకొక చక్కని యుదాహరణ కలదు. ఒక ఘటములో ధూళి, ధూమము ఉన్న యెడల ప్రపంచములోని యన్నిఘటములు ధూళి ధూమ, దూసరితములు కానక్కరలేదుకదా. నా మనస్సులో రాగ ద్వేషములున్న, నా మనస్సుచే నేను గ్రహించు ప్రపంచ మంతయు రాగద్వేషములతో నిండియుండును. జనసామాన్యము స్థూలదేహాభిమానులైన, తత్ఫలితమగు భ్రాంతిచే యీ ప్రపంచమంతయు, మోహపూరితమై, దుఃఖాంతమగు రాగముచేతను, బాధాంతమగు వియోగాదులచేతను, నిండి యుండును. కాని ఒక్కజీవి యీ బాహ్యావరణములతో తాదాత్మ్యమును తొలగించుకొని, భ్రమవిక్షేపములను అంత మొందించిన, ఆ జీవియేపరమాత్మను పొందగలుగుచున్నాడు.

ఆత్మ స్వభావతః సచ్చిదానంద రూపము. దేహమనో బుద్ధులు మధ్యజొచ్చుటచేతను, వానియందు మనము తాదాత్మ్యము చెందుటచేతను, ఆ ఆత్మ తననుండి ఆవృతమై పోయి

నది. తనలో దుమ్ము ధూళి యున్నప్పటికిని ఘటాకాశము సదా నిర్మలమైయే యున్నది. దానిలోని మాలిన్యమంతయు ఆ ఘటమునకు సంబంధించినదిగాని అందుండు ఆకాశమునకు అంటునది కాదు.

ఆత్మ సుఖించుచున్నది, ఆత్మ దుఃఖించుచున్నది ఇత్యాది భావనలు ఆత్మకు సుఖదుఃఖములుండుటచే కలుగుట లేదు. ఆ ఆత్మను ఆవరించిన మనోబుద్ధులకే యీ సుఖ దుఃఖాదులు కలుగుచున్నవని తాత్పర్యము. బాలురు ఆకాశ మును చూచుచు ఆకాశము మలినముగా నున్నదందురు. ఆ మాలిన్యము ఆకాశమునకు సంబంధించినది కాదు. ఆ మాలి న్యము అచట కనబడు ధూమరూప మేఘములకు సంబంధించి నదే యగుచున్నది. కాని యా పిల్లవాడు మేఘములకు సంబంధించిన యా మాలిన్యమును ఆకాశమునకు సంబంధించి నదే యని భావించును. కాని యా బాలుడే కొంత యెదిగిన పిమ్మట వస్తుతత్త్వమును గ్రహించి, ఆ మాలిన్యము ఆకాశ మునకు సంబంధించినది కాదని తెలిసికొనగలడు. అట్లే మనముకూడ వేదాంతములో చెప్పిన వివేకము, జ్ఞానము, త్యాగము మొదలైన సాధనలద్వారా పాశవికప్రవృత్తిగల యీ మనస్సును అంతమొందించి అతీతావస్థను చేరినయెడల అచట మనము మన సహజతత్త్వమగు ఆత్మతత్త్వమును అనుభవించగలుగుచున్నాము. అందరు తప్పక యా ఆత్మ తత్త్వమును పొందగలరు. మనయొక్క మిథ్యాభిమానమువల ననే మనము అసమర్థులము అనుకొనుచున్నాము. అట్టివాడు

తనను తాను ఉద్ధరించుకొనవలసినదేగాని యితరులెవరును అతనిని యుద్ధరించలేరు.

కా॥ రూపకార్య సమాఖ్యాశ్చ భిద్యన్తే తత్ర తత్రవై ।
ఆకాశస్య న భేదోఽస్తి తద్వజ్జీవేషు నిర్ణయః ॥ ౬

అక్కడక్కడ నామరూప కార్యములయందు భేదమున్నప్పటికిని అద్వయమైన ఆ మహాకాశములో ఎట్టి భేదమును లేదు. అట్లే విభిన్ననామరూపాదులు గలిగియున్నట్లగపడుచున్నప్పటికిని అద్వైతమగు ఆ పరమాత్మకూడ ఒక్కటే యగుచున్నది.

ఇచట మరియొక పూర్వపక్షి గౌడపాదుని వాదములో దోషమును కనిపెట్ట చూచుచున్నాడు. విభిన్న జీవులయొక్క యనుభవములు విభిన్నముగా నున్నవి. కనుక ప్రతి దేహామునందును విభిన్న ఆత్మలు ఉండవలెను. జీవులయొక్క అనుభవములు భిన్నముగా నుండుటవలన ఆత్మ ఏకమై యుండజాలదు.

పూర్వపక్షి వాదమునకు ఈ శ్లోకములో ప్రత్యుత్తరమీయబడినది. ఆత్మ యొక్కటేయైనను రూపవిశ్లేషణ యంత్రమగు (Spectroscope) మనస్సుద్వారా దానిని చూచినపుడు అది విభిన్ననామరూపాత్మకమైన ప్రపంచముగా మనకు కనబడుచున్నది. ఈ నానాత్వవిశిష్ట ప్రపంచమును చూచువాడు జీవుడు కాని ఆత్మకాదు. ఆ యాత్మమనస్సనెడు పొగమంచుద్వారా ప్రసరించినపుడు అందుండి యుదయించిన పెనుభూతమే యీ జీవుడు అని చెప్పవచ్చును.

ఒకే మట్టిలోనుండి వెలువడిన వివిధఘటములు తమ తమ నామరూపాదులలో విభిన్నముగ గోచరించినను ఆ మన్నులేక వాని యస్తిత్వమే లేదని మనకందరకును బాగుగా తెలియును. నీవా ఘటములకు ఎట్టిపేరైనను పెట్టికొనుము, ఏ ప్రయోజనమునకైనను వానిని యుపయోగించుకొనుము. కాని వానియొక్క సహజ తత్త్వమైన మట్టి లేకుండ యవి ఉండజాలవు అవి మట్టిలో పుట్టి, మట్టిలో పెరిగి, నశించిన పిమ్మట మరల మట్టిలోనే కలియుచున్నవి.

ఈ ఘటములన్నియు వాని యాకారాదులలో విభిన్నమై తోచవచ్చును కాని, వాని యందుండు ఆకాశమును పరిశీలించినచో అచట ఎట్టి భేదములేని అనంతమైన ఏకత్వమునే చూడగలుగుచున్నాము. ఉమ్మిపాత్రలోని యాకాశము, గంగాకలశములోని యాకాశము ఒకటే యగుచున్నవి. ఇట్లు ఆకాశమునకు సంబంధించినంతవరకు అది అద్వైతమే యగుచున్నది. అక్కడ ఏ విధమైన నానాత్వము లేదు. ఆ విధముగానే యీ అసంఖ్యాకమైన జీవులవెనుక అద్వైతమై, శాశ్వతమైన ఆత్మ యొక్కటే యున్నది. అన్ని రూపముల లోను, అన్నియవస్థలలోను ఆ ఆత్మతత్త్వము ఏకరూపమై, యున్నది. మన యనుభవములు విభిన్నముగా నున్నప్పటికిని, మనము సాధువులుగా ఉన్నను, హంతకులుగా నున్నను మనజీవమును ప్రకాశించు ఆత్మ సమానముగా అన్నింటి యందును ఏకరూపమై యున్నది. అయితే యీ కనబడు భేదమెట్లు వచ్చుచున్నది ? ఆ యా వ్యక్తులలో వారి వారి మనోబుద్ధులందు కలుగునట్టి భేదమే మనకు ఇన్ని భేదములుగా

కనబడుచున్నది. కాని మనమా మనోబుద్ధుల నధిగమించిన యా తురీయావస్థ యందరికి ఒక్కటేయై సమముగా తోచుచున్నది.

మనోబుద్ధుల నధిగమించినవారికి యీ నామరూప ప్రపంచమే లేదు. ఘటమునుండి విడివడిన ఘటాకాశము అనంతాకాశముతో ఏకమై పోవుచున్నది. ఆ విధముగానే దేహమనోబుద్ధులనుండి విడివడిన జీవాత్మ ఆ పరమాత్మతో నైక్యముచెందుచున్నది. అనగా తనను తాను తెలిసికొనుచున్నదని భావము. ఆ బ్రహ్మజ్ఞానములో ఈ నామరూపాత్మక ప్రపంచముగాని, కాల మానాదులుగాని ఏవియు లేనేలేవు అని వినగానే "ఆ జీవాత్మ పరమాత్మలో కలిసినవెనుక యా బ్రహ్మజ్ఞానికి ప్రపంచమే లేదని యెట్లు చెప్పగలము. ఇది యథార్థమా లేక కవియైన వేదాంతియొక్క భావనా సిద్ధాంతమా లేక ప్రపంచములోని దుఃఖములనుండి తప్పించుకొనజూచు దుర్బలుని మానసిక భ్రమయా యని మనకొక సందేహము కలుగవచ్చును. అట్టి సందేహమును 'నిర్ణయః' అని చెప్పుటద్వారా గౌడపాదుడు నివారించుచున్నాడు. ప్రపంచములోని మహర్షులు వేదాంతము నభ్యసించి, అభ్యసించిన దానిని క్రమపద్ధతిలో నాచరించి, ఆచరించినదానిని ఆంతరికముగా ననుభవించి, "తమ సహజతత్త్వము ఆ శుద్ధ చైతన్యమగు ఆత్మతత్త్వముకంటె భిన్నముకాదు" అని నిర్ణయించి నిష్కర్షగా చెప్పియున్నారు.

కా॥ నాకాశస్య ఘటాకాశో వికారావయవౌ యథా ।
నైవాత్మనః సదా జీవో వికారవయవౌ తథా ॥ ౭

ఘటాకాశము ఆ మహాకాశముయొక్క వికారము కాదు, ఆ మహాకాశముయొక్క అవయవము కాదు. అట్లే ఈ జీవుడు ఆత్మయొక్క వికారరూపము కాదు. ఆత్మయొక్క అంగము కాదు.

ఆ ఆత్మ అఖండమై, అనంతమై, సర్వవ్యాప్తమై యుండుటచేత అందు జీవాత్మ విభిన్నముగా ఉండజాలదు. మరియు ఆ పరమాత్మయందు ఒక వికారము లేదా ఒక పరిణామము జరిగినది కావున తత్ఫలితముగా ఈ జీవప్రపంచము బయల్వెడలెననియు చెప్పజాలము. ఒక వస్తువు మరియొక వస్తువుగా పరిణమించిన దానియొక్క ప్రథమరూపము నశించవలెను. పాలు పెరుగైన పాలయొక్క రూపము నశించుచున్నది. మరల యా పాలనుండి పెరుగును వడగట్టలేము కదా ? ఇట్లు, ఆ నిత్యసత్యపరమాత్మయే యిట్టి మర్త్యజీవులుగా పరిణామము చెందినయెడల, ఆ పరమాత్మ మరల తన స్వస్వరూపమును పొందవలెనని యాశించనులేదు. పొందుటకు తాను పాటుపడుటకూడ వ్యర్థమే యగుచున్నది. మరియు ఆ అమృతతత్త్వము తననుండి యీ ప్రపంచమును సృష్టించినచో తాను ముందుగా నశించవలెను. ఈ ప్రపంచమును సృష్టించిన వెనుక ఆతడే లేకపోయిన యాతనిచే సృష్టింపబడిన ప్రపంచమందలి ప్రజలు ఆతనిని స్తుతించనులేరు. స్తుతించు ఆవశ్యకతయు లేదు.

ఆ మహాకాశము ఘటాకాశమగుటకుగాను తాను విభక్తము కాలేదు. 'పాలు–పెరుగు'గా మారినట్లు తానా ఘటాకాశముగా పరిణమించను లేదు. ఈ ఘటాకాశము ఆ మహా

కాశమే యగుచున్నది. అట్లే నా లోని జీవుడు ఆ పరమాత్మ కంటె భిన్నుడు కాడు. ఇట్లు సరిగా అర్థము చేసికొనుటయే జ్ఞానమగుచున్నది. అట్టి జ్ఞానము లేనివాడు దుఃఖపడు చున్నాడు. కావున "నిన్ను నీవు తెలిసికొని పునరుద్ధరించు కొనుము. జీవించుట తెలిసికొనుము. అజ్ఞానములో జీవించుట మరణముతో సమానమే యగుచున్నది. జీవుడు ఆత్మయొక్క పరిణామముకాదు. తదంశముకూడ కాదు." అని చెప్పుట ద్వారా ఇతరమతములన్నియు ఖండింపబడి అద్వైతతత్త్వము స్థాపింపబడినది. ఆత్మ ఆవృతమైన జీవుడనియు, తన్ను తాను తెలిసికొనిన ఆ జ్ఞానమే తత్త్వమనియు ఈ పై యుదాహరణ వివరించుచున్నది.

కా॥ యథా భవతి బాలానాం గగనం మలినం మలైః
తథా భవత్యబుద్ధానామాత్మాఽపి మలినో మలైః॥ ౮

ఆకాశము మలినము చేయబడినదని బాలురు భావించునట్లు ఆత్మకూడ అపవిత్రము చేయబడినదని అజ్ఞానులు భావించుచున్నారు.

బాలురు నీలాకాశములో కాలమేఘములను చూచెదరు. తమ అపరిణత దృష్టితో చూచుటచే ఆ మేఘముల యొక్క కాలిమను నీలిమను ఆకాశమునందారోపించి, ఆకాశము మలినముగా ఉన్నది, నీలముగా యున్నది యని భావించెదరు. అదే విధముగా, మానవుని మనోగతానుభవములు ఆ పరమాత్మయందు లేవని వివేకించి గ్రహించక అతడు తన యజ్ఞానములో "ఆత్మ దుఃఖించుచున్నది, ఆత్మ సుఖించు

చున్నది" యని భావించి, మనోధర్మముల నాయాత్మ యందారోపించుచున్నాడు. వాస్తవములో శుద్ధచైతన్యరూప మగు ఆ ఆత్మయే యీ సుఖదుఃఖములను తెలియజేయు చున్నది. సూర్యుడు భూమియందలి నదీవన పర్వతాదులను ప్రకాశింపచేయుచున్నాడు. కాని యా సూర్యునిలో యీ నదీ పర్వతాదులేవియు లేవుకదా! ప్రకాశింపజేయునది ప్రకాశింపబడు వస్తువు కంటె భిన్నమే యగుచున్నది.

ప్రకాశింపజేయు తత్త్వమైన ఆత్మ తన జ్ఞానముచే మనోవృత్తులను ప్రకాశింపజేయుచున్నది. కాని యాత్మయం దెట్టి మనోవృత్తులును లేవు. అయినను మనము ఈ దేహమనో బుద్ధులయందైక్యము పొందుటచే, గ్రహించువాడు, తదను గుణముగా ఆచరించువాడు, తత్ఫలితమును అనుభవించువాడు అగు జీవుని యొకని సృష్టించుకొనుచున్నాము. ఇట్టి మిథ్యా జీవసృష్టితో మన సహజస్వరూపమును చూచుకొనునపుడు అజ్ఞానమావరించుటచే యీ జీవలక్షణములు ఆఆత్మకు సంబంధించినవే యని భావించుచున్నాము.

పచ్చని యద్దముద్వారా ప్రపంచమును చూచినపుడు అన్నివస్తువులు పచ్చగనే కనపడును. అంతమాత్రమున ప్రపంచమంతయు పచ్చగా ఉన్నదని చెప్పజాలముకదా! ఆ పచ్చదనము మనముచూచు అద్దముద్వారా కలిగినప్పటికిని మనమా పచ్చదనమును వస్తువులపై ఆరోపించుచున్నాము. ఆత్మ 'అద్వైతము శుద్ధము' అని చెప్పగా "మనచుట్టు చూచు ప్రపంచము ద్వైతమై మలినమై యుండగా ఆత్మ అద్వైతము, శుద్ధము ఎట్లు కాగలదు?" అని యాక్షేపించు పూర్వపక్షి వాదము

నకు పై యుదాహరణ ప్రత్యుత్తరమై యున్నది. ఇట్లు ప్రపంచములోని మాలిన్య, ద్వైతభావనలకు మూలకారణమును గౌడపాదుడిచట వివరించుచున్నాడు. ఛచ్ఛదనము అద్దము యొక్క దోషమెట్లగుచున్నదో అట్లే యీ ద్వైతాదులు మనస్సు యొక్క దోషములేకాని ఆ ఆత్మవి కావనియు, మనస్సులోని యజ్ఞానమును తొలగించిన యీ శుద్ధచైతన్యమే మిగులుచున్నదనియు గౌడపాదుడు వివరించుచున్నాడు. బాలురకు మలినమైన ఆకాశము విద్యావంతులకు నిర్మలమైన అకాశమగుచున్నది కదా !

కా॥ మరణే సంభవే చైవ గత్యాగమనయోరపి।
స్థితౌ సర్వశరీరేషు ఆకాశేనావిలక్షణః ॥ ౯

సమస్త దేహాంతర్వర్తియగు ఆత్మ జన్మించుచున్నది, మరణించుచున్నది, దేహాంతరమును పొందుచున్నది అను నీ భావనలన్నియు ఆ ఘటాకాశము కంటె భిన్నము కాదు.

యజ్ఞయాగాది సత్కర్మలచేత జీవులు స్వర్గమునుపొంది యచట యతీంద్రియ సుఖముల ననుభవించుచున్నారనియు, దుష్కర్మలు చేయుటచేత ఆ జీవులు పశుపక్ష్యాది నీచజన్మలెత్తుచున్నారనియు, మీమాంసకుల మతసిద్ధాంతము. జీవుని యీ దేహాంతరప్రాప్తి అద్వైతులకు అంగీకారయోగ్యమైనది కాదు. "అద్వైతమందీ గమనాగమనములు కేవలము ఆభాసమాత్రమే కావున అట్టి గమనాగమనములు అద్వైతమగు ఆత్మతత్త్వమునకు ఏ విధముగను బాధాకరములు కావు" అని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

ఈ పై విషయమును వివరించుటకే శ్రీ గౌడపాదుడు ఘటాకాశమును ఉదాహరణగా తీసికొనుచున్నాడు. ఒక ఘటము ఉత్పత్తి కాగానే ఘటాకాశముకూడ యుద్భవించి నట్లగపడుచున్నది. ఘటము పగిలిపోగానే ఘటాకాశము నశించినట్లు భావించుచున్నాము. వాస్తవములో మహాకాశము ఘటముతో జన్మించను లేదు. ఘటము పగులుటతో నశించను లేదు. ఘటముయొక్క జన్మనాశనములు ఆ మహాకాశమున యద్విధముగాను బాధించలేదు. ఘటమును ఉత్తరధృవము నకు తీసుకు పోయినను, అచటనుండి మరల దక్షిణధృవము నకు తెచ్చినను ఘటాకాశ మహాకాశములమధ్య సంబంధము మాత్రము మార్పు లేకుండగనే యున్నది. అదేవిధముగా అద్వైతమైన ఆత్మ జన్మించనులేదు, నశించనులేదు. ఆ సర్వ వ్యాపికి సంచారము లేదు. పరిమితమైన మనోబుద్ధులచే ఆత్మ యందు జీవభావము కల్పింపబడినది. తత్ఫలితముగా అది యొక దేశకాలమందు జన్మించినట్లును, మరియొక దేశకాలములందు మరణించినట్లును భాసించుచున్నది. వాస్తవములో ఒకడు జన్మించినను, మరణించినను, స్వర్గములోనున్నను, నరకములో నున్నను, ఆత్మమాత్రము అజము, శాశ్వతమునై గమనా గమనాదులు లేకయున్నది. "నా పుత్రుడు జన్మించెను. నేను మరణించుచున్నాను" అను నీ భావములుకూడ ఆ చైతన్యము వలననే తెలిసికొనబడుచున్నవి. ఆత్మయెదుట ప్రదర్శితము లగుచున్నవో యనునట్లు యివియన్నియు మనోరంగమందు ప్రదర్శితములగు దృశ్యములే యై యున్నవి. సముద్రము సంద డిగా నున్నను, శాంతముగా నున్నను, సూర్యుని కెట్టి బాధయు

లేదు. సూర్యుడు కేవలము సముద్రమును ప్రకాశింపజేయు వాడుమాత్రమే యగుచున్నాడు.

కా॥ సంఘాతాః స్వప్నవత్సర్వే ఆత్మమాయావిసర్జితాః।
అధిక్యే సర్వసామ్యే వా నోపపత్తిర్హి విద్యతే ॥ ౧౦

దేహమనోబుద్ధులయొక్క సంఘాతములన్నియు ఆత్మను అవరించియుండు అజ్ఞానముచే కలుగునవే యగుచున్నవి. అవి పరస్పరము సమానమైనవా లేక ఒకదానికంటె మరియొక్కటి అధికమా అని వాటి సామ్యమును గుఱించిగాని వాని ఆధిక్యమును గుఱించిగాని స్థాపించుటకు తగిన యుపపత్తులులేవు.

ఒక గృహమును నిర్మించుట యా గృహమందలి గోడల కొఱకు తలుపులు కిటికీలకొఱకు గాదు. ఆ గృహము యజమాని నివసించుటకై నిర్మింపబడియున్నది. అట్లే ఈ దేహమనోబుద్ధులు తమంతట తాము స్వయముగా అభివ్యక్తమగుటకు కాక అందు పరమాత్మ యనెడి యజమాని నివసించుటకై కూడియున్నవి. దేహమునకు యజమాని ఆత్మ గావున ఆత్మకుయందు ప్రవేశించుటకుగాని అందుండి నిర్గమించుటకుగాని సర్వహక్కులు గలవు. కాని యా గృహభాగములకు లోనికి నడచుటకుగాని బయటకు వెడలుటకుగాని స్వాతంత్రము లేదుకదా! సమస్త గృహములందలి గోడలు కలుసుకుని తమకు స్వాతంత్రము కావలెనని నిర్ణయించి ప్రకటించినను అవి స్వాతంత్రముగా రాకపోకలు చేయలేవు కదా! అవి కేవలము అ ఇంటికి భాగములేకాని స్వాతంత్రవ్యక్తిత్వములు గలవి కావు. జ్ఞానేంద్రియములు మనస్సులేకుండ పనిచేయ

జాలవు. మనస్సు బుద్ధిచోదితము కాకుండ ఏపనియు చేయ లేదు. ఆ బుద్ధికి తన యజమానియగు చైతన్యము లేకున్న స్వయముగా అస్తిత్వమే లేదు. ఈ మనోబుద్ధుల కలయికనే "సంఘాతము" అను పదము సూచించుచున్నది.

ఇట్లు ఆ పరమాత్మయొక్కటియే సత్యమైన, మనోబుద్ధుల సంఘాతమగు ఈ దేహభాగములకు ప్రత్యేక అస్తిత్వము కలదా యనిన, ఆ పరమాత్మ దృష్ట్యా యీ సంఘాతమునకు ప్రత్యేక అస్తిత్వము లేనేలేదని గౌడపాదుడు చెప్పుచున్నాడు మనమా దేహమనోబుద్ధులతో తాదాత్మ్యమును పొందినపుడే యీ దేహమనోబుద్ధులకు స్వతంత్రముగా ప్రత్యేకమైన అస్తిత్వము కలదు. కావున యవి స్వప్నము కంటె యధిక సత్యమైనవి కావు. ఈ మనోబుద్ధులెచటనుండి వచ్చినవని తెలిసికొనదలచినచో అది వ్యర్థప్రయత్నమే యగును కాని మన పరిమితబుద్ధి యీ సంఘాతమునకు కారణము వివరించిననే కాని తృప్తిచెందదు. అట్టి సరియైన కారణము లేకపోవుటచే ఆ శాస్త్రగ్రంథములు "ఆత్మను గురించిన జ్ఞానము లేకపోవుటయే కారణము" అని చెప్పుచున్నవి. ఇట్టి అజ్ఞానమునకు స్వయముగా ఒక స్వరూపము లేదనియే చెప్పవచ్చును. అది ఉన్నదికాదు. లేనిదికాదు. అది సత్యము కాదు. మిథ్యకాదు. సత్యమువలె భాసించు యీ ప్రపంచమునకు కారణము గలదని, చెప్పుట తాత్కాలికముగా బుద్ధిని తృప్తిపరచుటకై చేయు వ్యర్థభావనయై యున్నది. కావున యీ మనోబుద్ధులు నిజముగా ఉన్నవా లేవా యని చెప్పుటకుకూడ శక్యముకాదు. అని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

ఈ ఆత్మకంటె అధికతరమైన సత్యత్వము ఈ నామరూపము లకు గలదా లేదా యని మనము చెప్పజాలము.

రజ్జువుతో సర్పమును పోల్చినప్పుడు రజ్జువు సత్యమా సర్పము సత్యమా యని చెప్పుట ఎట్లశక్యమో అట్లే ఆత్మ సత్యమా అజ్ఞానసృష్టప్రపంచము సత్యమా అని చెప్పుటయు అత్యంతము అశక్యమగుచున్నది. సర్పముయొక్క అస్తిత్వము రజ్జువునందు లేనేలేదు. భాసమానమైన యే అస్తిత్వము సర్పమందున్నదో యది రజ్జువునుండి ఎరువు తెచ్చుకొనిన అస్తిత్వమే యగుచున్నది.

అస్తిత్వమునకు సంబంధించినంతవరకు రజ్జువు సత్యమైన యెడల సర్పముకూడ సత్యమైనదే యగుచున్నది. కాని భ్రమలో రజ్జువునందు భాసించిన సర్పముయొక్క ఆ నామ రూపములు మాత్రము అసత్యమే యగుచున్నవి. అట్లే యీ దేహమనోబుద్ధులు ఆ పరమాత్మకంటె భిన్నములు కావు. కాని వానిని మనము ఆత్మకంటె భిన్నమైన ప్రత్యేక దేహము గాను, ప్రత్యేక మనస్సుగాను, ప్రత్యేక బుద్ధిగాను గ్రహించు చున్నాము. ఈ విభేదములన్నియు ఆత్మనుగుఱించి మనకు గలిగిన అజ్ఞానముచే సృష్టింపబడినవే యగుచున్నవి.

కా॥ రసాదయో హి యే కోశా వ్యాఖ్యాతాస్తైత్తిరీయకే ।
తేషామాత్మా పరో జీవః ఖం యథా సంప్రకాశితః॥ ౧౧

పంచకోశములకు అతీతమై ఆత్మయున్నది. ఈ పంచ కోశములు తైత్తరీయకోపనిషత్తునందు విపులముగా వివరింప

బడినవి. మరియు ఆత్మ ఆ మహాకాశమువలె యున్నదను విషయమును ఇదివరకే వివరించితిమి.

నామరూపాత్మకమైన జగత్తంతయు ఆ పరమాత్మ యందు ఆరోపితమైనదేగాని సత్యమైనది కాదు అని చెప్పుటకే యింతవరకు ప్రయత్నము జరిగినది. అట్లు చెప్పిన, "తాను తప్ప మిగిలిన ప్రపంచమంతయు మిథ్య" యని విద్యార్థి భావించుట సంభవించును. అట్టి అపోహ సంభవింపకుండుటకై యిచట యీ శ్లోకములో జగన్మిథ్యాత్వము మరికొంత విశదముగా వివరింపబడుచున్నది.

"అది"అని నిర్దేశించుటకు వీలున్నవన్నియు విషయ ప్రపంచమందుచేరి యందే యిమిడియున్నవి. ఆత్మ ఒక్కటి తప్ప మిగిలినవన్నియు విషయప్రపంచమునందు చేరినవే యగుచున్నవి. కావున దూరముననున్న వనపర్వతాదులు, ఎదుటనున్న పశుపక్ష్యాదులు, తనతో కూడియుండు యితర మానవులు మాత్రమే విషయప్రపంచమునకు చెందినవారు కారు. మన దేహమనోబుద్ధులుకూడ యీ ప్రపంచములో విషయీకృతములు-అనగా ప్రపంచమందలి విషయములే యగుచున్నవి.

ఆత్మ భౌతిక పదార్థములచే ఆవరింపబడియున్నది. వేదాంత దృష్టితో శారీరకమైన విభజన చేసినయెడల మానవుని వ్యక్తిత్వము పంచకోశములుగా విభజింపబడి యున్నదని తెలియుచున్నది. ఈ స్థూలమైన దేహము అన్నమయకోశమనియు, దానియందలి సూక్ష్మశరీరము ప్రాణమయకోశమనియు, అందుండు మనస్సును మనోమయకోశమనియు

ఆ మనస్సునావరించియుండు బుద్ధిని విజ్ఞానమయకోశమనియు, దానియందుండు ఐదవదానిని ఆనందమయకోశమనియు పంచ కోశములుగా ఈ మానవవ్యక్తిత్వము విభజింపబడియున్నది. అందు ఆనందమయకోశముతో తాదాత్మ్యమును చెందు నపుడు మనము సుషుప్త్యవస్థలో ఉండెదము. ఈ పంచకోశ ముల వివరణ తైత్తరీయకోపనిషత్తులో విపులముగా విశదీక రింపబడినది. ఇచట దానిని యంత విపులముగా వివరింప కున్నను, ఆత్మనావరించిన యీ పంచకోశములు మనోగత మాయాకల్పితములు మాత్రమే యగుచున్నవని చెప్పబడి యున్నది.

మనలోని శుద్ధచైతన్యమగు ఆత్మ సర్వవ్యాపియగుటచే దానినుండి యేదియు జన్మించలేదు. దానికంటె భిన్నమైన అస్తిత్వముకూడ కలిగియుండలేదు. కాని ప్రతినిత్యము మనమీ పంచకోశములతో కూడిన జీవునితో తాదాత్మ్య మును పొందినట్లొక యనుభవమును కలిగియున్నాము. కావు ననే సత్యమువలె భాసించుచు, మనపై తమ ప్రభావమును చూపుచున్న యీ పంచకోశాత్మకమైన యావరణకూడ పరమాత్మయందు కేవలము ఆరోపితమైనదే కాబట్టి మిథ్యయే యని యీ పరమాచార్యులు మనకు చెప్పవలసి వచ్చినది.

పూర్వశ్లోకములో చెప్పబడిన సంఘాతము ఈ పంచ కోశముల సమూహమే కావున, అవియేవియు ప్రత్యేకమైన అస్తిత్వము గలవి కావు. ఆత్మ యానందించి, తన మహా త్మ్యమును కనబఱచుటకుగాను మాత్రము అవియన్నియు కూర్చబడినవే యగుచున్నవి. ఈ పంచకోశములు ఆత్మను

పరిమితము చేయుచున్నవి యని చెప్పుట యెంతమాత్రము సరికాదు. స్థూలమెప్పటికిని సూక్ష్మమైనదానిని పరిమిత పఱచ లేదు. ''రాతిగోడలు కారాగారము కాజాలవు.'' మానవుని చుట్టును గోడకట్టిన యది యాతని స్థూలశరీరముయొక్క సంచారమునే నియమించగలదుగాని సూక్ష్మశరీరమగు మనో బుద్ధుల సంచారమును ఆటంకపఱచలేదు. స్థూలము స్థూలమునే నియమించగలదగుటచే యా బంధితుని మనో భావనలకు సంబంధించినంతవరకు ఆ గోడలు ఎంతమాత్రము ప్రతిబంధకములు కావు. ఇట్లు సూక్ష్మశరీరమును బంధిం చుటకు రాతిగోడలు ప్రతిబంధకములు కానపుడు సూక్ష్మతమ మైన ఆత్మను స్థూలతరమైన దేహమనోబుద్ధులు ఏ విధము గాను నియమించి పరిమిత పఱచలేవు. ఆ పరమాత్మ ఆకాశము వంటిది. ఈ యాకాశ ఉదాహరణను, తద్వివరణనుకూడ యిదివరకే వివరించితిమి.

కా॥ ద్వయోర్ద్వయోర్మధుజ్ఞానే పరం బ్రహ్మ ప్రకాశితం।
పృధివ్యాముదరే చైవ యథాఽకాశః ప్రకాశితః॥ ౧౨

ఆకాశము ఒక్కటేయైనను పృథివియందు వేరుగాను, ఉదరమందు వేరుగాను ఉన్నట్లు తోచుచున్నది. అట్లే బ్రహ్మ కూడ ఒకటేయైనను, ఆధ్యాత్మికమని, ఆధిదైవికమని ద్వివిధ ముగా భాసించుచున్నది. ఇట్టి ద్వయములు మధుబ్రాహ్మ ణములో చక్కగా వివరింపబడి యున్నవి.

ఈ వ్యష్టిప్రపంచమే సమిష్టి ప్రపంచ మగుచున్నదని సమస్త వేదాంతగ్రంథములచే యంగీకరింపబడి, ఆచార్య

లందరిచేత వివరింపబడినదని యితః పూర్వము ఉపన్యాసము లలో దృఢపఱచి చెప్పియున్నాము. ఈ వ్యష్టి సమిష్టి ప్రపంచమును గూర్చి బృహదారణ్యకోపనిషత్తులో కూడ వివరింపబడి యున్నది. మరియు వ్యష్టిరూప విశ్వతైజసప్రాజ్ఞులకును ఆ సమిష్టిరూప విరాట్ హిరణ్యగర్భ ఈశ్వరులకును ఏకత్వము కలదని కూడ వివరించి చూపబడినది. బృహదారణ్యకోపనిషత్తులోని మధుబ్రాహ్మణాధ్యాయములు, ఆత్మీయమైనదిఆధ్యాత్మికమనియు, వైషయికమైనది ఆధిదైవికమనియు పేర్కొనబడినది. ప్రత్యేకవ్యక్తిలోని యాత్మ విశ్వవ్యాపి పరమాత్మ యగుచున్నది. ఘటాకాశముగాని, గదియందలి యాకాశముగాని మహాకాశముకంటె యెట్లు భిన్నములుకావో అట్లే యీ ప్రత్యగాత్మ ఆ పరమాత్మకంటె భిన్నముకాదు.

కా॥ జీవాత్మనోరనన్యత్వమభేదేన ప్రశస్యతే।
నానాత్వం నిన్ద్యతే యచ్చ తదేవం హి సమంజసం॥ ౧౩

జీవాత్మలకుండు అభేదయుత అనన్యత్వమే ప్రశంసింపబడుచున్నది. ద్వైతులు చూచు నానాత్వము శాస్త్రములందు నిందింపబడుచున్నది. అద్వైతమొక్కటియే సరియైనది. న్యాయమైనది.

వివేకముతోనువిచారణద్వారాను ఈ నామరూపాత్మక ప్రపంచము అసత్యమని నిరూపించి, ఆ పరమాత్మయే సత్యమను దానికి శాస్త్రప్రమాణమును గౌడపాదుడిచట చూపుచున్నాడు. సిద్ధాంతములు ఎంత మహత్తరమైనవి ఉదారమైనవి అయినప్పటికిని కేవలము అవి ఒకరి బుద్ధితో

మాత్రము సిద్ధాంతీకరింపబడిన, అట్టివానిని ఆర్యులు అంగీకరింపరు. అవి ఉన్నతమార్గముద్వారా లక్ష్యమును చేర్చు జీవితవిలువల సమూహమైయుండి నిత్యజీవితములో ఆచరణీయములై యుండిననే, ఆ సిద్ధాంతములను, ఆర్యులు తమ వేదాంతభాగములుగా పరిగణించుచున్నారు. అందుచే, ఇచట చూపబడిన సిద్ధాంతములన్నియు తనబుద్ధిబలముచే కనిపెట్టబడినవి కావనియు, ఇవన్నియు ఆ మహర్షుల వాక్యముల నాధారముగా చేసికొని పలికినవే యనియు గౌడపాదుడు చెప్పుచున్నాడు. బృహదారణ్యకోపనిషత్తులో "నేహ నానాస్తి కించన" —ఇచట యెట్టి నానాత్వమునులేదు" అని చెప్పబడి యున్నది.

"ఇదికాదు-ఇదికాదు" అని నిరసించి నిషేధించుట ద్వారా ఆ లక్ష్యమును సూచించుట వేదాంతములో ఒక మార్గమై యున్నది. కాని "ఇది అవును" అను నిర్మాణాత్మక సూచనలుగల విధులతోకాని యీ వేదాంతము పూర్తికాదు. కావున బృహదారణ్యకములో "నానాత్వము లేదు" అని నిషేధించినను ఆ జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యమును గురించి యచట వర్ణింపబడియున్నది. ఆ పరమాత్మయే యచట 'బ్రహ్మ' యను పదముతో వ్యవహరింపబడుచున్నది. ఈ విధముగా యాజ్ఞవల్క్యుని వాక్యములో నిశ్చితముగాను నిస్సందేహముగాను ప్రపంచముయొక్క నిందయు, స్థిరమై నిర్ణీతమైన అద్వైతబ్రహ్మస్థాపనయు రెండును గోచరించుచున్నవి. ఏకమేవాద్వితీయం బ్రహ్మ యనునట్లు అద్వైతమైన యీ ఆత్మతత్త్వము ఏకము. అద్వయము. ఇదియే

యుక్తము న్యాయముకూడ. ఇదియే అద్వైతమతము అని నిష్కర్షగా చెప్పి గౌడపాదుడు శ్లోకమును ముగించుచున్నాడు.

కా॥ జీవాత్మనో పృథక్త్వం యత్ ప్రాగుత్పత్తేః ప్రకీర్తితం ।
భవిష్యద్వృత్యా గౌణం తన్ముఖ్యత్వం హి న యుజ్యతే॥ ౧౪

జగత్సృష్టిని గురించి వ్యవహరించు వేదములలోని కర్మకాండలో చెప్పబడిన జీవాత్మ పరమాత్మలయొక్క పృథగ్భావము కేవలము గౌణము. రాబోవుదానిని యుద్దేశించి చెప్పబడినదగుటచే యీ భాగము గౌణము (అప్రధానము) ద్వైతప్రపంచమును గురించిన ప్రతిపాదనలన్నియు వాచ్యార్థమును మాత్రము కలిగియుండజాలవు.

వేదాంతులు ప్రతిపాదించు జగన్మిథ్యాత్వముపై ఒక పూర్వపక్ష మిచటగలదు. వేదములలోని కర్మకాండయంతయు జీవాత్మ పరమాత్మకంటె భిన్నుడు అను భావముపై ఆధారపడి యున్నది. మరియు అది పరమాత్మ యీ నానారూప ప్రపంచమును సృష్టించియున్నట్లు చెప్పుచున్నది. అంతేకాక, ఆ పరమాత్మను వివరించు పవిత్ర వాఙ్మయమైన ఉపనిషత్తులలోకూడ యీ సృష్టినిగురించి సూచనలు కలవు. కావున అజాతివాదులగు వేదాంతులయొక్క వాదమునకు ఎట్టి శాస్త్ర ప్రమాణము లేదనియు, మరియు విధిగా వేదవిరుద్ధమైకూడ యున్నదనియు పూర్వపక్షియొక్క ఆక్షేపణయై యున్నది. దానికి ప్రత్యుత్తరముగానే గౌడపాదుడిచట యీ విధముగా చెప్పుచున్నాడు. వేదములయొక్క పూర్వభాగములో ప్రత్యగాత్మ పరమాత్మకంటె భిన్నమని చెప్పియుండుట సత్యమే.

కాని వేదాంత భాగములో చెప్పబడిన విషయముదృష్ట్యా నిజమైన విద్యార్థి కర్మకాండలోని ప్రతిపాదనలు కేవలము గౌణములు (అముఖ్యములు)అని గ్రహించగలుగుచున్నాడు. కావున సాధకులను ప్రోత్సాహపరచి ఆధ్యాత్మిక శిక్షణ ననుస రించునట్లు లేదా ఆరాధించునట్లు చేయుటకుగాను, తద్ద్వారా మనోబుద్ధుల నైక్యపరచుకొని మననముచేయుట కనువగు సాధనలగా అగుటకుగాను, అటుపైని యా విషయమును ధ్యానించి తదర్థమును సరిగా అర్థముచేసికొనుటకుగాను, ప్రప్రథమముగా వేదములలో ద్వైతప్రపంచవర్ణన చేయ బడినది.

వేదాంతములోను, యితర విద్యావిభాగాలలోను, శాస్త్రీయ సిద్ధాంతములలోనుకూడ పదములకు విస్పష్టమైన రెండువిధముల అర్థములు గలవు. అవి "ముఖ్యార్థము, గౌణా ర్థము" అనునవి. వేదాంతమైన ఉపనిషద్భాగములో వివరింప బడు ఆత్మతత్త్వముయొక్క అనుభవమును పొందుటకుగాను చేయు సన్నాహముగా వేదముల పూర్వభాగములో యీ ద్వైతవర్ణన చేయబడినదని గౌడపాదుడు నొక్కి వక్కాణించు చున్నాడు.

వేదములోని పూర్వభాగములోచేసిన ప్రతిపాదనలు గౌణములు అనగా అప్రధానములు అని చెప్పుటతో తృప్తి చెందని యీ మహర్షి, పూర్వభాగములో ప్రతిపాదింపబడిన సృష్టిని నిరాకరించుచు ఆత్మను స్థాపించు ప్రతిపాదనలు వేదాంతమందు ఉండుటచే విద్యార్థి పూర్వభాగములనే ప్రధానముగా భావించినచో అది యీ విద్యార్థియొక్క అవి

వేకమే యగుచున్నది." అని చెప్పుచున్నాడు. అట్లు కాకున్న యా మహర్షి 'మతిలేనివాడు' అని భావించిన తప్పు ఆ విద్యార్థి యా పూర్వభాగమును ప్రధానమని తలచుట అసంభవము అనవచ్చును. ఏలయన వేదాంతములో అంతిమ నిర్ణయములే ముఖ్యతమములుగా పరిగణింపబడుచున్నవి. అట్టి నిర్ణయములను చేయుటకుముందు మనము అనేక ఉపపత్తులను గడపవలసియున్నది. ఇదివరకు మనము చెప్పికొనినట్లు వేదాంతము వింతపదములలో వర్ణించు వేదాంతులయొక్క స్వప్న వర్ణన మాత్రమే యని నేటి మనకాలపువారు భావించుచున్నారు. కాని పూర్వకాలములోని ఆర్యుడైన వేదాంతి కేవలము వర్ణనామాత్రమేగాక శిష్యునికి మార్గదర్శకముగా కూడ వేదాంతము ఉపయోగపడవలెనని ఆశించెడివాడు. భారతీయ మహర్షికి వేదాంతము కేవలము ఊహాగానము మాత్రమేగాక నిత్యజీవితములో అనుభవయోగ్యమే అగుచున్నది. అందుచే పూర్వభాగములలో శిష్యునకు పరిచితమైన యా యజ్ఞానభాషలోనే గురువులుకూడ మాట్లాడవలసి వచ్చెను. అటుపిమ్మట నెమ్మదిగా అచటనుండి వారిని ఆ ఆత్మతత్త్వముయొక్క ఔన్నత్యమునకు లేవనెత్తి యచటనా పరమాత్మను దర్శింపజేయుచున్నారు.

కా॥ మృల్లోహ విస్ఫులింగాద్యైః సృష్టిర్యా చోదితాఽన్యథా ।
ఉపాయః సోఽవతారాయ నాస్తిభేదః కథంచన ॥ ౧౫

సృష్టినిగురించి వివరించుట కుపయోగించిన మట్టియొక్క లోహముయొక్క విస్ఫులింగములయొక్క ఉదాహరణలన్నియు

ప్రత్యగాత్మకు పరమాత్మతో గల ఐక్యమునే బోధించుటకు ఉద్దేశింపబడినవి. వాస్తవములో ఎట్టి భేదమును లేవు. ఉన్నది అభేదమే.

వేదములలో యీ సృష్టివర్ణన కేవలము శిష్యుని ప్రోత్సాహపరచుటకే చేయబడినదని చెప్పిన, జ్ఞానమార్గమును బోధించు ఉపనిషత్తులలోకూడ యీ సృష్టివర్ణనను విధిగా ఏల చేయవలెను ? ఈ దృశ్యప్రపంచము పరమాత్మనుండి యుద్భవించినదనుటకు ఉపనిషత్తులలో చాల ఉదాహరణలు గలవు. మరియు వారు "మట్టినుండి కుండలు ఉద్భవించినట్లు" "బంగారునుండి భూషణములు చేయబడినట్లు" "అగ్నినుండి విస్ఫులింగములు బయలువెడలినట్లు" అను ఉదాహరణల ద్వారా యీ సృష్టిని వివరించియున్నారు. బృహదారణ్యకో పనిషత్తులో మనకీ పై యుదాహరణలన్నియు కనబడు చున్నవి. అదే యుపనిషత్తు కట్టకడపట నానాత్వవిశిష్టమైన యీ ప్రపంచమును నిషేధించి, "అద్వయమైన ఆత్మతత్త్వమే బ్రహ్మ" యని విధిగా నిర్ణయించుచున్నది. కావున శిష్యుని మనస్సును శాంతపఱచి, నెమ్మదిగా యతనిలోని మిథ్యాభావ ములను త్రోసిపుచ్చి 'నీవు చూచునదంతయు భ్రమ' అని చెప్పుటకే యీ యుదాహరణలన్నియు ఉపయోగపడు చున్నవి. తన తరమువారిని తరింపజేయుటకు గురువు అవలం భింపవలసిన మార్గము ఇది ఒక్కటియే యై యున్నది.

సత్యముయొక్క ఆభాససృష్టిద్వారానే శిష్యుడా జ్ఞాన ప్రకాశ ఔన్నత్యమును చేరగలుగుచున్నాడు. "సప్రపంచ త్వము ద్వారా నిష్ప్రపంచత్వమును చేరుము" అనునదే

వేదాంతుల నినాదమై యున్నది. ప్రపంచము ఎచటనుండి ఎందుకొఱకు వచ్చినదని తెలిసికొనిననే యీ మనోబుద్ధులు సంతృప్తిని పడయుచున్నవి. సంతృప్తిచే సంశుద్ధినందిన యట్టి మనోబుద్ధులే ధ్యానమునకు యోగ్యమైన వగుచున్నవి. ఒక భ్రమ మరియొక శాస్త్రీయమైన భ్రాంతిచే తొలగుచున్నది. స్వప్నములోని సింహము మిథ్యయైనప్పటికిని యది మనల నా స్వప్నమునుండి తప్పించి, మన భీతి యంతయు యజ్ఞానమైనదే యని తెలిసికొనునట్లు మేలుకొలుపుచున్నది. కావున యీ ప్రపంచవర్ణనయంతయు మాయామోహిత మనోబుద్ధులుగల వారికొఱకే యుద్దేశింపబడియున్నది. అది చంచలమనస్సును నిశ్చలపఱచునట్టి లాలిపాటవంటిది! దండయాత్రకు బయలు దేరు బుద్ధికి శాంతినినాదము వంటిది. కావున శిష్యుని దుఃఖ ప్రపంచ సరిహద్దులకు ఆడంబరముగా తీసికొనిపోయి, అచట నుండి శాంతముగా ఆ ఉన్నత సామ్రాజ్యములోనికి ఉద్ధరించు టకు ఈ ప్రపంచవర్ణన ఒక ఉపాయమై యున్నది. "ఉపాయ" అనుదానికి సరియైనపదము ఆంగ్లభాషలో లేదనేచెప్పవచ్చును.

కా॥ ఆశ్రమాస్త్రివిధా హీన మధ్యమోత్కృష్ట దృష్టయః ।
ఉపాసనోఽపదిష్టేయం తదర్థమనుకంపయా ॥ ౧౬

ఉత్తమ, మధ్యమ, హీన ఇత్యాది జ్ఞానసామర్థ్యము దృష్ట్యా జీవితమును త్రివిధయాశ్రమములుగా విభజించ వచ్చును. శాస్త్రములు అనుకంపచేతను, ఆదరముతోను అజ్ఞానులకొఱకై ఉపాసనావిధానమును ఉపదేశించెను.

సరియే వేదాంతులు నిర్దేశించినట్లు ఈ ప్రపంచసృష్టి, తత్ సృష్టికర్త యను విషయములు, అద్వితీయమైన ఆ పరమాత్మను సూచించుటకు ప్రారంభసాధకులకొరకు ఉద్దేశింపబడియుండిన, యా సాధకులయొక్క తారతమ్యమును గ్రహించుటకు మార్గమేది ? యను ప్రశ్నకు ప్రత్యుత్తరముగా ఇచట సాధకుల వర్గీకరణము చూపబడుచున్నది. ఆ యా వ్యక్తుల బుద్ధిపరిణతిని బట్టియు, మనస్తత్వమును బట్టియు, ఈ సాధకులు హీన, మధ్యమ, ఉత్కృష్టులని విభజింపబడియున్నారు. వేదాంతుల ప్రకారము ఎవ్వడును ప్రతిభావంతుడుగా పుట్టుటలేదు. మందబుద్ధిగా పుట్టుట పాపము కాదు. వేదాంతులకు ఒకని బుద్ధిశక్తి వాని మానసికస్థితిని సూచించునది మాత్రమే యగుచున్నది. ఒకని మనస్సులోని సంకల్పవికల్పములు, ఊహాపోహాలు ఎక్కువైన కొలది వానిబుద్ధిశక్తి తగ్గుచున్నదని వేదాంతులభావము. కావున మందబుద్ధి కూడ మనస్సునే కాగ్రపఱచుకొనుట ద్వారా మహత్తర పరిపూర్ణత నందవచ్చుననియు, అట్టి శిక్షణ ఉపాసనద్వారా పొందవచ్చుననియు తెలియుచున్నది. ఈ విధముగా వేదాంత సాధనచేయు సాధకులు ప్రప్రథమముగా ఉపాసనచేయుటకు ప్రోత్సహింపబడుచున్నారు. ఇట్లు ఎక్కువ కాలము ఉపాసన చేసిన, వారు తమ ఆంతరికసాధనలైన మనోబుద్ధులను పరిపూర్ణముగా నైక్యపఱచుకొన సమర్థులగుదురు. అట్టి సమత నందిన సూక్ష్మశరీరమే వేదాంతములో చెప్పిన ఆత్మజ్ఞానము నందుటకు తగిన సాధనయగుచున్నది.

హీనసాధకులు ప్రథమదశలో కొంత కాలూనుకొని అటుపిమ్మట ఉపాసనద్వారా ఆ ఉన్నతతత్త్వమును సులభముగా కనుగొనుటకు ఇచటి యీ సృష్టివర్ణన పనికివచ్చుచున్నదని వేదాంతఋషి సంతుష్టినందుచున్నాడు. అత్యంతమైన అనుకంపకలదై శ్రుతి యీ సృష్టివర్ణనను సాధకునికై చేయుచున్నది. తద్ద్వారా సాధకుడు సాధనలోని ప్రథమదశను దాటసమర్థుడు కాగలడనియే శ్రుతి యట్లు సృష్టిని వర్ణించుచున్నది. ఈ విషయములో శ్రుతిని నిందించవలసిన పనిలేదు. నీవు నీ చిన్నతమ్మునివద్ద కూర్చొనినప్పుడు వర్షము పడుచుండినయెడల, "అన్నా ! వర్ష మెట్లుపడుచున్నది ?" అని యాతడు నిన్నడిగినాడనుకొనుము. అటువంటప్పుడు నిజముగా వానియందు నీకు వాత్సల్యమనునది యే మాత్రమైన యున్న నీవు "ఈ వర్షము నీరు ఆవిరియై, ఘనీభవించి, చల్లబడి వానరూపములో పడుచున్నది" అని చెప్పవు. ఆ సమయమున నీవు "ఇంద్రుని ఐరావతము సముద్రములోని నీటిని తన తొండముతో పీల్చి, నీవంటి బుద్ధిమంతులైన బాలురు కాగితపు పడవలతో ఆడుకొనుటకై, ఆ నీటిని వానరూపములో భూమిపై జల్లుచున్నది" అనియే చెప్పుదువు. ఇచట నీ చిన్నతమ్మునకు యుద్దేశపూర్వకముగా అబద్ధము చెప్పవలెనని నీవు భావించలేదు. పైపెచ్చు ఇట్లుచెప్పుట నీ తమ్ముని విషయమై నీకు దయాదాక్షిణ్యములు గలవనియే తెలియజేయుచున్నది. అతని బుద్ధిలోని పరిమితశక్తిని యామోదించినవాడవై వాని బుద్ధిని తృప్తిపరచు కథను నీవు కల్పించి చెప్పుచున్నావు. నీ తమ్మునికి సరియైన శాస్త్రవిషయములను సుల

భముగా గ్రహించు బుద్ధిశక్తి యలవడువరకు నీవు చెప్పిన కథయే యాతనిని తృప్తిపరచగలదు. అదేవిధముగా శ్రుతి కూడ సాధకునకు బోధించుచున్నది. శ్రుతి సాధకునకు ఆత్మ జ్ఞానము కలుగవలెనని కోరుచున్నది. నామరూపాత్మక ప్రపంచము మనస్సులోని మాయా మాత్రమే యని తెలిసిననే యట్టి ఆత్మజ్ఞానము కలుగుచున్నది. అట్లుకాక ప్రారంభము నుండియు వానికి ఆ-ఆత్మతత్త్వమునే బోధించినయెడల, బాలుడైన యా సాధకుడు దానిని గ్రహించలేకపోవుటచేత అది యతనికి హానికరమగుచున్నది. కావున శ్రుతిమాత అత్యంత అనుకంపగలదగుటచేతనే సాధకునకీ సృష్టికథను చెప్పుచున్నది అని గౌడపాదుడు చెప్పుచున్నాడు. ఆమె తన బిడ్డలయొక్క స్వభావమును, వారి అజ్ఞానమును బాగుగా తెలిసికొనియే యున్నది.

కా॥ స్వసిద్ధాన్త వ్యవస్థాసు ద్వైతినో నిశ్చితా దృఢం ।
పరస్పరం విరుధ్యన్తే తైరయం న విరుధ్యతే॥ ౧౭

ద్వైతులు తాము పరిశీలించి నిర్ణయించిన సిద్ధాంతమునే తత్త్వమని దృఢనిశ్చయులై యున్నారు. కావుననే వారిలో వారు తగవులాడుకొనుచున్నారు. అద్వైతులకు వారితో ఎట్టి విరోధమును లేదు.

కపిల, కాణాద, జైనమతస్థులు, తమ తమ మత తీవ్రతలో పరస్పరము వాదవివాదములు చేసికొనుచు ఆ యా మతములను ఖండించుకొనుచున్నారు. పూర్వాధ్యాయములో మనమిదివరకే ద్వైతులయొక్క వివిధమతసిద్ధాంతములను

గురించి తెలిసికొని యున్నాము. వేదాంతులమగు మాకు వారితో నెట్టి విరోధమును లేదు. ప్రపంచసృష్టికి కారణము చెప్పుటకు తమకు శక్యముకాదని వారు తమ వాదములలో ఓటమిని ఒప్పుకొనుటచేతనే సృష్టియంతయు మాయ యని నిర్ణయమగుచున్నది. ద్వైతులు తమ వాద ప్రతివాదముల ద్వారా తుదకు అజాతివాదమునే ప్రశంసించుచున్నారు. వారిలో వారు పరస్పరము వివాదములాడుకొనుటచే వారితో మాకెట్టి విరోధమును లేదు. ద్వైతులతో అద్వైతులకు తగ వెందుకు లేదో రాబోవు శ్లోకములో వివరించుచున్నాడు.

కా॥ అద్వైతం పరమార్థో హి ద్వైతంతద్భేద ఉచ్యతే ।
తేషాముభయథా ద్వైతం తేనాయం న విరుధ్యతే॥ ౧౮

అద్వైతమే పరమార్థము. ద్వైతము దానియొక్క భేదమే యగుచున్నది. పరమాత్మయందు, దృశ్యప్రపంచ మందుకూడ ద్వైతులు ద్వైతమునే చూచుచున్నారు. కావున అద్వైతమునకు ద్వైతముతో విరోధములేదు.

పాశ్చాత్యులైన స్టీలు (Steel) ఎడిసన్ (Addison) అను రచయితలకుకూడ గౌడపాదునకు కలిగినట్టి వ్యంగ్యబాణ ములు లేవనియే చెప్పవచ్చును. ద్వైతులకును అద్వైతులకును మధ్య స్పష్టముగా విరోధము కనబడుచున్నప్పటికిని గౌడ పాదుడిచట ద్వైతులతో తమకు విరోధమే లేదనుచున్నాడు. ద్వైతులు ప్రపంచమునకు ద్వైతమే కారణమని చెప్పు చున్నారు, అద్వైతులకు ఆ పరబ్రహ్మ అద్వితీయమగు చున్నది గావున దానినుండి మరియొకటి సృష్టింపబడలేదు.

ప్రపంచసృష్టికి కారణము ద్వైతమని, ద్వైతులు చెప్పు చున్నారు కావున అద్వైతులమగు మాకు వారితో విరోధము లేదని గౌడపాదుడు చెప్పుచున్నాడు. కారణమే నానాత్వము గలది గావున కార్యము కూడ అట్టిదే అగుచున్నది. అట్టి నానాత్వముగల తత్త్వము సత్యము నిత్యము కాజాలదు. సవికారము, సవిభాగము అయిన తత్త్వమునుండి యట్టి ప్రపంచము సృష్టింపబడినది యని వారు చెప్పిన, వారితో మాకెట్టి విరోధము లేదు. పరిమితమై, ఆద్యంతసహితమైన కారణమునుండి యట్టిప్రపంచము సంభవించవచ్చును. అయితే ద్వైతులు వారి "తత్త్వము" నిత్యమైనది యనునపుడే మనకీ వివాదము వచ్చుచున్నది. పరిమితమైనది నిత్యము కాజాలదు. ఇట్లుండ ద్వైతులకు అద్వైతులకు విరోధమే లేదని చెప్పుచు గౌడపాదుడు తన వ్యంగ్యబాణమును ఉపయోగించుచున్నాడు. "ఏనుగుమీద కూర్చొనిన పురుషుని చూచి దారిప్రక్కన నిలుచున్న పిచ్చివాడు "నేను కూడా ఏనుగుమీద యున్నాను, నన్ను ఎదుర్కొనుము" అనిన తన యేనుగుబలము తెలిసియు ఆ ఏనుగుమీదివాడు ఆ పిచ్చివానిని యెదుర్కొనబోడుకదా ! "అట్లే వేదాంతులు కూడ ద్వైతులను అణగద్రొక్కుటకు ప్రయత్నింపరు సరికదా వారి వాదముల నంతగా పట్టించు కొనరు" అని శ్రీ శంకరాచార్యులు చెప్పుచున్నారు. అద్వైతి యొక్క ఆత్మజ్ఞానమునకు గల మహత్తు ఇట్టిదియే యన వచ్చును.

కా॥ మాయయాభిద్యతే హ్యేతన్నాన్యథాఽజం కథంచన ।
తత్త్వతో భిద్యమానే హి మర్త్యతామమృతం వ్రజేత్॥ ౧౯

అద్వైతమైన బ్రహ్మ వాస్తవములో అజము అగుచున్నది. కాని యీ మాయచేత అది భేదములను మార్పులను పొందినట్లు తోచుచున్నది. ఈ విభేదములే తత్త్వమైన అమృతతత్త్వము మృతము కావలసివచ్చును.

ఈ అద్వైతమే సత్యమైనయెడల మనమీ నామ రూపాత్మకమైన జగత్తు నెట్లు చూచుచున్నాము? అని ప్రశ్నింపగా మాయయే దీనికి కారణమని వేదాంతి ప్రత్యుత్తర మిచ్చుచున్నాడు. ఆ పరమాత్మ ఏకమై, అఖండమైనదగుట వలన యీ నానారూప ప్రపంచముగా మార్పునొందదు.

"అజము" అను పదమునకు గంభీరమైన భావము కలదు. జన్మగలది నశించును. జన్మ యనగా వికారమేగదా? వికారరహితమైన తత్త్వమునకు వికారము సంభవించదు. వికారమనగా మార్పేకదా. త్రాడు తనకంటె భిన్నమైన వస్తువుగా మారలేదు. అయినను మసక చీకటిలో చూచిన అది పాముగా గోచరించవచ్చును. ఇచట పాము త్రాటియొక్క పరిణామము (మార్పు) కాజాలదు. కాబట్టి యా పాము ఎట్లు వచ్చినదనిన యది మనోభ్రాంతియే యని చెప్పవచ్చును. అట్లే నిత్యసత్య బ్రహ్మతత్త్వము అద్వితీయము, ఏకము. ఈ నానాత్వవిశిష్టప్రపంచము మన మనస్సునందున్న మాయచే కల్పితమైనదే యగుచున్నది. అయినప్పటికిని ఆ తత్త్వమందు మనము నానాత్వమును చూచుచున్నట్లు తోచుచున్నది. ఈ ప్రపంచభావన కేవలము ఆత్మయందధ్యాసితమై యున్నది.

ఆ పరమాత్మయే యిట్లు నానావిధముగా విభక్తమైనది అని చెప్పినచో మనము అనేక తర్కవిరోధములను,

వేదాంతపు టసందర్భములలోను తగులొ్కనవలసి వచ్చును. తత్ఫలితముగా అమృతమైన ఆత్మ మృతమగును. పాలు పెరుగుగా మారగానే పాలరూపము నశించినది కదా. ఆ పెరుగు నుండి మరల పాలరూపమును వేరుపరచలేము. అట్లే ఆ అమృతము మర్త్యరూపమును పొందినంతనే అమృతతత్త్వము నశించుచున్నది. ఇంక యీ మర్త్యుడు పొందదగిన అమృతతత్త్వమేదియు ఉండజాలదు కదా. ఇది సాధారణబుద్ధికికూడ అసందర్భముగా తోచుచున్నదనిన లోతుగా ఆలోచించువారికి యెంత అసంగతముగా తోచునో ఊహింపవలసినదే.

అజాతివాదమును దృఢపరచుటకు ఇది గౌడపాదుని రెండవవివరణమై యున్నది. ఆతనియొక్క ఉదాత్తమైన జ్ఞానదృష్ట్యా ఈ ప్రపంచము కేవలము మాయాకల్పితము. వైతథ్యప్రకరణములో యీ విషయప్రపంచమునకు మొదటి వివరణ విస్పష్టముగా విశదీకరింపబడినది. అచట, ఆతడు "స్వయంప్రకాశమైన ఆత్మ స్వకీయ మాయాశక్తిద్వారా తనచే కలిగి తనయందే యీ ప్రపంచమున్నట్లు భావించుచున్నది" అని చెప్పియుండెను. ఆ తత్త్వమును గురించి మనము తెలిసికొనకపోవుటచే మన మనస్సు చేతనే యీ ప్రపంచము సృష్టింపబడినది కాని వాస్తవములో ఈ దృశ్య ప్రపంచము సత్యము కాదు. ఇది "ఆభాస మాత్రమే" అని గౌడపాదుడు తన రెండవ వివరణను ఇచట విశదీకరించుచున్నాడు.

కా॥ అజాతస్యైవ భావస్య జాతి మిచ్ఛంతి వాదినః ।
అజాతోహ్యమృతో భావో మర్త్యతాం కథమేష్యతి॥ ౨౦

అజాతమైన ఆత్మతత్త్వము జన్మను పొందినదని ద్వైతులు భావించుచున్నారు. అజాతమై అమృతమైన ఒక తత్త్వము మర్త్యత్వమునెట్లు పొందగలదు ?

పూర్వశ్లోకములోని భావమునే కొనసాగించువాడై శ్రీ గౌడపాదుడు జగత్కారణవాదులగు ద్వైతులపైన బడితె పుచ్చుకొని పైబడుచున్నాడో యనునట్లు తన వివేకముతో కూడిన యుపపత్తులతో ప్రశ్నించుచున్నాడు. రాబోవు అధ్యాయములో కార్యరూపమైన ప్రపంచ సృష్టిని మరికొంత తీవ్రముగాను శాస్త్రీయముగాను ఖండించబోవుచున్నాడు. అచటి సందర్భము ననుసరించి యీ శ్లోకమును మరల ఆ అధ్యాయములో చెప్పబోవుచున్నాడు.

అవికారమైన ఆత్మ వికారమును పొందుచున్నదను ద్వైతుల భావమే విరుద్ధముగానున్నది. ఈ భావమే "అమృతము మృతమెట్లగుచున్నది" యను ప్రశ్నద్వారా బయల్పడినది. కాని తర్కవాదమునకు అలవాటుపడక వేదాంత వాసనకూడలేని కొంతమంది మందబుద్ధులు "ఏల కాకూడదు ?" అని యడుగవచ్చును.

కా॥ నభవత్యమృతం మర్త్యం న మర్త్యమమృతం తథా ।
ప్రకృతే రన్యథాభావో న కథంచిద్భవిష్యతి ॥ ౭౧

అమృతత్త్వము మర్త్యత్వమును పొందజాలదు. మర్త్యత్వము అమృతముగా మారజాలదు. ప్రకృతిసిద్ధమైన తత్త్వమును మార్చుకొనికూడ అది ప్రకృతి తత్త్వముగానే ఎట్లుండగలదు ?

అమృతత్వము మర్త్యత్వమున కెన్నటికిని మారజాలదు. అట్లు చెప్పుట ప్రకృతి విరుద్ధము. ప్రకృతిలో ఒక పదార్థము తన సహజస్వరూపమును మార్చుకొనకుండ మరియొక పదార్థముగా మారుట మనమెచటను చూడలేదు. మార్పు ఉన్నచోట స్వరూపనాశము తప్పక యుండితీరును. ఎగిరేకొండలు, మంచువంటి అగ్ని, అగ్నివంటి మంచు, ఇత్యాదులు బహుశా పిచ్చివాని బుద్ధిలో సృష్టింపబడియుండవచ్చును. కాని ప్రకృతిలో అవి యసంభవములు. ద్వైతులు అమృతత్త్వము మర్త్యత్వమును పొందుచున్నదని చెప్పిన అది ఎగిరే కొండలున్నవని చెప్పుటతో సమానముగా ఉన్నది.

కా॥ స్వభావేనామృతో యస్య భావో గచ్ఛతి మర్త్యతాం ।
కృతకేనామృతస్తస్య కథం స్థాస్యతి నిశ్చలః ॥ ౨౨

స్వభావములో అమృతమైన తత్త్వము మర్త్యత్వమును పొందుచున్నది యని విశ్వసించువాడు వికారము పొందియు ఆ తత్త్వము స్థిరమై, నిశ్చలమైన తన సహజ తత్త్వమును పోషించుకొనుచున్నదని యెట్లు భావించగలడు ?

అట్టి ద్వైతమునకు మరియొక అసందర్భము కలుగగలదని యిచట కారికాకారుడు సూచించుటకు ప్రయత్నించుచున్నాడు. ఇట్లా అసందర్భమును సూటిగా సూచించుటచేత అందరకును అది ప్రత్యక్షముగా అగపడుచున్నది. "ఆ అమృతమైన ఆత్మ యీ ప్రపంచమును సృష్టించుటకై నానారూపములుగా పరిణమించినది" అని ద్వైతులు నమ్ముచున్నారు. అయినప్పటికిని ఆత్మ అట్లే అవికారమై, నిత్యసత్యమై యథా

తథముగా నున్నదని వారు నమ్ముచున్నారు. అవికారమైన తత్త్వమునుండి వికారము కలిగినదని చెప్పుచు, మరల యా తత్త్వము అట్లే అవికారమై యున్నదని చెప్పినచో బాగుగా యోచించు బుద్ధిగలవానికి అది అత్యంతము అయుక్తమై అసంగతముగా తోచును.

కా॥ భూతతోఽభూతతో వాఽపి సృజ్యమానే సమా శ్రుతిః ।
నిశ్చితం యుక్తి యుక్తంచ యత్తద్భవతి నేతరం॥ ౨౩

సృష్టి సత్యమని, అసత్యమని రెండింటికి సమముగానే ప్రాధాన్యమిచ్చి శ్రుతి చెప్పుచున్నది. శ్రుతి చెప్పినది యుక్తి వాద సహమైననే తత్త్వమని నమ్మవచ్చును. అట్లుగాకున్న దానిని తత్త్వముగా యంగీకరించజాలము.

మరల నిచట వేదాంతసిద్ధాంతము పునశ్చరణ చేయబడు చున్నది. వేదాంతులు శాస్త్రగ్రంథములకెదురు చెప్పని వారైనను, వారు శాస్త్రము చెప్పిన దానిని గ్రుడ్డిగా నమ్ము వారు మాత్రము కాదు. మహర్షులయొక్క అంతః ప్రేరిత విజ్ఞానమును వేదాంతి తప్పక గౌరవించుచున్నాడు. కాని యతనిది గ్రుడ్డినమ్మకము మాత్రము కాదు. వారి మహత్తర విజ్ఞానము నతడు ఆమోదించి హర్షించుచున్నాడు. ఆ మహర్షులయొక్క గ్రహణపద్ధతిని, వారి తర్కవాదములను బాగుగా తెలిసికొనినవాడగుటచే వేదాంతి వారి విజ్ఞానమును హర్షించగలుగుచున్నాడు. కాని అతడు యా మహర్షియే పరిహాసమునకై ఏదైన చెప్పిన అదియే బ్రహ్మ యని నమ్మె నంతటి మూర్ఖుడు మాత్రము కాడు. కావున శ్రీ శంకరులు

చెప్పినట్లు "వాదమునకు యుక్తియుక్తముగాను, పరిశీలించు వారికి సరియైన స్థిరసూక్తులుగాను" ఉన్న శ్రుతి సిద్ధాంతము లనే వేదాంతి యంగీకరించుచున్నాడు. "అగ్ని చల్లగా నుండును" అని శ్రుతి ప్రకటించిన మహర్షుల మాట కదా యని దానిని వేదాంతి యంగీకరించడు. ఒక మహర్షి యెంత గొప్పవాడైనప్పటికిని తన యున్నతపరిధులయందుండి తర్క-వాదమునకు విరుద్ధమైన ప్రకటనలను చేయలేదు. కావున శాస్త్రగ్రంథములలో అట్టి వ్యతిరేకప్రకటనలగుపడిన వాని వాచ్యార్థమునుగాక అందు ప్రతిధ్వనించు నిరూపకభావము లను మనము గ్రహించవలెను." పూర్వభాగములో పరమాత్మ నుండి ప్రపంచము సృష్టింపబడినదని వర్ణించియున్నను, ఉత్త రార్థమందు "ఈ దృశ్యమాన ప్రపంచమా ఆత్మయందు ఆరోపింపబడినది. ఇది మనస్సుయొక్క ఇంద్రజాలము" అని సూచించు "అవికారము" అను పదము ఉండుటచే, ముందు చెప్పిన సృష్టివిషయము "గౌణము" (అముఖ్యము) అని మనము తెలిసికొనవలెను. వేదాంత శాస్త్రమందు చెప్పిన రెండు ప్రధానవాక్యములను రాబోవుశ్లోకములో చర్చించ బోవుచున్నాడు.

కా॥ నేహ నానేతి చామ్నాయాదిన్ద్రో మాయాభిరిత్యపి ।
అజాయమానో బహుధా మాయయా జాయతేతుసః॥ ౨౪

"నేహనానాస్తి" "ఇంద్రోమాయాభిః" ఇత్యాది శ్రుతివాక్యములచే "ఆత్మ అజము" అని తెలిసినప్పటికిని మాయచేతనే ఆత్మ నానారూపము నందినట్లు మనకు గోచ రించుచున్నది.

గౌడపాదునిచే తఱచుగా ఉపయోగింపబడు గ్రంథములలో ప్రధానగ్రంథమగు బృహదారణ్యకోపనిషత్తునుండి పూర్వార్ధములోని రెండు ముఖ్యవాక్యములు యుదహరింపబడినవి.

ప్రథమ వాక్యములో నానాత్వవిశిష్టప్రపంచసృష్టి వాస్తవములో లేనేలేదని సూటిగాను, నిశ్చయముగాను, సంపూర్ణముగాను నిషేధించుచున్నది. రెండవ వాక్యములో "ఈ ప్రపంచమంతయు ఇంద్రునిమాయచే సృష్టింపబడినదని" యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు. ఈ వాక్యములను ఆత్మీయముగా అర్థముచేసికొనుటకు ప్రయత్నించుకొలదిని యా పదములలో కుతూహలకరమగు గంభీరభావములు గోచరించును.

ఇంద్రుడు మనస్సునకు అధిదేవతయై యున్నాడు. కేనోపనిషత్తు మొదలైన గ్రంథములలో కూడ మనస్సును సూచించుటకు ఇంద్రునే యుదాహరణగా తీసికొనియున్నారు. వేదాంతరీత్యా చెప్పవలెననిన, యీ ప్రపంచము ఇంద్రుని మాయచేత సృష్టింపబడినది యనుట ఈ ప్రపంచము మనస్సుచే సృష్టింపబడినది యనుటతో సమముగా నుండును. ఇట్లు మనోదృష్ట్యా యీ ప్రపంచము నామరూపసహితముగా కనబడుచున్నది. అమనస్కమైన ఆత్మదృష్ట్యా యీ ప్రపంచము లేనే లేదు.

"ఆత్మ అజమైనప్పటికిని బహుధా భిన్నమై భాసించుచున్నది" అనియే మనికీ రెండువాక్యములను సమీకరించిన గలుగు సారాంశమైయున్నది.

కా॥ సంభూతేరపవాదాచ్చ సంభవః ప్రతిషిధ్యతే ।
కోన్వేనం జనయేదితి కారణం ప్రతిషిధ్యతే ॥ 25

ఇట్లు సంభూతిని (సృష్టిని) నిషేధించుటద్వారా సంభవము (కార్యము) నిషేధింపబడినది. "ఆ ఆత్మను ఎవరు సంభవింపచేయగలరు ?" అను ప్రశ్నద్వారా కారణము ప్రతిషిద్ధమైనది.

వేదాంత వాఙ్మయములో శాస్త్రప్రతిపాదనలన్నియు సృష్టిని నిరాకరించుటయందే మిక్కిలి పట్టుదలగలవై యున్నవి. అట్లు నిరాకరించుటద్వారా 'ఆత్మనుండి జగత్తు జన్మించినది' అను భావమునే వారు పూర్తిగా నిరాకరించిరి. ఆ పరమాత్మ అచలము. తనకంటె వేరొక వస్తువుగా మారుటకుగాను ఆ ఆత్మ పరిణామమును చెందునదికాదు.

అన్ని యుపనిషత్తులలోకంటె బృహదారణ్యకోపనిషత్తులో ఆత్మనుండి సృష్టియొక్క యుత్పత్తి బలవత్తరముగా నిషేధింపబడినది. "ఆ పరమాత్మ పరిణామమందుటకు ఏది కారణమగుచున్నది ?" అని ప్రశ్నించిన, "ఆ ఆత్మకంటె యితరమైనదేదియు లేదుగనుక, యితరమైనదేదియు ఆత్మను సృష్టింపజాలదు" అని ప్రత్యుత్తరమీయబడినది. ఇట్లు చెప్పుట, ఈ జగత్సృష్టికి ఆత్మ ప్రత్యక్షకారణముగాని, అప్రత్యక్షకారణముగాని కాజాలదని దృఢపఱచి చెప్పుటయే యగుచున్నది. సంగ్రహించి చెప్పిన హేతువాదమే ఆ బ్రహ్మతత్త్వమందసంభమగుచున్నది. ఈ కార్య కారణభావము మనఃపరిధియందు మాత్రమే ప్రవర్తించగలదు.

కా॥ స ఏష నేతినేతీతి వ్యాఖ్యాతం నిహ్నుతే యతః ।
సర్వమగ్రాహ్య భావేన హేతునాజం ప్రకాశతే ॥ ౨౬

ఆ పరమాత్మ అగ్రాహ్యమగుటచే, ద్వైతులు దేనిని దేనిని యాత్మయని చెప్పుచున్నారో 'అది ఆత్మకాదు - అది ఆత్మకాదు' అని ఉపనిషత్తులు నిషేధించుచున్నవి. కావున అజమగు పరమాత్మయొక్కటే యున్నది. ద్వైతము లేదు.

"నేతి - ఇదికాదు, నేతి - ఇదికాదు" అను వాక్యములచేతనే ఆత్మ సూచింపబడగలదు అని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడినది. తురీయావస్థను వర్ణించునపుడు మాండూక్యోపనిషత్తులోని ఋషికూడ సంతృప్తికరమైన యిట్టి నిషేధపద్ధతిద్వారానే ఆత్మకు లక్షణము చెప్పుటలో సఫలుడైనట్లు చూచియున్నాము. ఆ పరమాత్మను మనయొక్క పరిమిత బుద్ధిచే గ్రహించుట శక్యము కాదు కావున, మన బుద్ధిచే గ్రహింపబడు ప్రతివస్తువును నిషేధించునట్టి నిషేధభాషలోనే ఆ పరమాత్మను సూచింపవలెను. మనదైనందిన యనుభవములయొక్క సరిహద్దులను మీరియుండుట చేత, మనకు ప్రాపంచిక భాషలో ఆ పరమాత్మకు నిశ్చితమై, నిర్ణీతమైన యొక లక్షణమును చెప్పలేము. కావున "నేతి, నేతి" యని యీ నానాత్వవిశిష్టప్రపంచమును నిషేధించుట ద్వారానే యీ పరమాత్మజ్ఞానమును మనకు కలుగచేయుచున్నది. పాము కాదు అని చెప్పుటచేతనే మనకు 'త్రాడు' అను జ్ఞానము కలుగుచున్నది. ఇట్టి మిథ్యారూపములు గలుగు ప్రతిచోటను ఆ భ్రమను తొలగించుటయే జ్ఞానమునకు

ప్రారంభమగుచున్నది. 'ఇది కాదు' అను నిషేధపద్ధతినే అట్టి భ్రమనివారణ జరుగుచున్నది.

పై విధముగా స్థూల సూక్ష్మశరీరములను నిషేధించిన పిమ్మట అద్వైత సత్యతత్త్వమొక్కటియే నిలుచును. అట్టి తత్త్వము నుండి ఎట్టి సత్యప్రపంచము వెలువడజాలదు.

కా॥ సతో హి మాయయా జన్మ యుజ్యతే నతు తత్త్వతః ।
తత్త్వతో జాయతే యస్య జాతం తస్య హి జాయతే॥ ౨౭

సత్తునుండి జగదుత్పత్తియైనదని చెప్పిన అది మాయా జాతమైనదే కాని వాస్తవములో ఉండజాలదు. ఇట్లు ఆ పరమాత్మ యీ జగద్రూపములో జన్మించుట సత్యమని నమ్మినవారికి ఒకసారి జన్మించినది మరల మరల జన్మించుటచే అనవస్థ వచ్చిపోవును.

ఉపనిషద్వాక్యములు ఆ అద్వైత తత్త్వమునే ప్రతిపాదించుచున్నవనియు, అట్లు ప్రతిపాదించు సమయములో నానాత్వవిశిష్ట ప్రపంచమును నిషేధించుచున్నవనియు, పూర్వ శ్లోకములో గౌడపాదుడు చెప్పియున్నాడు. ఈ ప్రపంచము నిట్లు నానారూపముగా ఎందుకు చూచుచున్నామనుదానిని యీ శ్లోకములో వివరించుచున్నాడు. ఈ ప్రపంచము మనో నిర్మితమాయాసృష్టమే గాని వాస్తవములో ఎట్టి ప్రపంచమును ఆ పరమాత్మనుండి యుద్భవింపలేదనికూడ యతడు చెప్పు చున్నాడు. మరియు వాస్తవములో ప్రపంచము సృష్టింపబడిన దనుటకు వాదదోషములున్నవనికూడ చెప్పుచున్నాడు. అట్టి సృష్టియే పరమార్థమైన వాదములో మనకు అనవస్థాదోషము

వచ్చిపోవుననియు చెప్పుచున్నాడు. ఆ పరమాత్మ అజము అవికారమునై యున్నది. అటువంటప్పుడు ఆ పరమాత్మనుండి యీ ప్రపంచముద్భవించినదని మనమంగీకరించిన యీ పరమాత్మ యీ ప్రపంచమునకు కారణమగుచున్నది. అప్పుడు, ఈ కార్యరూపజగత్తును సృష్టించు నా పరమాత్మను ఈ సృష్టియందు ప్రవర్తింపజేయుటకు కారణము ఏదై యుండును? ఇట్లు ఒక్కసారి మనమా పరమాత్మకు కారణత్వమును కల్పించిన, ఆ స్వయంభూవైన పరమాత్మకు కారణమేది ? యని ప్రశ్నింపవలసివచ్చును. ఇట్లు ఒక్కొక్కదానికి కారణాన్వేషణ చేయుచు పోగా అది అనంతమై తుదకు అనవస్థాదోషమే సంభవించుచున్నది. కావున కార్యకారణవాద మీ ప్రపంచ సృష్టికి తగదనియు, ప్రపంచమునకు పరమాత్మ కారణమని చెప్పుట తర్కవిరోధమనియు గౌడపాదుడు చెప్పుచున్నాడు.

కా॥ అసతో మాయయా జన్మ తత్త్వతో నైవ యుజ్యతే ।
వంధ్యాపుత్రో న తత్త్వేన మాయయా వాపి జాయతే॥ ౨౮

అసత్తునుండి వాస్తవముగా గాని, మాయచేగాని యేదియు జన్మించదు. వంధ్యాపుత్రుడు వాస్తవములోను జన్మించలేదు. మాయచేతకూడ జన్మించలేదు.

సత్తునుండి ప్రపంచముద్భవించినదని యీ సత్తునకు ప్రపంచకారణము చెప్పుటలో కలుగు అసందర్భములు ఇంతకు ముందు చూపబడినవి. ఇప్పుడు 'అసత్తునుండి మాయవలన యీ ప్రపంచము సృష్టింపబడియుండవచ్చును' అని వాదించు వారికి యీ శ్లోకము ప్రత్యుత్తరమై యున్నది. అసత్తునుండి

కూడ ప్రపంచసృష్టి సంభవముకాదని గౌడపాదుడు చెప్పు చున్నాడు. అసత్తు అనగా 'మిథ్య' (లేనిది) వాస్తవములో కాని భ్రాంతిలోకాని యెట్టి కార్యమును సృష్టించలేదు కదా? వంధ్యకు వాస్తవములో పుత్రుడు పుట్టలేదు. మాయలోకూడ ఆమెకు పుత్రుడులేడు. కావున యీ జగత్తు సత్తునుండిగాని అసత్తునుండిగాని యుద్భవించలేదు. ఇట్లు ఈ జగద్రూప కార్య మునకు కారణమే లేదని చెప్పుటచే కార్యరూపమగు జగత్తు సంభవించనే లేదని నిశ్చితమగుచున్నది.

కా॥ యథా స్వప్నే ద్వయాభాసం స్పన్దతే మాయయా మనః ।
తథా జాగ్రత్ ద్వయాభాసం స్పన్దతే మాయయా మనః॥ ౨౯

మాయచే స్వప్నమందు జగత్తు నానారూపముగా ఎట్లు భాసించుచున్నదో అట్లే జాగ్రత్తునందుకూడ యీ జగత్తు మాయాకారణముగానే నానారూపముగా భాసించుచున్నది.

స్వప్నములో కలతచెందిన మనస్సు మాయమైన స్వప్నప్రపంచమును సృష్టించుచున్నది. అంత స్వప్నజీవియైన యీ తైజసుడు అట్టి మనస్సుతో నైక్యము పొంది, యీ స్వప్నప్రపంచమును సత్యమని నమ్మి అందుండు సుఖదుఃఖా దుల ననుభవించుచున్నాడు. అట్లే జాగ్రత్తనందలి విశ్వునితో నైక్యము పొందిన యీ మనస్సు సత్యమువలె భాసించు మిథ్యాప్రపంచములో సుఖదుఃఖముల ననుభవించుచున్నది.

కా॥ అద్వయం చ ద్వయాభాసం మనః స్వప్నే న సంశయః ।
అద్వయం చ ద్వయాభాసం తథా జాగ్రన్న సంశయః॥ ౩౦

"అద్వయమైన మనస్సే స్వప్నములో నానారూపము లుగా చెదరి పటాపంచలగుచున్నది" అనుటలో ఎట్టి సందేహ మును లేదు. అట్లే జాగ్రత్తునందును అద్వయమైన యీ మనస్సే నానాగారూపొందినదై యీ జాగ్రత్ ప్రపంచరూప ములో భాసించుచున్నది.

సత్యమువలె భాసించు ఈ బాహ్యప్రపంచమంతయు కేవలము మనోకల్పితమే యని యీ వాదము నిర్ణయించు చున్నదని వేదాంతము వివరించుచున్నది. స్వప్నప్రపంచము నందు ప్రత్యక్షమైన ప్రతివస్తువు తైజసుని మనోవృత్తి తప్ప యితరము కాదు. అట్లే జాగ్రత్ప్రపంచములోని బాహ్యవస్తువు లన్నియు విశ్వుని మనస్సుకంటె భిన్నమైనవి కావు. స్వప్న ములో కనబడు వేటాడువాడు—వేటాడబడు ప్రాణిగా గ్రహించు వాడు గ్రహింపబడు వస్తువుగాని, అందలి భూమ్యాకాశములు గాని, తైజసుని స్థూలశరీరముగాని, అన్నియు స్వప్నమును చూచువాని మనస్సుకంటె భిన్నములు కావు. అతడు మేలు కొనినపుడాదృశ్యము లన్నియు మాయమై, ఏకమై అద్వితీయ మైన తనయొక్క మనస్సుమాత్రమే యతనికి గోచరించు చున్నది కావున, జాగ్రదవస్థలో కూడ అజ్ఞానముచే కలత చెందిన తన మనస్సే యిట్లు నానారూపములుగా చెదరి ప్రపంచరూపములో కనబడుచున్నదని యతడు గ్రహించ గలుగుచున్నాడు. ఈ ప్రపంచమునుండి పూర్తిగా మేలుకొని, యీ శుద్ధచైతన్య సామ్రాజ్యము నందినపుడు అతని కిట్టి జ్ఞానమే కలుగుచున్నది.

కా॥ మనోదృశ్యమిదం ద్వైతం యత్కించిత్సచరాచరం ।
మనసో హ్యామనీభావే ద్వైతం నైవోపలభ్యతే ॥ ౩౧

చరాచరరూపములో గ్రహింపబడు నీప్రపంచమంతయు కేవలము మనోదృశ్యమే యగుచున్నది. మనస్సు నధిగమించి యమనీభావమును పొందిన పిమ్మట యీ ప్రపంచమే యుండ జాలదు.

దృశ్యమానమగు చరాచరప్రపంచమునకు గౌడపాదు డనుగ్రహించి యిచ్చిన మూడవ వివరణ యీ శ్లోకములో కనబడుచున్నది. ఈ ప్రపంచము కేవలము ఆభాసమాత్రమే యని యిచట యతడు చెప్పుచున్నాడు. "చరాచరములు" అను పద మతి జాగ్రత్తగా ఉపయోగింపబడినది. చరము లనగా జంగమప్రాణులు, అచరములనగా స్థావరములు, జడ ములు; అని యర్థము. ఈ చరాచరప్రపంచమంతయు మనో దృశ్యమే యని చెప్పుటలో అతని భావమేమి? అనగా మనస్సు లేనప్పుడు ఈ చరాచరప్రపంచమంతయు అదృశ్యమగుచున్నది. మనము దీనిని నిత్యము అనుభవించుచున్నాము. ఒక వ్యక్తి తనకుగల సమస్యలలో మునిగి యున్నప్పుడుగాని, లేక తన పరిసరములలో జరుగు విషయముల నాలోచించునపుడుగాని యతడు తన ప్రక్కనేయుండు ఎట్టి పదార్థమును ఏ వ్యక్తిని కూడ తెలిసికొనలేడు. "మనస్సు లేనిచోట ప్రపంచము లేదు" అను విషయము మన నిత్యానుభవములోనున్నదే యగు చున్నది.

అమనీభావము, అమనస్కస్థితి యను పదములు ఒక ప్రత్యేకమైన ప్రయోగములు. ఇట్టి మనోహరమైన పదములు

మరియొక భాషలోనికి యనువదించుటకు తగియుండువు. మనస్-అనగా మనస్సు. అమనస్ అనగా మనస్సు లేకపోవుట. అమనీభావమనగా అమనస్క స్థితి యని యర్థము. అట్టి అమనస్కస్థితినుండి క్రిందికి చూచిన, అందుగ్రహించుటకునైయీ లోపభూయిష్ట ప్రపంచము లేనిదే యగుచున్నది.

'యోగశ్చిత్తవృత్తి నిరోధః' యనునట్లు, యోగమునకు లక్ష్యము మనస్సునణచివేయుట యని యిదివరకే తెలిసికొంటిమి. అట్టి అమనీభావము వలననే ప్రతిసాధన సాఫల్యము నందుచున్నది. చెదరిపోయిన యీ మనోబుద్ధులనెడి సాధనలనుఛేదించిన యీ యమనీభావమే ఒక మర్త్యుని ఆ యమృతత్వమునకు చేర్చుచున్నది, ఎచట మనస్సు అంతమొందుచున్నదో అచట దివ్యమానవత్వము ప్రారంభమగుచున్నది. అట్టి యుత్కృష్ట మానవునకు వికారమును కలిగించు మనస్సనెడి యీ సాధనములేకపోవుటచే యీ ప్రపంచము ఉండనే యుండదు. అయినను ఆతడా ఆధ్యాత్మిక సులోచనముల ద్వారా చూచుచున్నాడు కావున యతనికి సమస్తము ఆత్మమయముగానే గోచరించును. అట్టి అమనీభావమును మనమెట్లు పొందగలమో రాబోవు శ్లోకములో వివరింపబడియున్నది.

కా॥ ఆత్మ సత్యానుబోధేన న సంకల్పయతే యదా
అమనస్తాం తదా యాతి గ్రాహ్యాభావే తదగ్రహం ॥ ౩౨

సత్యతత్త్వమును తెలిసికొనిన తరువాత మనస్సులోనెట్టి సంకల్పాదులును ఉండవు. మనస్సు అట్లు సంకల్పరహితమైన యది అమనస్సు అగుచున్నది. గ్రహించువస్తువులు

లేకుండుటచే అది అగ్రహమగుచున్నది. (గ్రహణమునుండి విముక్తినందుచున్నది) గ్రహించు శక్తిలేని దగుచున్నది.

ఎవడైతే వివేకముగలవాడై బాహ్యప్రపంచమునుండి తన దృష్టిని పూర్తిగా మరల్చుకొని, దేహమనోబుద్ధులనుండి తాదాత్మ్యమును వదలుకొనుచున్నాడో, అతడు తనలోని ఆత్మతత్త్వమును తెలిసికొనుచున్నాడు. మరియు తానే యా సర్వవ్యాపి సత్యతత్త్వమై యా శుద్ధచైతన్యస్థితినందుచున్నాడు. ఆ స్థితినుండి యాతడు ప్రపంచమును చూచిన యాతనికి ఆత్మకంటె భిన్నముగా నేదియు అతనికి నగుపడదు. అనగా సర్వమును ఆత్మమయముగానే చూచుచున్నాడు. అట్టి ఆత్మ జ్ఞాని మనస్సు నధిగమించుచున్నాడు లేదా అమనీభావమును పొంది దివ్యత్వమునందుచున్నాడు అని చెప్పవచ్చును.

ఆత్మజ్ఞానమును అమనీభావస్థితియని యెందుకు చెప్పు చున్నామో ఆ కారణమును గౌడపాదుడిచట వివరించు చున్నాడు. గ్రహించు వస్తువులున్ననే మనస్సు తన స్వరూప మును నిలుపుకొని పనిచేయగలదు. నాలుగవ అధ్యాయములో దీనిని గురించి విపులమైన వివరణ గలదు. కావున ప్రస్తుతము మనస్సు ఇంద్రియములకు కేంద్రస్థానము అని తెలిసికొనిన చాలును. ఇంద్రియములు గ్రహించితెచ్చు విషయములు లేకున్న యీ కేంద్రస్థానము వట్టిపోవుచున్నది. వట్టిపోయిన మనస్సు 'అమనస్సు' అగుచున్నది. శుద్ధచైతన్యస్థితిలో జ్ఞానము జ్ఞానముకంటె యితరమైనదానిని తెలిసికొనలేనప్పుడీ మనస్సు అచట లేనిదే యగుచున్నది.

కా॥ అకల్పకమజం జ్ఞానం జ్ఞేయాభిన్నం ప్రచక్షతే ।
బ్రహ్మ జ్ఞేయమజం నిత్యమజేనాజం విబుధ్యతే ॥ 33

అజమై నిర్విషయమైన జ్ఞానము జ్ఞేయముకంటె అభిన్న మని చెప్పబడుచున్నది. అజమై, నిత్యమైన బ్రహ్మయే జ్ఞానమునకు జ్ఞేయవిషయమగుచున్నది. కావున అజముచేతనే అజము తెలిసికొనబడుచున్నది.

ఈ శ్లోకములోని పదజాలమందు గౌడపాదుడు తన ఉన్నత సత్యములను అరికట్టినాడు. అసంభవమైనదానినికూడ ఇంచుమించు సిద్ధింపజేసినాడు. అనుభవైక వేద్యములేకాని వాక్కులకందవు అనునట్టి భావములకు పదముల నమర్చి కూర్చినాడు. ఆ శుద్ధచైతన్యమును బ్రహ్మజ్ఞానమని యీ శ్లోకములో నిర్వచించినాడు. ఇట్టి నిర్వచనము శాస్త్ర వాఙ్మయమందు సాటిలేనిదై యున్నది. ఆ మహత్తర విషయము నింత యమోఘముగా ఏ మహనీయుడును ఇంతవరకు స్పృశించి యుండలేదనియే చెప్పవచ్చును.

ఆ పరమాత్మ సర్వవ్యాపియగు చైతన్యము, గుణాతీతము, అగుటచే యీ దృశ్యప్రపంచములోని పదార్థమువలె దానిని గ్రహింపలేము. శ్రుతికూడ దానికి నిశ్చితమైన నిర్వచనము నీయజాలకున్నది. కాని బదరీనాథ్‌లోని పరమాచార్యుడగు గౌడపాదుడు తన పరమానుభూతిలో అనిర్వచనీయమైన దానిని నిర్వచించుటకు తగిన నిర్వచనమును కనుగొనినాడు.

వేదాంతములో "జ్ఞానము" అను పదము మనమీ విషయప్రపంచములో నుపయోగించు జ్ఞానముయొక్క యర్థ

ములో నుపయోగించినది కాదు. మనమీ విషయప్రపంచ ములో 'జ్ఞానమనగానే దేనియొక్క జ్ఞానము ? తెలిసికొని నాము అనగానే దేనిని ?' యని సంబంధబద్ధముగా జ్ఞానమును ఉపయోగించుచున్నాము. కావున యీ జ్ఞానము తద్విషయ మైన వస్తువుయొక్క రూపగుణాదులచేత సమర్థతగలదగు చున్నది. ఇట్టి గుణీకృత (గుణాదులచే కలుగు) జ్ఞానము వస్తు వునుబట్టి మారుచునే యుండును. కాని యిచట సర్వవ్యాపి యైన బ్రహ్మజ్ఞానమును విశదపఱచుటయే ఆచార్యుని ప్రయ త్నమై యున్నది. దీనిని ఉదాహరణద్వారా వివరించిన యిది స్పష్టముకాగలదు.

వివిధవర్ణములు, వివిధయాకారములు గల యనేక సీసా లలో ఒకే రకమైన నీటిని పోసినను, ఆ యా సీసాల ఆకార వర్ణములచే ఆ నీరు కూడ విభిన్న ఆకారవర్ణములు గలదై కనబడుచున్నది. మనము నీటిని తెలిసికొనవలెననిన, ఆ యా సీసాల ఆకారవర్ణములను బట్టి "నీలము నీరు" "పొడుగు నీరు" అని నీటి తత్త్వమును తెలిసికొనముకదా! అది నీటియొక్క తత్త్వమును తెలిసికొనుట కాజాలదు. నీటికి వర్ణముగాని ఆకారముగాని లేనేలేదు. అట్లే మనకు కేవలము వస్తువిషయక జ్ఞానమే యుండుటచే ఆ యా వస్తువును బట్టి మన జ్ఞానముకూడ మారుచున్నది. ఇచట బ్రహ్మజ్ఞానమును లేదా శుద్ధజ్ఞానమును తెలియజెప్పుటకే ప్రయత్నము జరుగుచున్నదని మనము తెలిసికొనిన యీ శ్లోకార్థము స్వయంవ్యక్తమగుచున్నది.

మార్పులేనిదై, సంకల్ప వికల్పరహితమైన జ్ఞానమే శుద్ధచైతన్య మగుచున్నది. అదియే సమస్తజీవులలోను జీవ

కేంద్రమై యున్నది. మనస్సులో భ్రాంతికలుగగానే యలజడి బయలుదేరు చున్నది. అట్టి మనోవృత్తులచే నియమితమైన ఆత్మకూడ చెదరిపోవుచున్నది. అంత మన మా ఆత్మను తెలిసికొనుటకు బదులు మన మనోవృత్తులనే తెలిసికొను చున్నాము. క్షణక్షణము మనోవృత్తులు మారుచుండుటచే మనమా మనోవృత్తివిషయక జ్ఞానము కలవారము మాత్ర మగుచున్నాము. ఇప్పుడు జ్ఞానమును యథార్థరూపములో నిర్వచించుటకు ప్రయత్నము జరుగుచున్నది. మనస్సు సంకల్ప వికల్ప రహితమైనంతనే జ్ఞానము స్వవిషయకమైనది యగు చున్నది. తన్నుతాను తెలిసికొనుటలో నది ఘనీభూతమైన శాశ్వత బ్రహ్మజ్ఞానముగానే మిగులుచున్నది.

జ్ఞానము బయలువెడలినదో యనునట్లు అది సాధారణ ముగా విషయము నావరించుచున్నది. అట్టి విషయమును మనము తెలిసికొనినామనినప్పుడు ఆ విషయమును మన మన స్సులో ప్రతిబింబింపచేయుచున్నది. ఉదాహరణకు మన జ్ఞానమొక పుష్పమును గ్రహించుటకు బయలువెడలినప్పుడు అట్టి పుష్పము ఆ జ్ఞానముకంటె భిన్నముగానుండజాలదు. జ్ఞాన మా పుష్పము నావరించుటచే పుష్పపరిమిత జ్ఞానమును నిస్సంశయముగా మనము వాస్తవములో అనుభవించు చున్నాము. అందుచేతనే మనకు పుష్పజ్ఞానము కలిగినదని చెప్పుచున్నాము. ఆ పుష్పజ్ఞానము, బయట వస్తురూపములో నున్న పుష్పము, ఈ రెండును ఒకేసారి మనలో నుండ జాలవు. జ్ఞానమా పుష్పాకారమునందుచున్నది. అంత తదా కారాకారితమైన జ్ఞానమే మనలో నుండును గాని పుష్పము

వేరుగాను, జ్ఞానము వేరుగాను నుండజాలదు. అయినను యీ మనోవృత్తులు క్షణక్షణము మారుచుండుటచే జ్ఞానముకూడ చెదరిపోయి, మనకు సరియైన వస్తుజ్ఞానము లేకుండ పోవుచున్నది.

మరియొక వేదాంతగ్రంథములోకూడ యీ మహత్తర సత్యము విపులముగా వివరింపబడినది. పాము యొక్క వాస్తవ తత్త్వమును తెలిసికొనగానే యా పాము త్రాటిలో లీనమగుచున్నది. అంత మన జ్ఞానము సంపూర్ణమగుచున్నది. అట్లే ప్రపంచములోని సమస్తవస్తువులు అదృశ్యమైపోగానే మన జ్ఞానము సఫలతనందుచున్నది. కావున ఎప్పుడు మనస్సు బాహ్యవిషయములను గ్రహించదో, మన మనస్సెప్పుడు సంకల్ప వికల్ప రహితమగుచున్నదో, మన మనోబుద్ధుల యందు దా పరమాత్మ యెప్పుడు ఆవరించియున్నదో, ఇట్లు ఆ ఆత్మ అనాత్మవిషయముపై విజయము పొందుచున్నదో అట్టి క్షణమే ఆత్మజ్ఞానమును పొందిన క్షణమై యున్నది. జ్ఞానము తన్నుతాను చుట్ట చుట్టుకొనిన అట్టి ఆత్మజ్ఞానక్షణమందు ఆత్మ యొక్కటే మిగిలి యున్నది. జ్ఞానము జ్ఞేయము లేక యుండ లేదుకావున "ఆత్మజ్ఞానమునకు తెలియదగు జ్ఞేయము ఏమై యున్నది ?" అను సందేహము కలుగుచున్నది. అట్టి సందేహమును గౌడపాదుడీ క్రిందివిధముగా నివారించుచున్నాడు. బ్రహ్మజ్ఞానమునకు విషయము ఆ బ్రహ్మయే యగుచున్నది. అనగా ఆత్మజ్ఞానము గ్రహించుటకు ఆత్మకంటె వేరువస్తువు లేదు గావున ఆత్మ విషయకజ్ఞానమే ఆత్మజ్ఞానమునకు విషయమగుచున్నదని భావము. ఆత్మ ఆత్మనే తెలిసికొనుచున్నది.

కావుననే ఆచార్యుడు "అజమును అజమే తెలిసికొనుచున్నది" అని చెప్పుచున్నాడు. అమృతమే తాను అమరమైనదని తనను తెలిసికొనగలుగుచున్నది. ఆ బ్రహ్మమునుగుఱించి బుద్ధి యోచించలేదు. మనస్సు భావించలేదు. మనోబుద్ధుల నధిగమించినంతనే ఈ ప్రత్యగాత్మ ఆ పరమాత్మలో లీనమగుచున్నది.

కా॥ నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః।
ప్రచారః సతు విజ్ఞేయః సుషుప్తేఽన్యో న తత్సమః॥ 34

నిర్వికల్పమై, నిగృహీతమైన వివేకవంతుని మనస్సుయొక్క ప్రచారమును తెలిసికొనవలెను. సుషుప్తిలోనిమనస్సు సర్వథా భిన్నమై యున్నది. అది ప్రశాంతముగా అణచబడిన మనస్సుతో సమానమైనది కాదు.

ఇంతవరకు ఆచార్యుని చర్చలను వినుచున్న విద్యార్థికి యొక సందేహము కలుగవచ్చును. మనస్సులేని అమనీభావస్థితియు సుషుప్తిలో మనమనుభవించునట్టి స్థితివంటిదేనా? యని యతడు సందేహించుచున్నాడు. ఎచట మనస్సు బాహ్యవిషయజ్ఞానము లేనిదై తనను తాను తెలిసికొను స్థితిలో యున్నదో అదియే శుద్ధచైతన్యస్థితి యని మనకిది వరకు చెప్పియున్నారు. ఈ భ్రాంతజీవులకు తెలిసినంతవరకు అట్టి స్థితి జాగ్రత్స్వప్నానుభవముల కతీతమైన సుషుప్తి యనుభవ మొక్కటియే యగుచున్నది. కావున అట్టి సుషుప్తియే యీ ఆత్మజ్ఞాన స్థితియేమోనని అపోహ పడకుండుటకై యీ ఆత్మ జ్ఞానస్థితి సుషుప్తికంటె సర్వథా భిన్నమైనది యని స్పష్టముగా వివరించుచున్నాడు.

ఈ కారికలు మాండూక్యోపనిషత్తునకు వ్యాఖ్యానముగా వ్రాయబడినవని మరువరాదు. జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడవస్థలు గలవనియు, వీని నధిగమించిన తురీయావస్థ నందగలమనియు, అచట చేరిన పిమ్మట ఆ జ్ఞానికి యీ దృశ్య ప్రపంచమే లేనిదగుచున్నదనియు ఈ యుపనిషత్తు చెప్పియున్నది. ఇచట ఆ తురీయావస్థ యెట్టిదో సరిగా చెప్పుచున్నది.

ఏడవ మంత్రములో నిశ్చితనిషిద్ధభాషలో ఆ తురీయావస్థను నిర్వచించి వివరించినది. కాని మనము లోపభూయిష్టమైన మనోబుద్ధులనెడి సాధనలను గలవారమగుటచే మనలో కొంతమంది దానిని సరిగా అర్థము చేసికొనకపోవుట సంభవించుచున్నది. ఇచటి పదప్రయోగములను జాగ్రత్తగా ననుసరించిన మన యీ బుద్ధితో కూడ కొంతవరకు ఆ తురీయ స్థితిని యర్థము చేసికొనగలము. తీవ్ర ధ్యానములో మనస్సును సంపూర్ణముగా స్వాధీనము చేసికొనవలెను. అట్లు స్వాధీన పఱచుకొనుటకై మనఃప్రచారమును బలవంతముగా అణచి వేయకూడదు. మనఃప్రచారమునట్లు ఆపివేసి అణచివేయుట దివ్యత్వమునందుటకు మార్గముకాదు. మనస్సులో గలుగు ఏహ్యమగు సంకల్ప వికల్పాదులనుండి యీ మనస్సును వివేకముతో విరమింపజేయవలెను. వివేకముచేత స్వాధీన పఱచుకొనకుండ హఠాత్తుగా ఒక్కసారిగా ఆ మనస్సును అణచివేయ ప్రయత్నింపరాదు. వివేకము ద్వారా విశ్వాసమును కలిగించి, యీ మనస్సును ఒప్పించి, యందుండి యీ మనోవృత్తులను ఆవలకు త్రోసివేయవలెను. కావుననే "చిత్త

బాలం లాలయ-చిత్తమను బాలుని లాలింపుము'' అని చెప్పి యున్నారు. లాలించిన బాలుడు చెప్పినమాట వినుచున్నాడు కదా. కావున శుద్ధ వివేకముద్వారా స్వాధీనపఱచుకొనిన మనస్సే మనల నాఆధ్యాత్మిక పరిపూర్ణతనందుకొన చేయుచున్నది.

ఈ కారణముచేతనే పార్థసారధిని, అర్జునుని రథమునకు పూన్చిన అయిదుగుఱ్ఱములను పగ్గముతో పట్టియుంచినట్లు వర్ణించి యున్నారు. కఠోపనిషత్తులోకూడ రథకథ వర్ణింపబడి యున్నది. అచటకూడ శుద్ధబుద్ధినే సారథిగా వర్ణించినారు. ఇట్లు తన పంచేంద్రియములను మనోనిగ్రహముతో స్వాధీన పరచుకొనిన శుద్ధ వివేకబుద్ధిగల జీవి మాత్రము ఆ పరమాత్మను చేరుటకు భయరహిత ప్రయాణమును చేయగలుగుచున్నాడు. మనస్సును స్వాధీనము చేసికొను వివేకము లేకపోవుటచేతనే యనేక సాధకులు తమలో నెట్టి పురోభివృద్ధిని గాంచలేనివారై, అనేక సంవత్సరములు తీవ్రధ్యానమును చేయుచు తమను తాము చెరచుకొనినామని భావించుచున్నారు. వారికి వచ్చిన చిక్కేమి యనగా వారు తమ మనస్సును బలవంతముగా అణచివేయ ప్రయత్నించుచున్నారు. తత్ఫలితముగా వారు తమ మనస్సును నశింపజేసికొనుచున్నారు గాని పరిశుద్ధి చేసికొనుటలేదు. ఇట్లనేకమంది యోగులు గిరి గహ్వరములందు తీవ్రధ్యానాదులు చేసియు, ఇతఃపూర్వముకంటె కామక్రోధాదు లధికమై యందుండి పిశాచములవలె బయలువెడలుచున్నారు. బలవంతముగా త్రొక్కి-వేయబడుటచే ఆకారము, అందముచెడి వికారరూపమును

పొందిన మనస్సుగలవారికి వీరు ఉదాహరణమై యున్నారు. ఇట్టి అపాయమునుండి తొలగించుటకై సాధకులకు ముందు జాగ్రత్త చెప్పుచున్నవాడై, 'మనస్సును వివేకముచే స్వాధీన పరచుకొని యందుండి సంకల్ప వికల్పములను నెమ్మదిగా తొలగించవలెను' అని ఆచార్యుడు హెచ్చరించుచున్నాడు. ఇట్లు వివేకముద్వారా మనస్సును స్వాధీనపరచుకొనిన యప్పటి స్థితిమాత్రము నిద్రమత్తువలె మాంద్యము గలది కాదు. నిజ ముగానే నిద్రలో మనస్సు పనిచేయుటలేదు. కాని తన పూర్వవాసనలతోకూడి అజ్ఞానమందు మునిగి అది అశక్తమై యున్నది. కావున మనస్సును నేర్పుగా శుద్ధిచేసుకొని, స్వేచ్ఛగా ప్రవర్తింపజేసి, వివేకముతో స్వాధీనము చేసి కొనిన యది పవిత్రమగుచున్నది. అప్పుడు మిగులునది అజ్ఞా నముయొక్క జ్ఞానముకాక జ్ఞానముయొక్క జ్ఞానమే యగు చున్నది. అది వ్యతిరేకమైన సుఖానుభవము కాదు. చురుకై నదై, అనుకూలమైన ఆనందానుభవమే యగుచున్నది.

కా॥ లీయతే హి సుషుప్తే తన్నిగృహీతం న లీయతే ।
తదేవ నిర్భయం బ్రహ్మ జ్ఞానాలోకం సమన్తతః ॥ ౩౫

సుషుప్తిలో మనస్సు విశ్రాంతి నొందియున్నది. లేదా అజ్ఞానములో మునిగియున్నది. కాని వేదాంతశిక్షణ పొందిన మనస్సు అట్లుండదు. కావున యనుభవముపొందుటలో సుషు ప్తియందలి మనస్సునకును, ఆత్మజ్ఞానమందలి మనస్సునకును భేదముగలదు. జ్ఞానియొక్క మనస్సు భయరహితమైన బ్రహ్మతో ఐక్యమును పొందుచున్నది. ఆ సమయమందు

దానిని పరిమితపరచునది అదియే. అనగా ఆత్మచేతనే ఆత్మ వ్యాప్తమైయున్నది. అన్ని వైపుల జ్ఞానప్రకాశమే నిండి యుండును.

పూర్వ శ్లోకములో ఆత్మజ్ఞానమునందిన స్థితియు, సుషుప్తిలోని మానసిక స్థితియు ఒకటి కాదని సూచించి యున్నారు. ఇప్పుడీ శ్లోకములో యీ రెండింటి మధ్యగల భేద మును విపులముగా విశదపరచుచున్నారు. సుషుప్తినందిన ప్రాజ్ఞుని మనస్సు తాత్కాలికముగా అజ్ఞానములో మునిగి సదా యనునట్లు వాసనలతో కూడినదై యణగి యుండును. తన భాగమును నటించు సమయము వచ్చువరకు తెరవెనుక నుండు నటకునివలె యీ మనస్సుండును. ఆ మనస్సచట కొంత విశ్రాంతి తీసికొని మరల మేలుకొన్నదై ప్రపంచ రంగముమీదికి వచ్చి తన కామక్రోధాదులతోను ఆశా ఆతు రతీలతోను కూడిన నటనను ప్రారంభించును.

జ్ఞాని మనస్సు వివేకముతో బాగుగా పుటము పెట్ట బడి, ధ్యానముచే పరిశుద్ధము చేయబడినదై సమాజమునుండి తొలగించబడిన నటుడు మరి రంగముపైకి రానట్లు ఆశా ఆతురతలతో కూడిన ప్రపంచ రంగముపైకి మరల యతని మనస్సు రాజాలదు. ఇట్లు సుషుప్తిలోను ప్రాజ్ఞుని మనస్సు నకును జ్ఞానియొక్క మనస్సునకును ప్రస్ఫుటమైన భేదము కలదు. ఇట్లు పుటమువేయబడి త్రోసివేయబడిన మనస్సు ఏమగుచున్నదని సందేహము కలుగవచ్చును. అట్టి మనస్సు బ్రహ్మతో నైక్యము పొందుచున్నదని గురువు చెప్పు చున్నాడు. రజ్జు సర్పమును జ్ఞాపకము చేసికొనిన మనకీ విష

యము విశదము కాగలదు. త్రాటి యందు పాము ఆరోపితమై నట్లు మన స్సు పరమాత్మయందారోపితమై యున్నది. ఆ సర్ప జ్ఞానము తొలగగానే త్రాటియొక్క జ్ఞానము కలుగుచున్నది. వెంటనే యా సర్పము త్రాటితో నైక్యముపొందుచున్నది. అంత సర్పము వాస్తవములో లేనిదే యగుచున్నది. అట్లే మనస్సును తొలగించిన ఆత్మజ్ఞానము కలుగుచున్నది. అట్టి జ్ఞానములో మన స్సు పరమాత్మతో నైక్యము పొందు చున్నది. పాముయొక్క భాగములేవియు త్రాటియందు లేవు కదా! అట్లే యీ ప్రపంచమేదియు ఆ పరమాత్మ యందుండజాలదు.

ఎండమావులలోనున్న జలము, బుడగలు, తరగలు, సూర్యప్రతిబింబము ఇత్యాదులన్నియు ఆ ఎడారికన్న భిన్న ములు కావు కదా! అట్లే యీ విషయప్రపంచము, దేహ మనోబుద్ధులు ఆత్మజ్ఞానమందినవానికి ఆత్మకంటె భిన్నములు కావు. ఆ శుద్ధచైతన్యముయొక్క కాంతికిరణ ప్రసారములో మనస్సు కొట్టుకొనుచున్నంత కాలము, భయంకరమైన, సత్యమై, సత్యాభాసమైన ప్రపంచము మనముందర భాసించు చునే యుండును. అట్టి మనస్సును వివేకముతో ఉపసంహ రించుకొనిన అచట మిగులునది ఆ ఆత్మానుభవమొక్కటియే.

కా॥ అజమనిద్రమస్వప్న మనామక మ రూపకం।
సకృద్విభాతం సర్వజ్ఞం నోపచారః కధంచన॥ 36

ఆ బ్రహ్మ అజము, అనిద్రము, అస్వప్నము, అనామ కము, అరూపకము, సకృద్విభాతము, సర్వజ్ఞము అయి యున్నది. అట్టి బ్రహ్మకు ఎట్టి పూజాదులును అవసరములేదు.

పరమాత్మ యొక్క సహజధర్మములను ఈ పరిమిత భాషలో నిర్వచింప శక్యము కాదు. ఆత్మ అనంతమైనది. అట్టి ఆత్మను ఈ పరిమితభాషలో నిర్వచింప అశక్యమైనను, పూర్వశ్లోకములో మనస్సు ప్రశాంతినొందిన ఆత్మజ్ఞానానుభవము కలుగుచున్నదని చెప్పబడియున్నది. గౌడపాదుడీ శ్లోకములో ఆ పరమాత్మను పదములతో సూచించుటకు ప్రయత్నించుచున్నాడు. వేదాంతగ్రంథములో ఆ ఆత్మ సూచింపబడు చున్నదే కాని నిర్వచింపబడుటలేదు. ఇచట ఆ ఆత్మ యొక్క జ్ఞానము కలుగుటకై విపులమై, అధికార యుక్తమైన సూచనలు గలవు. ఆచార్యుడు వీనిని వ్రాయునపుడు అతనికి గల మేధాశక్తిని కనుగొనవలెనని సహానుభూతిగలవారమై మనమా స్థితిని యందుకొనవలెను. అట్లా స్థితిని చేరి మనమా పదములను పరిశీలించిన మనకా పదములు ఆత్మతత్త్వమును సూచించుటకు సమర్థము లగుచున్నవి.

అజం–జన్మలేనిది. దీనిభావమిదివరకే వివరింపబడినది. మార్పు లేనిది యనగా జన్మలేనిది యనియేకదా భావము. ఆ పరమాత్మ సదా సమమైనది. అది యెట్టి పరిణామమును పొందదు.

అనిద్రం – నిద్రలేనిది. నిద్రయనగా మనమనుభవించు సుషుప్తి యని యర్థము చేసికొనరాదు. ఇట్టి అర్థమునే కొంత మంది పండితులు చెప్పుటచేత హైందవ సంఘములోని సాధారణ తరగతికి చెందిన ఇట్టి పిచ్చినమ్మకములు గలవారగు చున్నారు. పరమగురువులు నిద్రపోరు విశ్రాంతి తీసికొనరు అని వారి నమ్మకము. ఇట్టి భావముతో నిద్రయను యీ పద

మిచ్చుట ఉపయోగింపబడలేదు. భౌతిక దేహము భౌతిక పరిధిలో పనిచేయుచున్నంతసేపు, మరల కొంత తేరుకొనుటకై తప్పక నిద్రపోవలెను. ఆ పరమాత్మ అనిద్రం – నిద్రలేనిది యనగా సుషుప్తిలో ప్రాజ్ఞుడనుభవించు కారణశరీరము లేనిది యని భావము. ఆనందమయ కోశములో జీవుడనుభవించు స్థితియే నిద్రయగుచున్నది. ఆ స్థితినికూడ యధిగమించగనే ఆత్మను పొందనగును. దీనిని గురించి యిదివరకే చర్చించితిమి. నిద్ర యనగా మనస్సు అజ్ఞానములో మునిగియున్నప్పటి స్థితి. కావున యిచట 'నిద్ర' యను పదము 'అజ్ఞానము' అను నర్థములో ఉపయోగింపబడినది. ఆత్మ శుద్ధ జ్ఞానస్వరూపమగుటచే ఆత్మజ్ఞాన సమయములో అజ్ఞాన చిహ్నములు కొంచముకూడ మిగిలియుండజాలవు. త్రాటియొక్క జ్ఞానము లేకపోవుటచేతనే సర్పభ్రాంతి కలుగుచున్నది. సత్యమైన త్రాడుయొక్క జ్ఞానము కలిగినంతనే సర్పభ్రాంతిని కలిగించిన యజ్ఞానము కొంచెముకూడ అచట నిలువజాలదుకదా. అట్లే ఒక్కసారి ఆత్మజ్ఞానమును పొందినపిమ్మట సత్యజ్ఞానాభావరూపమగుఅజ్ఞానము, తత్ఫలితమగు మాయాసృష్ట ప్రపంచము కూడ మిగిలి యుండజాలవు.

అస్వప్నం – స్వప్నములేనిది. స్వప్నపదముచే స్వప్న జాగ్రత్తులు రెండును సూచింపబడుచున్నవి. జాగ్రత్స్వప్నములు లేనిది యని భావము. ఈ జాగ్రత్స్వప్నములు రెండును సత్యజ్ఞానము లేకపోవుటచే కలిగిన అజ్ఞానముచే సృష్టింపబడిన మాయా జగత్తులే యగుచున్నవి. కావుననే వేదాంతికి జాగ్రత్ప్రపంచముకూడ స్వప్నతుల్యమే యగుచున్నది. స్వప్న

మనగా మనస్సుచే సృష్టమైన నామరూపాత్మక జగత్తు, అందలి సుఖదుఃఖాదులు మొదలైనవి. ఇవన్నియు ఆత్మ జ్ఞానము లేకపోవుటచే కలుగు అజ్ఞానముచేతనే సృష్టింపబడి నవి. ఆత్మజ్ఞానములో నట్టి యజ్ఞానములేదు. కావున తత్సృష్ట నామరూపాత్మక జగత్తుకూడ లేదు. త్రాడు రూపమే లేన పుడు సర్పభ్రాంతియే లేదుకదా. త్రాడు ఉన్ననే కదా భ్రాంతిచెంది దానిని సర్పముగా మనము గ్రహించు చున్నాము. ఇట్లు భ్రాంతికారణమైన అజ్ఞానమే లేనప్పుడు భ్రాంతికూడ ఉండజాలదు.

అనామకం, అరూపకం – నామరూపములేనిది. నామ రూపాత్మకమైన యీ మాయా ప్రపంచమంతయు ఆ తత్త్వ మందు లేనిదే యగుచున్నది. కావున ఆ తత్త్వము నామ రూపములు లేనిది యని చెప్పబడుచున్నది.

సకృత్ విభాతం – సదా ప్రకాశించునది. వందల కొలది యుపనిషత్తులు ఆత్మ స్వయంప్రకాశమైనదని వర్ణించి యున్నవి. ఇచట ప్రకాశమనగా సూర్యప్రకాశమనిగాని, అగ్ని ప్రకాశమనిగాని భావించరాదు. 'జ్ఞానమునకు అది జ్ఞానము' అనగా అది శుద్ధజ్ఞానము లేదా శుద్ధచైతన్యమని భావము. అది స్వయంప్రకాశమగుటచే దానిని గ్రహించుటకు మరియొక జ్ఞాత యుండనవసరములేదు. అది స్వయముగా జ్ఞానస్వరూ పము. ఈ పదము రాబోవు అధ్యాయములో మరికొంత విశ దముగా వివరింపబడినది. సర్వజ్ఞం – సమస్త జ్ఞానముగలది. ఎచట యెచట ఏ యే విధమైన జ్ఞానముకలదో ఆ యా జ్ఞాన ములకు జ్ఞానమైనదీయాత్మ. అట్లగుటచే నిది భూతభవిష్యద్వ

ర్తమాన జ్ఞానములన్నిటిని అఖండముగాను ఏక జాతీయము గాను ప్రకాశింపజేయుచున్నది. సర్వవ్యాపియై నిత్యసత్యమైన ఆ పరమాత్మను నిర్వచించుటకు 'సర్వజ్ఞం' అను పదముకంటె వేరొకటి తగినది లేదని చెప్పవచ్చును.

ఇట్లీ శ్లోకములో 'ఇదికాదు – ఇదికాదు' అని జగత్తునకు సంబంధించిన అనుభూతులను నిషేధించు, నిషేధభాష లోను, సర్వజ్ఞం, అద్వైతం ఇత్యాది విధిభాషలోను ఆ పరమాత్మ సంపూర్ణముగా నిర్వచింపబడినది.

ఈ సత్యమును తెలిసికొనుటకై యెట్టి యజ్ఞయాగాది కర్మలు చేయనవసరములేదు. ధ్యానము ఆత్మజ్ఞానమునకు 'కారణము' కాజాలదు. ఆత్మ సాధనచే పొందబడినదని చెప్ప లేము. అట్లు చెప్పిన ఆత్మజ్ఞానము ఒక కారణమునకు కార్యమగుచున్నది. కార్యకారణ ప్రపంచమంతయు నశించునదే గావున ఆత్మజ్ఞానమనెడి దివ్యత్వము కూడ నశించునదే యగును. వేదాంతులగువారు ధ్యానసాధనలద్వారా నాశకరమై, అంతవంతమగు అజ్ఞానమును నశింపజేసికొనిన పిమ్మట స్వయంప్రకాశమైన ఆత్మయొక్కటియే తన్నుతాను తెలిసి కొనుటకు వారికచట మిగిలియున్నది. మేఘములను తొలగించవలెను. అంతేకాని సూర్యుని ప్రకాశింపచేయనక్కరలేదు. చెరువులోని నీటిలో సూర్యుని ప్రతిబింబమును చూచుటకు నీటిపైనుండు నాచును తొలగించవలెను. నాచును తొలగించిన వెనుక తన ప్రతిబింబమును ఆ నీటిలో చూపుటకై మనమా సూర్యుని ఆహ్వానించి వేడుకొన నవసరము లేదు. సూర్యుని ప్రతిబింబమచట యుండనే యున్నది. కావున దాని

నావరించియుండు నాచును తొలగించుటయే ముఖ్యము. అట్లే ఆత్మ సదా స్వయంప్రకాశమై అచట యుండనే యున్నది. దానిని గ్రహించుటకు మనలోని అజ్ఞానమను ఆవరణను మనము తొలగించుకొనవలెను.

ఆత్మ నిత్యమైనది. దాని సహాయము లేక యీ దేహము జన్మించలేదు, జీవించలేదు, పనిచేయలేదు, గ్రహించలేదు, అనుభవింపలేదు, జ్ఞానమును పొందలేదు. ఆత్మను ధ్యానముద్వారానే వెదుకొన నవసరము లేదు. ధ్యానము వలన ఆత్మ జన్మించదు. మన మానసిక వ్యాధులను నివారించుటకును, పరిశుద్ధమైన ఆత్మజ్ఞానమును పొందుటకును ఈ ధ్యానము ఒక ప్రక్రియ. దీనిని సాధనచేసిన మనస్సు తనంతట అదియే అంతమొందును. మనస్సు అజ్ఞానముయొక్క అభివ్యక్త రూపమే కావున మనస్సు నశించగానే అజ్ఞానమంతమొందు చున్నది. అంధకారమయమైన అజ్ఞానావరణయొక్క అంతిమ సరిహద్దులో స్వయంప్రకాశమైన బ్రహ్మజ్ఞానము వెలయు చున్నది.

కా॥ సర్వాభిలాపవిగతః సర్వచింతా సముద్ధితః।
సుప్రశాన్తః సకృజ్జ్యోతిః సమాధి రచలోఽభయః ॥ ౩౭

ఈ ఆత్మ వాక్కులకతీతమైనది. చింతించుట కలవి గానిది. అది సుప్రశాంతము, సకృజ్జ్యోతి రూపము. భయ రహితము, అచలము. సమాధిద్వారా పొందదగినది.

ఇంతవరకు ఆ ఆత్మనెందుకు సూటిగా నిర్వచించి నిశ్చయపఱచలేకున్నారో యీ శ్లోకములో వివరింపబడినది.

అనగా ఆ పరమాత్మను నిర్వచించుట ఎట్లు అశక్యమో యిచట వివరింపబడినదని భావము.

సర్వాభిలాపవిగతః – మాటలు లేనిది. అనగా భావములను వ్యక్తపఱచు పదములు లేనిది యని యర్థము. మనస్సు ఇంద్రియములద్వారా గ్రహించి, బుద్ధిద్వారా నిర్ణయించుటచే కలుగు మన భావములను వ్యక్తపఱచునది భాష. ఆత్మ అట్లు గ్రహించు పదార్థము కాకపోవుటచే, భాషచే నభివ్యక్తపఱచుటకు తగిన పదములు లేనిది యని భావము.

సర్వచింతా సముత్థితః – సమస్త చింతల నధిగమించినది. ఆత్మ యింద్రియాతీతమైనయెడల మన మనస్సుచే భావించవచ్చునుకదా యని యొకడు సందేహపడవచ్చును. అట్టి సందేహ నివారణకై 'సమస్త మానసిక చింతలు లేనిది' అని చెప్పుచున్నాడు. ఉదాహరణకు ప్రేమను ఇంద్రియములచే గ్రహింపలేము. దానిని మనస్సుచే యనుభవింతుము. ఆత్మకంటె వేరుగా నిలచినప్పుడే మనస్సునకు తదనుభవము కలుగుచున్నది. కాని ఆత్మ చిత్తసారరూపమే యగుటచే, యా చిత్తము తన సహజరూపమైన ఆత్మనుండి ఒక్కక్షణమైనను వేరు కాజాలదు. కావున చిత్తము చింతించుటకు ఆత్మ విషయము కాజాలదు.

సుప్రశాంతః – ఈ పదము బుద్ధియోచించి నిర్ణయించుటకు వీలులేని గంభీరధ్వనిభావము కలిగి యున్నది. ఇట్టి నిర్వచనము నాస్తికునకు అసంగతముగా తోచును. అతని మనస్సు బుద్ధికతీతమైన ఆత్మసామ్రాజ్యమును ఊహించుటకు

కూడ శక్తిలేనిదై యున్నది. కావున బుద్ధిచే గ్రహించుటకు వీలులేని యొక తత్త్వముండుట సంభవమా, అని యాతని మనస్సు సందేహించును. అయినప్పటికిని మనోబుద్ధులకతీత మైన తత్త్వమొకటి యుండనే యున్నది.

ఆ పరమాత్మ అత్యంత సూక్ష్మమైనదగుటచే బుద్ధిలో నది యెట్టి యశాంతిని కలుగజేయలేదు, అని యాచార్యుడు చెప్పుచున్నాడు. మన బుద్ధి అభిప్రాయములకు ఆలోచనలకు నడుమనే పనిచేయగలుగుచున్నది. అట్టి ఆలోచనలు అభిప్రాయములు బుద్ధికి అశాంతి కలుగజేయును. కాని యా బుద్ధి సంపూర్ణముగా విశ్రాంతి తీసికొనినపుడు ఆత్మజ్ఞానము స్వయముగానే ప్రకాశించుచున్నది. కాని బుద్ధిలో అభిప్రాయముల అలజడులు, యోచనాస్పందనములు కలిగి యున్నంతవరకు ఆ శుద్ధజ్ఞానము అట్టి అభిప్రాయములను, ఆలోచనలను ప్రకాశింపజేయుచుండును కావున మనకు బుద్ధిలో కలుగు భావములే తెలియుచున్నవి.

కాని యిచట నిర్విషయకమైన శుద్ధజ్ఞానమును నిర్వచించుటకే ప్రయత్నము జరుగుచున్నది. కావున విషయవిశిష్ట బుద్ధికంటె ఆత్మ అతీతమైనది యని చెప్పుచున్నాడు. అనగా ఆత్మయందు బుద్ధి పనిచేయలేక విశ్రాంతినందుచున్నదని భావము. ఇట్లు మనోబుద్ధీంద్రియములకా ఆత్మ అందరానిదైన మర్త్యులమగు మనకు గ్రహించు సాధన లా మనోబుద్ధీంద్రియములే యై యుండుటచేత, మనము ఆత్మజ్ఞానవిషయమై నిస్పృహ నిరాశ చెందవచ్చును. మనకది అత్యంతము అసంభావ్యమైన సిద్ధాంతముగానే తోచుచున్నది. అందుచే ఆచా

ర్యుడు అది 'సకృజ్జ్యోతి' యని చెప్పుచున్నాడు. అనగా ఆ ఆత్మ స్వయంప్రకాశము. దానిని ప్రకాశింపచేయుటకు మరి యొక జ్యోతి యవసరములేదు. అదియే జ్ఞానరాశి. కావున జ్ఞానమును తెలిసికొనుటకు మరియొక జ్ఞానమవసరములేదు. సూర్యుని చూచుటకు మనకొక దీపమవసరములేదు కదా! మనకు సూర్యునకు మధ్యనున్న ఆవరణను తొలగించిన చాలును. అట్లే మనలోని మనోబుద్ధుల యందుండు సంకల్ప వికల్పాదులను విశ్రాంతిచెందిన ఆత్మతత్త్వము స్వయంప్రకాశ మగుచున్నది.

పరిమితపఱచు పరిధులు లేనిదగుటచే పరమాత్మ లోపల, బయట, సమస్త నామరూపములందు, తద్బాహ్య మందు కూడ తప్పక ఏకరూపమై యుండవలెను. అట్టిఅద్వైత నిత్యసత్యతత్త్వము కావున అది చలనము లేనిదై, భయా తీతమై యుండవలెను.

ఆ ఆత్మయొక్క నిర్వచనము నిషేధభాషలోనున్నను, విధిభాషలోనున్నను సరియే, విద్యార్థికి నిత్యజీవితములో ఆత్మీ యానుభవవేద్యమగునట్టి ఆదర్శమైననే గాని, ఆచరించు స్వభావముగల ఆర్యసంస్కృతి సంపూర్ణము కాజాలదు. కావున 'సమాధి' యను పదము ద్వారా ఆ ఆత్మ సాక్షాత్కారము కలుగుటకు సాధనను గౌడపాదుడు సూచించుచున్నాడు.

క్షీణదశనొందుచున్న హైందవమతములో, తత్ఫలిత మగు ఆత్మవిషయక అజ్ఞానదశలోనున్న మనకు నిష్ప్రయోజ కుడై తాను జీవించియుండగనే తనను పూడ్చిపెట్టించుకొను కపటయోగియొక్క చిత్రమును ఈ 'సమాధి' అను పదము

చిత్రించుచున్నది. తద్ద్వారా మనకొక ఏహ్యాభావము కూడ కలుగుచున్నది. ధీ యనగా బుద్ధి. సమా+ధీ యనగా నిర్వికారమైన బుద్ధి యని యర్థము. ఒక పరిపూర్ణమానవుడు తన మనస్సును పూర్తిగా స్వాధీనపఱచుకొని, బుద్ధిని నిర్వికారముగా నుంచుకొని, జీవితములో కలుగు సుఖదుఃఖములచే కలతచెందని సరితూనికగల బుద్ధి కలిగియున్న నది 'సమాధి' స్థితి యనియు, అట్టి స్థితిలోనే మనమందరము సుఖముగా ఆత్మతత్త్వమును అనుభవించగలమనియు తాత్పర్యమై యున్నద. కావున బిక్షమెత్తుకొనుటకై బిక్షాపాత్రను చాపుటకు ముందుచేయు చవకరకపు తమాషాగాని, మనోబలముచే చేయు కపటయోగము కాని 'సమాధి' కాజాలదు. సరితూనికలో నాతని వ్యక్తిత్వము నమర్చి, సంపూర్ణ పరిణతి చెందిన బుద్ధికలిగి, నిర్దుష్టమైన సంస్కృతిగల మానవుని సమత్వ స్థితియే సమాధి యగుచున్నది. అట్టి వ్యక్తి తనలో తాను నిరంతరము అనిర్వచనీయమైన ఆనందమును అనుభవించుచునే యుండును. అతడు ఆవేశరహితమైన, సమత్వముగల మనస్సు చేతను, స్థిరమైన బుద్ధిచేతను ఉత్కృష్టమైన ఆత్మవిశ్వాసము కలవాడగుచున్నాడు. అందుచే అతడు నిరాక్షేపముగా జీవించువాడై జీవితమును ఆనందించగలుగుచున్నాడు.

కా॥ గ్రహో న తత్ర నోత్సర్గశ్చింతా యత్ర న విద్యతే।
ఆత్మసంస్థం తదా జ్ఞానం అజాతి సమతాం గతం॥ 38

నిశ్చింతమైన ఆత్మ తత్త్వమందు గ్రహణము గాని ఉత్సర్గము గాని యుండజాలదు. ఆత్మయందే స్థాపితమై, ఆత్మ

యందే రమించు ఆ జ్ఞానము అఖండత్వమును సమత్వమును పొందుచున్నది.

మనస్సునధిగమించిన యీ పరమాత్మతత్త్వము మన ఆత్మీయానుభవములోనికి వచ్చుచున్నదని పూర్వశ్లోకములో చెప్పబడియున్నది. మనోవృత్తులు లేనట్టి స్థితియే దివ్యానుభూతి యగుచున్నది. ఆ పరమాత్మయందు వస్తుగ్రహణము గాని, ఆలోచనలు, అభిప్రాయములు కలుగుటకాని సంభవించదు. సృష్టిస్థితిలయములచట లేవు. సాహసగర్భితమగు ఈ మనస్సు ఆ పరమాత్మయందు లేదు. ఇట్లు మనస్సును పూర్తిగా స్వాధీనపఱచుకొనిన క్షణములో పరిమిత జీవి యపరిమిత పరమాత్మలో లీనమై, నిర్వికార స్థితినందుచున్నాడు. ఆ పరమాత్మలో నెట్టి వికారమును లేదు కావున అది నిర్వికారము, స్థిరము అగుచున్నది.

ఒక తత్త్వము అపరిమితము లేక అనంతమగుటకు అది అఖండమై యుండవలెను. అద్వితీయమై, సర్వవ్యాపియై, సత్యజ్ఞానానంతమైన ఆ బ్రహ్మ సహజముగానే అఖండమగుచున్నది. ఈ అల్పజీవి అంతరించి అఖండ పరమాత్మ యగుచున్నది. మనోబుద్ధులతోడి తాదాత్మ్యమును విడువగానే జ్ఞానమయమైన ఆత్మతత్త్వమును పొందుచున్నాడు.

కా॥ అస్పర్శయోగో వై నామ దుర్దర్శః సర్వయోగిభిః ।
యోగినో బిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః ॥ ౩౯

ఈ అస్పర్శయోగము సాధకులందరికి సులభముగా లభ్యమగునదికాదు. అభయమైన ఆ ఆత్మవలని భయముచేత యోగులీ మార్గము ననుసరించ భీతిచెందుచున్నారు.

తన ప్రతిభ యనెడి బంగారు మలాములో కుంచెను ముంచి 'అస్పర్శయోగము' అను నొక్క సాటిలేని పదముతో గౌడపాదుడు వేదాంతసాధనను విశదముగా చిత్రించు చున్నాడు. ఈ పదము బౌద్ధవాఙ్మయమునుండి యెరువు తెచ్చికొనినదనియు, దీనితో సరితూగుపదము శాస్త్రగ్రంథ ములలో లేదనియు కొంతమంది విమర్శకులు గౌడపాదునిపై నేరము మోపుచున్నారు. మరియు వారివిమర్శ యెంతవరకు పోయినదనగా గౌడపాదుడు బౌద్ధగ్రంథముల ననుకరించు చున్నాడను నంతవరకు వారు విమర్శించుచున్నారు. కాని గ్రంథమును జాగ్రత్తగా ననుసరించు విద్యార్థు లీ విమర్శను అంతగా అంగీకరించవలసిన పనిలేదు. బాహ్య విషయముల నింద్రియములద్వారా మనస్సు స్పృశించుటను సూచించుటకు 'స్పర్శ' యను పదమును శ్రీ కృష్ణభగవానుడే గీతలో (అధ్యా - 5. శ్లో - 21, 22, 27) ఉపయోగించియున్నాడు. అట్టి గీతాజ్ఞానముతో గౌడపాదుడీ 'అస్పర్శ' యను పదమును స్వాయముగా కూర్చియుండవచ్చును.

మనస్సు ఇంద్రియములద్వారా విషయములనంటి, తత్ఫలితముగా సుఖదుఃఖముల నందుచున్నదను సందర్భములో మనస్సు విషయముల నంటుటకు 'స్పర్శ' యనుపదము గీతలో నుపయోగింపబడినది. విషయములు స్వాయముగా నెట్టి సుఖ దుఃఖముల నీయజాలవు. మన మనస్సు ఇంద్రియములద్వారా, ఆ విషయజాలములో తగుల్కొనినపుడు మన మిథ్యాభావన లను, అసత్యపు విలువలను ఆ విషయములకంటగట్టుచున్నాము. ఇట్లుచేయుటద్వారా మనమా ఇంద్రియవిషయములకు మనను

చుటకు చెప్పినదికాదు. కాని యీ మార్గమును అతిజాగ్రత్తగా యనుసరించవలెనని విద్యార్థులకు చేయు హెచ్చరికయై యున్నది.

వేదాంతవిద్యార్థులవలెగాక యోగులు - అనగా ద్వైతులు-ఈ ప్రత్యగాత్మనంతమొందించి యా పరమాత్మతో లీనమగుటకు అత్యంతము భీతినొందుచున్నారు. కావుననే వారు పరమాత్మతోపాటు మాయారూపమైన ప్రత్యేకజీవి కూడ అనాదినుండి యున్నదని నొక్కి వక్కాణించుచున్నారు. వారా పరమాత్మను ప్రత్యేకమైన స్వతంత్ర వస్తువువలె దర్శించి ఆనందింపకోరుచున్నారు. జీవాత్మను సంపూర్ణముగా నా పరమాత్మతో ఐక్యపరచుటకు భీతి చెందిన వారికి ఆంతరికమైన తమ భయము నభివ్యక్తపరచుటకు ఇట్లు ప్రత్యేక ఆత్మదర్శన విధానమే మార్గమైయున్నది.

వాస్తవములో ఆ పరమాత్మ భయరహితమైనది. అట్టి పరమాత్మ తమపై సంపూర్ణాధికారమునందుటకై తమ జీవ భావము నా పరమాత్మతో నైక్యపఱచుటకు ద్వైతులు సమ్మతించుట లేదు. అట్లు సంపూర్ణ ఐక్యము పొందు విధమును నేర్చుకొననంతవరకు ఆ జీవుడు దివ్యత్వానుభూతినిగాని, తద్ద్వారా కలుగు ఆధ్యాత్మిక పరిపూర్ణతనుగాని సాధించలేడు. దుఃఖకరమైన యీ ప్రాపంచిక జీవితమును గడుపు సంసారి స్పర్శయోగి యగుచున్నాడు. నిత్యవిశ్వాసముతో ఆత్మతత్త్వముతోడి అనంతజీవితమును గడుపు దివ్యమానవుడు అస్పర్శయోగి యగుచున్నాడు.

యీ విషయ శృంఖలములను నెమ్మదిగా విడదీసుకొని వాని నుండి తన సంబంధమును తప్పించవలెను. ఇట్లు అనాత్మను ఒకవైపు నిషేధించి, దానినధిగమించుచు ఆత్మతత్త్వమును విధిగా పొందు బలవత్తరమైన మార్గము కావున యీ అస్పర్శ యోగము ఒకవైపు నిషేధించు విధానమును, మరియొకవైపు విధించువిధానమును కలిగియుండు రెండురకముల వేదాంత సాధనమై యున్నది. మనకుగల అసత్యపు విలువలను త్యజించి మాయామోహమునుండి అసక్తుడగుటయే 'అస్పర్శ' అను దాని భావము. సాధకునిలోనుండు పవిత్రజీవాత్మ నిత్యసత్య తత్త్వమును కనుగొని యందు స్థిరపడుటకు చేయు ప్రయత్నమే 'యోగము' అగుచున్నది.

త్రాడునుండి సర్పభ్రాంతి తొలగుటకు మనకు రెండు మార్గములు కలవు. ప్రథమమున సర్పభ్రాంతిని సంపూర్ణముగా తొలగించుకొనవలెను. పిమ్మట త్రాడుయొక్క వాస్తవిక రూపమునుకూడ తెలిసికొనవలెను. ఈ రెండును ఏకకాలమున సమాన ప్రతిపత్తితో జరిగిన భ్రాంతికి వెనుకనుండు సత్యతత్త్వము మనలో జాగరితమగుచున్నది. ఆధ్యాత్మిక సాధనను సాఫల్యము చేయునట్టి విధి నిషేధయుక్త ద్విధాసాధన యోగులకు కూడ కష్టతరమైనదిగా ఎంచబడుచున్నది. యోగులకుకూడ అసాధ్యమైనదని చెప్పుటచే సాధకుడు దీనిని పొందుట కష్టతరమనిగాని అసంభవమనిగాని భావించరాదు. కాని ఆత్మజ్ఞానమునుపొందు మార్గమెంత కఠినమైనదో సాధకునకు ముందుగా తెలియపరచుటయే యిచట గురువుయొక్క యుద్దేశ్యమై యున్నది. ఇది విద్యార్థులను నిరుత్సాహ పర

చుటకు చెప్పినదికాదు. కాని యీ మార్గమును అతిజాగ్రత్తగా యనుసరించవలెనని విద్యార్థులకు చేయు హెచ్చరికయై యున్నది.

వేదాంతవిద్యార్థులవలెగాక యోగులు - అనగా ద్వైతులు-ఈ ప్రత్యగాత్మనంతమొందించి యా పరమాత్మతో లీనమగుటకు అత్యంతము భీతినొందుచున్నారు. కావుననే వారు పరమాత్మతోపాటు మాయారూపమైన ప్రత్యేకజీవి కూడ అనాదినుండి యున్నదని నొక్కి వక్కాణించు చున్నారు. వారా పరమాత్మను ప్రత్యేకమైన స్వతంత్ర వస్తువువలె దర్శించి ఆనందింపకోరుచున్నారు. జీవాత్మను సంపూర్ణముగా నా పరమాత్మతో ఐక్యపరచుటకు భీతి చెందిన వారికి ఆంతరికమైన తమ భయము నభివ్యక్తపరచుటకు ఇట్లు ప్రత్యేక ఆత్మదర్శన విధానమే మార్గమైయున్నది.

వాస్తవములో ఆ పరమాత్మ భయరహితమైనది. అట్టి పరమాత్మ తమపై సంపూర్ణాధికారమునందుటకై తమ జీవ భావము నా పరమాత్మతోనైక్యపఱచుటకు ద్వైతులు సమ్మతించుట లేదు. అట్లు సంపూర్ణ ఐక్యము పొందు విధమును నేర్చుకొననంతవరకు ఆ జీవుడు దివ్యాత్మానుభూతినిగాని, తద్ద్వారా కలుగు ఆధ్యాత్మిక పరిపూర్ణతనుగాని సాధించలేడు. దుఃఖకరమైన యీ ప్రాపంచిక జీవితమును గడుపు సంసారి స్పర్శయోగి యగుచున్నాడు. నిత్యవిశ్వాసముతో ఆత్మ తత్త్వముతోడి అనంతజీవితమును గడుపు దివ్యమానవుడు అస్పర్శయోగి యగుచున్నాడు.

కా॥ మనసో నిగ్రహా యత్తమభయం సర్వయోగినాం।
దుఃఖ క్షయః ప్రబోధశ్చాప్యక్షయా శాన్తిరేవచ॥ ४०

ఈ శ్లోకములో చెప్పిన విధముగా జ్ఞానమార్గము ననుసరించని యోగులు, అభయము, దుఃఖక్షయము, ఆత్మబోధ, శాన్తి కలుగుటకు తమ మనోనిగ్రహాముపై ఆధారపడి యుందురు.

పూర్వశ్లోకములో వివరించిన వేదాంతసాధనకు వ్యతిరేకముగా ద్వైతమతస్థులు మనస్సును పవిత్రము చేసికొనుటకు శరీరసాధనలపై ఆధారపడుచున్నారు. ఇంద్రియ సంచారమును తగ్గించి, మనస్సును స్వాధీనపఱచుటకు భక్తులు భక్త్యుద్రేకముపై నాధారపడుచున్నారు. హఠయోగులు ప్రాణాయామముపై ఆధారపడుచున్నారు. కాని వేదాంతులమత మిదికాదు. వేదాంతి తన యుత్కృష్ట వివేకముద్వారా మనస్సును స్వాధీనపఱచుకొని పవిత్రము చేసికొనుచున్నాడు భక్తుల భావోద్రేకముతోను, హఠయోగుల ప్రాణాయామముతోను కాక వేదాంతి వివేకమనెడు సూక్ష్మసాధనతో ఆ మనస్సును స్వాధీనపఱచుకొని క్రమబద్ధము చేసికొనుచున్నాడు.

అభయం, దుఃఖక్షయం, ప్రబోధం, అక్షయశాంతి యను నీ పదములు సాధకులన్వేషించు యా శుద్ధచైతన్యతత్త్వమును సూచించుచున్నవి. ఈ పదముల నిదివరకే విశదముగా వివరించియుండుటచేత మరల యిచట వివరించ నవసరము లేదు.

కా॥ ఉత్సేక ఉదధేర్యద్వత్కుశాగ్రేణైక బిందునా।
మనసో నిగ్రహ స్తద్వద్భవే దపరి ఖేదతః॥ ४ఌ

తిత్తిరిపక్షి కుశాగ్రముతో నీటిబొట్టులను గ్రహించి సముద్రమును ఇంకించుటకు ప్రయత్నించినట్లు విసుగుచెందని దీక్షతో కొంచెము కొంచెముగా మన మనస్సును వశము చేసికొనవలెను.

హితోపదేశములో తిత్తిరోపాఖ్యానము కలదు. అందు తిత్తిరిపక్షి కుశాగ్రముతో నీరుతోడి సముద్రమును ఇంకించుటకు ప్రయత్నము చేయును. అట్టి ప్రయత్నమునే యిచట మనస్సును నిగ్రహించుటకై చేయవలసిన ప్రయత్నముతో పోల్చుటకై యీ ఉపాఖ్యానమును ఉదహరించుచున్నాడు. తిత్తిరిపక్షి తన గ్రుడ్లను సముద్రపుటొడ్డున యుంచినది. సముద్రము పొంగినపుడా నీరు వచ్చి యీ గ్రుడ్లను ముంచివేసినది. పక్షి తిరిగివచ్చినది కాని తన గ్రుడ్లచ్చటలేవు. సముద్రమే వానిని అపహరించెనని తెలిసికొనిన యీ తిత్తిరిపక్షి తన గ్రుడ్లను తెచ్చికొనుటకుగాను ఆ సముద్రమునే యింకింప నిశ్చయించుకొనెను. వెంటనే యది యొక కుశాగ్రమును తీసికొని దానితో బొట్టు బొట్టుగా సముద్రములోని నీటిని యావల వేయదొడగెను. ఆ సమయమున ఆకాశమున పోవుచున్న గరుడుడు తన జాతి పక్షియొక్క ప్రబల ప్రయత్నమును, సాహసకృత్యమును చూచి దానికి సహాయపడుటకు నిశ్చయించెను. ఆ గరుడుని కోపమునకు భయపడిన సముద్రుడు వెంటనే తిత్తిరిపక్షియొక్క గ్రుడ్లను తెచ్చి యిచ్చివేసెను.

"ఆత్మ పరిప్రాప్తి కలనంబంట ఎంతటి దుష్కరమైనదైనను, దృఢమైన భక్తి విశ్వాసములతో సాధకుడా మార్గమును స్థిరముగా అనుసరించిన సాధకుని కార్యమునకు (గరుడుడు తిత్తిరిపక్షికి సహాయము చేసినట్లు) భగవంతుడు అనుగ్రహించి సహాయపడుచున్నాడు" అని చెప్పుటకు ద్వైతులీ తిత్తిరోపాఖ్యానమును ఉదహరించెదరు. కాని యీ ఉపాఖ్యానమిచట విభిన్నమైన సందర్భములో యుదహరింపబడినది. విద్యారణ్యులచే పంచదశిలోను, మధుసూదన సరస్వతిచే భాగవత భాష్యములోను ఈ కథ యుదహరింపబడినది.

జ్ఞానిచే యవలంబింపబడు ఆత్మజ్ఞాన మార్గమునకు వ్యతిరేకముగా ద్వైతు లనుసరించు మార్గము పూర్వశ్లోకములో వివరింపబడినది. యోగి చిత్తవృత్తుల నొక్కటొక్కటిగా నిరోధించి, మనస్సును పవిత్రము చేసికొనుచున్నాడు. ఒక వృత్తిచే నింకొక వృత్తిభావమును తొలగించి మనస్సు నివృత్తి మార్గము నవలంబించునట్లు చేయుచున్నాడు. ఈ మార్గము చాల కఠినమైనదనియు, కుశాగ్రముతో సముద్రము నింకించుటవలె ఇది యత్యంతము అసాధ్యమైనదనియు తెలియజేయుటయే ఇచట గౌడపాదుని కార్యమై యున్నది. అయినప్పటికిని వారి పద్ధతి సఫలము కాదనలేదు. ఈ పద్ధతిద్వారా కూడ అమనస్కస్థితి నందవచ్చును. అతని ప్రయత్నమందు గురువుయొక్క అనుగ్రహము కలుగకున్న సాధారణ సాధకునకీ సాధన యతి దుష్కరమగుచున్నది. గుర్వనుగ్రహము నిరంతర తీవ్రధ్యానముచేతనే పొందబడుచున్నది.

ఈ అధ్యాయములో ముగింపు శ్లోకములగు రాబోవు ఏడు శ్లోకములకు ఈ శ్లోకము ఉపోద్ఘాతము వంటిది. ఇది ఉపదేశగ్రంథమగుటచే తన్మాధ్యయమును జాగ్రత్తగా పాలించు గౌడపాదుడు సాధకునకు స్పష్టముగా ఉపదేశము నీయవలసి యున్నది. ఈ ఏడు శ్లోకములలో ఆ సత్యమార్గమును చూపు ఉపదేశ కోశము కలదు. శ్రద్ధగల సాధకుడెవ్వడైనను, తాను నిజమైన సాధకుడైన యీ సాధనను ప్రబలసమస్యవలె నెంచడు. కాని యట్టి వారెంత అరుదు ! !

శ్లో॥ ఉపాయేన నిగృహ్ణీయా ద్విక్షిప్తం కామ భోగయోః ।
సుప్రసన్నం లయే చైవ యథా కామో లయ స్తథా॥ ౪౨

కామ భోగములయందు విక్షిప్తమైన మనస్సును, లయమందు సుఖించు మనస్సునుకూడ సక్రమమార్గములో సంపూర్ణశిక్షణనిచ్చి నిగ్రహించవలెను. కామభోగాదులు ఎంత ప్రమాదకరమైనవో లయముకూడ అంత ప్రమాదకర మైనదే అగుచున్నది.

ధ్యానములో సంభవించు విఘ్నములను, వాటి కపట వ్యూహములను గౌడపాదుడు సాధకునకు సూచించు చున్నాడు. గోతిలో పడబోవు మనస్సును మరలించుకొని పైకెగురుటకై సాధకునకీ సూచనలు బలమునిచ్చును. మనస్సు అప్రయత్నముగా మునిగిపోవుస్థితి అపాయకరమై, విచారకర మైనకఠిన విఘ్నములలో ఒకటి. ఈ స్థితిని సంస్కృతి పరి భాషలో 'లయము' అందురు. లయమనగా నిద్రలేక కునికి పాటు. ఈ మనస్సును శాంతింపజేసి విషయక్షేత్రములనుండి

మరలించి, ఏకాగ్రత కలుగునట్లు చేయగానే అది నిద్రవంటి లయములో పడుచున్నది. ఆ లయస్థితి మనము సాధారణముగా పొందు నిద్రవంటిది కాదు. అది ఆనందాతిశయమునందు ఒక స్థితి. దానినే పారవశ్య స్థితి యనికూడ అందురు. అట్టి సమయములలో మన మనస్సును మేలుకొలిపి మరల పని చేయునట్లు చేయవలెనని గురువు ఉపదేశించుచున్నాడు.

మరియు ఆ మనస్సు భూతకాలమందలి సుఖస్మృతియందుగాని, వర్తమానమం దనుభవించు సుఖములందుగాని, రాబోవు సుఖముల నూహించుట యందుగాని, సంచరించుచుండగలదు. నిజమైన సాధకునకు కోరికలెట్లు నాశనము చేయునో లయముకూడ యట్లే యాతనిని యాకర్షించి పడద్రోయును. కావున ధ్యానించువాడు లయమందుగాని యనంతమైన కోర్కెలందుగాని తగుల్కొని యున్నంతవరకు ఆతడు మనస్సును జయించుటలో సఫలుడు కాలేడు.

కా॥ దుఃఖం సర్వమనుస్మృత్య కామభోగాన్నివర్తయేత్ ।
అజం సర్వమనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి ॥ ४३

ఇంద్రియ విషయభోగములు దుఃఖభూయిష్ఠములని స్మరించి వానినుండి మనస్సును మరల్పవలెను. అట్లే అజమైన బ్రహ్మనే సదా స్మరించుచుండిన యీ ద్వైతప్రపంచము మనకు గోచరించదు.

కామములనుండి మనస్సును ఎట్లు నివర్తింపవలెనో పూర్వశ్లోకములో చెప్పబడినది. ఆధ్యాత్మిక సాధనలలో

మనస్సును నిర్విషయము చేసిన దానిని అణచివేయుమార్గ మును మనము శ్రద్ధగా అనుసరింపగలము. వేలకొలది కోరిక లతో అలజడిచెందు మనస్సును స్వాధీనపఱచుకొను మార్గ మిచట ఉపదేశింపబడినది. మనస్సు సాధారణముగా సుఖాను భవకాంక్షతో ఇంద్రియ విషయజాలమందు చిక్కుకొని జీవించుచున్నది. అంత సత్యత్వభావనగాని, నిత్యత్వభావన గాని లేక సమీచీనత్వభావన (నిత్యముగా ఆనందమునివ్వ గలవు అను భావన) కలిగిన వస్తువులవైపు ఆ మనస్సు పరు గెత్తగలదు. ఈ మిథ్యాభావనలా ఇంద్రియ విషయములందా రోపింపబడినవి. స్వయముగా ఆ విషయములకు ఈ పైని చెప్పిన యెట్టి భావనలు లేవు.

ప్రపంచ పదార్థములలో నీ పై మూడు గుణములు సహజముగా నున్నవని భావించుట కేవలము మూఢనమ్మ కము, లేక అంధవిశ్వాసమే యగుచున్నది. మరియు నట్టి గుణములు లేనిచోట ఆ మనస్సు అటనుండి పరుగెత్తిపోవును గాని, వానికై పాటుపడదు, అనుటయు వాస్తవమే యగు చున్నది. ఆ మనస్సును బోధించుటకు మనలోని గురువు మనయొక్క వివేక బుద్ధియే యై యున్నది. నేడు సాధారణ మానవునియొక్క బుద్ధి ఒరలోని కత్తివలె నున్నది. మన స్సులో స్వయముగా ఆరోపితమైన యావరణలనుండి తనను విముక్తునిగా చేసికొనవలసినదని వేదాంతసాధకునకు గురువు ఉపదేశించుచున్నాడు.

జ్ఞానజ్యోతిని చుట్టుకొనిన మానసిక ధూమమును తుడిచి ఊదివేయుము. జ్ఞానము నా మనస్సుయొక్క మాయా

జాలమునుండి తప్పించుటయే వివేకాభివృద్ధి యగుచున్నది. ఇట్టి యీ వివేకముతో విషయసుఖముల నన్వేషించిన అవి యెంత నిస్సారమైనవో తెలియగలదు. అంత నా సాధకుడు తానా విషయములకు మూఢ విశ్వాసములతో కూడిన అసత్యపు విలువలను కేవలము భ్రమచే అంటగట్టుచున్నానని భావించి సిగ్గుపడును. అందుచే ఆశ పుట్టించి హింసించు దుఃఖకరమైన తమ నృత్యములచే ఆ యింద్రియ విషయములాతనిని తమవైపు ఆకర్షింపలేవు. జాగృత వివేకముయొక్క ఉన్నత స్థితినుండి ప్రపంచమును చూచువానికి అందలివస్తువు లేవియు తనకు దుఃఖము నీయజాలవు సరికదా అవి తమ సహజస్వభావమగు అశక్తతను రిక్తతను ప్రత్యక్షముగా బయలుపెట్టగలవు. వానిపై నావరించియున్న కపట తంత్రములనెడి ఆవరణను ఛేదించి, లోనికి చొచ్చుకొనిపోయి, యా విషయములందుండు బాధాకరమైన వ్రణములను చూడగలుగుటకు వివేకము ఎక్స్‌రే (x - ray) వంటిది యగుచున్నది.

జ్ఞానమార్గము ననుసరించు సాధకులు పవిత్రవివేకము ద్వారా తమ జీవితమును సూక్ష్మముగా పరిశీలించి పరిణతి చెందించుకొనుటకు నేర్చుకొనవలెనని గౌడపాదు డిచట యుపదేశించుచున్నాడు. వివేకముతో విచారణచేయునట్టి మార్గమును స్థిరముగా ననుసరించు సాధకుడు ధ్యానస్థితిలో భూతకాలమందలి సుఖస్మృతులచేగాని, వర్తమానకాలమందలి సుఖచింతనలచేగాని, భవిష్యత్కాలమున రాబోవు సుఖాకాంక్షలచేగాని చలించి యుద్వేగమును పొందడు. ఇట్టి అభ్యాసముచేతనే జ్ఞానయోగి మనస్సునందలి విక్షేపముల నణచుకొన

గలుగుచున్నాడు. మనస్సంచారము నరికట్టినను పంచేంద్రియములనెడి శునకములు ఆత్మశాంతినణచివేయుటకు మొరుగుచునే యుండును. కాని యట్టి యలజడిని సాధకుడు తన ధ్యానములో ననుభవింపడు. సర్వవ్యాపి సత్యతత్త్వమునందు ఏకాగ్రదృష్టిగల సాధకుని మానససరోవరములో ఈ యింద్రియములు మరి యెట్టి చిఱుతరంగములను లేపజాలవని గౌడపాదుడు చెప్పుచున్నాడు. అట్టివానికి తన యింద్రియముల కంటె భిన్నమైన విషయప్రపంచ మేదియు లేదు. తన చెవి కంటె వేరైన శబ్దముకాని, నేత్రములకంటె భిన్నమైన రూపముగాని, అతనికి లేదు. ప్రపంచములో నానా యా వర్ణ రూపములు లేకున్న మనకొక నేత్రమున్నదనికూడ మనకు తెలియదు. అటువంటప్పుడు మన నేత్రములు దేహమనెడి గోడలో ముక్కునకు రెండువైపులనుండు రెండురంధ్రములే యగుచున్నవి. శ్రవణేంద్రియము దూరముగా వ్యాపించిన శబ్దమగుచున్నది. దృష్టి దూరముగా ప్రసరించిన రూపమగుచున్నది. ఇట్లే తదితర యింద్రియములు నున్నవి. కాని యీ సర్వేంద్రియముల వెనుకనుండు ఆ శుద్ధచైతన్య తత్త్వమే మనోబుద్ధుల వెనుక నున్నది. అట్టి శుద్ధచైతన్యతత్త్వములో స్థిరముగా ప్రతిష్ఠితుడైనవాడు ఇంద్రియాకర్షణలనెడు పద్మవ్యూహములో చిక్కుకొనడు.

కా॥ లయే సంబోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః ।
సకషాయం విజానీయాత్సమప్రాప్తం న చాలయేత్॥ ౪౪

లయమందు చిత్తమును ప్రబోధింపవలెను. విక్షిప్తమైనప్పుడు దానిని శమింపజేయవలెను. ఈ రెండింటిమధ్య శక్తి

వంతమైన కోరికలు అనభివ్యక్తమై యున్నవని తెలిసికొనవలెను. ఆ చిత్తము సమస్థితిని పొందిన దానిని సంచలింప చేయకుము.

వ్యాప్తిగలిగి దివ్యమైన సంపూర్ణత గలిగి యున్నట్టి యీ శ్లోకములోని ప్రతియక్షరము తాత్త్వికయాత్రికునకు తప్పించుకోలేని మార్గసూచిగా నున్నది. ప్రథమ దశలో సాధనద్వారా మనస్సును మెల్ల మెల్లగా శాంతింపజేయు చుండునపుడు ఆ మనస్సు లయమును చేరుటకై అజ్ఞానగర్తము లోనికి జారిపోవునై పుణ్యము నలవఱచుకొనుచున్నది. అందుచే సాధకుడా మనస్సును మేలుకొలిపి మరల మరల ధ్యానమగ్న మగునట్లు చేయవలెనని యుపదేశించుచున్నాడు. నిరంతర అభ్యాసముచే ఈ లోపమును మనము జయించిన ఆ మనస్సు స్వయముగా ఆ లయస్థితిని చేరజాలదు.

ఇట్లు జాగరితమై ఏకాగ్రము చేయబడిన మనస్సు అచటనేయుండి ఆనందించలేక సాధకునకు మరియొక ప్రతిబంధకమువలె, తన సంకల్పము లనెడి యడ్డుదారులలో నది సంచరించ ప్రారంభించును. అనగా ఆ మనస్సు పూర్వ మనుభవించిన సుఖస్మృతులందుగాని, వర్తమానకాలమందలి సుఖానుభవము లందుగాని, భవిష్యత్సుఖాకాంక్షలయందుగాని సంచరించ నారంభించును. ఇట్టి సమయములలో పూర్వశ్లోకములో చెప్పినరీతిగా వివేకముతో ఆ మనస్సును బోధించి, ధ్యానము ద్వారా అసత్యపువిలువలనుండి విడివడజేసుకొని దానిని స్థిర పఱచుకొనవలెను.

ఆ సాధకు డట్లు లయావస్థనుండి జాగృతిపొంది, సరియైనమార్గములో శ్రద్ధగా ఆ మనస్సును నడిపించగానే, బ్రహ్మవిద్యాభ్యాసముచేయు విద్యార్థి తా నా మనస్సును జయించి హఠాత్తుగా పరిపూర్ణత్వస్థితికిపోవుచున్నట్లుగా తొందరపాటుచే నిర్ణయించును. ఇట్లు పూర్తిగా ప్రవేశములేని విద్యార్థుల హృదయములోకలుగు ఆశను గౌడపాదుడు దయగలవాడై మొలకలోనే తునిమివేయుచున్నాడు. నిజముగా సాధకు డట్టి యధికారమును మనస్సుపై కలిగియున్నను, తాత్కాలికముగా అది యుత్తమసంస్కృతి గలిగి యణగియున్నట్లు తోచినను, తన మనస్సునకు ఆంతరికముగా శక్తివంతమైన వ్యతిరేకప్రభావములు కలవని ఆ సాధకుడు తప్పక తెలిసికొనవలెను. అనాది జన్మలనుండి నాటుకొనియుండి తన మనస్సులో సుప్తమైయున్న పాశవిక ప్రవృత్తులు, ఆతని శిక్షిత మనస్సుపై దాడివెడలి అందుండు విజయస్వప్నము నంతమొందించి, ఆతనిని నిరుత్సాహపఱచి యాతని మనస్సును చెదరగొట్టగలవు. సాధకుడు తన ఆధ్యాత్మిక మార్గములో నిరుత్సాహపడకుండుటకు ఇట్టి హెచ్చరిక సహాయపడగలదు.

పైకగపడకుండ ఆంతరికముగానుండు పాశవికప్రవృత్తులు, జ్ఞానాగ్నిలో తాము దగ్ధమగుటకు పూర్వము ఎప్పుడో అప్పుడు ఒక్కసారైన పైకి రావలయును. ఈ ప్రవృత్తులనే మనస్సులోని 'కాషాయము' అని పేర్కొనుచున్నారు.

ఇట్లా సాధకుడు మనస్సులోని కాషాయమును, విక్షేపమును నశింపజేసిన పిమ్మట తత్త్వ ద్వారమును తట్టగలడు. "తలుపు తట్టుము నీవు లోపల ప్రవేశించగలవు" అని భగ

వంతుడు ప్రమాణము చేయుచున్నాడు. అట్లు తలుపు తట్టి నప్పుడు ఆ తలుపు తెరచుకొనువరకు నీకు స్తిమితము ఓర్పు ఉండవలెను. "మనస్సు సమస్థితినందిన తరువాత మరల దానిని చికాకు పఱచకుము" అని చెప్పుటద్వారా యీ పై భావమునే సూచించుచున్నాడు.

అట్టి తీవ్రధ్యానములో, మనస్సు లయమునందు మునుగ కుండ సంకల్పాదులందు విక్షిప్తము కానప్పుడు, నిశ్చల నిశ్శబ్ద ప్రజ్వలిత శూన్యత్వమననుభవించునట్టి యీ యతీతావస్థలో మనస్సును చీకాకు పఱచుట మానవుడు తన ఆత్మ విషయమై చేయు మహాపాపములలో నొకటై యున్నది.

కా॥ నాఽస్వాదయేత్సుఖం తత్ర నిస్సంగః ప్రజ్ఞయా భవేత్।
నిశ్చలం నిశ్చర చ్చిత్తమేకీకుర్యా త్ప్రయత్నతః॥ ౪౫

సమాధియందు సుఖమును అనుభవించుటకు మనస్సును వదలకూడదు. అట్టి సుఖాసక్తినుండి మనస్సును వివేకముతో మరలించి విడిపించవలెను. నిశ్చలమైకూడ మనస్సు బాహ్యవిషయములందు పరుగెత్త నారంభించిన స్వప్రయత్నముతో ఆ మనస్సును మరల ఆత్మతో నైక్యము చేయవలెను.

పూర్వశ్లోకములో చెప్పినరీతిగా కాషాయావస్థలను దాటిన పిమ్మట అతడు సమాధిస్థితినందుచున్నాడు. అది మిక్కిలి యానందదాయకమైన యనుభవము. వాస్తవములో నది యీ బ్రహ్మానందపు వాసనలు గలదై యుండును. ఆ ఆనందానుభవమే బ్రహ్మానందమని భావించునట్టి ఆత్మవంచ

నకు సాధకుడు బలిగాకూడదని గౌడపాదు డతనిని హెచ్చ రించుచున్నాడు. ఆ యానందానుభవము ఆత్మానందాను భవమునకు నకిలీ మాత్రమే యగుచున్నది.

ద్వైతమైన విషయప్రపంచము ననుభవించునట్లు ఆ బ్రహ్మతత్త్వము ననుభవించుటకు వీలుకాదు. వేదాంత సాధనా ఫలితముగా పొందిన సమాధి యనుభవమే గంభీర నిశ్శబ్దానుభవమైనప్పటికిని అది వాస్తవములో ఆత్మజ్ఞానాను భవము కాదు. ప్రపంచానుభవముతో పోల్చినప్పుడే ఆ సమాధికొక ప్రాధాన్యము వచ్చుచున్నది. కావుననే యది ప్రశాంతస్థితి యని భావింపబడుచున్నది. అందుచే సమాధి యందు తానానందము ననుభవించుచున్నానని మనస్సు భావించకూడదని గౌడపాదుడు హెచ్చరించుచున్నాడు. స్థూలమైన ఇంద్రియ విషయములనుండి కంటె సూక్ష్మతర మైన యానందమునుండి విడిపించుకొనుట అత్యంతము కష్ట మగుటచే యిట్టి హెచ్చరిక ఆవశ్యకమై యున్నది.

ఈ జగత్తునందలి యనుభవములవలన కలుగు ఆనం దము దుఃఖముచే ధ్వంసమగుచున్నదని మనకందరికి యను భవపూర్వకముగా తెలిసిన విషయమే. ఇంక సమాధియందు అనుభవించు ఆనందము మరికొంత అధికమైనది, పరిపూర్ణ మైనది కావున మత్తుకలిగించి మంత్రముగ్ధునివలె చేయునట్టి సమాధిస్థితియందలి యానందమునుండి దూరముగా నిలచి ఆత్మతత్త్వముననుభవించుట చాలా కష్టతరమై యుండును. మనము నిజమైన సాధకులమైనయెడల సమాధి స్థితియందు కలుగు శాంత్యానందములకు వశమై తన్మయత చెందకూడ

దని హెచ్చరించుచున్నాడు. అతీతావస్థను పొందు సమయ
ములోకూడ మన మా శాంత్యానందములకు ప్రక్కగానుండి
వానిని ప్రకాశింపజేయు ఆ జ్ఞాన ప్రకాశమును వెతకవలెను.
మరియు శాశ్వతానుభూతియై అదృశ్యమైన ఆత్మతత్త్వమును
చేరువరకును ద్వైతపరిధిలోనుండు సమస్త అనుభవములను
త్యజించి త్రోసిపుచ్చుము. ఇట్లు మనస్సు నిర్విషయమైన
ఆత్మతత్త్వమును చేరినంతనే ఆ మనస్సును స్వేచ్ఛగా తిరుగ
నివ్వకూడదు. ప్రశ్నించుటయు, అన్వేషించుట ఇత్యాదు
లందు మామూలుగా అలవాటుపడిన యీ మనస్సు ఒకవేళ
అట్లు స్వేచ్ఛగా సంచరించ నారంభించినను దానిని కూడ
దీసికొని శుద్ధచైతన్యమందు కేంద్రీకరించవలెను. పైనుండి
దిగివచ్చు ఈశ్వరకృప వలనగాని, గురుకృప వలనగాని గాక,
లోనుండివచ్చు స్వప్రయత్నము వలననే యీ కార్యము
సిద్ధించుచున్నది.

కా॥ యదా న లీయతే చిత్తం న చ విక్షిప్యతే పునః।
అనింగనమనాభాసం నిష్పన్నం బ్రహ్మ తత్తథా॥ ४६

ఎప్పుడైతే యీ మనస్సు లయస్థితియందు లగ్నము
కాదో, సంకల్పాదులచే విక్షిప్తముకాదో అనగా మనస్సె
ప్పుడు నిర్వికల్పమై ప్రశాంతినొందుచున్నదో అదియే
బ్రహ్మానుభవస్థితి యగుచున్నది.

త్రాటియందలి పాము మనపై పడగనెత్తినపుడు,
బుస కొట్టినపుడు, మనపై ప్రాకనపుడు మనకు కలుగు ఆ
పవిత్రక్షణమే ఆ త్రాడుయొక్క జ్ఞానోదయక్షణమగుచున్నది.

మనస్సు - అనగా సంకల్ప ప్రవాహమే యని మనకు తెలిసియున్నది. అట్టి మనస్సు అజ్ఞానపు తెరవెనుక నొదిగి యుండనపుడు, ఉద్వేగ ప్రవృత్తులనెడు మృత్యున్మృత్యములను చేరకుండ నుండునపుడు అది మనస్సు కాజాలదు. ఎక్కడ మన మనస్సట్లు సంపూర్ణముగా శాంతినందుచున్నదో అక్కడ మన జ్ఞానము ఆత్మతత్త్వము ననుభవించుచున్నది.

సంస్కృతములో ప్రత్యగాత్మనే ఆత్మయందురు. విషయ ప్రపంచము ద్వారా దేహమనోబుద్ధుల నధిగమించి, ఆత్మ సామ్రాజ్యమును చేరుటకు గౌడపాదుడు సాధకునకు దారి చూపుచున్నాడు. కాని ఆత్మదృష్టికలిగిన క్షణమందు అతని యనుభవము ఆత్మానుభవముగాక బ్రహ్మానుభవమై యున్నది. ఈ పదముల మార్పు అచ్చుదోషముచే కలుగలేదు. ఆ మహర్షి యొక్క కలమందలి అజాగ్రత్తచేతను కలుగలేదు. ఇది సాటిలేని కలముయొక్క బుద్ధిపూర్వకమైన వ్రాతయే యనవచ్చును. ఇక్కడ మహర్షి యొక్క భావమేమనగా ఆ ఆత్మ జ్ఞానమును పొందుక్షణమున సాధకుడు కేవలము తనలోనుండు ఆత్మనేగాక 'బ్రహ్మ' యనబడు సర్వవ్యాపి పరమాత్మను కూడ తెలిసికొనుచున్నాడు.

శ్రీ శంకరాచార్యుల మతప్రకారము, జీవబ్రహ్మైక్యమే జ్ఞానమని చెప్పబడిన విషయము నిచట మనము జ్ఞాపకపఱచుకొనుట ప్రయోజనకారియగును. అతని భాష్యమంతటను "ఈ జీవాత్మ పరమాత్మ ఐక్యమే జ్ఞానము" అని చెప్పని జ్ఞాన నిర్వచనమే లేదు. సంగ్రహించి చెప్పిన మానవునిలోనుండి మనస్సును తీసివేసిన దేవుడగుచున్నాడు. దేవు

నకు మనస్సును కలిపిన మానవుడగుచున్నాడు. అశాంతి యందే మనస్సు నిలచును. శాంతియున్నచోట దేవు డున్నాడు. కామ సంకల్పములు, భావస్పందనములు, మరియు, అజ్ఞానమునుండి బయల్వెడలు అంతులేని యాకార ములచే సృష్టమగు అలజడులన్నియు అంతమొందినయెడల అచట అశాంతి యుండజాలదు. ఇట్లు మనస్సెచట మనస్సు కాకుండనున్నదో, మానవుడా మనస్సును ఎప్పుడు వదలి వేయుచున్నాడో, అప్పుడతడు ఆత్మతత్త్వము ననుభవించు చున్నాడు.

తత్, తదా యని యీ శ్లోకములో రెండు సర్వ నామ పదములు పయుక్తమైనవి. తత్ అను పదముచే యింత వరకు ఉపనిషత్తులద్వారా నిర్వచింపబడిన ఆ సర్వవ్యాపి సత్య జ్ఞాన తత్త్వమును సూచించుచున్నది. ఆ తత్త్వము సాధకు నకు ప్రారంభదశలో దూరముగా నున్నట్లు భాసించుటచే 'తత్ - అది' అను సర్వనామపదముచే సూచింపబడినది.

ఇదివరకు వివరింపబడిన జ్ఞానస్థితిని మనస్సు అందు కొనినయెడల ఆ ఆత్మ తత్త్వముగా జ్ఞాతమై, పరమగురువులచే వివరింపబడిన ఆత్మీయానుభవము మనకు సన్నిహితమై అందు బాటులోనికి వచ్చుచున్నది.

కా॥ స్వస్థం శాంతం సనిర్వాణమకథ్యం సుఖ ముత్తమం ।
అజమజేన జ్ఞేయేన సర్వజ్ఞం పరిచక్షతే ॥ ४२

ఈ అతీతానందము మనము ఆత్మను కనుగొనుటపై ఆధారపడి యున్నది. అది అనిర్వచనీయమై అజమైన ముక్తి

రూప శాంతియై యున్నది. అజమై, బ్రహ్మజ్ఞాన విషయమైన ఆత్మతో ఐక్యము పొందినదగుటచే అది సర్వజ్ఞం బ్రహ్మ యని వర్ణింపబడినది.

జ్ఞాన విషయము, జ్ఞేయస్థానముకూడ యీ శ్లోకములో సూచింపబడినది. మరియు, అట్టి స్థితిని యనుభవించుటకు కావలసిన సాధనను చేయవలసినదని సాధకునకు చెప్పబడినది. అటుపిమ్మట అతని యనుభవము తప్పక యీ దివ్యాను భూతియే యగుచున్నది. ఈ మహదానందము ఆత్మజ్ఞాన ముపై ఆధారపడియున్నది. అది అజము, అనిర్వచనీయము స్వేచ్ఛాయుతము నైన ప్రశాంతి. జ్ఞానమన్వేషించు విషయ మైన ఆత్మతో సమానమగుచున్నది కావున అది అజమై, సర్వజ్ఞమైన బ్రహ్మ యని వర్ణింపబడినది. ఈ పారిభాషిక పదము నిదివరకే వివరించియున్నాము. కావున యింతవరకు ఈ అధ్యాయములో వివరించిన దానినిబట్టి యీ శ్లోకమునకు అధికవివరణ యవసరములేదు.

మనస్సు స్థిరమై ప్రశాంతమైనప్పుడనుభవింపదగిన యీ యానందమే ఉత్కృష్టానందమగుచున్నది. ఇదియే ముక్తి నిచ్చునది. ఇది అనిర్వచనీయము. ఈ పరిమిత భాషలో దీనిని వర్ణింప శక్యముకాదు.

కా॥ న కశ్చిజ్జాయతే జీవః సంభవోఽస్య న విద్యతే ।
ఏతత్తదుత్తమం సత్యం యత్ర కించిన్న జాయతే ॥౪౮

ఈ ప్రత్యగాత్మ రూపములైన జీవులు ఎన్నడును జన్మించలేదు. వాని జన్మకు ఎట్టి కారణము లేదు. ఎచట ఏదియు జన్మించలేదో అదియే ఉత్తమమైన సత్యము.

గౌడపాదుని మతమునకు సారభూతమైన సంపూర్ణ అజాతవాదమును ఈ శ్లోకము సంగ్రహపరచుచున్నది. యోగ వాసిష్టమునియొక్క గౌడపాదునియొక్క మూలసిద్ధాంతము అజాతవాదమై యున్నది. వేదాంతములో శ్రీ శంకరా చార్యులచే క్రొత్తగా ప్రవేశపెట్టబడిన 'సంబంధరూపేణ జగత్సత్యం' అను నవీన మతమునకు వ్యతిరేకముగా అజాత వాతసిద్ధాంతమను సనాతన మతమును వసిష్ఠ గౌడపాదులు బోధించువారై యున్నారు. వీరిద్దరు ఆత్మసామ్రాజ్యమునకు చెందినవారు. వారు విశ్రాంతికొరకైనను సెలవు తీసికొని క్రిందకు దిగరు. తామున్న స్థలముననే వారు కూర్చుండి జ్ఞానసులోచనములద్వారా యీ ప్రపంచమును చూచునపుడు మనలోకూడ ఆత్మ ప్రతిబింబములను తప్ప మరియొక దానిని వారు చూడలేరు.

త్రాడుయొక్క సత్యజ్ఞానమును కలిగిన వాడొకడు భ్రాంతసర్పమును చూచి భయపడు మూఢుని నిందించు చున్నాడు. గౌడపాదుడుకూడ యిట్టి కార్యమునే చేయు చున్నాడు. ఆ ఆత్మజ్ఞానములోనే యిమిడిపోయినవాడై, యందే యానందించి రమించువాడై, ఆ జ్ఞానములోనే నివ సించువాడై, సర్వహృదయాధి దేవతయై యీ పరమగురువు సమస్తమును పాలించుచున్నాడు. అతని దృష్టిలో తనకు భిన్న మైన వస్తుప్రపంచము లేనేలేదు. ఈ అధ్యాయములోని యీ తుది శ్లోకము గౌడపాదుని మతమును రంగరించి చేసిన బహు ప్రయోజక రసగుళికవలె యున్నది. ఇందులో గౌడపాదుని అజాతవాదమున్నది. ఇది బౌద్ధులగు శూన్యవాదులు

శూన్యమే సత్యమని చెప్పుటచేత యిది అజాతవాదము కాలేదు కాని ఆత్మయే సత్యమగుటవలననే యిది అజాత వాదమై యున్నది. కావుననే గౌడపాదుని మతసారమీ రస గుళికలో ఇమిడియున్నది.

జాతము పట్టి భ్రమ. అజాతమే ఆ పరమ సత్య తత్త్వము. కావున ద్వైతప్రపంచమునుచూచి దాని కొక కారణము నన్వేషించువాడు ఆకాశములో పక్షుల పదచిహ్న ములను - అన్వేషించునట్టివాడే యగుచున్నాడు. ఏదియు జన్మించలేదు. కావున మనము జగత్తునకెట్టి యుక్తమైన కారణ మును కనుగొనలేము. ఈ నానారూపజగత్తు కారణమున్ననే యుద్భవించుచున్నది. కాని ఉత్తమ తత్త్వముకంటె యేదియు ఉండియుండలేదు. కావున యేదియు ఎప్పుడును జన్మించ లేదు.

# అధ్యాయము ౪

## ఆలాతశాంతి ప్రకరణము

గ్రంథమంతటిలోను ఈ అధ్యాయమునకు మిక్కిలి ప్రముఖమైన స్థానము కలదు. దీని స్థానమును గురించి కొంత మంది విమర్శకులు ప్రశ్నించుచుండిరి. వారి విమర్శల నెదుర్కొనుట కష్టము. ఈ అధ్యాయము ప్రార్థనతో ప్రారంభింపబడినది. కావున యిది స్వతంత్రమైన గ్రంథమనియు అట్టిది యిందులో చేర్చబడినదనియు వారి యభిప్రాయము. కాని యీ విషయము నంగీకరించుటకు హేతువాదము చాల తక్కువగా ఉన్నది. మరికొందరు, గౌడపాదుని కారిక లన్నియు ఒకనిచే వ్రాయబడలేదనియు, అది నలుగురిచే వ్రాయబడిన నాలుగు గ్రంథములనియు, ఆ గ్రంథములన్నిటిని చేర్చి కూర్చబడిన వేదాంతగ్రంథమే ఇది యనియు అనుటకుకూడ సిద్ధపడిరి. శ్రుతిమాత కంఠములోని మాలగా ఈ నాలుగు పుష్పములను సుందరముగా కూర్చిన శ్రీ శంకరులచేత వారి వాదములు పటాపంచలు చేయబడినవి. ప్రార్థనతో ప్రారంభింపబడి యున్నది గనుక, ఇది ప్రత్యేక గ్రంథమని చెప్పు భట్టాచార్యుల మతము అవశ్యమంగీకరించవలసిన పనిలేదు. ఏలయన సంస్కృత వాఙ్మయములో మూడువంతులన్ని యధ్యాయములును ప్రార్థనతోనే ప్రారంభించుట పరిపాటియై యున్నది.

"ముందున్న మూడధ్యాయములలోని శ్లోకములు ఇందు పునరుక్తమైనవి" అని యీ యధ్యాయముపై మరి

యొక విమర్శ గలదు. ఇది యుపదేశగ్రంథమగుటచే దీనికి పునరుక్తి దోషము పట్టదు. గురువు తనయొక్క యభిప్రాయ మును ముఖ్యవిషయములపట్ల నొక్కి చెప్పవలసి వచ్చును. విషయము చాలా సూక్ష్మమైనదగుటచే విద్యార్థులు దానిని అపార్థమైనను చేసికొనవచ్చును. లేదా యీ ముఖ్యాంశము లను దాటిపోనైనా పోవచ్చును. వేదాంతమందలి యుపదేశ గ్రంథములకు ముఖ్యముగా సంస్కృతములో పునరుక్తి యను నది యొక శైలియై యున్నది. కారికలు ఉపదేశగ్రంథమని సుస్పష్టముగా తెలిసియే యున్నది. ప్రాచీనమైన తాళపత్ర గ్రంథములందలి గ్రంథాంత గద్యలలో యీ విషయము సూచింపబడి యున్నది.

పూర్వాధ్యాయములోని శ్లోకములను గౌడపాదుడు బుద్ధిపూర్వకముగానే యిచట మరల యుదహరించి యున్నాడు.

అ. జగత్కారణత్వ కల్పన యెంత మూఢత్వము, అని-

ఆ. ఆలాతము త్రిప్పుటచే కలుగు వివిధ చిత్రములతో ఈ ప్రపంచమును పోల్చుట ద్వారా జగన్మిథ్యా త్వమును వివరించుట, అనియు,

ఇ. ఆ పరమ సత్యము శాశ్వతము, అజము, అద్వైతము అని స్థిరపరచుటకుగాను బౌద్ధమత విధానము ననుస రించి హేతువాదము చేయుట, అనియు

ఈ అధ్యాయములో మూడు ముఖ్యాంశములు చెప్ప బడియున్నవి. ఈ అధ్యాయములో గౌడపాదుడు బౌద్ధమత

మందలి అనేక సాంకేతిక పదములను స్వేచ్ఛగా ఉపయోగించెను. కేవలము అతడు వానిని గ్రుడ్డిగా యెరువు తెచ్చుకొనలేదు. తనయొక్క స్వతంత్రమైన యభిప్రాయములను, అర్థచ్ఛాయను అభివ్యక్త పరచుటకై సుకరముగానుండు బౌద్ధశాస్త్రీయ పదములను యథారూపముగా వారి గ్రంథముల నుండి యతడు ఉద్ధరించి యుపయోగించెను.

"బౌద్ధమతము ననుసరించవలసినదని గౌడపాదుడు మనకు బోధించుచున్నాడు" అని చెప్పు మరికొంతమంది విమర్శకులు "కావుననే యిందు ఉపనిషత్తులందలి యుదాహరణలిందు లేవు" అని యాక్షేపించుచున్నారు. "గౌడపాదుని ఆగమశాస్త్రము" అను గ్రంథములో శ్రీ భట్టాచార్యులు "మన గ్రంథకర్తయొక్క కడపటి గ్రంథమగు 'ఆలాతశాంతి' లో ఉపనిషత్తులేవియు ఉదహరింపబడియుండినట్లు అందేదియు కానరాదు" అని చెప్పియున్నారు. కాని యిది న్యాయమైన విమర్శకాదు. అట్లుచెప్పుట వేదాంతతత్త్వవిరుద్ధమగుచున్నది. వేదములలోని శాశ్వత జ్ఞానమును జ్ఞాపకపఱచు ఉపనిషత్తులయొక్క అర్థమును ప్రతి విద్యార్థికిని పరిచయపరచు పదములెన్నియో ఇందు గలవు. Pro. (Belvankar) బెల్వాంకర్, ఈ అధ్యాయమందు అనేకమైన ఉపనిషత్తులను (శ్లో. 75, 80, 85, 95) సూచించియున్నారు.

వేదాంతాచార్యుడగు గౌడపాదుని విమర్శించువారిని యీ గ్రంథనామముకూడ ఆకర్షించినది. బౌద్ధ ఆదర్శములను ప్రతిష్ఠింపదలచుకొనినవాడై గౌడపాదుడు బౌద్ధమతములో వేదాంతమతము నన్వేషించుచున్నాడని వారు ప్రతిపాదించు

చున్నారు. గౌడపాదు డీ ఆలాత ఉపమానమును బౌద్ధగ్రంథ ములనుండి గ్రహించుటయే ఆ విమర్శకు లిట్లు గౌడపాదుని అపార్థము చేసికొనుటకు కారణమగుచున్నది. గౌడపాదుడు బోధింపదలచిన విషయమునకా ఉపమానము అత్యంతము ఉపయోగపడుటచేతనే యాతడట్లు దానిని గ్రహించెను. ప్రపంచసంఘటనలపై వేదాంతమతస్థుల కెవ్వరికిని సర్వ హక్కులు లేవు కదా. చంద్రుని యుపమానముగా తీసికొను టకు సర్వహక్కులు తమవే యని యెవ్వరును చెప్పలేరు కదా. మరియు ఈ ఉపమానము మైత్రేయణి ఉపనిషత్తులలో నున్నది గనుక గౌడపాదునితోపాటు బౌద్ధులుకూడ ఆ యుపనిషత్తునుండియే యీ యుపమానమును తీసికొనిరని చెప్పవచ్చును. ఆ యుపనిషత్తులలో "తిరుగుచున్న దీప చక్రమువలె బ్రహ్మ ప్రకాశించుచున్నాడనియు, సూర్యకాంతి వలె ప్రకాశించుచున్నాడనియు తలంచుచున్నారు" అని యున్నది. ఈ అధ్యాయములోని "గారడీ ఏనుగు" అను ఉదాహరణకూడ యెరువు తెచ్చుకొనినదే యని యీ విమ ర్శకులు భావించుచున్నారు. కాని యీ యుదాహరణ భాసుని నాటకములోని ప్రసిద్ధుడైన యుదయుని కథనుండి వచ్చియుండవచ్చునని వారు మరచిరి.

నేడు మనమా వేదాంత గ్రంథములను వివరించునపుడు మనకు పరిచయమై వాడుకలోనున్న వైజ్ఞానిక పదములను క్రైస్తవమతమందలి యుదాహరణలను ఉపయోగించునట్లు నాడు శ్రీ గౌడపాదుడుకూడ, పుస్తకములను రచించి యమ్ము కొనుటకే కాక, ఆ మహత్తర జ్ఞానమును ఆ నాటి విద్యా

వంశముల కందజేయదలచినవాడై తన కాలమునాడు వాడు కలోనున్న ప్రసిద్ధ పదములను ధారాళముగా నుపయోగించెను. శాశ్వత ప్రాముఖ్యముగల సిద్ధాంతములను తనతరము వారికి వారి స్వభాషలో బోధించుటయే సాధువుల పనియై యున్నది.

వేదాంతమతమును క్రమబద్ధముగా వివరించుటలో గౌడపాదుడే ప్రథముడు. బ్రహ్మసూత్రముల కింతకంటె ప్రాచీనత కలిగియున్నను అవి కేవలము ఉపనిషత్తులయొక్క దివ్యతత్త్వసారముగానే భావింపబడుచున్నవి, గాని క్రమబద్ధమైన వేదాంతముగా పరిగణింపబడలేదు. గురు సాంప్రదాయము ప్రకారము చూచిన శ్రీ గౌడపాదుడు శ్రీ శంకరులకు వేదాంత పితామహుడని చెప్పవచ్చును.

శ్లో॥ నారాయణం పద్మభవం వసిష్ఠం శక్తించ తత్పుత్ర పరాశరంచ ।
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవింద యోగీంద్ర మథాస్య శిష్యం ।
శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తామలకం చ శిష్యం ।
తంత్రోటకం వార్తికకార మన్యానస్మద్గురూన్సంతతమానతోఽస్మి ॥

శ్రీ శంకరాచార్యులయొక్క వారి శిష్యులయొక్క పరంపరలోనిది యగు ఆచార్యపరంపర యీ శ్లోకములో కలదు. ఈ గురువంశము శ్రీ మహావిష్ణువుతో ప్రారంభించి పారంపర్యక్రమముగా ఆ తత్త్వజ్ఞానమును మన కందజేయుచున్నది.

నారాయణుడు, పద్మభవుడు, వశిష్ఠుడు, శక్తి, యాతని పుత్రుడగు పరాశరుడు, వ్యాసుడు, శుకుడు, తచ్ఛిష్యుడగు గౌడపాదుడు, గోవిందపాదుడు, శ్రీ శంకరాచార్యులు, తచ్ఛిష్యుడగు పద్మపాదుడు, హస్తామలకుడు, త్రోటకాచార్యుడు.

ఈ వంశావళిలో శ్రీ శంకరాచార్యుల గురువైన గోవిందపాదుడు శ్రీ గౌడపాదుని శిష్యునిగా తెలిసికొనుచున్నాము.

శ్లో॥ జ్ఞానేనాకాశకల్పేన ధర్మాన్యో గగనోపమాన్ ।
జ్ఞేయాభిన్నేన సంబుద్ధస్తం వందే ద్విపాదాం వరం ॥ ౧

జ్ఞేయాభిన్నమై, ఆకాశసదృశసమైన అనంత జ్ఞానము ద్వారా ఆకాశముతో సమానమైన వివిధ మానవతత్త్వములను ఎవడైతే తెలిసికొనుచున్నాడో అట్టి నరశ్రేష్ఠునకు నేను నమస్కారము చేయుచున్నాను.

ఇట్టి ప్రార్థనాశ్లోకముతో శ్రీ గౌడపాదుడు తన కారికలయొక్క కడపటి అధ్యాయమును ప్రారంభించుచున్నాడు. జీవాత్మ పరమాత్మల ఐక్యతాజ్ఞానమును తెలిసికొనినవాడై, నరశ్రేష్ఠుడైన తన గురువునకు తన వందనముల నతడు అర్పించుచున్నాడు. ఈ "ద్విపదాం వరం – మానవ శ్రేష్ఠుడు" అను నీ పదమునుగూర్చి యనేకమైన విమర్శలు బయల్వెడలినవి. ఆత్మజ్ఞానము, భూతదయగలిగి నరశ్రేష్ఠుడైన బుద్ధునికొఱకే యీ ప్రార్థనయని కొంతమంది భావించుచున్నారు. శ్రీ గౌడపాదుడు బదరీనాథ లోయలలో చాలా కాలము వేదాంతసత్యమగు ఆత్మతత్త్వముపై యనేక సంవత్సరములు ధ్యానము చేసెననియు, అంత ఆ నారాయణుని యనుగ్రహముచే, అట్టి అంతఃప్రేరితమైన ఆత్మజ్ఞానము అతని కలవడెననియు జనశ్రుతియైయున్నది.

తన స్వకీయానుభవములచే పొందిన వేదాంత సిద్ధాంతములను, ఆతని స్వీయానుభవములను, ఈ కారికలు సూచించుచున్నవి. కావున శ్రీ శంకరాచార్యులతో సహా మిగిలిన వేదాంతాచార్యులందరు ఈ ప్రార్థన బదరీనారాణుని

గూర్చియేనై యున్నదని నిశ్చయించినారు. ఒక పెద్ద గ్రంథము నిర్విఘ్నముగా ముగియుటకై, సంస్కృత సాహిత్యములో సామాన్యముగా ప్రార్థనతో గ్రంథమును ప్రారంభించుట వాడుకయై యున్నది. ఈ నాలుగవ యధ్యాయము ప్రార్థనతో ప్రారంభింపబడినది గనుక యిదియొక ప్రత్యేక గ్రంథమని విమర్శించు విమర్శకులుకూడ కలరు. ఉపోద్ఘాతమునందిట్టివారి విమర్శనలను చర్చించి నిరాకరించడమైనది. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే।'

ప్రత్యేక వ్యక్తిలోని ప్రత్యగాత్మయే సర్వవ్యాపి యగు ఆ పరమాత్మ యను వేదాంతసత్యమును ఈ శ్లోకము సూచించుచున్నది. ప్రత్యగాత్మకు పరమాత్మకు కూడ గల ఆకాశోపమానమును పూర్వాధ్యాయములలో విపులముగా వివరించియున్నాము.

కా॥ అస్పర్శయోగో వై నామ సర్వసత్త్వ సుఖో హితః ।
అవివాదోఽవిరుద్ధశ్చ దేశిత స్తం నమామ్యహం ॥ ౨

వివాదము విరోధము లేక సర్వభూతహితమై, శాస్త్రములచే బోధింపబడిన యీ అస్పర్శయోగమునకు నేను నమస్కరించెదను.

ఆ పరమజ్ఞాన దేవునకు నమస్కరించినపిమ్మట శ్రీ గౌడపాదుడు, ఆత్మతత్త్వమును చేరుటకు తనకు సహాయపడిన ఆ యోగమునకే నమస్కరించుచున్నాడు. 'ఆత్మజ్ఞానము పొందిన పిమ్మట ఒకడు తానే ఆత్మగా యగుచున్నాడు'

అనునది పరమాచార్యులచే ఆమోదింపబడిన శాస్త్ర ప్రతిపాదనయై యున్నది. ఇట్లు జ్ఞానముచేపొందిన ఆత్మకు నమస్కరించుట ఆ పరమలక్ష్యమునకు నమస్కరించుటయే యగుచున్నది. హైందవ వేదాంతములో లక్ష్యమున కెంత ప్రాముఖ్యముకలదో దానిని చేర్చుమార్గమునకుకూడ అంతయే ప్రాధాన్యమున్నది. సాధ్యమెంత పవిత్రమో సాధనకూడ యంతే పవిత్రముగల సత్యసంస్కృతినే ఆర్యులు అనుసరించువారై యున్నారు. కావున శ్రీ గౌడపాదుడు జ్ఞాన మార్గమునకు ప్రత్యేకముగా నమస్కరించుట యుక్తముగాను, ఉదాత్తముగాను ఉన్నది.

ఈ అస్పర్శయోగము నిదివరకే పూర్వాధ్యాయములో విపులముగా వివరించితిమి. ఆత్మ పరిపూర్ణతసంగు మార్గములో విజయవంతముగా ప్రయాణముచేయుటకు సాధకునకు వీలుకలిగించుటకునై ఉపయోగింపబడిన యీ విశేషణములు అతి గంభీరములై భావగర్భితములై యున్నవి.

ప్రపంచములోని యెట్టిపనియైనను ప్రపంచ ప్రజలకు సుఖమును సంతృప్తిని కలిగించునదై యుండవలెను. ఏది సుఖమో అది సదా తప్పక హితమైనదిగానే యుండవలయునని లేదు. కావున సుఖమై, హితమైన పనులు చాలా అరుదుగానే యున్నవి. ఈ అస్పర్శయోగము అందరికిని సుఖమును హితమునుకూడ కలిగించుచున్నదని గౌడపాదుడు చెప్పుచున్నాడు. ఆత్మజ్ఞానమునకు మరియు అనేకమార్గములున్నవి కాని యచట యవి యా ప్రత్యేకవ్యక్తికే అనుగ్రహరూపమగుచున్నవి కాని యితరులకు హితకరముగా ఉండజాల

కున్నవి. ఇట్లుండుటకు కారణమా మార్గములలో చాలవరకు బాహ్యాడంబరము కలిగియుండుటయే యగుచున్నది. భక్తి మార్గములో పూజావిధానము, మంత్రజపము, భగవత్సంకీర్తన మొదలైన కర్మకాండకు సంబంధించిన విధానములు చాలగలవు. ఇవన్నియు సంశయాళువులైన యిరుగు పొరుగు వారికి అసౌకర్యము కలిగించవచ్చును ! ఇంక హఠయోగములో చాలా కఠిన నియమములు కలిగియుండుటచే నది తీవ్ర తపశ్చర్యవంటిదే యగుచున్నది. ఆ మార్గమును గ్రహించలేనివారికి యట్టి తాపసుని చూచుటకూడ బాధాకరముగానే యుండును. ఇక కర్మకాండలో కొంతవరకు రాగద్వేషములు తప్పక చేరియే యున్నవి. ఇట్లు చూచిన యీ మార్గములన్నింటిలోను ఏదో ఒక విధముగా స్వల్పమైన దుఃఖమో విచారమో ఉండనే ఉన్నది. ఈ అస్పర్శయోగము హృదయకుహరాంతర్గతమైన ఆంతరికాభివృద్ధి యగుటచేత, అది యితరుల కెంతమాత్రము బాధాకరము కాదు. మరియు నది ఆ ప్రత్యేకవ్యక్తికి హితమును చేకూర్చునదిగా కూడనున్నది.

ఆత్మపరిపూర్ణతనందు ఈ మార్గముయొక్క ప్రయోగ విధానము నెమ్మదిగాను, సావధానముగాను హృదయ వికాసముతోను ప్రారంభించుచున్నది. అట్టి సాధనలో మార్గమందుండు వ్యతిరేకపు భావనలనెడి యటవిని ఛేదించుకొనుచు ఆ స్థలమందు ఉదాత్తగుణములను స్థాపించుట జరుగుచున్నది. కావున ఆత్మాభివృద్ధినందు నీ శాస్త్రీయవిధానమునకు వ్యతిరేకముగా ఎట్టి విరోధముగాని ప్రతివాదముగాని ఉండజాలదు. మిగిలిన యన్నిమార్గములలోను ప్రతివాదములకు చాల

అవకాశములు ఉన్నవి. ఒక గురువు బోధించు సిద్ధాంతము కంటె మరియొక గురువు చెప్పు సిద్ధాంతములు విభిన్నముగా నుండును. అప్పుడొక సిద్ధాంతము ననుసరించు శిష్యునకు నితర సిద్ధాంతములలో నెట్టి సాధ్యములున్నవో అర్థము కాకుండును. అనగా ఒక యోగమును అనుసరించువాడు ఇతరుల సిద్ధాంతములందుండు సాధ్యములను కూడ తెలిసికొనకోరుచుండును గావున అతడు తప్పక తానవలంబించు యోగమునే తాననుసరించవలెననెడి నియమము లేనివాడగును. మరియు కర్మయోగము ననుసరించువాడు, భక్తిజ్ఞాన యోగములద్వారానే సాధ్యమును పొందగలుగుచున్నాడు. కాని అస్పర్శయోగమందు అట్టి అడ్డుదారులేవియు లేవు. అది ఒకే రాజమార్గము. అది చాల దగ్గర మార్గము కూడ అగుచున్నది. బాణమువలె ఈ అస్పర్శయోగము తిన్నగా పోయి లక్ష్యమునే చేరుచున్నది. వివేకబుద్ధి, నిష్కాపట్యము, ఆత్మార్పణము అను పాథేయములు తనవద్ద యున్నంతవరకు సాధకుడీ మార్గములో నిరాటంకముగా సాగిపోవుచునే యుండును. ఇట్లాతనికి యభివృద్ధియే కలుగుచుండును.

కా॥ భూతస్య జాతి మిచ్ఛంతి వాదినః కేచిదేవ హి।
అభూతస్యాపరే ధీరా వివదన్తః పరస్పరం ॥ 3

ఇదివరకే యున్నదానినుండి జగత్తు ఉద్భవించినదని కొంతమంది భావించుచున్నారు. మరికొంతమంది ఇదివరకు లేనిదానినుండి (అభూతమైనదానినుండి) జాతి యనగా జగదుత్పత్తి సంభవించినదని భావించుచున్నారు.

ఈ శ్లోకములోను రాబోవు శ్లోకములోను సాంఖ్యుల మతమును వివరించి ఖండించుచున్నాడు. ఈ యిద్దరుకూడ ద్వైతులే. వారి పరస్పరవాదములలో కనుపట్టు లోపములనే గౌడపాదు డిచట అభివ్యక్తపరచుచున్నాడు. ఈ వాద ప్రతి వాదములకు అతీతమైన మార్గము నతడు తన శిష్యులకు చూపు చున్నాడు.

ఈ రెండు విరుద్ధమతములను అర్థము చేసికొనుటచే విద్యార్థులకు ద్వైతుల మతములను గుఱించి కొంచెము తెలిసి కొనుటకు వీలు గలుగుచున్నది. సాంఖ్యులు సత్కార్యవాదము అనబడు పరిణామ వాదమును నమ్ముచున్నారు. ఒక కార్యము ఉద్భవించుటకు ముందే యది తన కారణమందిమిడి యున్నది. ఉదాహరణకు, ఘటము మట్టియందిదివరకే యున్నది. వీరి మతప్రకారము ఏదియు హఠాత్సంభవము కాదు. ఈ కార్యము ఆ కారణములో నిదివఱకే యుండి యుండకపోయినయెడల ఆ కార్యమందుండి సంభవించుటయే జరుగదు. కార్యమిదివరకే సూక్ష్మరూపములో తనయందిమిడి యుండిననే వారి కది కారణమగుచున్నది. ఇట్లు కారణము కార్యముగా పరిణమించుటయే వారి మతప్రకారము కార్య కారణవాదమగుచున్నది. ఘటము మట్టిలో నిదివరకే తిరో హితమైయున్నది. కారణగుణము సమస్త కార్యగుణములను ఆవరించుచున్నది. అప్పుడీ కారక వ్యవహారము అంతర్గత కార్యమును బహిర్గతము చేయుచున్నది. అంత మట్టినుండి ఘటము ఉద్భవించుచున్నది.

ఈ వాదము నంగీకరించకపోయిన, ఒక ప్రత్యేక కారణమునుండి ఒక ప్రత్యేక కార్యము ఉద్భవించినదని చెప్పుట కుదురదని సాంఖ్యుల యభిప్రాయము. ఉదాహరణకు, ఇసుకను కొట్టి ఇడ్లీయును, ముళ్ళనుండి పండ్లను, కడుగునుండి వెన్నను తీయవచ్చునుకదా ! మరియు ఒక ప్రత్యేక కారణము అట్టి ప్రత్యేక కార్యమునే పుట్టించగలుగుచున్నది గనుక కార్యముద్భవించుటకు పూర్వమే యది కారణమందిమిడి యున్నదని వారు వాదించుచున్నారు. ఇట్లు సాంఖ్యులకు కారణమందు సూక్ష్మరూపములో కార్యము ఇమిడియున్నది. కావున కార్యకారణములు తత్త్వములో ఒకటే యగుచున్నవి.

న్యాయవైశేషిక మతస్థులు ఈ మతమును ఖండించుచు తమ మతమును స్థాపించువారై 'అసత్కార్యవాదము' లేదా "ఆరంభవాదము" అను దానిని ప్రవచించిరి. పదార్థములు హఠాత్తుగా సంభవించినవనియే వీరి సిద్ధాంతమై యున్నది. కార్యము కారణములో నిమిడియున్నదని నమ్ముటకు వీరు నిరాకరించుచున్నారు. కార్యమిదివరకే కారణములోనుండిన దానిని యుద్భవింపజేయుట యనవసరమని వారు వాదించుచున్నారు. "కారక వ్యవహారము మట్టినుండి ఘటమును బహిర్గతము చేయుచున్నది." అనుదానిలో అర్థమేమి యని సాంఖ్యులను ప్రశ్నించువారై వీరు ఆ సాంఖ్యుల వాదములో ఛిద్రమును కనబఱుచుచున్నారు. న్యాయవైశేషికము, ఘటమునుద్భవింపజేయు కారక వ్యవహారమునకు, ఇదివరకే అజ్ఞాతముగానున్న ఘటమును బహిర్గతముచేయు కారక వ్యవహార

మునకును భేదమేమున్నదని" సాంఖ్యుల మతములోని సూక్ష్మ భేదమును సూచించి వారిని ప్రశ్నించుచున్నారు.

కారణములో నిదివరకే కార్యమిమిడియున్నదను సాంఖ్యుల సిద్ధాంతమును సూటిగా నుదహరించువారై న్యాయవైశేషికులు, "మట్టియు ఘటము ఏకము, మరియు మట్టియు కుండయు భిన్నము" అని ఒకేసారి చెప్పినట్లున్నదని సాంఖ్యులమతమును నిరసించుచున్నారు. "భేదములో అభేదమును చెప్పు సాంఖ్యుల సిద్ధాంతమును నమ్ముట వైషమ్యమును మ్రింగివేయుటవంటిది" అని ఒక విమర్శకుడు సరిగా చెప్పెను.

ఇట్లు "కారణముకంటె కార్యము భిన్నమైనదనియు, తాను ఉద్భవించినపుడే కార్యము ప్రారంభమగుచున్నదనియు" న్యాయవైశేషకులు భావించుచున్నారు. అయినప్పటికిని కారణముకంటె కార్యము సంపూర్ణముగా భిన్నమైనదని వారు నమ్మరు. అట్లయిన యిదివరకు సంభవించిన యసందర్భములు ఇచటకూడ సంభవించవచ్చును. నూనెను తఱచుటచే మనము తేనెను తేగలము! ఇట్టి అసందర్భములను అణచివేయుటకు వారు కార్యకారణములకు సమవాయ సంబంధమును అంగీకరించియున్నారు. "కార్యభావము అప్పటికప్పుడే యుద్భవించినను కారణముతో దానికి సమవాయ సంబంధము కలదు" అని వారు విశ్వసించుచున్నారు. మన మీ మతములలోని వివరములకు పోనావశ్యకము లేదు. ఈ పరస్పర వైరుధ్యమే "వారి పరస్పర మతములను ఖండించుచు. వేదాంతమునే తప్పక యొప్పుకొనవలసి వచ్చు

నని'' తెలియపఱచుచున్నదని గౌడపాదుడిచట చెప్పుచున్నా డని మనము గ్రహించిన చాలును.

ఈ శ్లోకములోని పూర్వార్ధము కారణమందిదివఱకే యిమిడియున్న కార్యమే యుద్భవించుచున్నదను సాంఖ్యుల మతమును సూచించుచుండి, ఉత్తరార్ధము కారణములో నిది వరకు లేనిదై, ఉద్భవముతోనే కార్యము ప్రారంభించుచున్న దను న్యాయవైశేషిక మతమును సూచించుచున్నది.

కా॥ భూతం న జాయతే కించిదభూతం నైవ జాయతే।
వివదన్తోఽద్వయా హ్యేవమజాతిం ఖ్యాపయన్తి తే॥ ४

ఇదివరకే యున్నది మరల పుట్టజాలదు. అట్లే ఇదివరకు లేనిది మరల పుట్టినదని చెప్పుట అసందర్భమగుచున్నది. ఇట్లు వీరు పరస్పరము వాదించుకొనుచు తమకు తెలియకుండగనే అద్వైత మతమైన అజాతివాదమును స్థిరపఱచుచున్నారు.

యుక్తి యుక్తమైనట్లు తోచు ఈ మతములలోని నిస్సారతను చూచి మన కారికాకారుడు నవ్వుచున్నాడు. తుదకా రెండు మతములును తమకు విరుద్ధమైన తత్త్వమునే స్థాపించుచున్నవి. ఇదివరకే అస్తిత్వము కలది మరల అస్తిత్వము కలది కాజాలదు. అది యిదివరకే యున్నది కావున మరల యున్నదనుట నిన్ననే నా తండ్రి పుట్టినాడని చెప్పుట వలె యుండును. ఇదివరకు లేనిది యిప్పుడు ఉద్భవించ జాలదు. ''నేనొక ఇంద్రధనస్సును కొంటిని'' అనుట సత్య విరుద్ధమై యున్నది. ''అతడు నాకు గగన కుసుమమును

ఇచ్చును'' అనునది వ్యర్థమైన ఆశ. వాస్తవములో లేనిది ఉద్భవించజాలదు. ఇట్లు సాంఖ్య వైశేషిక మతములు రెండును ప్రపంచ ప్రాదుర్భావమును వివరించలేకున్నవి. కావున వారు ప్రాదుర్భావమునకు కారణమును చెప్పలేని వారై ''ఎప్పుడు ఏదియు ఉద్భవించలేదు. సృష్టి కారణాన్వేషణము అంధవిశ్వాసములలోకెల్ల మూఢతమ మైనది'' అను వేదాంతమతమునే స్థాపించుచున్నారని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

కా॥ ఖ్యాప్యమానామజాతిం తైరనుమోదామహే వయం।
వివదామో న తైః సార్ధమవివాదం నిబోధ త॥ ౫

ఇట్లు ద్వైతులు చెప్పు అజాతివాదమును మేముకూడ ఆమోదించెదము. వారితో మాకు విరోధము లేదు. ఇప్పుడు నిర్వివాదమైన విషయమును చెప్పుచున్నాము. వినుడు.

సాధారణముగా గొప్పగా తర్కవాదములను చేయగల ద్వైతులను వారి తీవ్ర విశ్వాసములను విమర్శించుటలో గౌడపాదుని యొక్క సూక్ష్మమైన పరిహాసము ధ్వనించుచున్నది. వారి స్వంత సిద్ధాంతముల ద్వారానే మన అజాతివాదమును వారు ప్రకటించుచున్నారని కారికాకారుడు చెప్పుచున్నాడు. వారితో మాకు విరోధములేదు సరికదా వారి సరియైన దృష్టిని, గ్రహణబుద్ధిని మేము స్వీకరించుచున్నాము. ఇప్పుడు మా మతమును వివరించెదము. సృష్టికారణత్వ కల్పన కేవలము మిథ్యయనియు, మూఢవిశ్వాసమనియు సారహీనమైన

వేదాంత వాదనలద్వారా చెప్పకుండ చెప్పుచున్న సత్య మిదియే యనియు మేము వివరింప ప్రయత్నించెదము.

వేదాంతసిద్ధాంతప్రకారము జగత్తు మిథ్యయని స్థిర పరచువాడై, అతీతమైన ఆత్మసామ్రాజ్యమును చేరుటకు మార్గమధ్య మందున్న వ్యతిరేకభావనలనెడి యరణ్యములను ఛేదించుచు, ప్రారంభ విద్యార్థులకు మార్గమును శుభ్రపఱచు టకై నడుముకట్టి గౌడపాదు డీయధ్యాయములో ప్రవేశించు చున్నాడు.

కా॥ అజాతస్యైవ ధర్మస్య జాతి మిచ్ఛన్తి వాదినః।
అజాతోహ్యమృతో ధర్మో మర్త్యతాం కథమేష్యతి॥ ౬

పరస్పరము వివదించుకొనువారై ద్వైతులు ఆత్మ జన్మించుచున్నది యని భావించుచున్నారు. అజాతమై, అమృతమైన ఒక తత్త్వము మర్త్యత్వమును ఎట్లు పొందగలదు ?

ఈ శ్లోకార్థము ఇదివరకే (మూడవ అధ్యాయము లోని ఇరువదియవ శ్లోకములో) వివరింపబడినది.

కా॥ న భవత్యమృతం మర్త్యం న మర్త్యమమృతం తథా।
ప్రకృతే రన్యథాభావో న కథంచిద్భవిష్యతి॥ ౭

అమృత తత్త్వము మర్త్యత్వమును గాని, మర్త్య త్వము అమృత తత్త్వమును గాని పొందజాలదు. తన సహజ ప్రకృతిని మార్చుకొనుట దేనికైనను అసంభవము.

కా॥ స్వభావేనామృతో యస్య ధర్మో గచ్ఛతి మర్త్యతాం।
కృతకేనామృతస్తస్య కథం స్థాస్యతి నిశ్చలః॥ ౮

సహజ ప్రకృత్యా అమృతమైనది మర్త్యత్వమును పొందుచున్నదని నమ్మువారు, 'మర్త్యత్వమును పొందియు ఆ అమృతతత్త్వమునే పోషించుకొనుచున్నది' అని యెట్లు చెప్పగలరు ?

పూర్వాధ్యాయములోని 21, 22వ శ్లోకముల యర్థమును వివరించినపుడే యీ రెండు శ్లోకముల తాత్పర్యము వివరింపబడినది. ఆ భావములను దృఢపఱచుటకు ఇది సరియైన సందర్భమని మరల యిచట యీ శ్లోకములనే పేర్కొనుచున్నాడు. ఈ శ్లోకముల భావము పూర్వాధ్యాయములో పూర్తిగా వివరింపబడినది. ఒక వస్తువు తన స్వభావమును మార్చుకొనుటకు ఎందుకు, ఎట్లు సంభవము కాదు అను దానిని వివరించ శక్యము కాదు. దానిపై వివరణ యీ క్రింది విధముగా నున్నది.

కా॥ సాంసిద్ధికీ స్వాభావికీ సహజా అకృతా చ యా ।
ప్రకృతి స్సేతి విజ్ఞేయా స్వభావం న జహాతి యా॥ ౯

ఒక పదార్థముయొక్క ప్రకృతి యనగా ఆ పదార్థములో భాగముగా నైక్యము పొందిన స్వభావమని మనము తెలిసికొనుచున్నాము. ఆ స్వభావము – సాంసిద్ధికీ, స్వాభావికీ, సహజా, అకృతా యని నాలుగు విధములు. ఏదియు తన సహజ స్వభావమును విడిచిపెట్టదు.

వేదకాలములోని వాఙ్మయమువలె మరి యే యితర వాఙ్మయములందును శాస్త్రీయభావన యిట్టి యున్నతిని యింతవరకు అందుకొనలేదు. అట్టి ఔన్నత్యము విశేషముగా మతగ్రంథములలోనే యగపడుచున్నది. ఆర్యులైన ఆ పరమాచార్యులు ప్రత్యేక పదార్థముయొక్క ప్రకృతిని నాలుగు విధములుగా విభజించిరి. ఈ నాలుగు విభాగములలో చేరని స్వభావముగల వస్తువు ఉండుట అసంభవము.

సాంసిద్ధికీ – పరిశ్రమచే సిద్ధించినవి :– యోగశక్తులు, పాండిత్యము, అక్షరజ్ఞానము ఇత్యాదులు. బాగుగా నొకరికి యలవడిన యట్టి యలవాట్లు యతనిని విడువజాలవు. తన పారిశుద్ధ్యమును కాపాడుకొనునంతవరకు శుద్ధిచేయబడిన బంగారము తన విలువను పోగొట్టుకొనజాలదు. బాగుగా అలవరచుకొని పొందిన యలవాట్లు. స్వాభావకీ – ఒక ద్రవములో సహజముగానే యుండు ప్రకృతి. ఉదాహరణకు అగ్నిలో ఉష్ణము – తేజస్సు. ఈ రెండు గుణములు లేకున్న అగ్నియే లేదు కావున అగ్నికి అవి అత్యావశ్యకములైన సహజగుణము లగుచున్నవి.

అకృతా – అకృత్రిమము – నీరు నిమ్నదేశమునకు పారుట. నీరు పల్లమునకు పారుచున్నదనగా అది యంత్రము చేత క్రిందికి త్రోయబడుట లేదు. అట్లు పల్లమునకు పారుట నీటియొక్క సహజ స్వభావమే యగుచున్నది

సహజా – జన్మతో కూడ గలిగిన గుణములు. ఉదాహరణ :– బాతులు నీటిలో నివసించుట, పక్షులు ఆకాశమున కెగురుట ఇత్యాదులు వానికి జన్మసిద్ధమైనవి.

ఇవి నాలుగున్ను గౌడపాదునిచే యీ శ్లోకములో చెప్ప బడిన సహజప్రకృతులు. కాని శాస్త్రప్రకారము అయిదవదికూడ కలదు. దానినికూడ యిచట 'చ' అను దానిచే గౌడపాదుడు సూచించియున్నాడు. "అది స్వరూప ప్రకృతి" ఉదాహరణ :- పటములో పటత్వము, ఘటములో ఘటత్వము ఇత్యాదులు. పటములో పటత్వము తీసివేసిన అది పటము కాజాలదు. ప్రత్తిమూటనుగాని, దారపుండలనుగాని పటము (బట్ట) అని చెప్పలేము కదా ! పటత్వము కలదియే పటమగుచున్నది. ఈ పదార్థములన్నియు పూర్తిగా మారిపోయిననే తప్ప తమ సహజ ప్రకృతిని వీడి వేరుకాజాలవు. సహజ ప్రకృతిని విడిచి యేదియు నిలువజాలదు. "చల్లని అగ్గి" "నల్లని సూర్యుడు" ప్రకృతిలో ఇంకను పుట్టలేదు.

ఏదియు తన సహజ ప్రకృతిని మార్చుకొనజాలదు. "తన ప్రకృతిని మార్చుకొనలేదు కనుక అమృతము మర్త్యత్వ మును పొందదు. మర్త్యత్వము అమృతత్వమును పొందదు" అను నీ వాక్యము ఇతఃపూర్వమందున్న రెండు శ్లోకములలోని (6, 7) భావమును బలపఱచుచున్నదై యున్నది. మర్త్యుడు తాను మర్త్యుడుగా నుండియే అమృతుడు కాలేడు. అట్లే ఆ పరమాత్మ అనిత్యజగత్తుగా పరిణమించినచో నింక యచట ఒక శాశ్వత తత్త్వము మార్పులేకుండ అదే విధముగా శాశ్వతముగా నుండజాలదు. అట్లుండుననిన వివేకమునకు హేతువాదమునకు విరుద్ధమగును.

ప్రపంచములోని యితరమతములవలె వేదాంతమతము హేతువాదమునకు విరుద్ధమైన యెట్టి స్థూలాంశమునుకూడ

అంగీకరించదు. వేదాంతము అంధవిశ్వాసముతో బాధపడు నది కాదు.

కా॥ జరామరణ నిర్ముక్తాః సర్వే ధర్మా స్స్వభావతః ।
జరామరణ మిచ్ఛన్తశ్చ్యవన్తే తన్మనీషయా॥ ౧౦

ఈ జీవులందరు స్వభావముచేతనే జరామరణ వర్జితులు. కాని వారు జరామరణములు తమకు కలవని భావించు చున్నారు.

ఆత్మతత్త్వము ప్రతివ్యక్తియొక్క సహజప్రకృతియై యున్నది గనుక ఈ ప్రత్యగాత్మలన్నియు (ప్రత్యేకముగా విడివడిన జీవాత్మలన్నియు) ఆ ఆత్మస్వభావమునే కలిగియుండ వలెను. అంతకంటె విభిన్నముగా నుండజాలవు. అయినను మీరు నేను కూడ అనిత్యత్వముగల పరిమిత మనోభావము లచే బాధపడుచునే యున్నాము. మనమా దివ్యప్రకృతిగల వారమైనప్పటికిని ఆత్మకు సహజమగు శాశ్వతతత్త్వమునకు వ్యతిరేకముగా నున్నామని మనము సదా భావించుచుందుము. మర్త్యులకంటె భిన్నులము కామని భావించి మనము మర్త్యత్వమునే యనుభవించుచున్నాము. ఈ మర్త్యభావమే 'జరామరణ' యను పదముచే సూచింపబడినది.

ఒక సంపూర్ణ జీవితములో యీ భౌతిక శరీరము అయిదు విధములుగా పరిణమించుచున్నది. అవి "జనించుట, వృద్ధిపొందుట, రోగము, క్షీణతగల ముసలితనము, మరణము" అనునవి. ఇచట 'జరామరణములు' అను పదములు మిగిలిన మూడింటినికూడ తమలో చేరినవిగా సూచించు

చున్నవి. అజ్ఞానపు ఆడంబరము చేతను, మిథ్యా తాదాత్మ్యముచేతను మనము పుట్టుచున్నామని, పెరుగుచున్నామని భావించుచున్నాము. ఈ పుట్టుట, పెరుగుట అనునవి రెండును రోగ జరామరణములతో కలిసి సంసార దుఃఖ రూపమును పొందుచున్నవి. ఇవన్నియు ఆ యా విధములుగా మార్పు చెందిన దేహములతో మనము తాదాత్మ్యమును చెందినపుడు పొందిన యనుభవములు, కలిగిన మానసిక భావములు తప్ప మరేమియు కాదు. కొంచెము వివేకముతో విచారించిన యీ మార్పులన్నియు దేహమనోబుద్ధులకే గాని మనలోని ఆత్మకు లేవు అని తెలియగలదు.

దేహము పుట్టుచున్నది. మనోబుద్ధులు పెరుగుచున్నవి. రోగము శరీరమునకు సంబంధించినదైన, బాధ మనస్సునకు సంబంధించి యున్నది. క్షీణత ఇంద్రియములకు సూక్ష్మ దేహ శక్తులకు సంబంధించినది. స్థూలదేహమునుండి సూక్ష్మ దేహము వేరగుటయే 'మరణము' అగుచున్నది. ఇట్లగుటచే ఈ మార్పులేవియు ఆత్మను అంటుటలేదు.

ఇట్లు మన సహజ స్వభావమును మఱచిపోయి ఆత్మ నావరించిన భౌతికావరణలతో ఎక్కువగా తాదాత్మ్యము నందుటచేత, యీ భౌతికావరణలయందు కలుగు మార్పు లను ఆత్మకు కలుగు మార్పులనుగా భావించుచున్నాము. వాస్తవములో యీ ప్రత్యగాత్మయే సచ్చిదానందరూపమైన యా పరమాత్మయై యున్నది. అయినను దాని స్వభావమును అపార్థము చేసికొని యీ యశాశ్వతమైన గుణముల నా యాత్మయందారోపించుచున్నాము. తత్ఫలితముగా మనము

మన మర్త్యజీవితములోని దుఃఖములను అనుభవించు చున్నాము. ఈ సంసార జీవితము మనది కాదు.

ఈ ప్రపంచముతో అస్తిత్వము కలిగియుండుటచే వచ్చు దుఃఖాదులు, జీవితపు పోరాటములు అన్నియు ఆత్మ తనను తాను కనుగొనుటకు పడు పాట్లే యై యున్నవి. మనము మన సహజప్రకృతినుండి విడివడినవారమై, ఆ పరమాత్మనుండి నిర్వాసితమైనట్లు దూరముగా జీవించుచున్నాము. కాని ప్రపంచమున ఏదియు తన సహజప్రకృతినుండి విడివడి యుండలేదు కనుక మనలోని ఆత్మ తన ప్రకృతి స్వరూపమగు పరమాత్మ తత్త్వమును కనుగొనుటకై జీవాత్మను శ్రమపెట్టుచున్నది. ఇట్లు స్వస్వరూప - మిథ్యాస్వరూపములచే అణగగొట్టబడినదై మన జీవాత్మ జీవిత సంఘటనలనెడు అడకత్తెరలో పడి నలిగిపోవుచున్నది. ఈ జీవితములోని దుఃఖములన్నియు మనలోని మిథ్యాజీవుడు వ్యర్థముగా భావించు భావనామాత్రములే యగుచున్నవి.

కా॥ కారణం యస్య వై కార్యం కారణం తస్య జాయతే।
జాయమానం కథమజం భిన్నం నిత్యం కథం చ తత్॥౧౧

కారణమే కార్యమని వాదించువారు, ఆ కారణమే కార్యముగా ఉద్భవించుచున్నదని భావించుచున్నారు. అట్లు కారణము కార్యముగా ఉద్భవించినయెడల ఆ కారణము 'అజము' ఎట్లు కాగలదు. మరియు ఆ కారణమునకు ఇన్ని మార్పులు కలిగినపుడు అది మార్పు లేనిది, నిత్యమైనది ఎట్లు కాగలదు?

గౌడపాదుడిచట సాంఖ్యమతమును విమర్శించు చున్నాడు. వారి మతప్రకారము కార్యము కారణములో నిమిడియే యున్నది. అట్లు కార్యము కారణములో నిదివరకే యుండిన ఆ కారణము మరల మార్పుచెంది కార్యముగా యుద్భవించినదనిన కారణమే కార్యముగా మారుచున్నది. మార్పు అనిత్యత్వమును కల్పించును. మార్పుచెందునది నశించుపదార్థమగుచున్నది. కావున కార్యము కారణము నుండి యుద్భవించినదనియు, అయినప్పటికి ఆ కారణము 'నిత్యము సంపూర్ణము' అని చెప్పునట్టి సాంఖ్యుల సిద్ధాంతము ఎట్లు సరిపడునని గౌడపాదుడు వారిని ప్రశ్నించుచున్నాడు. నిష్పాక్షికమైన బుద్ధితో విమర్శించిన వాస్తవములో యీ సిద్ధాంతము నిలువజాలదని గౌడపాదుడు చెప్పుచున్నాడు. కారణము కార్యముతోగాని, కార్యము కారణముతో గాని తాదాత్మ్యమును చెందియున్నదను ప్రతిపాదన విశ్వసింపదగి నది కాదు. ఈ రెండు పక్షముల యందును కార్యకారణ సంబంధమంగీకరించిన తక్షణము కారణమశాశ్వతమైనదై నశించునదగును. కావున ప్రపంచమే నారాయణుడు నారా యణుడే ప్రపంచము అను నీ రెండు పక్షములందును, నారా యణుని నుండి ప్రపంచ ముద్భవించినదనుట ఆ నారాయణుని హత్యచేయుట వంటిదే యగుచున్నది. 'ఈ సృష్టికి ఆ పర మాత్మయే కారణము, ఆ పరమాత్మనుండి యీ సృష్టి యుద్భవించినది,' అని చెప్పిన ఆ పరమాత్మకూడ అనిత్యు మైన మర్త్యుడగుచున్నాడు.

కా॥ కారణాద్యద్యనన్యత్వమతః కార్యమజం యది ।
జాయమానాద్ధి వై కార్యాత్కారణం తే కథం ధ్రువం ॥ ౧౨

కారణము కార్యముతో ఐక్యమగుచున్నదనిన ఆ కార్యముకూడ కారణమువలె అజము, నిత్యము కావలసి వచ్చును. మరియు కారణము కార్యముకంటె భిన్నము కానిచో, అట్టి కారణము శాశ్వతము, స్థిరము ఎట్లుకాగలదు.

ఆ పరమాత్మ యీ జగత్కారణమని గాని, లేక శాశ్వతమైన ఆ పరమాత్మ నుండి అశాశ్వతమైన యీ ప్రపంచ ముద్భవించినదనిగాని చెప్పుటకు సాధ్యమైన హేతువాదమేమియు లేదు. "బెండకాయనుండి బూడిదెంక పుట్ట జాలదు. పరమాత్మనుండి ప్రపంచము ప్రభవింపజాలదు. ఏ తల్లియును రాతిబొమ్మను కనలేదు. చిత్ నుండి జడము పుట్టజాలదు. నిత్యమునుండి అనిత్యము, అపరిమితము నుండి పరిమితము పుట్టజాలదు. ఈ ప్రపంచము సత్యమనియు, ఇది యీ సత్యతత్త్వమునుండియే యుద్భవించినదనియు, చెప్పిన, నిత్యకారణమైన యీ పరమాత్మనుండి యీ యనిత్యవస్తువు లుద్భవించుట జరుగదు కావున, యీ అనిత్య వస్తువుల యుత్పత్తికి కారణమైన యీ నిత్యపరమాత్మకూడ వారి సిద్ధాంతము ప్రకారము క్షీణించి నశించునదే యనవలసి యున్నది. ద్వైతులు తమ విశ్వాసముపై పట్టుదలగలిగి యుండుటకు మరియొక అవకాశమున్నది. అదికూడ తార్కికముగా అసందర్భముగాను పరిహాసాస్పదముగాను ఉండ గలదు. "ఆ భగవంతుడు తననుండి యీ అనిత్య ప్రపంచ

మును సృష్టించుచున్నాడు. అట్లు సృష్టించియు తాను తన శాశ్వతప్రభావముతోనే యుండి విరాజిల్లుచున్నాడు." అని చెప్పినను ద్వైతులు చెప్పవచ్చును. కట్టి యీ అభిప్రాయ మును ఈ శ్లోకార్థము వ్యంగ్యముగా పరిహసించుచున్నది. శ్రీ శంకరులు నిత్యజీవితములోని యుదాహరణద్వారా వారి యీ వాదములోని లోపములను తమ భాష్యములో చక్కగా యెత్తి చూపుచున్నారు. "ఒక కోడిని రెండుగా కోసి ఒక భాగమును వండుకొనుటకు తీసికొని, రెండవ భాగమును గ్రుడ్లు పెట్టుటకై జాగ్రత్త పరచుటవలె నున్నదని యను చున్నారు.

కా॥ అజాద్వై జాయతే యస్య దృష్టాన్తస్తస్య నాస్తివై ।
జాతాచ్చ జాయమానస్య న వ్యవస్థా ప్రసజ్యతే ॥ ౧౩

అజాతమైన కారణమునుండి కార్యము పుట్టినదని చెప్పి వివరించుటకు నిత్యజీవితములో మనమెట్టి యుదాహర ణను ఎత్తిచూపలేము. ఇంక, జాతమైన కారణము నుండియే కార్య ముద్భవించిన దనిన దానికి కారణమొకటి యుండ వలెను. ఇట్లు కారణాన్వేషణ చేయ ప్రారంభించిన అనవస్థా దోషము వచ్చిపోవును.

ద్వైతులు తమ వాదమునింకను వదలక పట్టుకొనదలచి యుండినచో వారు అజాతమైన కారణమునుండి కార్యముద్భ వించినదని వాదించవచ్చును. ఇది మరియు అత్యంతాసంద ర్భమై యుండును. నాకు పుట్టని కుమారునియొక్క కుమారుకై పండ్లనొప్పితో బాధపడలేదుకదా! ఆ కారణమే పుట్టనప్పుడు

అది కార్యమునెట్లు పుట్టించగలదు ? నేను ఎనిమిదేండ్ల బాలు నిగా నుండిన నా కుమార్తె జబ్బుతో ఎట్లు బాధపడగలదు?

ఈ కార్యకారణ సంబంధమునకు సంభావ్యమైన మరి యొక వాదమేమనగా నేను నా తండ్రికి, నా తండ్రి యతని తండ్రికి జన్మించినట్లు "కార్యకారణములు రెండును జాతమై నవే" అని. ఇట్టి కారణాన్వేషణలో ఆ పరమాత్మను ఎన్న టికిని చేరలేము. మనస్సు ఎంతవరకు ఊహించగలదో అంత టిలో కారణమునకు మరియొక కారణము ఉండియుండవలెను కదా ! ఇట్లు కారణాన్వేషణములో నా తండ్రికి తండ్రి, ఆ తండ్రికి తండ్రి యని చెప్పుకొనుచు పోవగా తుదకు తార్కిక మగు అనవస్థా దోషమే రాగలదు. కావున అకారణ కారణ మైన శాశ్వత తత్త్వమొకటే సత్యమని నమ్మి యంగీకరించిన యెడల ఈ ప్రపంచమూ పరమాత్మనుండి యుద్భవించినదని మనము చెప్పజాలము. ఈ ప్రపంచ సృష్టికి ఆ పరమాత్మ కారణము కాజాలదు.

కా॥ హేతో రాదిః ఫలం యేషా మాదిర్హేతుః ఫలస్య చ ।
హేతోః ఫలస్య చానాదిః కథం తైరుప వర్ణ్యతే॥ ౧౪

"కార్యమే కారణమునకు కారణము. కారణమే కార్య మునకు కారణము" అని చెప్పువారు ఈ కార్యకారణములు రెండును అనాదియైనవని యెట్లు నిరూపించగలరు ?

ఈ శ్లోకము మీమాంసక మతస్థుల వాదమునకు సమ్మెటపెట్టై యున్నది. "ఈ ప్రపంచము పూర్వకర్మ ఫల

ముగా యుద్భవించినదనియు, ఇప్పుడు మనము చేయు కర్మలు భవిష్యత్ ప్రపంచమునకు కారణమగుచున్నవనియు" వారు నమ్ముచున్నారు. ఆత్మీయముగా దీనిని వివరించిన "నేను పూర్వజన్మలో చేసిన కర్మలే యీ నా జన్మకు కారణము. నేనీ జన్మలో ప్రతి క్షణము చేయు కర్మలు నా భవిష్యజ్జన్మ ఫలములను నిర్ణయించు కారణములై యున్నవి" అని చెప్ప వచ్చును. కర్మకాండను తచ్ఛక్తిని విశ్వసించు మీమాంస కులు, "పూర్వకర్మలు ఈ జన్మకు కారణములనియు, ఈ జన్మలో చేసిన కర్మలు మరుజన్మకు కారణములనియు" భావించుచున్నారు. ఇట్లు వారికి కార్యమే కారణమునకు కారణమగుచున్నది. ఈ శ్లోకములో మీమాంసకుల వాద ములోగల దోషము చెప్పబడినది. రాబోవు శ్లోకములో దాని ఖండన జరుగును.

కా॥ హేతోరాదిః ఫలం యేషామాదిర్హేతుః ఫలస్య చ ।
తథా జన్మ భవేత్తేషాం పుత్రాజ్జన్మ పితుర్యథా॥ ౧౫

ఇట్లు కార్యము కారణమునకు కారణము, కారణము కార్యమునకు కారణము అను చెప్పువారి వాదనను పరిశీ లించగా పుత్రుడు తండ్రియొక్క జన్మకు కారణమని పర్యవ సానములో తేలుచున్నది.

పూర్వశ్లోకము మీమాంసకుల వాదమునకు సుత్తి దెబ్బయైన యీ శ్లోకము వారియనుయాయులపై గొడ్డలి పెట్టు అగుచున్నది. పరిహాస వేదాంతియైన గౌడపాదుని పరి హాసము మీమాంసకానుయాయులపై తిరిగినది. కార్యమే

కారణమునకు కారణమైన యెడల మీ మతము ప్రకారము పుత్రుడే తన తండ్రికి తండ్రి కావలసి యుండును. పుత్రుడే తన తండ్రికి తండ్రి యగుటను ప్రపంచములో మనమెక్కడను కని విని యుండలేదు కదా. ఇట్టిది సంభవించినయెడల మీమాంసకుల మతముకూడ పరిపూర్ణమైనది సమగ్రమైనది కాగలదు.

కా॥ సంభవే హేతుఫలయోరేషితవ్యః క్రమస్త్వయా ।
యుగపత్సంభవే యస్మాదసంబంధో విషాణవత్ ॥ ౧౬

ఇంకను ఈ కార్యకారణ వాదమును వదలకయున్న ఆ రెండింటికిని ముందు వెనుకల విషయమై ఒక క్రమమును చెప్పవలసివచ్చును. కార్యము ముందా, కారణము ముందా యని మనము నిర్ణయించవలసివచ్చును. కార్యకారణములు రెండును ఒకేసారి యుద్భవించిన వనిన మృగముయొక్క కొమ్ములవలె యవి యొకదానితో నొకటి సంబంధము లేకుండ యుండును.

సాంఖ్యుల మతమును న్యాయవైశేషికమతమును సరి పోల్చి చూచునపుడు ఎట్టి కారణమునుండియు యద్వివిధమైన కార్యము ఉద్భవించజాలదని కనుగొంటిమి కదా! కారణము కార్యములో నైక్యము కాలేదు. కారణము కార్యముతో నైక్యమగుచున్నదనుటకు తగినంత బలము లేదు. మరియు 'కార్యము కారణమునకు కారణము' అను మీమాంసకుల మతముకూడ అసందర్భముగనే యున్నదనియు మనము తెలిసి కొంటిమి. కావున గౌడపాదుడు కార్యకారణ సంబంధమును

కల్పించు ద్వైతులను పిలచి "కార్యకారణములలో ఏది ముందు ఉద్భవించినది ?" అనుదానిని వివేకియైన విద్యార్థి విశ్వసించి, సంతృప్తితో స్వీకరించునట్లుగా ఆ కార్యకారణ క్రమమును నిశ్చయముగా చెప్పవలసినదని వారిని యడుగుచున్నాడు.

కార్యకారణ భావమును నమ్మువారు ఎల్లప్పుడు పూర్వమందుండు కారణము, సదా పశ్చాద్భవమగు కార్యమును ఉత్పత్తిచేయుచున్నదని తప్పక నిరూపించవలెను. కార్యకారణము లిట్లు క్రమముగా గాక ఒక్కసారే యుద్భవించిన వనిన ఆకార్యకారణములు తమ మధ్య యెట్టి సంబంధమును స్థిరపరచుకోలేవు. ఒకే సారిగా పుట్టి పెరుగుచున్న ఆవుయొక్క రెండు కొమ్ములకును యద్విధముగను కార్యకారణ సంబంధము కల్పించుట అసంభవము కదా. ఇట్లు ఒకేసారి పుట్టి, ఒకే విధముగా పెరుగుచున్న రెండు అంశము లెన్నటికిని మృగ విషాణములవలె సంబంధమును కలిగి యుండజాలవు.

ఈ కారిక కాలముదృష్ట్యాకూడ కార్యకారణ సంబంధము సరిపడదని కార్యకారణ భావమును నిరసించుచున్నది.

కా॥ ఫలాదుత్పద్యమానాస్సన్నతే హేతుః ప్రసిధ్యతి।
అప్రసిద్ధః కథం హేతుః ఫలముత్పాదయిష్యతి ॥ ౧౭

కార్యమునుండి కారణము ఉద్భవించినదనిన అట్టి కారణము లేనిదే యగుచున్నది. అట్టి అస్థిరమైన కారణము నుండి కార్యమెట్లు ఉద్భవించగలదు ?

కార్యమే పుట్టలేదు కావున అజాతమైన కార్యము నుండి కారణము పుట్టినది అని చెప్పిన మరుమరీచిక వలె యా

కారణము అస్తిత్వమే లేనిది యగుచున్నది. సృష్టికారణ భావమే హేత్వాభాసను కలిగించుచున్నదని యీ కారికార్థము చెప్పుచున్నది.

కార్యకారణ భావమును విశ్వసించువారు, 'కార్య కారణములు రెండును తమ యుత్పత్తికి తామే పరస్పరము ఆధారమై యున్నవి' అని భావించుచున్నారు. కాని కారణము కార్యముకంటె ముందుండు ననియు, కార్యము కారణమునకు తరువాత ఉండుననియు సామాన్యధర్మమై యున్నది.

కావున ద్వైతులయొక్క వాదనలేవియు నిశితబుద్ధి యొక్క సూక్ష్మ పరిశీలనల కాగజాలవు.

కా॥ యది హేతోః ఫలాత్సిద్ధిః ఫలసిద్ధిశ్చ హేతుతః ।
కతరత్పూర్వ నిష్పన్నం యస్య సిద్ధిరపేక్షయా ॥ ౧౮

కార్యము కారణమునుండి యుద్భవించిన, లేదా కారణము కార్యమునుండి యుద్భవించిన యితరమైన కార్యముయొక్కగాని కారణముయొక్కగాని యుత్పత్తికి యేది కారణమగుచున్నది ? కార్యకారణములకు కారణమైనది యేది ముందుగా ఉత్పన్నమైనది ?

కార్యకారణములకు యద్విధముగాను సంబంధ మసంభవమైనప్పటికిని, 'కారణతః కార్యకారణములకు సంబంధము లేకపోయినను, ఆ కార్యకారణములు తమ అస్తిత్వమునకు యొకదానిపై యొకటి పరస్పరము ఆధారపడియున్నవి' అని ప్రతివాదులు వాదించుచున్నారు. దీనికి ప్రత్యుత్తరమిచ్చు

వాడై, 'కార్యకారణముల రెండింటిలోను ముందున్నది యేది' యని గౌడపాదుడు వారిని యడుగుచున్నాడు. దీనిని నిర్ణయించిననే గాని వానికి పరస్పరాధారము చెప్పుట కుదరదు.

కా॥ అశక్తిరపరిజ్ఞానం క్రమకోపోఽథవా పునః ।
ఏవం హి సర్వథా బుద్ధైః అజాతిః పరిదీపితా ॥ ౧౯

ప్రత్యుత్తరమిచ్చుటలో అశక్తి, విషయ అపరిజ్ఞానము, కార్య కారణములయొక్క క్రమస్థాపనలో అసంభవము - అనునివి యన్నియు, పరిపూర్ణమైన అజాతివాదమునకే సర్వథా అంటిపెట్టుకొని యుండునట్లు జ్ఞానులను ప్రోత్సహించుచున్నవి.

పైని చెప్పిన కారణములచే వివేకవంతుడైన వేదాంత విద్యార్థియు, జ్ఞానులైన మహర్షులును కార్యకారణములకు కారణత్వకల్పనలోగల అసందర్భమును అభివ్యక్తపఱచుచున్నారు. "ఈ వాదములలో అసందర్భమును తెలిసికొనిన జ్ఞానులకు అజాతివాదము నభివ్యక్తపఱచుటకే దారి తీయుచున్నది" అని శ్రీ శంకరాచార్యులు సూటిగా చెప్పిరి. తన మాండూక్య కారికలలో గౌడపాదు డీ విషయమునే ఒత్తి చెప్పదలచుకొనినాడు.

కా॥ బీజాంకురాఖ్యో దృష్టాన్తః సదా సాధ్యసమో హి సః ।
న హి సాధ్యసమో హేతుః సిద్ధౌ సాధ్యస్య యుజ్యతే॥ ౨౦

బీజాంకుర న్యాయమే ఇంకను సాధించవలసి యున్నది. అట్లు స్వయముగా సాధితముగాని విషయము సాధ్యమైన మరియొక విషయమును సిద్ధింపజేయలేదు కదా !

నిస్సంశయమై నిశ్చితమైన గౌడపాదుని సిద్ధాంతముపై కొంతమంది పూర్వపక్షము చేయుచున్నారు. బీజమునకు అంకురమునకు గల సంబంధము వంటిదే కార్యకారణ సంబంధముకూడ యని వారు చెప్పుచున్నారు. ఇట్టి వారి వాదమునకు కారికాకారుడు ఈ శ్లోకములో ప్రత్యుత్తరము నిచ్చుచున్నాడు. బీజాంకురముల మధ్య కార్యకారణ సంబంధము ఇదివరకు స్థిరపడలేదు. మొక్క పుట్టకముందు విత్తు కార్యమై యున్నది. విత్తునుండి మొలక పుట్టిన తరువాత విత్తా మొక్కకు కారణమగుచున్నది. ఇట్లు ఒకే వి త్తనమునందలి విభిన్న కాలమందలి యవస్థలే కార్యకారణములగుచున్నవి. విభిన్న కాలములో, విభిన్న దేశములో ఒకే కారణము కార్యముగను, అదేకార్యము కారణముగను అగుచున్నవి. అంతతః యీ బీజాంకురవాదములో ఏది దేనికి కారణమని మనము చెప్పలేకున్నాము. ఒక కాలము దృష్ట్యా కారణముగా నున్నది మరియొక కాలము దృష్ట్యా కార్యముగా నగుచున్నది !!

కావున మీ కార్యకారణభావమును స్థాపించుటకు స్వయముగా సిద్ధముకాని బీజాంకుర న్యాయమును ఉదహరించుటకు వీలులేదని గౌడపాదుడు దృఢముగా చెప్పుచున్నాడు.

కా॥ పూర్వాపరా పరిజ్ఞానం అజాతేః పరిదీపకం ।
జాయమానాద్ధి వై ధర్మాత్ కథం పూర్వం న గృహ్యతే ॥ ౨౧

కార్యకారణములయొక్క పూర్వాపర అపరిజ్ఞానమే అజాతివాదమును బలపరచుచున్నది. కార్యమగు జీవాత్మ

వాస్తవములో నొక కారణమునుండి పుట్టినదే యైన ఆ పూర్వ కారణమును చెప్పుటలో మీరెందుకు అసమర్థులగు చున్నారు ?

జ్ఞానులమైన మేము ఈ అజాతివాదము నెట్లు ప్రతి పాదించ గలుగుచున్నాము ? ద్వైతులు తమ కార్యకారణము లకు పూర్వాపరస్థితిని సూచించలేకపోవుటచేతనే, ఏదియు ఎప్పుడును, ఎట్టి కారణమునుండియు కార్యరూపములో సృష్టిం పబడలేదని స్పష్టమగుచున్నది. కారణమునుండి కార్యమే ఉద్భవించకపోయిన వానికి పూర్వాపరప్రసక్తియే లేదుకదా. ద్వైతులు తమ మతమును స్థాపించుకొన అసమర్థులై తుదకు అజాతివాదమునే అభివ్యక్త పఱచుచున్నారు. ఈ ప్రపంచము ఒక కారణమునుండి యుత్పన్నమైన కార్యమే యైన యెడల అట్టి యీ ప్రపంచరూపమునకు నిశ్చయకారణమును ద్వైతులు ఏల చూపించలేకపోవుచున్నారు? అని గౌడపాదుడు ప్రశ్నించు చున్నాడు.

కా॥ స్వతో వా పరతో వాపి న కించిద్వస్తు జాయతే ।
సదసత్సదసద్వాపి న కించిద్వస్తు జాయతే॥ ౨౨

స్వతః గాని, పరతః గాని, యీ రెండింటివలన గాని యే వస్తువు ఉద్భవించలేదు. సత్తుగా గాని, అసత్తుగా గాని, సదసత్తుగా గాని యే వస్తువు ఉద్భవించలేదు.

సాంఖ్యులయొక్క న్యాయవైశేషికుల యొక్క మత ములను సంగ్రహించి, గౌడపాదు డిచట వేదాంత నిర్ణయ మగు అజాతివాదమును స్థిరపరచుచున్నాడు. సృష్టి యుద్భ

వించుటకు సంభావ్యమగు ఆఱు మతములను చెప్పి యీ ఆఱు మతముల ప్రకారము కూడ సృష్టి యథాతథముగా ఉద్భవించ జాలదని తుది నిర్ణయమును చేయుచున్నాడు.

1. తననుండియే తాను (స్వతః) యేదియు జన్మించ లేదు. ఒక ఘటము ఆ ఘటమునుండియే పుట్టలేదు. నేను నా నుండియే పుట్టలేదు.

2. ఒక వస్తువు తనకంటె భిన్నమైన (పరతః) యితర వస్తువునుండి యుద్భవించజాలదు. నీటినుండి కుర్చీని యుత్పత్తి చేయలేముకదా! ఘటమునుండి పటమును ఉత్పత్తి చేయలేము.

3. ఒక వస్తువు తననుండి యితర వస్తువునుండి (స్వతః పరతః) రెండు విధములుగాను ఒకేసారి ఉద్భవించజాలదు. ఒక ఘటము ఒక పటము కలిసి ఏకమై మరియొక ఘటమును గాని, పటమునుగాని యుత్పత్తి చేయలేవు.

ఇప్పుడిచట ప్రతివాదులు మరియొక వాదన నిట్లు చేయవచ్చును. తండ్రినుండి పుత్రుడుదయించుటయు, మట్టి నుండి ఘటముద్భవించుటయు చూచుచునే యున్నాము కదా అని. అట్టి జన్మ, యుత్పత్తి యిత్యాదిపదములు కేవలము అర్థరహితములై యున్నవి. శ్రుతికూడ యీ ప్రతిపాదనను సమర్థించుచున్నది. "సమస్త కార్యములు కేవలము నామ మాత్రములే, వాగ్వికారములే" (వాచారంభణం వికారో నామధేయం మృ ... ...సత్యం)

4. సత్తునుండి ప్రపంచముద్భవించినదనిన, ఒక వస్తువు 'సత్ - సదా ఉండునది' యగుచో దానిని మరల యుత్పత్తి చేయనవసరము లేదు. యథార్థములో అది ఉత్పన్నము కాజాలదు కూడ. నన్ను నేనే పుట్టించుకోలేను. నేనిదివరకే యున్నాను. నన్ను మరల యుత్పత్తిచేయలేరు.

5. అసత్తునుండి అనగా లేనిదానినుండి యీ జగదుత్పత్తి కలిగినది యనిన అది యత్యంతము విరుద్ధముగా నున్నది. ఎండమావులలో నేను నీటిని యుత్పత్తి చేయలేను, ఆ నీటిని సేకరించను లేను. మానవునకు కొమ్ములనుగాని, తోకను గాని యుత్పత్తి చేయలేము కదా. కావున అసత్, అసలు లేనిది అనగా అభావమునుండి యేదియు, యే సమయమునందును, ఉద్భవింప జాలదు. ఉద్భవింప చేయజాలము.

6. సదసత్తులనుండి - ఉండి లేనిదానినుండి యొకదానిని యుద్భవింపజేయవచ్చును కదా యని మీరు వెంటనే వాదించవచ్చును. ఇదికూడ అసంభవమే యగును. అటువంటి వ్యతిరేకవస్తువులు ఒకదానితో నొకటి కలిసి యుండజాలవు. ఒక వస్తువు ఒకే కాలమందు సత్తుగాను అసత్తుగాను ఉండజాలదు కదా. బౌద్ధులలో నొక శాఖవారగు క్షణిక విజ్ఞానవాదులీ వాదనను లేవదీసిరి. వారికీ బాహ్యావిషయములన్నియు మనోభావములకంటె భిన్నములు కావు. ఆ భావములు క్షణక్షణము మారుచుండును. ప్రతి భావము పైకివచ్చి వెంటనే నశించిపోవుచున్నది. కావున అట్టి భావము 'సదసత్ - ఉన్నది లేదు' అని మాత్రము చెప్పగలము. కాని వారి యీ మతము

వివేకదూరమగుటచే మనము దానిని యంగీకరింపజాలము. ఒక వస్తువును చూపి 'ఇది వస్తువు' అని చూపి చెప్పులోపలనే యది నశించినయెడల దానిని చూపి చెప్పుటయే కష్టము కదా. ఇదియే నిజమైన మనమెట్టి స్మృతిని కలిగి యుండుటయు అసంభవమే యగును.

ఈ శ్లోకము వస్తూత్పత్తి కారణమును వివరించుటకు సంభావ్యమైన ఆఱువిధముల వాదనలలో గల అసంగతిని చూపుచున్నది. ఇట్లు తుది నిర్ణయముగా అజాతివాదమునే స్థాపించుచున్నది.

కా॥ హేతుర్న జాయతేఽనాదేః ఫలం చాపి స్వభావతః ।
ఆదిర్న విద్యతే యస్య తస్యహ్యాదిర్న విద్యతే ॥ ౨౩

అనాదియగు ఫలమునుండి హేతువు ఉత్పన్నము కాజాలదు. ఫలమగు కార్యముకూడ స్వతః జన్మించినది కాదు. ఏది అనాదియో అది తప్పక జన్మలేనిది - అజమై యుండును.

పూర్వపక్షులు వాదించు మరియొక వాదన యిచట చూపబడుచున్నది. అనాది కారణమునుండి కార్యము ఉద్భవించవచ్చును. లేదా కార్యము స్వతఃగానే యుత్పన్నము కావచ్చును. ఈ రెండు వాదనలను గౌడపాదు డిచట నిరాకరించుచున్నాడు.

కారణము అనాదిమైన అది తప్పక జన్మరహితమైన అజమై యుండవలెను. అట్లు అనాదియైనది అనంతముగా కూడ నుండును. శాశ్వతము అనగా మార్పులేనిది యని

యర్థము. ఒక కార్యమును పుట్టించుట మార్పునకు కారణమగుచున్నది. ఇట్లు తార్కికముగా యోచించిన, ఒక కార్యము అనాదియైన కారణమునుండి యుద్భవించినదని చెప్పుట, అగ్ని మంచుగడ్డనుండి యుద్భవించినదని చెప్పుట వలెనే యుండును. ఈ శ్లోకముతో కార్యకారణ చర్చ ముగియుచున్నది.

మనోబుద్ధుల నధిగమించుటయే మార్గముగాను, అట్టి క్షణమందలి యనుభవమే లక్ష్యమనియు మనకు సమస్త శాస్త్రములు చెప్పుచున్నవి. ఆ మనోబుద్ధుల నధిగమించు రీతు లనేకములున్నవి. వాస్తవములో మనస్సు దేశకాల కారణత్రయములో నుండియే పనిచేయగలదు. ఈ దేశకాల కారణములుకూడ మూడు ప్రత్యేక ప్రకృతులుగా కాక సాధకుని సాధన కొఱకై యీ మూడును ఏకమే యగుచున్నవి. ఒక ప్రదేశము కాలకారణ జ్ఞానము లేకుండ నుండజాలదు. అట్లే ఆ మూడింటిలో నే యొక్కటియును మిగిలిన రెండును లేక అస్తిత్వము కలిగియుండజాలవు. ఇట్లు వివేకముతో పరిశీలించిన సత్యము నిత్యమువలె భాసించు ఈ ప్రపంచ సృష్టి యంతయు మిథ్యగా తెలియుచున్నదని గౌడపాదుడీ వేదాంత గ్రంథములో విద్యార్థులకు సూచించుచున్నాడు. సృష్టికారణమును వివేకముతో ఛేదించుచు, తత్ఫలితముగా మనకు దేశకాలములపై నుండు విశ్వాసమునుకూడ పారద్రోలుచున్నాడు. మనస్సునకు అవధులగు ఈ దేశకాల కారణములలో నే యొక్కటి నశించినను మనస్సు స్వరూపమును నిలుపుకొని యీ మిథ్యా జగద్భావనను మనకు ఈయజా

లదు. కావున మనస్సు నధిగమించిన పిమ్మట గలుగు అను భవము ఆత్మానుభవమే అగుచున్నది.

కా॥ ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వమన్యథా ద్వయనాశతః ।
సంక్లేశస్యోపలబ్ధేశ్చ పరతంత్రాస్తితా యతః ॥ ౨౪

వస్తుజ్ఞానమునకు దద్విషయీభూత వస్తువులే కారణము కావలెను. లేకున్న యీ రెండును నశించవలసివచ్చును. ఈ కారణము చేతను దుఃఖాదుల అనుభవమును పొందుట చేతను ద్వైతు లంగీకరించిన బాహ్యవిషయములయొక్క అస్తిత్వమును స్వీకరించవలెను.

పూర్వ శ్లోకములో నిదివరకే చెప్పబడిన యర్థమును బలపరచుటకై యిచట మరియొక పూర్వపక్షము చేయబడి నది. ప్రజ్ఞప్తి యనగా వస్తుజ్ఞానము – శబ్ద స్పర్శ రసాదుల జ్ఞానము. ఈ ఇంద్రియ జ్ఞానమునకు తత్సంబంధి బాహ్య విష యములే కారణములగుచున్నవి. అనగా పూర్వపక్షుల వాదము ప్రకారము విషయములుండుటచేతనే తద్విషయక జ్ఞానమును మనము సేకరించుచున్నాము. వస్తుజ్ఞానము మనకు లేకున్న అచట వస్తువులైన లేకుండ నుండవలెను, లేదా వస్తు గ్రహణశక్తియైన మనకు లేకుండ నుండవలెను. కేవలము "వస్తుజ్ఞానము" మాత్రము ప్రపంచముయొక్క అస్తిత్వము నకు కారణము కాదు, మరియు దానివలన కలుగు దుఃఖాదు లకు కూడ కారణమగుచున్నవి. ఈ వస్తు ప్రపంచమే లేకున్న మనకు దుఃఖాదులు లేకుండ నుండవలయునుకదా. ఇట్లు 'వస్తుజ్ఞానము' కలిగియుండుట చేతను, దుఃఖాదుల ననుభవిం

చుటచేతను జగదస్తిత్వము స్థిరపరుపబడుచున్నదని వారు వాదించుచున్నారు. దుఃఖమునకు తగిన పరిస్థితులు నిజమైననే కదా మనము దుఃఖములను అనుభవించగలుగుచున్నాము అని వారనుచున్నారు. ఇట్టి యాక్షేపణ చేయువారు బౌద్ధులలో నొక తెగ వారైన 'బాహ్యార్థవాదులు' అనబడు జగత్సత్యవాదులు. వారికి బాహ్యావస్తు ప్రపంచము సత్యము. మనకి ప్రపంచములోని వస్తుజ్ఞానము కలుగుచున్నది కాబట్టిన్ని, మన మీ ప్రపంచములోని దుఃఖాదుల ననుభవించుచున్నాము కాబట్టిన్ని వస్తుప్రపంచము సత్యమే యైయున్నది, యని వారనుచున్నారు.

వేదాంతములోని యుపపత్తులతో కాక యీ బౌద్ధులలోనే మరియొక శాఖవారైన "విజ్ఞానవాదుల" వాదనలను తీసికొని యీ పూర్వ పక్షులను గౌడపాదుడు ఎదుర్కొనుచున్నాడు. రాబోవు శ్లోకములో నీ జగత్సత్యవాదులకు ప్రత్యుత్తరముగానుండు విజ్ఞాన వాదులయొక్క వాదము కలదు.

హేతువాదము దృష్ట్యా పదార్థభావన అంగీకరించవచ్చునుగాని ఆ పరమసత్యము దృష్ట్యా చూచినను, వస్తుస్వభావమును గమనించినను యీ కారణము అనబడునది కారణమే కాజాలదు.

ఈ 'విజ్ఞానవాదులు' బౌద్ధులలో నొక తెగవారు. "ఆత్మీయముగా వాసనారూపములో అన్ని వస్తువులు అస్తిత్వము కలిగియున్నవి." అని వీరి మతము. ఈ భావమును రాబోవు మూడు శ్లోకములలో వివరించుచున్నాడు.

జగత్సత్యవాదులు వస్తుజ్ఞానముండుటచేతను, దుఃఖాదుల ననుభవించుటచేతను జగత్తు సత్యమని యొప్పుకొని తీరవలెనని వాదించుచున్నారు. తమ మతస్థులే యగు నీ జగత్సత్యవాదులకు ఇచట విజ్ఞానవాదులచే బదులు చెప్పించుచున్నాడు. సాంఖ్యులు వైశేషికులు కూడ జగత్సత్యవాదులే యగుచున్నారు.

కా॥ ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వం ఇష్యతే యుక్తిదర్శనాత్ ।
నిమిత్తస్యానిమిత్తత్వం ఇష్యతే భూతదర్శనాత్ ॥ 25

యుక్తితో చూచినంతవరకు జగత్తు సత్యమే యని యంగీకరించవచ్చును. కాని బుద్ధిదర్శన సిద్ధాంతము దృష్ట్యా నానాత్వవిశిష్ట ప్రపంచమంతయు మాయారూపముగా తోచును.

విజ్ఞానవాదులయొక్క ఈ వాదము బాహ్యార్థవాదుల యొక్క మతమును నిరసించుటకే యిచట గైకొనబడినది. అందుచే వేదాంతమనగా కేవలము విజ్ఞానవాదమే యని మాత్రము తలపరాదు. కొంతమంది విమర్శకులిట్లు వేదాంతము విజ్ఞానము రెండును ఒకటే యని భావించిరి. Prof. భట్టాచార్యులు "గౌడపాదుని ఆగమశాస్త్రము" అను తన గ్రంథములో "నాలుగవ అధ్యాయములో వేదాంతమును గురించి యేమియులేదు. కావున గౌడపాదుడిందు వేదాంత విషయమునే చర్చించలేదు" అని తీవ్ర విమర్శనాదృష్టితో చెప్పుచున్నాడు.

మీరీ విషయమై ఆశ్చర్యపడనవసరములేదు. ఇంతకంటె యెక్కువ బాధాకరమైన విమర్శనలనుకూడ యీ

విమర్శకులు చేయగలరు. 'హిందూతత్త్వశాస్త్ర చరిత్ర' అను గ్రంథములో Prof. దాస్‌గుప్త 'బౌద్ధమతములోని శూన్యవాదమును, విజ్ఞాన వాదమును బాగుగా జీర్ణించికొనియుండుటచే గౌడపాదుడు వేదాంతములో బోధింపబడు తత్త్వమునకు కూడ ఆ వాదములే సరిపోవునని భావించెను.' ఈ పై విమర్శప్రకారము దాస్‌గుప్త గారికి గౌడపాదుడు బౌద్ధుడై యున్నాడు. అతడు ఆత్మ యను దేవాలయములో శాస్త్రభాషలో బౌద్ధమతమును బోధించు బౌద్ధుడై యున్నాడు. నేనీ విషయమును గూర్చి నేరుగా విమర్శించదలచలేదు. మనమీ నాలుగవ అధ్యాయమును ముగించు లోపల, Prof. దాస్‌గుప్త గారి, భట్టాచార్యగారి నిర్ణయములు ఎంతవరకు సరియైనవో మీలో ప్రతియొక్కరు తప్పక నిర్ణయించగలరు.

కా॥ చిత్తం న సంస్పృశత్యర్థం నార్థాభాసం తథైవ చ।
అభూతో హి యతశ్చార్థో నార్థా భాసస్తతః పృథక్॥ ౨౬

చిత్తము బాహ్య విషయములను స్పృశించదు. బాహ్య విషయములవలె తోచుభావములు కూడ చిత్తములో భ్రాంతిని కలిగించవు. బాహ్యవిషయములు లేనివే యగుచున్నవి. బాహ్యవిషయములవలె భాసించు భావములు యద్విధముగను, చిత్తముకంటె భిన్నములు కావు.

ఇది బౌద్ధులలోని విజ్ఞానవాదుల వాదనయై యున్నది. జగత్సత్యవాదుల నెదుర్కొనుటకు విజ్ఞానవాదుల వాదనను గౌడపాదు డిచట ఎత్తి చూపుచున్నాడు. 'ప్రపంచములోని వస్తువుల జ్ఞానము మనకు కలుగుటచేతను' అందలి దుఃఖాదు

లను మన మనుభవించుటచేతను జగత్తు సత్యమని జగత్సత్య వాదులు నమ్ముచున్నారు. విజ్ఞానవాదులకు బాహ్య విషయ ప్రపంచము అసత్యము కావున మనస్సుచేత నది గ్రహింప బడదు. కావున మానసిక భావములైన దుఃఖాదులు ఆ మనస్సుకంటె భిన్నములు కావు. ఇట్లు వస్తుగ్రహణ దుఃఖా ద్యనుభవములు మనోభావనలే యగుచున్నవి.

బాహ్య ప్రపంచమును వివరించుటకు రెండు మార్గ ములు కలవు. 1. బాహ్యవిషయములు అంతఃప్రేరితములై మనోభావములను సృష్టించుచున్నవి. ఆ భావముల తోడి కల యిక మనస్సుయొక్క జ్ఞానమును కలుగజేయుచున్నది. ఈ సిద్ధాంతము ప్రకారము మనస్సు బాహ్యవిషయములచే సృష్టింపబడుచున్నది. కాని యిచట జగత్సత్యవాదులు బాహ్యవస్తు జగత్తు సత్యమని యంగీకరించుచున్నారు. కాని బాహ్యవస్తు జగత్తే అసత్యము గనుక యది మనస్సును సృష్టించలేదని నిరూపించుచు విజ్ఞానవాదులు జగత్సత్య వాదుల మతమును ఖండించుచున్నారు. ఎండమావులలోని నీరే అసత్యమగుటచే యా నీటిని దాటుటకై యంత్రనిర్మిత నావను మనముపయోగించలేము. అట్లే బాహ్యవిషయ జగత్తే అసత్యమైనప్పుడు అవి మనస్సును ఎట్లు సృష్టించ గలుగును?

బాహ్యప్రపంచము యొక్క సత్యత్వమును వివరించు రెండవ మార్గము – మనస్సు తన భావములను పైకి ప్రస రింపజేసి దుఃఖకరమైన ప్రపంచమును భాసింపజేయుచున్నది. 'మనస్సు కంటె మనోభావములు భిన్నములు కావు' అని

చెప్పుటద్వారా విజ్ఞానవాదు లీ పై వాదనను ఖండించు చున్నారు. 'భావరహితమైన మనస్సు మనస్సే కాజాలదు. క్రూరభావములు కలిగిన మనకు క్రూరమైన మనస్సు ఉండును. ప్రశాంతమైన భావములున్న, మృదువై ప్రశాంతమైన మనస్సే మనకుండును. ఇట్లు భావములు మన మనస్సుకంటె భిన్నములు కావు. ఒకవేళ బాహ్యవిషయ ప్రపంచమున్నదని యొప్పు కొనవలసి వచ్చినను అది మన మనస్సులోనే యున్నది' అని యీ విధముగా వాదించి విజ్ఞానవాదులు మనస్సుకంటె భిన్నమైన బాహ్యప్రపంచమను నదొకటి లేదని నిర్ణయించినారు.

ఈ విజ్ఞానవాదులు జగత్సత్యవాదుల విశ్వాసములకు వ్యతిరేకముగా వాదించుచున్నారు.

కా॥ నిమిత్తం న సదా చిత్తం సంస్పృశత్యధ్వసు త్రిషు।
అనిమిత్తో విపర్యాసః కథం తస్య భవిష్యతి॥ ౨౭

త్రికాలములయందును నిమిత్తము చిత్తమును స్పృశించుటలేదు. మనస్సు భ్రాంతి పొందుటకు తగినంత కారణము లేకపోవుటచే యట్టి విపర్యాసము (భ్రమ) మనస్సునకెట్లు కలుగును ?

శ్రీ శంకరులు తమ వ్యాఖ్యానములో ఇదియొక పూర్వ పక్షము అని చెప్పుచున్నారు. "ఘటాదులు అసత్యమే అయి నప్పటికిని మనస్సు ఘటాదులను భావించుచున్నది. కావున మనస్సులో ఒక అసత్ జ్ఞానము ఉండియుండవలెను. దీనినిబట్టి మేము చెప్పిన అసత్ జ్ఞానమునకు సంబంధించినది గాని లేదా సత్ జ్ఞానముకంటె భిన్నమైనది గాని యగు నొక సత్

జ్ఞానము ఒకటి యుండవలెను.'' అని నైయ్యాయికులు చేయు వాదనమై యున్నది.

ఇది వరకు మన మనస్సులో సర్పజ్ఞానమున్ననే కదా యిప్పుడు మనకు సర్పభ్రాంతి కలుగుచున్నది. కావున ఇతః పూర్వమందు విషయముల యొక్క సత్యజ్ఞానముండిననే యిప్పుడీ భ్రాంతిజ్ఞానము కలుగుట సంభవించుచున్నది. ఇట్లు, ఈ మనస్సే మిథ్యాజ్ఞానమును సృష్టించిన, ఘటాదులతో కూడిన సత్య ప్రపంచజ్ఞానము ఇదివరకే యీ మనస్సులో సంస్కారరూపముగా నుండి యుండవలయును కదా. ఇట్టి మిథ్యాసృష్టిని కలిగించుటకు యితఃపూర్వము సత్యప్రపంచ జ్ఞానమొకటి యీ మనస్సులో యుండియుండ వలయునని నైయాయికులు ఆక్షేపణ చేయుచున్నారు. వారి వాదన కిచట గౌడపాదుడు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు.

''త్రికాలములందును ఈ మనస్సు ఎట్టి విషయముల తోను ఎట్టి నిమిత్తకారణ సంబంధమును కలిగియుండలేదు. ఇట్లు ఎక్కడనో ఒక సత్యప్రపంచమున్నదను భావమును ఖండించుటయేకాక, అట్టి ప్రపంచమున్నను మనస్సు దానిని గ్రహించి సంస్కారరూపములో ధరించలేదు'' అని రుజువు పఱచుచున్నాడు.

కా॥ తస్మాన్న జాయతే చిత్తం చిత్తదృశ్యం న జాయతే ।
తస్య పశ్యంతి యే జాతిం ఖేవై పశ్యంతి తే పదం ॥ ౨౮

చిత్తమేనాడును ఉద్భవించలేదు. చిత్తదృశ్యమైన యీ ప్రపంచమంతకంటె వాస్తవములో లేనేలేదు. అయినను

చిత్తమును చిత్తదృశ్యములను చూచువారు ఆకాశములో పక్షిపాదచిహ్నములను చూచువారే యగుదురు.

యథాప్రకారము గౌడపాదుడు తీవ్రముగాను, దృఢముగాను ప్రతివాదులపై దాడిచేయుచున్నాడు. ద్వైతమతములోని అసందర్భములచే నాత డిట్లు తీవ్రతను వహించుట లేదు కాని యట్టి ద్వైతభావములను సులభముగా వీడుటకు సిద్ధపడని, తన యెదుటనుండు యువక విద్యార్థులకొరకై యాతడిట్లు పట్టుదల వహించవలసివచ్చెను. తన విద్యార్థులు విషయమును సమగ్రముగా గ్రహించవలెననెడి యాతురతతో ఆ పరమాచార్యుడు వారిలోనుండు ద్వైతభావనా వాసననుకూడ దులిపి వేయ ప్రయత్నించుచున్నాడు.

'విషయప్రపంచమువలెనే భావనా ప్రపంచముకూడ అసత్యము' అని నిరూపించు చర్చలు కలిగిన ముఖ్యశ్లోకములలో ఈ శ్లోకము రెండవది.

ఇట్లు బాహ్యవిషయప్రపంచము, ఆంతరికమైన భావనా ప్రపంచముకూడ మిథ్య యని రుజువుపరచినప్పటికిని విద్యార్థులు తమ భ్రాంతిజ్ఞానమునే యనుసరించదలచుకొనినయెడల, వారు ఆకాశమందు పక్షులపదచిహ్నములను గుర్తించువారివలె వ్యర్థమైన ప్రయత్నముగలవారగుచున్నారు వారు అసంభవమును అన్వేషించి అసందర్భమును స్థాపించువారే యగుచున్నారు !!

కా॥ అజాతం జాయతే యస్మాత్ అజాతిః ప్రకృతిస్తతః ।
ప్రకృతే రన్యథా భావో న కథంచిద్భవిష్యతి ॥ ౨౯

అజాతమైనది జాయమానమెట్లగును ? దానియొక్క సహజస్వభావమే 'అజాతి' కదా. సహజస్వభావమునకు విరుద్ధముగా నేదియు యుండజాలదు.

ఇంతవరకు నిరూపించిన కారణములచేత బ్రహ్మ 'అద్వయం అజం' అని తేలినది. ఇప్పుడు సృష్టికారణధర్మము అజ్ఞానపూరిత మనస్సులో గలుగు అసంబద్ధపుటపోహయే యని గౌడపాదు డిచట చెప్పుచున్నాడు. ఆ బ్రహ్మతత్త్వముకంటె అన్యముగాక, అజమైయున్న యీ మనస్సు జాతమైనదని ద్వైతులు భ్రమించుచున్నారు. కావుననే వారికి అజముకూడ జాతమైనదే యగుచున్నది. ప్రకృతిలో తన ధర్మమును త్యజించినదేదియు స్వస్వరూపములో నిలువజాలదు. వేడి మంచుగడ్డకాని, చల్లని అగ్గికాని యుండుట అసంభవము. కావున అజమునుండి యొకటి జాతమైనదని చెప్పుట వివేకవంతులైన వేదాంతులకు పరిహసించుటకుకూడ వీలులేని యసందర్భమగుచున్నది.

కా॥ అనాదేరన్తవత్త్వం చ సంసారస్య న సేత్స్యతి ।
అనన్తతా చాఽఽదిమతో మోక్షస్య న భవిష్యతి ॥ 30

ఈ జగత్తు అనాదియైన యెడల అది అశాశ్వతము కాజాలదు. ఆదిగలిగియుండియు మోక్షము శాశ్వతమై యుండజాలదు.

ఆత్మకు బంధమోక్షములు కలవని వాదించువారి మతమందుగల మరియొక లోపమును గౌడపాదు డిచట చూపుచున్నాడు. ప్రపంచమునకు అనగా బంధములోనుండు ఆత్మకు

ఆదిగాని, నిర్ణీతమైన భూతకాలముకాని లేకపోయిన ఆ ఆత్మను అంతమును ఉపపత్తిపూర్వకముగా స్థాపించలేము. ఆది లేనిది తప్పక అంతములేనిదేయై యుండును. మరియు ఆత్మను కనుగొనుట యను మోక్షమునకు ఆది యున్నయెడల నది తప్పక అంతముకలదై యుండవలెను. ఆద్యంతములు గల యట్టి యనుభవము అనిత్యమే యగుచున్నది. అటువంట ప్పుడు మోక్షమును పొందినవాడుకూడ జనన మరణరూప సంసారగర్తములోపడి తీరవలెను. ఈ భావము వేదాంతము యొక్క ముఖ్యోద్దేశమునే భంగపఱచుచున్నది. ఇట్లు ప్రపంచము అనాది యని చెప్పిన దానికి అంతముకూడ యుండదు గనుక అది తప్పక అనంతమే కావలసియున్నది. మరియు మనయొక్క మర్త్యత్వము అంతములేని నిత్యస్థితియే యైన అనంత పరిపూర్ణ తత్త్వరూప శాశ్వత సాఫల్యమును జేర్చు ఆ ఆధ్యాత్మిక మార్గము ఈ జీవయాత్రికులకు ఉండజాలదు.

అట్లే మోక్షమునకు ఆదిలేదు. ఆది యున్న అంతము కూడ యుండవలెను. సృష్టమై, కల్పితమైన పదార్థము లన్నియు తప్పక నశించి తీరవలెను.

"ప్రపంచము కేవలము మనోమాయాసృష్టమేననియు, అట్టి మానసిక - అవధులను దాటిన వ్యక్తికి తనలో సదా సహజమైయున్న ఆత్మను క్రొత్తగా కనుగొనుట కాక ఆ ఆత్మనే మరల కనుగొనుట యనునట్టి ఆత్మానుభవము కలుగు చున్నది" అని సద్ధేతువుద్వారా నిరూపించి, నిశ్చయించి, నిర్ణయించవచ్చును.

ఒకడు తాను దరిద్రుడైనట్టు స్వప్నమును గాంచి యుండవచ్చును. ఆ స్వప్నావస్థలో ఆతనికా దారిద్ర్యమెంత సత్యముగా భాసించినప్పటికిని యతడు నిజముగా దరిద్రుడు కాజాలడు కదా ! తనను తాను మరచిపోయి, తనలోని మనోభావములతో తాదాత్మ్యమును పొందుటచేత నొకనికి స్వప్నము వచ్చుచున్నది. ఆతడు జాగృతినందిన క్షణముననే తన వాస్తవస్థితిని తాను కనుగొనుచున్నాడు. అంత స్వప్నములోని తన దారిద్ర్యబాధను గురించి నవ్వుకొనుచున్నాడు.

అట్లే యీ ప్రపంచము, తద్గత అనుభవములు, మిథ్యాజ్ఞానము, మర్త్యత్వము, ఇత్యాదులన్నియు తన్ను తాను మరచిన మనస్సుతోను, తన్నావరించిన స్థూలకోశముతోను తాదాత్మ్యము పొందెనా యనునట్లున్న ఆత్మయొక్క స్వప్నానుభవములే యగుచున్నవి. కావున జ్ఞానము కలిగి ప్రయత్నముతో యీ మనోబుద్ధుల నుపసంహరించుకొనిన, అట్టి సత్యమైన జాగృతిక్షణమందు ఈ జీవాత్మ తననా పరమాత్మగా తెలిసికొనుచున్నది. అదియే నిజమైన ముక్తక్షణము. అది తన బంధములోని యనుభవములను, మరియు నీ ప్రపంచమును మిథ్యా స్వప్నమని తెలిసికొనుచున్నది.

కా॥ ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా।
వితథైః సదృశాః సన్తోఽవితథా ఇవ లక్షితాః ॥ ౩౧

ఆదియందు అంతమందు ఏదిలేదో అది మధ్యలోకూడ లేదు. మనము చూచు పదార్థములన్నియు మిథ్యయే యైనను అవి సత్యమువలె గోచరించుచున్నవి.

కా॥ సప్రయోజనతా తేషాం స్వప్నే విప్రతిపద్యతే ।
తస్మాదాద్యన్తవత్త్వేన మిథ్యైవ ఖలు తే స్మృతాః ॥ ౩౧

ఆ పదార్థములు జాగ్రదవస్థలో ప్రయోజనవంతములైన తద్వ్యతిరేకముగా స్వప్నమందు మిథ్యయగుచున్నవి. ఇట్లు ఆది అంతము కలవగుటచేత ఆ పదార్థములు మిథ్యయే యని పండితులు నిస్సంశయముగా నిర్ణయించిరి.

ఈ పై రెండు శ్లోకములు వైతథ్యప్రకరణములో వివరింపబడినవి. (అధ్యా-2. శ్లో-6, 7.) ప్రపంచ మిథ్యాత్వమును నిరూపించుటకు సరియైన సందర్భమని మరల యీ కారికలిచట యుదహరింపబడినవి.

వివేకహీనుడు చూచినదానిని నమ్మును కాని వివేకముతో యోచించువాడు ప్రత్యక్షముగా చూచినదానిని గుఱించి కూడ ప్రశ్నించును. ఒక వేదాంతి ఆవేశమునుగాని, అనుకంపనుగాని ఎఱుగడు. అతడు నిర్దాక్షిణ్యముగా సత్యమునన్వేషింప ప్రయత్నించును. శ్రద్ధతో కూడిన యట్టి ప్రయత్నములో ఒక వస్తువును ప్రత్యక్షముగా చూచినప్పటికిని యంతటితో యాగక దాని విచిత్రతను గూర్చి ప్రశ్నింప ప్రయత్నించును. కొన్ని సమయములలో వాస్తవములోలేని వస్తువులను మనము చూచుచున్నాము. ఎండమావులలోని నీరు, త్రాటి యందలి పాము, శుక్తి యందలి రజతము ఇత్యాదులు. కేవలము వీనిని మనము చూచుచున్నాము కాబట్టి యవి సత్యమని నమ్ముటకు వీలులేదు. నేను స్వప్నములో నా పట్టాభిషేకమును చూచియుండవచ్చును. కాని మేల్కాంచినపిమ్మట నేను

రాజువలె ప్రవర్తించిన యిక నాకు జరుగు మర్యాద యడుగ నక్కరలేదు! నేను నిద్రపోవుటకు ముందు నాకా రాజత్వము లేదు. మేల్కాంచిన పిమ్మట కూడ ఆ రాజత్వము నాకు లేదు. ఆదియందు, అంతమందును ఒక పదార్థము లేనిదై అది మధ్యను మాత్రమున్నయెడల వివేకులు దానిని మిథ్యయని పరిగణించిరి. అట్లే యిప్పుడు మనము చూచుచున్న యీ ప్రపంచము మనోబుద్ధుల నధిగమించిన పిమ్మట మాయమగు టచే అది మిథ్య, భ్రమ యని వివేకవంతులగు జ్ఞానులు, తెలిసికొనిరి.

కా॥ సర్వేధర్మా మృషా స్వప్నే కాయస్యాన్తర్నిదర్శనాత్ ।
సంవృతేఽస్మిన్ ప్రదేశే వై భూతానాం దర్శనం కుతః॥33

ఈ దేహాంతర్భాగమందే చూచుచున్నాము కనుక స్వప్నమందలి పదార్థము లన్నియు లేనివే యగుచున్నవి. దేహాంతర్భాగమున చూచిన వస్తువులు సత్యమని యెట్లు విశ్వ సించగలము.

ఈ శ్లోక మిదివరకే వివరింపబడినది. అయినను దాని లోని విశేషభావములను విపులముగా వివరించుటకిది తగిన సందర్భమగుటచేత యిచట మరల యుదహరింపబడినది. స్వప్నమును మన దేహాంతర్భాగమందు చూచుచున్నాము. అట్టి స్వప్నములో చూచు ఎట్టి పదార్థములును మన దేహములో నుండుట అసంభవము కదా. ఇట్లు అవి దేహమం దుండుటకు నిరవకాశము లగుటచే పదార్థములు వాస్తవములో లేవు. అది కేవలము మిథ్యాజ్ఞానము మాత్రమే యగుచున్నది.

స్వప్నానుభవములు ఎందుకు సత్యములుకావో తెలుపుటకు మరికొన్ని యుపపత్తులను గౌడపాదు డిచట చూపుచున్నాడు. భారతదేశములో ఈ స్వప్నముకూడ వాస్తవమే యని విశ్వసించు ఒక మతస్థులు గలరు. ఈ శ్లోకములు ఆ మతము వారికి ప్రత్యుత్తరములై యున్నవి. 'స్వప్నమును చూచువాడు దానిని చూచుచున్నంతవరకు ఆ స్వప్నము సత్యమే యగుచున్నది' యని స్వప్నము సత్యము అని విశ్వసించువారు చెప్పుచున్నారు. వారి వాదములోని లోపములను తరువాతి శ్లోకములోని యుపపత్తులు అభివ్యక్తపఱచగలవు.

కా॥ న యుక్తం దర్శనం గత్వా కాలస్యానియమాద్గతౌ ।
ప్రతిబుద్ధశ్చవై సర్వస్తస్మిన్ దేశే న విద్యతే ॥ ౩౪

స్వప్నస్థుడు ఆ దూరదేశమును పోయిచూచుటకు కాలము పరిమితమైనదగుటచేత అది కుదరదు. మేల్కొనిన పిమ్మట కూడ ఆ వ్యక్తి తన పడకమీదనే యున్నాడు గాని తాను చూచు ఆ దూరప్రదేములలో నుండుటలేదు.

స్వప్నము సత్యము కాదని చెప్పుటకు మరి రెండు కారణము లిచట చేర్చబడినవి. ఒక జీవి స్వప్నములో తాను చూచు ప్రదేశములకు పోవుచున్నాడనియు, అచట ఆ యా వస్తువుల ననుభవించుచున్నాడనియు, ప్రతివాదులు భావించుచున్నారు. తాను తన పడకమీద సుఖముగా నిద్రపోవుచునే అమెరికాలోని తన స్నేహితులతోనున్నట్లు అతడు కలగనుచున్నాడు. స్వప్నము సత్యమని నమ్మువారి మతము ప్రకారము ఆ వ్యక్తి వాస్తవముగా అచటికి ప్రయాణముచేసి యచటి

మనుష్యులతో వ్యవహరించుచున్నాడు. అట్లు అమెరికాకు పోయి వచ్చుటకు ఆ స్వప్నసమయము అత్యల్పమగుటచే యీ వాదన మిక్కిలి యసందర్భముగా నున్నది. తన ప్రియురాలి చేయి సోకినంతనే యతడు మేల్కాంచి తాను అమెరికాలో నుండు తన స్నేహితులతోనున్నట్లు కలగంటినని యామెకు చెప్పుచున్నాడు. రాను పోను వేలకొలది మైళ్ళదూరములో నున్న ప్రదేశములకు ఎవడును తన ప్రియురాలి చేయి తాకి మేలుకొనునంతలో ప్రయాణముచేసి తన పడకగదిని చేరుటకు తిరిగి రాలేడు. కావున నచట వాస్తవమైన రాకపోకలు ఉండ జాలవు. 'ఇదివరకు తా ననుభవించి, మానసిక పరిధిలో వాసనా రూపముగా మిగిలిన మానసిక అనుభవముల ననుభవించు టయే స్వప్నము' అని చెప్పవచ్చును.

మరియు ఆ స్వప్నమును చూచువాడు తాను చూచు వివిధ ప్రదేశములకు రాకపోకలు సాగించుట నిజమే యైన యెడల ఆ వ్యక్తి స్వప్నములో తాను చూచిన ప్రదేశము లలో మేల్కాంచియుండవలెను కదా. అట్లు మేల్కాంచినట్లు మానవ చరిత్రలో నింతవరకు మనమెక్కడను చూడలేదు. తాను మేల్కాంచినపుడెల్ల నతడు తన స్వంతపడకమీద నుండియే మేల్కాంచుచున్నాడు. తాను స్వప్నములోచూచు ప్రక్కింటివారి పడకగదిలోగాని, యెదుటింటివారి వీధిగదిలో గాని యాతడు మేల్కాంచుట మనము వినియుండకపోవుటచే ఆ వ్యక్తి శారీరకముగా యెట్టి రాకపోకలను చేయలేదని మనము నిర్ణయించవలసి యున్నది.

కా॥ మిత్రాద్యైః సహ సంమంత్ర్య సంబుద్ధో న ప్రపద్యతే ।
గృహీతం చాపి యత్కించిత్ ప్రతిబుద్ధో న పశ్యతి ॥ ౩౫

స్వప్నములో మాటలాడుచున్న మిత్రులను మేల్కాంచిన వెంటనే చూచుటలేదు. మరియు స్వప్నములో పొందిన పదార్థములు మేల్కాంచినపిమ్మట మాయమగుచున్నవి.

స్వప్నములో ఇతర ప్రదేశములకు రాకపోకలుగాని, ఇతర వ్యక్తులతో జరుగు వ్యవహారాదులుగాని వాస్తవములో లేవనియు, స్వప్నము ఒకని వాసనలఫలితముగా గలిగిన మానసిక భ్రమ మాత్రమే యనియు రుజువు పఱచుటకుగాను గౌడపాదు డీ శ్లోకమునుకూడ వినియోగించుచున్నాడు. స్వప్నములో స్నేహితులతో మాట్లాడి మేల్కాంచిన యతడు అది యంతయు భ్రమయని తెలిసికొనుచున్నాడు. ఆ స్వప్నములోని సంభాషణను కొనసాగించుటకు జాగృతిలో యెట్టి మిత్రుడును అచట లేడు. స్వప్నములో నేను వ్రాయు ప్రమాణపత్రములు, నేను చేయు ప్రమాణములు మేలుకొనిన తరువాత నిరర్థకములగుచున్నవి. ఆ స్వప్నములో జరుగు వ్యవహారమంతయు మన మనస్సుచే సృష్టమైనదే కావున అది యేదియు వాస్తవము కాదు.

ఇట్లు స్వప్నమందు చూచునదేదియు మేల్కాంచినపుడు వాస్తవములో లేకపోవుటచే స్వప్నము జరుగుచున్నంతసేపు అది వాస్తవము అని వాదించు వారి మతము ఎంత నిస్సారమైనదో గౌడపాదుడు నిరూపించుచున్నాడు. స్వప్నా

వస్థ యెంత సత్యమో జాగ్రదవస్థకూడ అంతే సత్యమను విషయము ఇదివరకే చెప్పబడినది.

కా॥ స్వప్నే చావస్తుకః కాయః పృథగన్యస్య దర్శనాత్ ।
యథా కాయ స్తథా సర్వం చిత్తదృశ్యమవస్తుకం ॥ ౩౬

స్వప్నమును చూచువాని యీ భౌతిక దేహము పడక మీదనే యుండుటచే నాతడు స్వప్నములో వ్యవహరించు దేహము వేరుగా నుండవలెను. ఆ మరియొక దేహము ఎంత సత్యమో ఆ స్వప్నదృశ్యములుకూడ అంత సత్యములై యగు చున్నవి.

నేను నదిలో మునిగిపోయినట్లు భయంకర దృశ్యమును స్వప్నములో చూచియుండవచ్చును. కాని మేల్కాంచిన పిమ్మట నా దేహముపైని యొక్క నీటిబొట్టుకూడ కనబడదు. అదే విధముగా స్వప్నములో నేను హత్యచేయబడి నట్లు చూచినను, మేల్కొంచినప్పుడు నా శరీరముపై యొక్క గాయముకూడ కనబడదు. కావున స్వప్నము చూచువానికి ఆ స్వప్న శరీరముకంటె భిన్నమైనది మరియొక దేహము జాగ్రదవస్థలో నున్నది. మేల్కాంచిన పిమ్మట నతడు తన స్వప్నశరీరము అసత్యము అని తెలిసికొనుచున్నాడు. ఆ స్వప్న శరీరమెట్లు అసత్యమో స్వప్నమందలి మిగిలిన పదార్థములన్నియు అట్లే అసత్యమగుచున్నవి. రెండు మూడు అధ్యాయములలో వివరింపబడిన యీ విషయము నిచట సరియైన సందర్భమని తలచుటచే గౌడపాదుడు మరల పేర్కొనుచున్నాడు. కావున స్వప్నశరీరము తదనుభవములు ఎంత

సత్యమో జాగ్రదవస్థయందలి దేహము తదనుభవములు కూడ అంతే సత్యమని చెప్పవచ్చును.

కా॥ గ్రహణాజ్జాగరితవత్తద్ధేతుః స్వప్న ఇష్యతే ।
తద్ధేతుత్వాత్తు తస్యైవ సజ్జాగరిత మిష్యతే ॥ ౩౭

స్వప్నములోని యనుభవములు జాగ్రదవస్థలోని యనుభవములతో సమానముగా నుండుటచే జాగ్రదవస్థయందలి యనుభవములే స్వప్నమునకు కారణమని భావించుచున్నారు. ఆ స్వప్నమును చూచువానికి మాత్రము ఆస్వప్నమునకు కారణమైన జాగ్రదవస్థానుభవములు కూడ సత్యమువలె భాసించుచున్నవి.

స్వప్నములోను జాగృతిలోను కూడ ఆ యా వస్తువులతో సంబంధము కలిగినపుడే ఒకడు తత్తదనుభవములను పొందుచున్నాడు. కావున యొక యనుభూతికి – అనుభవించువాడు, అనుభవింపబడునది, తత్సంబంధమగు అనుభూతి, అను నీ మూడును ఉండవలెను. స్వప్నమందుగాని, జాగృతియందు కాని యీ ధర్మమే ప్రవర్తించుచున్నది. ఇట్టి యీ న్యాయము వలననే జాగ్రదవస్థయే స్వప్నమునకు కారణమని అనాలోచితముగా బుద్ధి నిర్ణయించుచున్నది. ఒక సువర్ణహారములోని ప్రతిభాగమందును బంగారమే యుండుటవలన ఆ హారమునకు బంగారు కారణమగుచున్నది. అట్లే స్వప్నములోని ప్రతి యనుభవమును జాగ్రదనుభవము వలెనే యుండుటవలన జాగ్రదవస్థయే స్వప్నమునకు కారణమగుచున్నది.

ఈ యుపపత్తి లోపభూయిష్టమైనదే కాని యిక్కడ కనికరించవలసిన విషయమేమనగా పాపమా పూర్వపక్షి తనవి

దివ్యజ్ఞాన మనుకొని గట్టిగా తన సిద్ధాంతమును ఘోషించు చున్నాడు !! ఇది వాస్తవములో ఒక యుపపత్తియైనయెడల అది స్వప్నద్రష్ట ముఖమునుండి వచ్చినది మాత్రమే యగు చున్నది అని గౌడపాదుడు చెప్పుచున్నాడు. స్వప్నమును చూచువాడే ఆ స్వప్నమును అనుభవించుచున్నాడు. అట్లు తాను స్వప్నస్థవిషయముల ననుభవించునపు డాతడు దానికి కారణము జాగ్రదవస్థయందలి ప్రపంచమేయని మొరపెట్ట వచ్చును. మేలుకొనిన పిమ్మటకూడ అట్లే చెప్పుట చూడగా అర్థరహితమైన స్వప్నములో ఆతడున్నాడని చెప్పవచ్చును.

స్వప్నమును చూచు తైజసుడు మాత్రము స్వప్నము కంటె జాగ్రదవస్థ సత్యమని చెప్పగలడు. వాస్తవములో జాగ్రదవస్థయే మిథ్య కావున యది తనకంటె భిన్నముగా సత్యమగుదానిని దేనిని కలుగజేయలేదు. ఎండమావులలోని నీరు స్వయముగా మిథ్యగనుక అది ఎడారిలోని యిసుకను తడపలేదు. వంధ్యాపుత్రుడు ఇంద్రధనుస్సును చేపట్టి ఎట్టి రాజ్యముపైన దండెత్తలేడు. ఆ ధనుస్సునుండి ఒక్క బాణము కూడ పైకి వెలువడదు కదా !!

ఇట్లు జాగ్రదవస్థయే ఒక అసత్ జ్ఞానము కావున అది మరికొంత భ్రమనే తప్ప యితరమైనదానిని దేనిని కలిగించ లేదు. అందుచే స్వప్నమునకు జాగ్రదవస్థ కారణమని వాదించువారు స్వప్నజగత్తులోని వేదాంతులచేత మాత్రము విశ్వసింపదగినవారగుచున్నారు.

కా॥ ఉత్పాదస్యా ప్రసిద్ధత్వాదజం సర్వముదాహృతం ।
న చ భూతాదభూతస్య సంభవోఽస్తి కథంచన ॥ 38

ఈ సృష్టిగాని, యీ పరిణామముగాని వాస్తవమని స్థిరపఱచుటకు వీలులేదు. కావున అది అజాతము. అది పుట్టనే లేదు. సత్యమునుండి అసత్యము ఉద్భవించుట అత్యంతము అసంభవము.

స్వప్నమువలె జాగ్రదవస్థకూడ అసత్యమే యని వాదించు గౌడపాదుని వాదముపై ప్రతివాది చేయు ఆక్షేపణయే యీ శ్లోకము. ప్రతివాదులు స్వప్నముకంటె జాగ్రత్ ప్రపంచము సత్యతరమైనదని వాదించుచున్నారు. స్వప్నముకంటె సత్యతరమైనదేకాక జాగ్రదవస్థ స్వప్నముకంటె అధిక శాశ్వతము కూడ యని వారు విశ్వసించుచున్నారు. ప్రతిసారి మనము స్వప్నమునుండి మేల్కాంచినంతనే మన మనుభవించుటకుగాను జాగ్రత్ ప్రపంచము మనకై సిద్ధముగా నున్నది యని వారు వాదించుచున్నారు.

శ్రీ శంకరులు చెప్పినట్లు 'వివేకము లేనివారికి ఈ పై వాదన సత్యమే' యగుచున్నది. జాగ్రదవస్థలోనే యుండి అప్పు డప్పుడు విభిన్నములగు స్వప్నములను గనువానికి ఈ పై వారివాదన సత్యమే కావచ్చును. కాని ఒకే స్వప్నములో నతడు మరల తన స్వప్నానుభూతిని పొందుటకు మేల్కాంచుచున్నాడు. అట్లే జాగ్రత్స్వప్నమును అనుభవించు విశ్వుడు స్వప్నమువంటి జాగ్రదవస్థ ననుభవించుటకే మేల్కాంచుచున్నాడు. కావున స్వప్నానుభవములను జాగ్రదవస్థానుభవములతో పోల్చవలయుననిన సరియైన తర్కముగాని యుపపత్తిగాని, యుండవలెను. లేకున్న పై వారి వాదమువలె అపార్థములు చాల బయలు వెడలును.

పూర్వశ్లోకములో చూపిన కారణములనన్నిటినిబట్టి చూడ కార్యకారణసంబంధము అనాలోచితబుద్ధిలో ఉండ జాలదు. మరియు వివేచనాబుద్ధికి కూడ కార్యకారణ సంబంధ మసలే యుండజాలదు. ఇట్లు ఈ అజాతివాదమును జ్ఞానులు స్థిరపఱచుచున్నారు.

మరియు అసత్యమైన ప్రపంచము సత్యమైన ఆత్మనుండి యుద్భవించినదనుట తర్కవిరోధము. సత్యములో సత్యము ఉన్నదే యగుటచే సత్యమునుండి సత్యము ఉద్భవించినదని మనము చెప్పజాలము. చెప్పనవసరము లేదు. నానుండి నేనుద్భవించితినని చెప్పుట అసంబద్ధము. నానుండి నాకంటె భిన్నమైనది యుద్భవించినదనుట అంతకంటె అసంభవము. ఒక బఱ్ఱెగొడ్డు నానుండి యుద్భవించలేదు కదా!!

కా॥ అసజ్జాగరితే దృష్ట్వా స్వప్నే పశ్యతి తన్మయః ।
అసత్స్వప్నేఽపి దృష్ట్వా చ ప్రతిబుద్ధో న పశ్యతి ॥ ౩౯

జాగ్రదవస్థయందు అసత్యమైన వస్తువులను స్వప్నములో మరల చూచుచున్నాడు. కాని స్వప్నములోచూచిన అసత్య వస్తువులను మాత్రము జాగ్రదవస్థలో మరల చూచుటలేదు.

"స్వప్నము జాగ్రదవస్థాకృతమే యని చెప్పిన వేదాంతులు కార్యకారణన్యాయమును మిథ్య యని యెట్లు చెప్పగలుగుచున్నారు." అని ప్రతివాదులు ప్రశ్నించు చున్నారు. మాయాకార్యమును సృష్టించుటకు ఒక కారణము సత్యమై యుండనవసరము లేదనుటయే పై ప్రశ్నకు ప్రత్యు

త్తరమై యున్నది. అసత్యమైన మిథ్యాకారణమే మిథ్యాకార్య మును కూడ ఉత్పత్తిచేయగలదు.

త్రాటియందు పామును చూచిన యొకడు ఆ సర్పము భ్రాంతిమూలకమైనదైనప్పటికిని దానిని స్వప్నమందు చూచు చున్నాడు. ఎండమావులలోని నీరే అసత్యము. అయినప్పటికిని పరిశ్రాంతుడైన బాటసారి దూరమునుండి చూచినప్పుడు అత నికి చిఱుతరగలు, నురగు ఇత్యాదులు గోచరించవచ్చును !!

అట్లే మిథ్యయైన జాగ్రదవస్థానుభవములను స్వప్న మందు చూచి యనుభవించుచున్నాడు.

కా॥ నాస్త్యసద్ధేతుక మసత్ సదసద్ధేతుకం తథా ।
సచ్చ సద్ధేతుకం నాస్తి సద్ధేతుక మసత్కుతః ॥ ౪౦

అసత్యమైనదానికి అసత్యము కారణము కాజాలదు. అట్టి అసత్యమునుండి సత్యము కూడ యుద్భవింపజాలదు. మరియు సత్యము కూడ సత్యమునకు కారణము కాజాలదు. అటువంటప్పుడు అసత్యమునకు సత్యము కారణ మెట్లగును ?

ఆ పరమసత్యతత్త్వము దృష్ట్యా యీ కార్యకారణ సంబంధమునకు యద్విధముగాను అవకాశము లేదు. బౌద్ధు డైన నాగార్జునుడు చూపిన చతుర్విధమైన వాదరూపమును గౌడపాదు డిచట యథాతథముగా నెరువు తెచ్చెనో యను నట్లున్నది.

వాస్తవములో యీ శ్లోకార్థము ముప్పది యెనిమిదవ శ్లోకార్థమును కొనసాగించునదై యున్నది. పూర్వశ్లోకములో

నానాత్వవిశిష్ట జగత్తు ఉండుట అసంభవమని సూచింపబడినది. ఈ శ్లోకములో ఆ విషయమునే యుక్తియుక్తముగా చర్చించు చున్నాడు. ఈ శ్లోకములో నాలుగు విధములైన యసంభవము లను చర్చించుచు, చివరకు, వానిలోనుండు యుక్తిలోపముచే నివియేవియు నిలువజాలవని రుజువు పఱుచుచున్నాడు.

1. అసత్యమునకు అసత్యము కారణము కాజాలదు – కుందేలుకొమ్ము ఆకాశమందలి గంధర్వనగరమునకు కారణము కాజాలదు.

2. సత్యమునకు అసత్యము కారణము కాజాలదు – వంధ్యాపుత్రుని వివాహమును చూచు అవకాశము మన కెన్నటికిని కలుగదు.

3. సత్యము సత్యమునకు కారణము కాజాలదు – ఒక మేజాబల్ల మరియొక మేజాబల్లకు కారణము కాజాలదు.

4. సత్యము అసత్యమునకు కారణమనుటకంటె అసంబద్ధము మరేదియు లేదు.

కా॥ విపర్యాసాద్యథా జాగ్రదచిన్త్యాన్భూతవత్ స్పృశేత్ ।
తథా స్వప్నే విపర్యాసాత్ ధర్మాం స్తత్రైవ పశ్యతి ॥ ४०

అచింత్యమైన తత్త్వములుగల వస్తువులను జాగ్రద వస్థలో సత్యమని విపరీతజ్ఞానముచే ఎట్లు తలచుచున్నాడో అట్లే ఆ స్వప్నమందు మాత్రము అస్తిత్వము కలిగియున్న వస్తువులను కూడ అదే విపరీతజ్ఞానముచే సత్యముగా చూచు చున్నాడు.

జాగ్రత్స్వప్నములమధ్య ఏ రవంతకూడ కార్యకారణ సంబంధము సంభవముకాదని చెప్పుటయే యీ శ్లోకముయొక్క యుద్దేశ్యమై యున్నది. జాగ్రత్స్వప్నములు రెండును అసత్యములే. వివేకము లేకపోవుటచే బుద్ధి, భ్రాంతమై నానాత్వ విశిష్టప్రపంచమును సృష్టించుకొనుటవలన నది జాగ్రదవస్థలో సత్యమువలె తోచుచున్నది. అట్లే స్వప్నములో మనస్సు మోహితమై, సగము జ్ఞానము మాత్రమేగలదై, బుద్ధితోడి సంబంధము నశించినదై కట్లువిప్పిన కుక్కవలె వ్యవహరించును. జాగ్రదవస్థదృష్ట్యా యీ స్వప్నము చాలా అసంబద్ధముగా తోచును. అయినప్పటికిని స్వప్నమందలి వస్తువులు జాగ్రదవస్థయందలి వస్తువులతో చాలవరకు పోలికకలిగి యుండును. ఇట్టి సామ్యముచేతనే జాగ్రత్స్వప్నములకు కార్యకారణ సంబంధమును మనము కల్పించుచున్నాము.

జాగ్రత్స్వప్నములకు కాలదృష్ట్యా సంబంధమునుకూడ గౌడపాదుడు నిరాకరించుచున్నాడు. 'ఉండవలసిన సంపూర్ణ వివేకము లేకపోవుట' అనునదొక్కటియే యీ జాగ్రత్స్వప్నములకు గల భేదమై యున్నది. జీవితములో ప్రతినిత్యము వ్యవహరించునపుడు సాధారణముగా వ్యక్తపఱచు వివేకబుద్ధి కంటె ఎక్కువ వివేకబుద్ధి కలిగియుండుటకు మానవుడు సమర్థుడై యున్నాడు. వివేకము ఉపయోగింపదగిన రాజకీయ వ్యాపార వ్యవహారములందు తన కత్యంత వివేకము గలదు అని చెప్పుకొను వ్యక్తికూడ మానవునకు సాధ్యమైన ఆ వివేకపుటంచులను అందుకొనలేకున్నాడు.

ఆర్యులైన మహర్షుల ఆశయము ప్రకారము నేటి విద్యావిధానము వలన మనకు గలుగు జ్ఞానము కూడ మానవుడు పొందదగిన సంపూర్ణ ఆదర్శపథమును చేరలేదనియే చెప్పవచ్చును. ఈ సంఘము ఇంకను అధికముగా వివేచనా బుద్ధి, సరియైన గ్రహణజ్ఞానము కలది కావచ్చునని వారు విశ్వసించుచున్నారు. మనోబుద్ధుల పరిణామము మరికొంత మహత్తర కార్యసాధనకై అధికాధికముగా ఔన్నత్యమును పొందగలదు. ప్రకృతియొక్క ప్రణాళికను సఫలత నొందించి, మనోబుద్ధుల పరిణతి నభివృద్ధి పఱచుటకు ఆధ్యాత్మికత యొక్కటియే సరియైన ప్రక్రియయై యున్నది.

కా॥ ఉపాలంభాత్సమాచారాత్ అస్తివస్తుత్వ వాదినాం ।
జాతిస్తు దేశితా బుద్ధైః అజాతేస్త్రసతాం సదా ॥ ४-४२

అజాతమైన యీ పరమాత్మవలని భయముచేతను, ప్రత్యక్షముగా వస్తుప్రపంచమును గ్రహించి యనుభవించుట చేతను, కర్మకాండ యందలి గాఢ విశ్వాసముచేతను, జగత్సత్యత్వ భావననే యంటిపెట్టుకొని యుండువారి కొఱకై జ్ఞాని యగువాడు జగత్సృష్టిని సమర్థించుచున్నాడు.

ఈ జగత్సృష్టి కేవలము కల్పనయే యైనయెడల 'ఈ విశ్వమునకు బ్రహ్మయే కారణము' అని యుపనిషత్తులు ఎందుకు చెప్పుచున్నవి? అట్లు చెప్పుటలో గల సామంజస్యమును ఈ కారిక యిచట వివరించుచున్నది.

అద్వైత వేదాంతమును గూర్చి ప్రవచించువారు, ఆత్మపరిపూర్ణతా పద్ధతిని వివరించువారై, సృష్టికారణత్వ

మును కూడ సమర్థించిరి. అందుచే వారు మానసికమైన మూఢ విశ్వాసముతో కారణత్వమును నమ్ముచున్నారని భావించరాదు. మధ్యమ విద్యార్థులకు బోధించు గురువులు, అట్టి సాధకుల జిజ్ఞాసను తృప్తిపఱచుటకై కారణత్వమును గుఱించి చెప్పనారంభించిరి. క్రొత్తగా ఈ వేదాంత విద్య యందు ప్రవేశించిన సాధకులు హఠాత్తుగా అజాతవాదమును విని చెదరి బెదరిపోగలరు. అట్టి విద్యార్థులు తమ వివేకము చేత, మనస్సుచేత కూడ ఒక్కసారిగా శుద్ధ అజాతవాదమును గ్రహించి అభినందించలేరు. వారు ప్రత్యక్షముగా చూచు ఈ ప్రపంచము కేవలము మిథ్య యనగానే భయపడినారో యను నట్లు దిగ్భ్రమ చెందెదరు. వారి వ్యక్తిత్వపు నరములను బిగించి, వారి మనోబుద్ధులను నెమ్మదిగా మాలీసు చేసి, సర్వసంపూర్ణమైన వేదాంత విద్యార్థిగా తయారు చేయుటకై యొక నియమిత ప్రక్రియ ననుసరించదలచి, యీ గురువు లీ కారణత్వ కల్పన యనుదానిని బాగుగా నుపయోగించు కొనిరి. వేదాంత విద్యాభ్యాసములో నిదియొక మాధ్యమిక స్థాయియై యున్నది. ఇట్లా మధ్యమ విద్యార్థి యుత్తమ విద్యార్థిగా నభివృద్ధి చెందగానే అతడు నిశ్చలమైన మనస్సు, నిశితమైన బుద్ధి కలవాడగుచున్నాడు. అట్టివానికి 'అజాత వాదము' అను పవిత్ర సత్యము తెలుపబడుచున్నది. ప్రథమ తరగతి పాఠ్యగ్రంథముల నుదహరించి, వాని యాధారముతో పట్టభద్రుల విద్యావిధానమును విమర్శించుట అసందర్భము లలో నెల్ల అసందర్భమై యున్నది. ప్రథమ తరగతిలోని బాలవిద్యార్థికి ఆ ఉన్నత సత్యములు తిన్నగా చెప్పబడవు:

పరిపక్వ దశను చేరువరకు వారి బుద్ధి జీర్ణించుకొనగలుగు విషయములచేతనే వారి బుద్ధిని పోషించవలెను.

అట్లే వేదాంతములో కూడ ప్రారంభ విద్యార్థులను, స్తిమితముగను, జాగ్రత్తగను, వివేకముతో పరిచయము చేయవలెను. ఇట్టి పరిపూర్ణ ప్రక్రియలో ఆ పరమ గురువులు కారణత్వ కల్పనను ఆభాసగానైన అంగీకరించిరి. కర్మ కాండతోను ఉపాసనతోను కూడిన ప్రపంచమునుండి సాధకుడా గురు పాదములను చేరుచున్నాడు. అట్టివానిని అజాత వాదమను మహోద్భుతములో ముంచి చకితుని చేయుటచే వానికెట్టి సహాయకముగా నుండజాలదు సరికదా యాతనికి నిర్వాణాత్మకముగనుండి అది యాతనిని యభివృద్ధిపఱచుట కూడ లేదు.

కా॥ అజాతే త్రసతాం తేషా ముపలంభాద్వియన్తి యే।
జాతి దోషా న సేత్స్యన్తి దోషోఽప్యల్పో భవిష్యతి॥४३

అవ్యక్తమైన పరబ్రహ్మనుండి భీతినొందినవారును, ప్రత్యక్షముగా ఈ ప్రపంచమును జూచుచున్నవారును అజాతి వాదమును అంగీకరింపరు. కారణత్వమును నమ్ముటవలన కలుగు అనర్థములచే వారు ఏ విధముగను, చలించుటలేదు. ఒకవేళ యేదైన యనర్థమున్నను అది వారికి అప్రధానము.

ప్రారంభ సాధనా దశలో కారణత్వ సిద్ధాంతమును తప్పక విశ్వసించవలసివచ్చిన ప్రారంభ వేదాంత సాధకులను గౌడపాదు డిచట సమర్థించుచున్నాడు. ఆ పరమాత్మ కార్య కారణముల కతీతమైనది, దానినుండి యెట్టి కార్యమును ఉద్భ

వించలేదనుటలో సందేహమేమియు లేదు. ఆ పరమాత్మ ఎట్టి కార్యములకును కారణము కాజాలదు. ఈ నానారూపజగత్తు కేవలము మిథ్య. ఈ మనోబుద్ధులు కేవలము ఆత్మయందు ఆరోపితమైనవే యగుచున్నవి. జ్ఞాత యున్నంతకాలము జ్ఞేయ ముండును. దేహమనోబుద్ధుల నధిగమించిన లేదా యీ జీవాత్మ తననా పరమాత్మకు పూర్తిగా అర్పణము చేసి కొనిన ఆ పరమాత్మ తనలోనే తానానందించునదై, తన సహజభావమైన అఖండ ఏకజాతీయ సత్యతత్త్వములో తననే తెలిసికొనుచున్నది. అయినప్పటికిని, గురువు, శిష్యుడు, శాస్త్రగ్రంథము ఓం ప్రతీకము ఇత్యాది నానాత్వమును గ్రహించుట అంత తప్పిదము కాదు. ప్రారంభ సాధకుడు ఆ పరతత్త్వమును చేరుటకుగాను ఎగురుటకుముందు తన సాధనముల నన్నిటిని కూడబెట్టుకొనవలెను. ఇట్లు తుట్టతుది గంతు వేయుటకు ముందు వేదాంతమార్గము ననుసరించు సాధకుడు పూర్వప్రయత్నముగా హేతువాద సిద్ధాంతమునందు తాత్కాలికముగా నైనను విశ్వాసము కలిగియుండవలెను.

'ప్రారంభములో సాధకునకు సద్గురువునకు తప్పని సరిగా కలుగు శ్రద్ధాభక్తులకు యద్విధమైన దుష్ఫలితములు కలుగబోజాలవు' అని గౌడపాదుడిచట చెప్పుచున్నాడు. ఆ ఆత్మదృష్ట్యా ఆ గురువు స్వప్నస్థ సింహమువలె వాస్తవములో లేనివాడే యగుచున్నాడు. కాని యా స్వప్నసింహము వాస్తవములో లేనిదే యైనను, తన భయంకర గర్జనచే మిథ్యా భయమును కలిగించి, యాతనిని మేల్కొలుపునట్లు, మిథ్యయైన వేదాంతసింహము నానాత్వ విశిష్ట ప్రపంచము నుండి

అఖండ ఆత్మజ్ఞానానుభవమునకు వానిని మేల్కొలుపు చున్నది.

కా॥ ఉపాలంభాత్సమాచారాత్ మాయా హస్తీ యథోచ్యతే ।
ఉపాలంభాత్సమాచారాదస్తి వస్తు తథోచ్యతే॥ ४४

కేవలము మాయచేత కల్పితమైన ఒక ఏనుగును మనము చూచినపుడు దానియందు యేనుగులక్షణము లగపడుటచే "అది ఉన్నది" అని యెట్లు చెప్పుచున్నామో, అట్లే ప్రపంచములోని పదార్థములు కూడ మనచే గ్రహింపబడి, మన మనస్సు వ్యవహరించుటకు యోగ్యము లగుటచే, అవి కూడ అస్తిత్వము కలిగియున్నవి' అని చెప్పుచున్నాము.

వాస్తవములో, ఈ వస్తుజగత్తు, ఆ యేనుగుకూడ మాయాకల్పితములే యగుచున్నవి.

వేదాంతముచేత తఱుచుగా నుదహరింపబడి, భారత దేశమున ప్రసిద్ధమైన కళలలో ఈ ఐంద్రజాలిక విద్య యొకటి. భారతీయ ఐంద్రజాలికులు మణిమంత్రౌషధములద్వారా తమ సామాజికులయెదుట ఒక పెద్ద యేనుగు నిలిచినట్లు వారికి భ్రమను కల్పింతురు. ఆ మాయా యేనుగు వాస్తవమైన యేనుగునకుగల సమస్తలక్షణములు కలిగియుండును. అంతియే కాక దానిపై స్వారిచేయుట మొదలగువానికి ఇతరయేనుగుల వలె అది యుపయోగపడుచున్నది. కావుననే ఐంద్రజాలికుడు సృష్టించిన యేనుగును మనము చూచుటయేగాక మన వ్యవహారమునకు కూడ ఉపయోగించు వీలుకలిగి నట్లుండును.

ఈ రెండు కారణములచేత ఆ గారడీవాని యేనుగు సత్యమని నమ్ముచున్నాము.

ఈ పై రెండు కారణములచేతనే యీ ప్రపంచము కూడ సత్యము, యథార్థమునై యున్నదని ద్వైతులు చెప్పుచున్నారు. కావున వారి మతములోని నిస్సారతను చూపుటకు గౌడపాదు డిచట ప్రయత్నించుచున్నాడు. మంత్రగానిచేత సృష్టింపబడిన యేనుగునకు కూడ దానిని చూచుచున్నంత వరకు యీ పై రెండు కారణములచేత 'అస్తిత్వము' ఉన్నది. జాగ్రదవస్థలో మనము వస్తుప్రపంచమును చూచి యనుభవించుచున్నను, అది సత్యమని స్థిరపఱచలేము. సంగ్రహించి చెప్పిన, ద్వైతులు సూచించు ఈ పై రెండు కారణములును ప్రపంచముయొక్క అస్తిత్వమును స్థిరపఱచలేవు. ఈ ప్రపంచమంతయు ఆ పరమాత్మపై ఆరోపితమైనదే యగుటచేత మనమీ ప్రపంచమును చూచుచున్నప్పటికిని అది ప్రత్యేక అస్తిత్వము కలిగియుండజాలదు.

కా॥ జాత్యాభాసం చలాభాసం వస్త్వాభాసం తథైవ చ ।
అజాచలమవస్తుత్వం విజ్ఞానం శాన్తమద్వయం ॥ ४५

ఆ పరమాత్మ జన్మ, చలనము, వస్తురూపము ఇత్యాదులు కలిగియున్నట్లగపడు చున్నప్పటికిని అది అజము, అచలము, అవస్తువునై విజ్ఞానరూపమగుచున్నది. అది అద్వైతము శాంతము అయి యున్నది.

"ఆ పరమాత్మ అపరిమితమై, సర్వవ్యాపియై, అవాఙ్మానస గోచరమే మైనయెడల, ప్రత్యేకగుణములు కలిగి మన ముం

దర యగుపడుచు చలించుచున్న యీ నామరూపములుగల ప్రపంచము ఏమై యున్నది? ” ఇట్టి ప్రశ్న వేదాంతము నభ్య సించు ప్రతి ప్రారంభ విద్యార్థికిని సహజముగానే కలుగు చున్నది. అట్లు సత్యమువలె భాసమానమగు ప్రపంచమునకు గౌడపాదు డిచట వివరణ నిచ్చుచున్నాడు. ఆ శుద్ధచైతన్యము అజమైనప్పటికిని ప్రత్యేక దేశకాలాపేక్ష యీ నానారూప ధారియై జన్మించి, కర్మక్షేత్రములో పాల్గొనుచున్నట్లు తోచు చున్నది.

సర్వవ్యాపియగు ఆత్మకు చలనము లేదు. అది కదలు చున్నది యనగా ఒక దేశకాలమునుండి మరియొక దేశ కాలమునకు మారుచున్నదని యర్థము. రెండు విభిన్న దేశము లలో రెండు విభిన్నకాలములలో ఒకేవస్తువు ఒక్కసారిగా నుండజాలదు. ఒకే సమయమందు రెండు స్థానములయందు ఉండలేదుకనుక ఒక వ్యక్తి ఒక కుర్చీనుండి మరియొక కుర్చీ పైకి మారుచున్నాడనవచ్చును. కాని అన్నిస్థలము లందును ఒకే కాలము నందుండు ఆత్మతత్త్వము ఒక స్థలమునుండి మరి యొక స్థలమునకు కదలిపోవుచున్నదని చెప్పుటకు వీలులేదు కదా. అయినను మనమీ నామరూపములు చలనము కలిగి యున్నట్లు చూచుచున్నాము. మనమనస్సుతో తాదాత్మ్యము పొంది, తద్ద్వారా పరిమిత ఇంద్రియ విషయప్రపంచమును చూచుట కలవాటుపడుటచే ఆ అచలమందుకూడ ఇట్టి చలన మును మనము చూచుచున్నాము.

మనము పడవలో కూర్చొని నదిలో ప్రయాణము చేయునపుడు తీరమందలి వృక్షాదులు కదలు చున్నట్లు

తోచును. వాస్తవములో ఆ వృక్షాదుల కెట్టి కదలికియు లేదు కాని మనము కదలుచుండుటచేత అవి కూడ కదలిపోవు చున్నవా యనునట్లు తోచుచున్నది. రైలు ప్రయాణముచేయు బాలురు తంతిస్తంభములు పరుగెత్తుచున్నట్లు భావింతురు. ఏతద్విషయపరిశీలనవలన మనకు తేలినదేమనగా చలనముగల వస్తుదృష్ట్యా అచలమైన వస్తువుకూడ కదలుచున్నట్లు తోచును.

ఇట్లే చలనస్వభావముగల యీ మనోబుద్ధులద్వారా ప్రపంచమును చూచునపుడు ఆ అచలతత్త్వముకూడ చలమై, క్రియావంతమై అభివ్యక్తమగుచున్నది. ఇది కేవలము మాయాదృశ్యము. భౌతికావరణలచే నొక వ్యక్తి యీ నానాత్వభ్రాంతికల వాడగుచున్నాడు. కావుననే జాతి – ఆభాస, చల–ఆభాస అని జాతి చలనములను ఆభాసమాత్రము గానే గౌడపాదుడు చెప్పుచున్నాడు. వాస్తవములో ఆ ఆత్మకు జన్మలేదు, చలనము లేదు. అది అద్వైతము సదానంద రూపము.

కా॥ ఏవం న జాయతే చిత్తమేవం ధర్మా అజాః స్మృతా ।
ఏవమేవ విజానన్తో న పతన్తి విపర్యయే ॥ ౪౬

ఇట్లు చిత్తము అజము అవికారము అయియున్నది. సమస్త జీవులు జన్మలేనివారే యగుచున్నారు. ఇట్టి సత్యమును తెలిసికొనిన వానికి ఆ పరమాత్మను గురించి విపరీత భావన కలుగదు.

జనన మరణ రూప సంసార గర్తమునుండి విడివడి జీవుడు ముక్తుడగుటయే ఆత్మైక్యమును పొందుట లేక ఆత్మను

తెలిసికొనుట యగుచున్నది. ఆత్మజ్ఞాని యగు అమృతుని దృష్టిలో పరిమితమైనది నశ్వరమైనది యేదియు యుండదు. మనోబుద్ధులతో చూచుచున్న ప్రపంచమంతయు అతనికి లేనిదే యగుచున్నది. అతడు మనోబుద్ధుల నధిగమించుటచే సర్వవ్యాపి శుద్ధ చైతన్య రూపమగు పరమాత్మ తత్త్వమే తానని తెలిసికొనుచున్నాడు. అంతట అట్టి అమృత తత్త్వముతో నైక్యము పొందుటయే తన లక్ష్యమని యాతడు తెలిసికొనుచున్నాడు.

జీవునకే మరల జన్మగలదు: మిగిలియున్న తన వాసనల కనుగుణముగా తత్తదనుభవముల ననుభవించుటకై యా జీవి అధికాధికముగా జన్మలను సృష్టించుకొనుచున్నది. మనస్సు నధిగ మించిన యతనికి జీవుడు ఉండడు. కాబట్టి అనుభవములను కాంక్షించువాడు కూడ వుండడు. అనుభవించువానిలో అనుభవములులీనమైపోయి మిగులునది అద్వైత ఆత్మానుభవమే అగుచున్నది. అచట అనుభవించుటకు తన కంటె నితరమైన వస్తువేదియు ఆతనికి లేదు. అనగా తనను తాను తెలిసికొనుచున్నాడు, ఆత్మానందమును అనుభవించుచున్నాడు అని భావము.

అటుపైని యాతడు ఈ దేహమనోబుద్ధులు తానని భావించడు. అతనికి మానసికమైన రాగభయాదులు కాని, బుద్ధిలోని ఆకాంక్షలు గాని ఉండవు సరికదా ఆధ్యాత్మికమైన అశాంతికూడ ఆతనికి నుండదు.

జీవులు అని ఈ శ్లోకములో బహువచనమును ఉపయోగించినాడు. ఆ ఆత్మతత్త్వమునుండి యివి భిన్నములు

అని సుస్పష్టముగా సూచించుటకే యిట్టి బహువచన ముప యోగింపబడినది.

కా॥ ఋజు వక్రాదికాభాస మాలాత స్పందితం యథా।
గ్రహణగ్రాహకాభాసం విజ్ఞాన స్పందితం తథా॥ ౪౭

ఆలాతము భ్రమించుచున్నప్పుడు, తిన్ననైన వంకరైన, యనేక యాకారములు కలుగుచున్నట్లుగానే ఆ ఆత్మలో స్పందనము కలిగినప్పుడు జ్ఞాత, జ్ఞేయము ఇత్యాది భేదము లుత్పన్నమై అభివ్యక్తమగుచున్నవి.

ఇదివరకే వివరింపబడిన యా పరమాత్మతత్త్వమునకు సత్యత్వమును స్థాపించుటకై యిచట ఆలాత చక్రము ఉదాహరణగా నీయబడినది. ఈ ఉదాహరణను స్వస్వరూపముతో యథాతథముగా గౌడపాదుడు బౌద్ధవాఙ్మయమునుండి అరువు తెచ్చికొనినాడని చెప్పు కొంతమంది విమర్శకులు గలరు. ఈ అధ్యాయముయొక్క ఉపోద్ఘాతములో వివరించినట్లుగా ఈ విమర్శ అత్యంతము అసమీచీనమై యున్నది. మైత్రాయణి ఉపనిషత్తులోని నాలుగవ అధ్యాయములో బ్రహ్మతత్త్వమును వివరించునపుడు ఆ ఋషి యిదే దృశ్యమును పేర్కొని యున్నాడు. బహుశా బౌద్ధులు, గౌడపాదుడు ఇరువురును ఆ ఉపనిషత్తునుండియే యీ యుదాహరణను తీసికొనియుందురు.

ఒకవేళ బౌద్ధవాఙ్మయమునుండియే యీ యుదాహరణను గౌడపాదుడు గ్రహించినాడని యంగీకరించినను, అది అతనికెట్టి దోషమును ఆపాదింపజాలదు. తన భావములను

వివరించి చెప్పుటకు ఆతనికీ యుదాహరణ అనుకూలమై యుండి యుండవచ్చును. తమకు పేరుప్రతిష్ఠలు కాక తమ తరమువారికి ఉపయోగకరముగా నుండుటయే ముఖ్యమని భావించు ఆనాటి ఉత్తమ ఆచార్యులందరు ఇట్లు చేసియే యున్నారు. అట్టి పరిస్థితులలో, తమ తరములోనుండు శిష్యులకు, సాధకులకు బోధించుటకై, వారికి పరిచితమై సులభ గ్రాహ్యమగు దృష్టాంతములద్వారా వివరింపనెంచి యూయాచార్యులిట్టి యుదాహరణలను వాడుకొనుచుండిరి. కావున గౌడపాదుడు ఆలాత దృష్టాంతమును ఉదాహరణగా ఉపయోగించినయెడల నది కావ్యచోరత్వ దోషమెంత మాత్రము కాజాలదు.

అగ్గి ముట్టించుటచే అగ్రభాగము ప్రకాశించు ఆలాతమును నాలుగు వైపుల త్రిప్పిన అది చక్రాకారమును, చదరపుటాకారమును, తిన్నని గీతల యాకారమును, మెలికలు తిరిగిన వంకరగీతల యాకారమును ఈ విధముగా అనేక రకములైన దృశ్యములను కలిగించును. ఇవన్నియు ప్రత్యేకము భిన్నమైన యాకారములు గలవై యుండినను అన్నియు కలిసి మొత్తముమీద ఒక చక్కని చిత్రమైన దృశ్యముగా తోచును. అజ్ఞానులైన బాలురు మాత్రము ఈ చిత్ర విచిత్ర దృశ్యములనుచూచి ఇది యేమి ? ఎట్లు ? ఎక్కడనుండి వచ్చినదని ప్రశ్నింతురు. ఆ ఆలాతమునుండి పుట్టినట్లే యగుపడినను, ఆ చిత్రదృశ్యములు వాస్తవములో ప్రత్యేక అస్తిత్వము లేనివే యగుచున్నవి, అని తెలిసిన విద్యావంతులకు వివేకవంతులకు ఇట్టి సంశయములు గలుగవు. ఆ ఆలాతము

లేకున్న యీ దృశ్యములే లేవనియు, యీ చిత్ర విచిత్ర దృశ్యములోని ప్రతి చిన్న యంశమునకు ఆ ఆలాతముయొక్క ప్రకాశితమైన యగ్రభాగమే మూలకారణమనియు మనకందరకు బాగుగా తెలియును.

కా॥ అస్పందమాన మాలాత మనాభాసమజం యథా ।
అస్పందమానం విజ్ఞాన మనాభాసమజం తథా ॥ ४८

ఆలాతము చలించకుండనున్నప్పుడు దానియందు ఈ నానారూపములు లేవు. అది స్థిరమైయున్నది. అట్లే ఆ చైతన్యము తన భావనలలో చలించకుండయున్న యందెట్టి దృశ్యములు లేవు. అది స్థిరమై అవికారమై యుంటున్నది.

ఆ శుద్ధచైతన్యము అవికారమైనప్పటికిని యది వికారము చలనము కలిగినట్లగపడుచున్నదని పూర్వశ్లోకములో చెప్పబడినది. చురుకైన బాహ్యక్రియలందు వ్యక్తమైన చైతన్యము చలచిత్తము, చాంచల్యము కలదిగా నగపడుచున్నది. బహుధాభిన్నమై, అస్థిరమై, ఆ చైతన్యము బాహ్యవస్తు ప్రపంచమందు రెపరెపలాడుచున్నది. అట్టి చంచలమైన యవస్థలోఉండి చూచిన మనకు నిత్యచలనము గలదిగా తోచుచున్నది. అచలమైన దానియందు ఆభాసమగు చలనమును, అస్థిరమైన దానియందు ఆభాసమగు వికారమును వివరించుట కొఱకై యిచట ఆలాతము ఉదాహరణగా గైకొనబడినది. ఆలాత స్పందనమాగిపోగానే, అజ్ఞానులు దానియందు చూచు విభిన్నరూపములు ఆకారములు ఆ ఆలాతముయొక్క ప్రకాశమాన అగ్రమందే లీనమై పోవుచున్నవి.

అట్లే ఆ చైతన్యము మనోమండలములో అల్లాడుచున్నప్పుడు నానారూపమగు ప్రపంచ మగుపడుచున్నదని మనము గ్రహించవలెనని గౌడపాదుడు చెప్పుచున్నాడు. మనస్సు నిశ్చలమైనయెడల ఆ అతీతస్థితియందు ఆత్మ తనయందు తననే చూచుకొనుటచే ఆత్మయొక్కటే యుంటున్నదని తెలిసికొనుచున్నాడు. అంతట యతనికి యీ నానాత్వవిశిష్ట ప్రపంచము లేనిదగుచున్నది. ఆలాతము స్థిరముగానున్న ఆ చిత్రములన్నియు దానిలో అంతర్హితమై పోవుచున్నవి. రాబోవు శ్లోకములలో నీ విషయము మిక్కిలి చక్కగా వర్ణింపబడియున్నది.

కా॥ అలాతే స్పందమానే వై నాఽఽభాసా అన్యతోభువః ।
న తతోఽన్యత్ర నిస్పందాన్నాలాతం ప్రవిశన్తి తే ॥ ౪౯

ఆలాతము స్పందించుచున్నప్పుడు కనబడు చిత్రములన్నియు మరియొక ప్రదేశమునుండి వచ్చినవి కావు. మరియు ఆలాతము నిష్పందమైనప్పుడు ఆ చిత్రములు మరియొక స్థలమునకు పోవుటలేదు. అథవా ఆ ప్రకాశమాన ఆలాతాగ్రమునందే ప్రవేశించుటయు లేదు.

ఆలాతము స్పందించుచున్నప్పుడు మనము చూచు చిత్ర విచిత్ర రేఖాదృశ్యములన్నియు ఆలాతముయొక్క చలనముచే కలిగిన భ్రాంతదృశ్యములే యగుచున్నవి. కావున అవి యొకచోటునుండి వచ్చినవి కావు. అవి మరియొక స్థలమునకు పోవుటయు లేదు. ఆ ఆలాతాగ్రమునందే అవి ప్రవేశిం

చినవని చెప్పుటయు సత్యము కాదు. ఏలనన ఆ దృశ్యములు ఆ అగ్రమునుండి బయలువెడలలేదు.

ఈ ఉపమానము ఉపమేయమైన ఆత్మయందు ఎట్లు సమన్వయింపవచ్చునో రాబోవు శ్లోకములో వివరించు చున్నాడు.

కా॥ న నిర్గతా అలాతాత్తే ద్రవ్యత్వాభావ యోగతః ।
విజ్ఞానేఽపి తథైవస్యురాభాసస్యావిశేషతః ॥ ౫౦

ఆభాసమైన యీ దృశ్యములకు ద్రవ్యగుణము లేక పోవుటచే అవి ఆలాతాగ్రమునుండి బయలువెడలుట లేదు. అట్లే యీ ప్రపంచముకూడ సత్తాకలది కాకపోవుటచే ఆభాస మానమే యగుచున్నది కావున అది ఆ సత్యతత్త్వమునుండి బయలువెడల లేదు.

"ఒక యింటినుండి ఏదైన బయలువెడలినట్లు ఆ దృశ్యములు ఆలాతమునుండి బయలువెడలలేదు" అని చెప్పి యీ విషయమును శ్రీ శంకరాచార్యులు తమ వ్యాఖ్యాన ములో సుస్పష్టపరచిరి. ఒక పదార్థమునుండి, ఒక పదార్థము బయలువెడలెననిన, మరియొక ప్రత్యేక విభిన్న పదార్థమే యట్లు బయలువెడలగలదు. కాని తననుండి తానే బయలు వెడలలేదు. ఒక స్త్రీ తననుండి ప్రత్యేక వ్యక్తిత్వముగల శిశువును ప్రసవించగలదు గాని తనను తానే సృష్టించుకొన లేదు కదా! అట్లే ఆలాతాగ్రమునుండి వెలువడిన యీ దృశ్యములు అసత్యములగుటచే అవి ఆలాతాగ్రమునుండి వెలువడజాలవు.

అవి ఆలాతాగ్రమునందు ప్రవేశించను లేదు. వాస్తవమైన పదార్థమే మరియొక పదార్థములో ప్రవేశించగలదు. అసత్యపదార్థము ఒకదానిలో ప్రవేశించనులేదు. ఒకదాని నుండి బయల్వెడలను లేదు. ఒక సీసాను ఎండమావులలోని నీటితో నింపను లేము, అట్టి నీటిని యా సీసానుండి వెలుపలకు పంపను లేము. అట్లే యీ చిత్రదృశ్యములు కూడ అసత్యము లగుటచేత అవి యందుండి వెలువడను లేదు, మరల యీ ఆలాతమునందు ప్రవేశింపనులేదు.

ఆలాతమునుండి అట్టి విచిత్ర దృశ్యములు వాస్తవములో బయలువెడలనే లేదు కనుక యవి మరియొకచోటికి మాయమైనవనికూడ చెప్పుటకు వీలులేదు. ఇంద్రధనుస్సు స్వర్గమునుండి వెలువడనులేదు. అది మరియొక ప్రదేశమునకు మరలిపోనులేదు. అది కేవలము ఆకాశములోనుండు ఒక మాయా దృశ్యమే యై యున్నది.

అదేవిధముగా ఆ శుద్ధ చైతన్యమునకు చంచలమైన యీ మనస్సుతో సంబంధము కలిగినపుడు అదికూడ చలించుచున్నట్లు భావించును. అట్టి చలనముద్వారా నానావిధములైన నామరూపములు ఉద్భవించుచున్నవి. ఈ నామరూపములే మిథ్య యగుటచే నిట్టి మిథ్యాదృశ్యములొక ప్రపంచమును ఉత్పత్తి చేయజాలవు. మరియు నిట్టి ప్రపంచ మా శుద్ధ చైతన్యములో లీనము కూడ కాలేదు.

ఉపమాన ఉపమేయములకు రాబోవు శ్లోకములలో విశదముగను చక్కగను సమన్వయము చేయబడినది.

కా॥ విజ్ఞానే స్పందమానే వై నాఽఽభాసా అన్యతోభువః
న తతోఽన్యత్ర నిష్పందాన్నవిజ్ఞానం విశన్తితే ॥ ౫౧

కా॥ న నిర్గతా స్తే విజ్ఞానాత్ ద్రవ్యత్వాభావ యోగతః ।
కార్యకారణ తాభావాద్యతోఽచిన్త్యః సదైవతే ॥ ౫౨

విజ్ఞానమగు ఆ చైతన్యము స్పందనముతో కూడినదై నప్పుడు ఆభాసమానమగు ఆ చిత్రదృశ్యములు మరియొక స్థలమునుండి వచ్చి చేరినవని చెప్పజాలము;

ఆ చైతన్యము నిష్పందమైనప్పుడు ఆ దృశ్యములు అచటనుండి మరియొక స్థలమునకు పోలేదు;

ఆ దృశ్యములా చైతన్యములోనికే ప్రవేశించను లేదు. మరియు అవి అసత్యములగుటచే సత్యమగు ఆ పర మాత్మనుండి ఆ దృశ్యములు వెలువడను లేదు;

ఇట్లు కార్యకారణ సంబంధమును కల్పించుటకు వీలు లేకపోవుటచే యీ దృశ్యములను గుఱించి తెలిసికొనుట దుష్కరమగుచున్నది. అవి సదా అచింత్యములే యగు చున్నవి.

ఆలాతము ఆధ్యాత్మికతా చైతన్యముతో సమానము అని యీ రెండింటికిని ఉపమానమును చెప్పుటలో ప్రతి యంశములోను గల సమాన ధర్మము ఈ రెండు శ్లోకముల లోను ప్రత్యేకముగా వివరింపబడినది.

ప్రతి అంశమందలి పోలికయు పైని అనువదించిన విధ ముగా స్వయంవ్యక్తమై యున్నది. ఇంక, ఈ మిథ్యా

దృశ్యములు ఎట్లు, ఎందుకు కలుగుచున్నవను దానికి వైజ్ఞానికముగా వివరణనిచ్చుటయే కష్టతరముగనున్నది.

జగత్తు మిథ్య యగుటచే యది పరమాత్మనుండి వాస్తవముగా వెలువడెనని చెప్పజాలము. మిథ్య యైనప్పటికిని అందుండు సుఖదుఃఖములు మనలను బంధించుటచేత అది అత్యంత సత్యమువలె భాసించుచున్నది. అది ఎట్లు ? దీనిని వివరించుట అసాధ్యమని ప్రతి వేదాంతియు తప్పక తెలిసికొనియుండవచ్చును. సత్యతత్త్వమునుండి యీ మిథ్యా ప్రపంచమెట్లు వచ్చినది ? సత్యమునుండి అసత్యము వెలువడ జాలదుకదా ? అసత్యమైనప్పటికిని సత్యమువలె భాసించుచు మనమా భ్రాంతిలో నున్నంతవరకు అది మనకు సుఖదుఃఖాదుల నిచ్చుచున్నది కదా. దీనికి ఒక్కటే ప్రతిక్రియ యున్నది. అది మనమా భ్రాంతినుండి బయటకు నడచుటయు, ఈ స్వయంసృష్ట మోహమును ఛేదించుకొనుటయు అయి యున్నది. ఇట్టి మాయాచ్ఛేదన ప్రక్రియ సంపూర్ణము కాగానే ఆధ్యాత్మిక సాఫల్యము నందుచున్నది. వేదాంతము దీనినే లక్షించుచున్నది.

ఆ పరమాత్మనుండి యీ ప్రపంచము ఎట్లు వచ్చినదని వివరించుట అసాధ్యమని యీ శ్లోకము స్పష్టముగా చెప్పుచునే యున్నది. అత్యంత వివేకశాలియగు గౌడపాదుడే యీ విషయము నిరూపించుట అసాధ్యమనుచున్నాడనిన యీ మహర్షికి వివేకము లోపించినదని మనము భావింపరాదు. తర్కశాస్త్రముయొక్క అసామర్థ్యము వలననే యిచట యెట్టి యుపపత్తులను మన కతడు చూపలేకున్నాడు. కార్యకారణా

న్యాయమే మిథ్యయగుటచేత ఈ ప్రత్యేక విషయములో అది పనిచేయదు. మరియు, ఆ పరమాత్మకు సంబంధించినట్లు భాసించు నీ ప్రపంచమును వివరించవలెననిన కారణమును అన్వేషించి కనుగొనకుండ అట్లు వివరించుట సాధ్యముకాదు.

శాస్త్రము కార్యకారణ క్షేత్రములోనే పనిచేయ గలదు. ఈ మనోబుద్ధులు హేతువాదమనెడి తీవ్ర ఉష్ణములో ఆవిరి యైనప్పుడు శాస్త్రమీ కార్యకారణతను అధిగమించు చున్నది. ఇట్టి భ్రమ పరిధులనుండి దాటిపోయిన అది కార్య కారణతను గమనించని ఆత్మలోకమునకు ఎగసిపోవుచున్నది. ఆ శుద్ధ చైతన్యములో ఎట్టి కార్యకారణములు లేవు. అద్వై తమైన తత్త్వమున్నచోట మరియొకటి యుద్భవించజాలదు.

క్రియావంతమైన చైతన్యము అనునప్పుడు జాగ్ర త్స్వప్నములందలి విశ్వతైజసులను, నిష్క్రియము అను నప్పుడు జాగ్రత్స్వప్న జగత్తులు లేనట్టి సుషుప్తి యందలి ప్రాజ్ఞుని గౌడపాదుడు సూచించుచున్నాడని మనము గమ నించవలెను. జాగ్రత్స్వప్నములు లేవనిన అవి మరియొక స్థల మునకు పోయినవనిగాని సుషుప్తియందు ప్రవేశించినవని గాని అర్థముకాదు. సృష్టిలయములు రెండును మిథ్యయే. ఈ జాగ్ర త్స్వప్న సుషుప్తుల వ్యవస్థ అజ్ఞానియై బాల్యదశలోనుండు మనస్సునకు వివేకము చెప్పెడి కట్టుకథయే యగుచున్నది.

కా॥ ద్రవ్యం ద్రవ్యస్య హేతుః స్యాదన్యదన్యస్య చైవ హి ।
ద్రవ్యత్వ మన్యభావో వా ధర్మాణాంనోపపద్యతే ॥ ౫౩

ఒక ద్రవ్యము మరియొక ద్రవ్యమునుండి యుద్భవించును. ద్రవ్యము కానిదానికి అట్టి ద్రవ్యముకానిదే అనగా అద్రవ్యమే కారణమగుచున్నది. కాని యీ జీవులు ద్రవ్యము కాదు. అద్రవ్యము కాదు.

శిష్యునియొక్క భ్రాంతమనస్సును జయింపబడిన శత్రువునివలె కొరడా పుచ్చుకొని గౌడపాదుడింకను తరుముచునే యున్నాడు. సరిదిద్దశక్యముగాని విశ్వాసముతో హేతువాదమందే యంటిపెట్టుకొనియున్న శిష్యుని యందుండి విడిపించుటకు అధికాధికమైన యుపపత్తులను హృదయములో నాటుటకు ప్రయత్నించుచున్నాడు. భౌతిక రసాయనిక ప్రక్రియా ప్రపంచములో ఒక ద్రవ్యము మరియొక ద్రవ్యమును సృష్టించగలదని మనము తెలిసికొనియున్నాము. అట్లే మానవులకు పరస్పర సంబంధము గలిగినట్టియు, మనస్తత్వశాస్త్రమునకు సంబంధించిన భావప్రపంచములో అద్రవ్యము అద్రవ్యమునే సృష్టించగలదనియు మనకు తెలియును.

ఇచట అద్రవ్యము అను పదము వస్తుధర్మమును, వస్తుగుణమును సూచించుటకు ఉపయోగింపబడినది. ఉదాహారణకు నా ప్రేమ సంపూర్ణముగను, నిష్కపటముగను ఉండినయెడల అది యితరులయందు అంతకంటె అధికమైన ప్రేమను సృష్టించగలదు. మానవునిలోని పశుత్వమును విద్య మచ్చికపరచుకొనుచున్నది. అత్యంత కాఠిన్యముగల హంతకునికూడ సానుభూతి హృదయముగల మంచి సంఘము మార్దవపరచగలదు. ఇట్లు ప్రేమ, దయ ఇత్యాది అద్రవ్యములు ఇతరుల

యందు అట్టి గుణములను సృష్టించుచున్నవి. ద్రవ్యము ద్రవ్యమునే యుత్పత్తి చేయగలదు.

ఇంక యీ జీవుని విషయము చూచిన యీ చిత్తము ద్రవ్యము కాక అద్రవ్యము కాక యుండుటచే అందువలన మరి యొకటి యుద్భవించలేదు. మరియు, మరియొకటి దీనిని ఉత్పత్తి చేయలేదు.

కా॥ ఏవం న చిత్తజా ధర్మాశ్చిత్తం వాపి న ధర్మజం।
ఏవం హేతు ఫలాజాతిం ప్రతిశన్తి మనీషిణః॥ ౫౪

ఇట్లు బాహ్యామందలి యింద్రియ గోచరవస్తువులు మనస్సుచే సృష్టింపబడినవి కావు. మరియు మనస్సుకూడ ఆ వస్తువులచే సృష్టింపబడినది కాదు. కావున ధీమంతులు "అజాతి సిద్ధాంతమును అనగా హేతుఫలాజాతిని" గ్రహించి యున్నారు.

మనస్సే యీ వస్తు ప్రపంచమును సృష్టించినదని సామాన్య సిద్ధాంతము. కాని యింద్రియ విషయముల ద్వారా మనలో మొత్తముగా నొక వాసనాసమూహము కూడు చున్నదనియు, అదియే మనస్సుగా మారుచున్నదనియు మన తత్త్వ శాస్త్రజ్ఞులు చెప్పు మరియొక సిద్ధాంతము కలదు. మన మింతదనుక పరిశీలించినంతవరకు, మనస్సుచే వస్తుప్రపంచము సృష్టింపబడినదనిగాని, వస్తుప్రపంచదృష్ట్యా మనస్సు కలుగు చున్నదనిగాని, వివరించుటకు తగిన సాక్ష్యమేదియు లేదు. కావున మనస్సుచే చూడబడు ఈ దృశ్యప్రపంచము వాస్తవ ములో లేదని నిర్ణయించవచ్చును. వివేకబుద్ధియొక్క పరిశీల

నకు నిలువగలుగు అజాతినే సిద్ధాంతముగా ధీమంతులెందుకు గ్రహించిరో చెప్పుచు గౌడపాదు డీ శ్లోకమును ముగించు చున్నాడు. హేతుఫలన్యాయమును దృఢముగా విశ్వసించు మనయొక్క మూఢనమ్మకమును అతడు వ్యంగ్యముగా సూచించుచున్నాడు.

ఈ శ్లోకములోని భావమును జీవితములో అనుసంధిం చిన అది అనుభూతినందలేని భ్రాంతులైన స్వప్నద్రష్టల యొక్క స్వప్న విషయములను వినోదపఱచుటకు మాత్రము తగినదై బుద్ధిసంబంధమై ఆవిరియైపోవు అభిప్రాయమును వ్యక్తపఱచు సిద్ధాంతము మాత్రము కాదు.

వాస్తవములో ఇది లాభకరముగా జీవితములో అను సంధించ యోగ్యమైన ధర్మమై యున్నది. పైని వివేకముతో నిరూపించిన నిరూపణలచే, వస్తుప్రపంచము అసత్యమగుట వలన స్వాయముగా మనకది యొక మనస్సును యుత్పత్తిచేయ జాలదని నిర్ణయించవచ్చును. అంత మనము బాహ్యపరిస్థితు లకు వశము కాజాలమని స్పష్టమగుచున్నది. మనల నా ప్రపంచము ఉత్పత్తి చేయలేదు, మనముకూడ ఆ ప్రపంచ స్వప్నమును సృష్టించలేదు. ప్రపంచ పరిస్థితులచేత మనము ఉత్పత్తి నాశనములు కలిగియుండలేదు, కాని మనమే యా పరిస్థితులకు సర్వదా అధిపతులమై, మనకొఱకు మనమే నిత్య కృత్యపు మంచి చెడ్డలను సృష్టించుకొనుచున్నాము.

వేదాంతము సాధకునకు కేవలము లక్ష్యమును, లక్ష్య మును చేరు మార్గమును మాత్రము సూచించి విడుచుట లేదు.

మానవుడు పరిస్థితులనుండి ముక్తుడై ఆరోగ్యకరమైన ఆకాంక్షలతోను, దృఢమైన విశ్వాసముతోను జీవితమును ఎదుర్కొనగలుగు వాస్తవమైన యొక తత్త్వమునే యది మనకిచ్చుచున్నది. మానవుడు ప్రకృతికి బానిసకాడు. ప్రకృతి మానవుని చేతిలోని అనువైన ఆటబొమ్మ. అతనికి అనుకూలముగను వినోదముగను ఉండుటకై ప్రకృతిని తోలుబొమ్మలాట ఆడించవలెను. కాని ఆత్మనాశకరమైన భ్రమచే కలిగిన వత్తిడి పోరాటములవలన సాధారణ మానవు డీ విషయమును మరచినాడు. ఆ జ్ఞానుల నిర్ణయములు ఉపపత్తుల ద్వారా నిరూపించబడుటచేత సంశయాతీతములగుటచే వానిని మార్చుటకు వీలులేదు.

కా॥ యావద్ధేతు ఫలావేశస్తావద్ధేతు ఫలోద్భవః ।
క్షీణే హేతు ఫలావేశే నాస్తి హేతుఫలోద్భవః ॥ ౫౫

హేతుఫలములను నమ్మువానికి ఆ హేతుఫలములు ఉండనే యున్నవి. కాని హేతుఫలావేశము క్షీణించినంతనే హేతుఫలములుకూడ లేనివే యగుచున్నవి.

పై విధముగా జ్ఞానులు తర్కవాదముచేత యుక్తియుక్తముగా 'అజాతి' నే నిర్ణయించిన యెడల హేతుఫలముల యందభినివేశముగలవారి విషయమేమని చెప్పవచ్చును ? అనుదానికి ప్రత్యుత్తరముగా ఈ శ్లోకములో "హేతుఫలములు గలవని దృఢమైన విశ్వాసముతో వాని ననుసరించిన వానికా హేతుఫలములు క్రమబద్ధముగానే గోచరించును." అని చెప్పబడియున్నది.

"నేను కేవలము కార్యకర్తను. ఈ పాప పుణ్యములు నావి. తత్ఫలితముగా నేనేదో ఒక జీవినై జన్మించి యీ పాప పుణ్యములను అనుభవించవలెను." అని మానవుడు భావించుచున్నంతకాలము అతడాయా జన్మలెత్తి తత్ఫలము లను అనుభవించుచున్నాడు. "నీవు భావించినట్లే నీవగుదువు." కాని వివేకఫలముగా ఈ మిథ్యావిశ్వాసము లంతమొందిన జన్మహేతువగు పుణ్యపాపములకు తత్తదనుభవములకు అతడు లొంగిపోడు. ఈ సందర్భములో నితరదేశవిషయ మెట్లున్నను ముఖ్యముగా భారతీయులు శకునముల నెక్కువగా నమ్మి వారై తత్ఫలములనుకూడ యనుభవించుచున్నారు. అట్టి నమ్మకములేనివారు ఆ శుభాశుభ శకునములవలన నెట్టి ఫలము లను అనుభవించుట లేదు.

కా॥ యావద్ధేతు ఫలావేశః సంసారస్తావదాయతః ।
క్షీణే హేతుఫలావేశే సంసారం న ప్రపద్యతే ॥ ౫౬

ఈ హేతుఫలములయందు విశ్వాసమున్నంత వరకు జనన మరణరూప సంసారచక్రము ఉండనే ఉన్నది. ఇట్టి హేతుఫలాభినివేశము నశించగానే యీ సంసార చక్రము కూడ ఉండదు.

హేతుఫలావేశముచే మనకు వచ్చిన నష్టమేమి? అనిన అట్టి విశ్వాసమున్నంతవరకు వికారము, విచారము, నాశము, మరణము, ఇత్యాది రూప సంసారమునకు మనము లోనగు చున్నాము. భౌతిక ప్రపంచముపైనను, మనోబుద్ధుల పరిధి లోను తమకు సంపూర్ణ అధికారమున్నప్పటికిని ఆధ్యాత్మిక

సాధకు లిట్టి అభ్యంతర అశాంతినుండి విముక్తులగుటకు పాటు పడవలసియే యున్నది. ఇట్లు గాఢముగా నాటుకొనిన, నామ రహితమైన పోరాటము వలని బాధయే ఆధ్యాత్మిక అశాంతి యనబడుచున్నది. సాధకుడు తన పరిణతిలో నిశ్చితమైన యభివృద్ధిని, పవిత్రతను చెందునపుడు, అంటువ్యాధివంటి యీ అశాంతి బయలువెడలుచున్నది.

పరిణతినొందుటకై ఆంతరికముగా పాటుపడువానికి, తన పరిపూర్ణతాయాత్రను ముగించి, శాంతి సామ్రాజ్యమును చేర్చుటకు ఇట్టి వేదాంత సిద్ధాంతములు క్రమశిక్షణములు కలిసి ఆతనికి ఆధ్యాత్మిక చికిత్సలై మార్గదర్శకములుగా నున్నవి. ఇట్టి ఆధ్యాత్మిక అశాంతితో హృదయము కొట్టు కొనుచున్నంతవరకు, హేతుఫలాభినివేశముతో తన్ను తాను బంధించుకొనుచున్నంతవరకు, ఈ మన హృదయము తన అస్తిత్వమును గుఱించి విచారించుచునే యుండును.

దేశకాల కారణక్షేత్రములోనే మనస్సు పనిచేయ గలదని మనమిదివరకే కనుగొంటిమి. దృఢమైన యీ మూడు తత్త్వములును మనస్సనెడి అట్టమేడ కట్టుటకు రాతి పునాది వలె యున్నవి. శాస్త్రజ్ఞానము ద్వారాను, యుక్తి హేతువుల చేతను సంస్కరింపబడి, వివేకము కలిగి నట్టి మనస్సునకు, ఈ దేశకాలములు పరస్పర సాపేక్షకములనియు, సదా మారు చుండునవనియు తెలియగలదు. పదార్థీకృత ప్రపంచమును పరిశీలించి, విశ్లేషించి సేకరించుటలో శిక్షణపొందిన మన బుద్ధి యీ హేతువాదములోని లోపములను బోధించుటకు సాధనము కాజాలదు. అశాంతిని పొంది జాగృతమైన బుద్ధి

గల సాధకులకు ఈ హేతువాదములోనుండి సమ్యగ్గోచరములు కాని లోపములను ఎత్తిచూపుటకై గౌడపాదుడిచట తన గ్రంథములో ఎక్కువ భాగమును వినియోగించుచున్నాడు. ఒకవ్యక్తి శాస్త్రపాఠము ద్వారాను, మననిధి ధ్యాసల ద్వారాను, హేతువాదము కేవలము మిథ్యయని యంగీకరించినయెడల, తదనంతరము యీ మనఃపరిధిని తేలికగా దాటి యతడు పైకి పోగలుగుచున్నాడు.

ఇట్లు మనస్సును అధిగమించిన అదియే ఆత్మ తనను తాను తెలిసికొను జాగృతిక్షణమై యున్నది. మనస్సును పటాపంచలు చేసిన జీవుడుకూడ అంతరించును. జీవుడు అంతరించిన వెంటనే ఆ పరమాత్మ అభివ్యక్త మగుచున్నది. మరణశీలియై నియమితమైన యీ ప్రత్యగాత్మ ఆ పరమాత్మ యొక్క ప్రతిబింబమే కాని ఆ పరమాత్మయే కాదు. ఏ పునాదులమీద యీ మిథ్యాభావము నిలచియున్నదో అట్టి పునాదిని కదలించినపుడు, లేదా ధ్వంసము చేసినపుడు మనస్సు అతీతస్థితిని చేరుచున్నది. మరియు, ఈ హేతుఫల సిద్ధాంతజ్ఞానము దేశకాలక్షేత్రమందు తప్ప యితరత్ర నిలువజాలదు. కావున దేశకాలములను గూర్చి తెలిసికొనుచోటనే హేతుఫలములను కూడ తెలిసికొన ప్రయత్నించుచున్నామని మనకు అవగతమగుచున్నది. ఒక ప్రత్యేకమైన కారణము నుండి ఒక కార్యము కలిగినదనిన యట్టి కారణము దేశకాలాపేక్షయా ఆ కార్యమును పరివేష్టించి యుండును. దేశకాలములు మార్పుచెందునవి, అనిత్యములు, పరస్పర సంబంధము గలవి యని తెలిసి యున్నయెడల, "చలన న్యాయ

మును అపార్థము చేసికొనుట తప్ప హేతువాదమన మరే దియు కాదు'' అని తప్పక మనము నిర్ణయించవలసివచ్చును.

ఎవడైతే స్వయముగానే హేతువాదజ్ఞానమును అంత మొందించుకొనుచున్నాడో ఆతడు పునర్జన్మమునుగుఱించి కలగనడు. అట్లు కలగనినను, వేదనాత్మకమగు మృత్యువును అందు చూచువరకు అతడు వేచియుండడు అని గౌడ పాదుడు చెప్పి ముగించుచున్నాడు. ఒకడు తన స్వప్నములో నరమాంస భక్షకుని చూచి మేల్కాంచిన ''ఆ నరమాంస భక్షకుడు తనను మరికొంతకాలము తరుముకొనుచు వచ్చిన తన గతి యేమగును?'' అని తెలిసికొన కోరడు. మరియు తానా స్వప్నమును మరికొంతకాలము చూచుటకుకూడ అభి లషించడు. హేతువాదమందు గల అంధవిశ్వాసము సడలిన యతడు తన జీవితములో తానార్జించిన దుఃఖములచే కలత చెందడు.

కా॥ సంవృత్యా జాయతే సర్వం శాశ్వతం నాస్తి తేనవై ।
సద్భావేన హ్యజం సర్వ ముచ్ఛేద స్తేన నాస్తివై ॥ ౫౭

అజ్ఞానముచేత యీ జన్మజ్ఞానము కలుగుచున్నది. అది కేవలము అజ్ఞానముచే కలిగినది కావున వాస్తవములో శాశ్వతమైనదేదియు లేదు. అన్నియు నా పరమాత్మలో ఐక్యము పొందియున్నవగుటచేత ఏదియు జన్మించలేదు కావుననే ఏదియు నశించజాలదు.

జనన మరణరూప సంసార చక్రమునుగూర్చి చెప్పిన పూర్వశ్లోకములోని భావముపై యిచట ఒక పూర్వపక్షి

మైన యీ వస్తుప్రపంచముగాని ఆంతరికమైన భావప్రపంచము గాని ఆ ఆత్మయందు లేదనియు ఈ రెండింటిని గ్రహించి తెలిసికొనువాడే ఆ పరమాత్మ యనియు ఘోషించుచున్నారు. అట్టి పరమాత్మ అజము, సర్వవ్యాపి, సదా సమము అగు చున్నది. ఈ జనన మరణరూప సంసారచక్రము అజ్ఞానులకు ఉన్నదే కావున వారికి యీ కార్యకారణభావము విశ్వాస ముతో పనిచేయుచున్నది. ఆ పరమాత్మదృష్ట్యా జ్ఞాని యీ ప్రపంచజ్ఞానమే లేనివాడై ఆత్మానుభవముమాత్ర మున్నదని నొక్కి వక్కాణించుచున్నాడు. సంగ్రహించి చెప్పిన యీ జనన మరణములు సంబంధాపేక్షయా సంభవించుచున్నవి. జ్ఞాని సమస్త ప్రపంచమును అద్వైతమైన యీ పరమాత్మ గానే యనుభవించుచున్నాడు. కావున యాతడు దేని యందును నాశమును చూడడు. ఈ హేతుఫలములు, జనన మరణములు, ఇత్యాది మనోభావములయొక్క ఉనికిని, తన్నాశముండుట సంభవమని కూడ అతడు గ్రహించ జాలడు.

కా॥ ధర్మా స ఇతి జాయన్తే జాయన్తే తే న తత్త్వతః ।
జన్మ మాయోపమం తేషాం సా చ మాయా నవిద్యతే ॥ ౫౮

ప్రత్యేక వ్యక్తిత్వముగల యీ జీవులు జన్మించిరని చెప్పుచున్నారు. ఆ పరమాత్మదృష్ట్యా వాస్తవముగా జన్మయే అసంభవమై యున్నది. కావున జన్మ యనునది మిథ్యాపదా ర్థమువలె యున్నది. అట్టి మాయకూడ వాస్తవములో లేనిదే మై యున్నది.

పూర్వశ్లోకములో నానాత్వ విశిష్టప్రపంచము లేదని రుజువుపఱచియు గౌడపాదుడీ ప్రపంచ భావమునకు కారణమును కూడ దయతో చెప్పియున్నాడు. ఈ ప్రపంచ భావనకు అజ్ఞానమే కారణ మగుచున్నది. ఈ వస్తుప్రపంచము వాస్తవములో ఉద్భవించనప్పటికిని యది యుద్భవించినట్లగ పడుచున్నదని యీ శ్లోకములో మరల చెప్పుచున్నాడు. అటు వంటప్పుడు జ్ఞానముకంటె భిన్నముగా అజ్ఞాన మనునదొకటి తప్పనిసరిగా నున్న దేమోనని సహజముగానే శిష్యుని హృదయములో ఒక సందేహము కలుగవచ్చును. అట్టిది లేదని దృఢముగ చెప్పుటకే ఆ మాయ యను నదొకటి అసలు లేనే లేదని యిచట గౌడపాదుడు చెప్పుచున్నాడు. ఇట్లు వస్తు ప్రపంచము "మాయాసృష్టమైన మాయ అభావసృష్టమైన అభావము" అగుచున్నది. కావున యీ జగత్తు వంధ్యాపుత్రుని ప్రథమ పుత్రికవంటి సత్యత్వమే కలిగియున్నది. ఆమె యొక్క వివాహ మహోత్సవము అత్యంత అసంభవమే యగుచున్నది. ఆమె తండ్రియే అజాత మిథ్యామూర్తియై యున్నాడు!!

కా॥ యథా మాయా మయాద్బీజా జ్ఞాయతే తన్మయోఽఙ్కురః।
నాసౌ నిత్యో న చోచ్ఛేదీ తద్వద్ధర్మేషు యోజనా ॥ ౫౯

ఐన్ద్రజాలికుడు మాయచేత సృష్టించిన విత్తునుండి అట్టి మాయాంకురమే మొలకెత్తుచున్నది. అట్టి మొక్క శాశ్వతము కాదు. జీవులుకూడ అట్టివారే యగుచున్నారు.

మాయ యనునదే వాస్తవములో లేనిదైన యట్టి మాయ మరియొక మాయాప్రపంచమును ఎట్లు సృష్టించ గలదు ? అని శిష్యుడు సందేహించవచ్చును. ఇట్టిదానిని యొక యుదాహరణనిచ్చి వివరించుచున్నాడు. భారతదేశములోని బజారువీధులలో సాధారణముగా తఱచు గారడీవిద్య చూప బడుచుండును. ఆ గారడీవాడు తన మాయచే యొక విత్తును ముందు సృష్టించి మనకు చూపించుచున్నాడు. దానిని భూమిలో పాతి నీళ్ళుపోసి ఒక బుట్టను దానిపైని కప్పు చున్నాడు. కొన్ని క్షణముల తరువాత అతడా బుట్టను పైకె త్తుచున్నాడు. ఆశ్చర్యము ! ఆ విత్తునుండి యొక మొక్క మొలచినట్లు ప్రజలు చూచుచున్నారు. అతడా మొక్కకు నీళ్ళుపోసి మరల బుట్టను మూతవేయుచున్నాడు. కొన్ని క్షణముల పిమ్మట ఆ బుట్టను తీయుచున్నాడు. ప్రజలాశ్చర్య ముతో తికమకపడుచున్నారు. అందు ఏమున్నది ? ఆ మొక్కకు కొమ్మలు పెరిగి దానినిండ పండ్లు వ్రేలాడు చున్నవి ! ! మూడవసారి యా యైంద్రజాలికు డా బుట్టను మొక్కపై మూయుచున్నాడు. ఏమైనది ? ఆ బుట్టనతడు పైకి తీయగానే ఆ పండ్లు మొక్కక్రింద నేలపై రాలియున్నవి! ఆ గారడీవాడు ఒక పండునుతీసి దానిని కోసి యా పండు ముక్కలను అచటి ప్రజలకు ఇచ్చుచున్నాడు. ఏమని చెప్పు దుము ! ఆ పండు ముక్క వాస్తవమైన మామిడిపండు రుచియే కలిగియున్నది ! !

మాయకు ఏదైనను సంభవమే యని చెప్పుటకొఱకు ఈ యుదాహరణను వేదాంతి చూపుచున్నాడు. స్వప్నములోని

మిథ్యా వివాహము అట్టి పుత్రులనే పుట్టించగలదు. అట్లే ఒక మాయ మరియొక మాయను సృష్టించగలదు. ఆ మాయ అజ్ఞానముకంటె వేరుకాదు. అది యట్టి ప్రపంచమును సృష్టించ గలదు. ఈ స్వప్నరూపమైన ఉదాహరణను రాబోవు రెండు శ్లోకములలో విపులముగా వివరించుచున్నాడు.

కా॥ నాజేషు సర్వధర్మేషు శాశ్వతాశాశ్వతాభిధా ।
యత్ర వర్ణా న వర్తన్తే వివేకస్తత్ర నోచ్యతే॥ ౬౦

శాశ్వతమైనది, అశాశ్వతమైనది యను విశేషణములు అజమైన జీవులకు అనువర్తించజాలవు. ఏదైతే పదములచే వర్ణింపశక్యము కాదో దానిని సత్యమైనదనిగాని, అసత్యమైన దనిగాని బుద్ధి వివేకించి చెప్పజాలదు.

ఇంద్రియములచేత తెలిసికొనబడి మనస్సుచేత గ్రహింపబడు ఈ ప్రపంచము మిథ్యయైనయెడల అటుపిమ్మట అది సత్యమా, అసత్యమా అను సందేహామే యుద్భవించ జాలదు. స్వప్నములోని పుత్రుల జాతకమును వ్రాయించను అవసరము లేదు. తత్ఫలితమును అడుగను పనిలేదు కదా! వారు మాయచే సృష్టింపబడినవారగుటచే వారి భవిష్యత్తును గుఱించి మనము విచారించనవసరములేదు. ఇట్లు ఉదాహరణ ద్వారా ప్రపంచముయొక్క మిథ్యాత్వమును స్పష్టముగా తెలిసికొనినపిమ్మట వివేకముగల వేదాంతవిద్యార్థికి అది సత్యమా అసత్యమా, శాశ్వతమా, అశాశ్వతమా యనెడి సందేహామే కలుగదు.

ప్రపంచము మిథ్యయని యనుభవముచే తెలిసికొనిన పిమ్మట వివేకము అంతమొందుచున్నది. ఒక వ్యక్తికి యీ ప్రపంచము సత్యమని తోచుచున్నంతవరకు అసత్యమునుండి సత్యమును, మిథ్యనుండి తత్త్వమును పరిశోధించుటకై యతని వివేకము శ్రమపడవలసియున్నది. ఆ పరమాత్మను తెలిసికొనినయెడల యీ వివేకముతో మరి పనిలేదు. త్రాడు యొక్క జ్ఞానము కలిగిన తరువాత అది త్రాడా ? లేక పామా? యని వివేకించు శ్రమ యతనికి లేదు. వాస్తవములో త్రాడును, త్రాడుగా చూచుచున్నవానికి ఆ పాముయొక్క పడగ భయమును కలిగించజాలదు. దాని బుసలు బాధను కలిగించజాలవు.

కా|| యథా స్వప్నే ద్వయా భాసం చిత్తం చలతి మాయయా ।
తథా జాగ్రద్వయా భాసం చిత్తం చలతి మాయయా ।। ౬౧

స్వప్నములో మనస్సు ద్విధావిభక్తమై తాను పని చేయుచున్నట్లును, తానే వివిధదృశ్యములను చూచుచున్న ట్లును ఎట్లు భ్రాంతి చెందుచున్నదో, అట్లే జాగ్రదవస్థలో కూడ మనస్సు మాయద్వారా పనిచేయుచున్నదై నానా రూపములను చూచుచున్నది.

కా|| అద్వయం చ ద్వయాభాసం చిత్తం స్వప్నే న సంశయః।
అద్వయం చ ద్వయాభాసం తథా జాగ్రన్న సంశయః।। ౬౨

మనస్సు ఒక్కటే యైనప్పటికిని స్వప్నములో వివిధ ముగా విభక్తమగుచున్నదని మనకు నిస్సంశయముగా తెలి

యును. అట్లే జాగ్రదవస్థలోకూడ ఒకే మనస్సు వివిధముగా విభక్తమైనట్లు నిశ్చయముగా గోచరించుచున్నది.

ఈ పై రెండుశ్లోకముల భావమును మూడవ అధ్యాయములో 29, 30 వ శ్లోకములలో యిదివరకే చర్చించితిమి. విద్యార్థుల సౌకర్యమునకై, మరియు వారు విషయమును బాగుగా అర్థముచేసికొనుటకై యుక్తమైన సందర్భమని యిచట యీ శ్లోకములు మరల పేర్కొనబడినవి.

కా॥ స్వప్నదృక్ ప్రచరన్ స్వప్నే దిక్షు వై దశసు స్థితాన్ ।
అండజాన్ స్వేదజాన్ వాపి జీవాన్ పశ్యతి యాన్ సదా॥ ౬౩

ఒకడు తాను స్వప్నములోనున్నంతకాలము, స్వప్నములోని అండజములు, స్వేదజములు మొదలైన జీవులను చూచుచున్నాడు. మరియు తాను దశదిశలందు సంచరించుచున్నట్లుకూడ ఆ స్వప్నములో చూచుచున్నాడు. తాను చూచినవన్నియు అతనియొక్క మనోభావములే కావున యీ జీవులకు అతని మనస్సుకంటె భిన్నమైన అస్తిత్వము లేదు.

స్వప్నములో చూచు తనయొక్క దారాపుత్రాదులు మాత్రము తనయొక్క మనోభావనలుకావు. స్వప్నములో దశదిశలందు, తాను చూచు ప్రతివస్తువు, ప్రతిజీవియు మనస్సుయొక్క భావనామాత్రమే యగుచున్నది. ఇట్లు స్వప్నములో చూచు ప్రతి జీవియు అతని మనస్సునుండియే యుద్భవించునట్లు జాగ్రదవస్థయందలి ప్రతి యనుభవమును మనఃకల్పితమే యగుచున్నది.

కా॥ స్వప్నదృక్చిత్త దృశ్యాస్తే న విద్యన్తే తతః పృథక్ ।
తథా తద్దృశ్యమే వేదం స్వప్నదృక్చిత్త మిష్యతే ॥ ౬౪

స్వప్నద్రష్టచూచు మనోగోచరములగు యీ వస్తు కేంద్రములకు మనస్సుకంటె భిన్నమైన స్వతంత్ర అస్తిత్వము మరియు స్వప్నద్రష్టయొక్క మనస్సుకూడ ఆ స్వప్నస్థుడు గ్రహించు విషయము మాత్రము అయి యున్నదని యంగీకరించితిమి. కావున ఆ స్వప్నద్రష్టయొక్క మనస్సు అతనికంటె భిన్నము కాదు.

ఈ నానారూప వస్తుప్రపంచమంతయు భ్రాంతిలో నున్న మనస్సుచే సృష్టింపబడినవని మన మిదివఱకే తెలిసికొంటిమి. స్వప్నావస్థకును జాగ్రదవస్థకును గల పోలిక యీ శ్లోకములో పూర్తిగా నిరాకరింపబడినది. తత్ఫలితముగా అందుండు మహత్తర భావములను కనుగొనుచున్నాము.

స్వప్నములోనుండు ప్రపంచమంతయు ఆ స్వప్నద్రష్టయొక్క మనస్సుకంటె వేరైనది కాదు. ఆ స్వాప్నికమైన భావనలే స్వప్నద్రష్టయొక్క మనస్సై యున్నది. దీనిని వివరించెదను. నేను కలగనుచున్నాను. నేనా స్వప్నములో చూచు పదార్థములన్నియు నా మనస్సుకంటె భిన్నమైనవి కావు. స్వప్నమును చూచు నా మనస్సుచేత సృష్టింపబడిన నేను సంచరించుచున్నాను. ఆ స్వప్నములో సంచరించు 'నేను' కూడ నా మనస్సుకంటె వేరేదియు కాదు. స్వప్నములోని యిట్టి 'నేను' నా యొక్క స్వప్నానుభవముల ననుభవించుటకై ఒక మనస్సు గలదై యున్నది. అట్టి నాలోని మనస్సు

కూడ నా యొక్క స్వప్నసంబంధమైన మనస్సేగాని మరి యొకటి కాదు, కావుననే నాకు భ్రమ కలుగుచున్నది.

నా లోని స్వప్నసంబంధమైన యిట్టి మనస్సు స్వయముగా కల్పితమైనదే యగుటచేత అది యట్టి కల్పితవస్తు ప్రపంచమునే సృష్టించగలదు. అందుచేతనే మనము స్వప్నమంతయు కేవలము మనోలీలామాత్రమే యని నిర్ణయించుచున్నాము. స్వప్నమిట్లు కల్పితమైనప్పుడు జాగ్రదవస్థ యింతకంటె భిన్నము కాజాలదు. స్వప్నద్రష్టయొక్క మనస్సు స్వప్నస్థునికంటె యద్విధముగాను భిన్నమైనది కాదు.

కా॥ చరన్ జాగరితే జాగ్రద్దిక్షు వై దశసు స్థితాన్ ।
అండజాన్ స్వేదజాన్వాపి జీవాన్పశ్యతి యాన్సదా ॥ ౬౫

కా॥ జాగ్రచ్చిత్తేక్షణీ యాస్తే న విద్యన్తే తతః పృథక్ ।
తథా తద్దృశ్యమేవేదం జాగ్రతశ్చిత్త మిష్యతే ॥ ౬౬

అండజ స్వేదజాది సమస్త జీవులును, దశదిశలందు తాను సంచరించుటయు, ఇత్యాది సమస్తదృశ్యములును జాగ్రదవస్థయందలి విశ్వుని మనోవిషయములే యగుచున్నవి. అదేవిధముగా మనస్సుకూడ జాగ్రదవస్థయందలి విశ్వునికి గోచరించు విషయము మాత్రమే యగుచున్నది. కావున గ్రహించువానికంటె వాని మనస్సు వేరైనది కాదు.

ఇంతకుముందే వివరించిన రెండు శ్లోకములను జాగ్రదవస్థాభిమానియగు విశ్వునికి యనువర్తించునట్లు ఇచట చెప్ప

బడియున్నవి. తైజసుని యనుభవములకంటె విశ్వుని యను భవములు యద్విధముగను వేరైనవి కావు అని చెప్పుటకే మరల యీ పై విధముగ ఇచట చెప్పబడినది. వైతథ్యప్రక రణములో వివరించినదానిని తెలిసికొనిన పిమ్మట ఈ యుదా హరణము అతి యుక్తముగాను, సత్యముగాను, మిక్కిలి వివ రింపబడినట్లును ఉన్నది.

కా॥ ఉభౌహ్యాన్యోన్య దృశ్యేతే కిం తదస్తీతి నోచ్యతే ।
లక్షణా శూన్యముభయం తన్మతేనైవ గృహ్యతే ॥ ౬౭

మనస్సు, యీ జీవులు రెండును పరస్పరగ్రాహ్య విష యములై యున్నవి. కావున నితరాపేక్షయా ఏది స్వతం త్రమై యున్నది ? ఒకటి లేక మరియొకటి తెలిసికొనలేక పోవుటచే ఈ రెండింటికిని ఇతరమునుండి వేరుచేయు ప్రత్యేక లక్షణము లేవియు లేవు.

మనమందరము ఒక్కొక్క యనుభవ క్షేత్రములో ఒక్కొక్క ప్రత్యేక వ్యక్తులుగా నున్నాము. కర్తకు ఆ యా విషయములతో ఒక విధమైన సంబంధము కలిగినపుడే యను భవములు కలుగుచున్నవి. జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అను నీ మూడును ఒకే దేశకాలములందు పనిచేయకున్న, ఒక ప్రత్యేక వ్యక్తియొక్క మనస్సునకు జీవితవ్యవహారములు చేయుట అసంభవమగుచున్నది.

శబ్దస్పర్శ రూపరసాది – ఇంద్రియ విషయములద్వారా మనస్సు సదా ప్రేరేపింపబడుచున్నది. కావున విషయము లను గ్రహించునది మనస్సు అగుచున్నది. ఇట్టి మనస్సుచే

మనము విషయప్రపంచమును గ్రహించుటచే అది సత్యమని నమ్ముచున్నాము. గ్రహించునది, గ్రహింపబడు విషయ ముండిననే ఉండగలదు. విషయములు గ్రహింపబడుటచే అవి సత్యమగుచున్నవి. ఇట్లు గ్రహించు మనస్సునకు గ్రహింప బడు విషయములకు పరస్పర సంబంధమున్నదని మనకు తెలి యుచున్నది. మనస్సు లేకున్న వస్తుప్రపంచములేదు. ఎక్కడ వస్తుప్రపంచము లేదో అక్కడ మనస్సులేదు. ఇట్లు గ్రహింప బడు వస్తువు గ్రహించు మనస్సుకూడ పరస్పర సంబంధముం డుటచేతనే ఉంటున్నవి కావున వానిలో ఏది సత్యమని మనము చెప్పగలము? అందుచే వివేకులు ఈ రెండును సత్యములు కావని చెప్పుచున్నారు. జ్ఞాతకుగాని, జ్ఞేయము నకుగాని, జ్ఞానమునకుగాని స్వతంత్రమైన సత్యత్వములేదు. అవి పరస్పర సాపేక్షకములగుటచే నా మూడును సత్యములు కావు. గ్రహించువానిని గ్రహింపబడు విషయమునుండి వేరు చేయుటకు అట్టి ప్రత్యేక లక్షణము లేవియు అతనికి లేవు. తమను గ్రహించు మనస్సు లేనప్పుడు ఆ విషయములు అస్తిత్వము లేకున్నవి. అట్టి అస్తిత్వములేని విషయములను గ్రహించు మనస్సు ఆ విషయములచేత సృష్టింపబడినదని చెప్పజాలము కదా!

ఇట్లా ఇంద్రియవిషయములను గుఱించి యోచించు కొలది అవి మనస్సుకంటె భిన్నము కావని మనము నమ్మ వలసివచ్చుచున్నది. శబ్దస్పర్శాది విషయములు వానిని గ్రహించు శ్రోత్రాది ఇంద్రియములకంటె భిన్నములుకావు. కావున మనస్సు కేవలము యింద్రియములకు కేంద్ర

బిందువై యున్నది. అట్లగుటచే నింద్రియములు మనస్సు యొక్క కల్పనలే యనియు, ఇంద్రియవిషయములు బాహ్య విషయమందు ప్రవర్తించు ఇంద్రియములకంటె భిన్నములు కావనియు జ్ఞానులు చెప్పుచున్నారు. ఎదుట నేనొక పుష్పమును చూచుచున్నాను. ఆ పుష్పముయొక్క ఆకారము నా మనస్సులోని దృశ్యముకంటె వేరుకాదు. మరియు నా మనో దృశ్యము నా మనస్సుకంటె భిన్నముకాదు. మనస్సుచేత మాత్రమే విషయములు గ్రహింపబడుచున్నవి. అట్టి విషయములు మనపై తమ ప్రభావము చూపునపుడే మన మనస్సు అస్తిత్వము కలిగియున్నది.

కా॥ యథా స్వప్నమయో జీవో జాయతే మ్రియతేఽపి చ ।
తథా జీవా అమీ సర్వే భవన్తి న భవన్తి చ ॥ ౬౮

కా॥ యథా మాయామయో జీవో జాయతే మ్రియతేఽపిచ ।
తథా జీవా అమీ సర్వేభవన్తి న భవన్తిచ ॥ ౬౯

కా॥ యథా నిర్మితకో జీవో జాయతే మ్రియతేఽపి వా ।
తథా జీవా అమీ సర్వేభవన్తి న భవన్తి చ॥ ౭౦

68. స్వప్నములో జీవులు కనబడి మాయమగునట్లే జాగ్రదవస్థలో కనబడు జీవులు కూడ కనబడి మాయమగుచున్నారు.

69. మాయచే సృష్టింపబడిన జీవులు బయల్వెడలి అంతర్హితమగుచునట్లు జాగ్రదవస్థలోని జీవులు బయల్వెడలి అంతర్హితమగుచున్నారు.

70. చేతితో నిర్మింపబడిన నకిలీ జీవులు కనబడి అంతర్ధానమునందున్నట్లే జాగ్రదవస్థలోని జీవులు కూడ కనబడి మరుగుపడుచున్నారు.

"మార్పుయొక్క క్రమము" "జననమరణ సిద్ధాంతము నటించు భ్రాంతినాటకము" అను నీ రెండును తమ ప్రణాళికలను కనబఱచుచున్నవి అని దృఢపఱచి యీ పై మూడు శ్లోకములలో చెప్పుటకు గౌడపాదుడు ప్రయత్నించుచున్నాడు. ఈ దృశ్యాదృశ్యములన్నియు స్వప్నములోగాని, ఇంద్రజాలములోగాని, జాగ్రదవస్థలోగాని సమముగనే యున్నవి. సాధారణముగా మనకు గలుగు మూడు విధములైన భ్రాంతులను చెప్పుటకై మూడుశ్లోకములుపయోగింపబడినవి. అట్టి భ్రాంతివల్లనే యీ జాగ్రదవస్థయందలి ప్రపంచముకూడ మిథ్య యగుచున్నది యని యా శ్లోకార్థములు ఒత్తిపలుకుచున్నవి.

సాధారణ మానవుడు కూడ సత్యమని యంగీకరింపని, లేదా సత్యమని భావించనుకూడ భావించని సుఖదుఃఖాత్మకమగు దృశ్యప్రపంచమే స్వప్నమగుచున్నది. ఇంద్రజాలకునిచే సృష్టింపబడిన యేనుగుకూడ సత్యమని నమ్మజాలము. కాని యట్టి యేనుగు కనబడినపుడు దానిని అభినందించము. అది మాయమగునపుడు విచారించము.

మణి మంత్రౌషధాదులచే సృష్టమైన వస్తువులన్నియు అసత్యములగుటచే భూతము గాలిలో లీనమైపోయినట్లు ఈ కల్పితవస్తువులుకూడ నశించుచున్నవి. ఇట్లు స్వప్న, మాయా,

మంత్రాదులచే సృష్టమైన వస్తుప్రపంచముకంటె మన జీవితములో చూచు యీ బాహ్యప్రపంచ మేమాత్రము సత్యము కాదని నిరూపించి, విద్యార్థికి బోధించుటకై యిచట నీ మూడు ఉదాహరణలను చూపుచున్నాడు.

బాహ్యప్రపంచమందు జనన మరణాద్యవస్థలు గలిగినట్లు మనచే గ్రహింపబడు సమస్త నామరూపములును మనస్సుచేత విషయీకృతములే యగుచున్నవి. వానికి ప్రత్యేకమైన సత్తా లేదు. అవి ఆ పరిపూర్ణతత్త్వమును కలిగి యుండలేదు.

కా॥ న కశ్చిజ్జాయతే జీవః సంభవోఽస్య న విద్యతే ।
ఏతత్తదుత్తమం సత్యం యత్ర కించిన్న జాయతే ॥ ౭౧

ఎట్టి జీవుడును ఎప్పుడును జన్మించలేదు. అట్టి జన్మకు ఎట్టి కారణమున్ను లేదు. ఎప్పుడును ఏదియు జన్మించలేదనుటయే ఉత్తమ సత్యమై యున్నది.

మూడవ అధ్యాయములోని 48 వ శ్లోకమే యిచట మరల పునరుక్తమైనది. గౌడపాదుని సిద్ధాంతములోని సారాంశమే యిట్టిది. విద్యార్థిగా బాగుగా సరియైన పద్ధతిలో గ్రహించుటకై అపరిచితమైన ఆ పరమాత్మ తత్త్వమును స్థాపించునట్టి ఉపదేశగ్రంథములో పునరుక్తి యొక దోషము కాదు. ఈ శ్లోకముయొక్క వివరణమునకై మూడవ అధ్యాయములోని శ్లోకవివరణను చూడుడు.

కా॥ చిత్తస్పందితమేవేదం గ్రాహ్యగ్రాహకవద్ద్వయం ।
చిత్తం నిర్విషయం నిత్యమసంగం తేన కీర్తితం ॥ ౭౨

జ్ఞాతృజ్ఞేయ సంబంధముతోను, గ్రాహ్యగ్రాహక సంబంధముతోను లక్షితమైన యీ ద్వైతప్రపంచము కేవలము చిత్తముయొక్క స్పందనము వలన కలిగినదే యగుచున్నది. మనస్సు వాస్తవములో ఎట్టి వస్తువుతోను సంబంధము కలిగియుండలేదు. కావున అది నిత్యమని చెప్పబడుచున్నది.

మనస్సునకు విషయములకు గల సంబంధఫలితముగా గ్రహించబడు ఈ ప్రపంచము కేవలము మనఃకల్పితమే యని మనమిదివరకు చర్చించినదానిని బట్టి నిస్సంశయముగా తేలినది. ఆ మనస్సు స్వయముగా అస్తిత్వము లేకపోవుటచేతను, ఆ మనస్సు ఆత్మయందారోపితమగుటచేతను, పరమాత్మదృష్ట్యా ఆ మనస్సే మిథ్యయగుచున్నది. స్వయముగా అస్తిత్వము లేని యీ మనస్సు ఆత్మకంటె భిన్నమైనది కాదు కావున, ఆ మనస్సునకు విషయములతో ఎట్టి సంబంధమును ఉండజాలదు. కావున వేదాంతులు ఆ మనస్సు నిర్విషయము, నిత్యము, అసంగము అని చెప్పుచున్నారు. త్రాడు దృష్ట్యా పామునకు విషముగాని, బాటసారులను భయపెట్టు సామర్థ్యముగాని లేదు కదా !!

కా॥ యోఽస్తి కల్పితసంవృత్యా పరమార్థేన నాస్త్యసౌ ।
పరతంత్రాభి సంవృత్యా స్యాన్నాస్తి పరమార్థతః ॥ ౭౩

కల్పితమైన మాయ దృష్ట్యా ఉండునది వాస్తవములో లేనిదే యగుచున్నది. ఇతర మతస్థుల దన్నుతో ఏదైతే 'ఉన్నదో' అదికూడ పరమార్థములో లేనేలేదు.

సంభావ్యమైన ప్రతివాదియొక్క ఆక్షేపణకు ఈ శ్లోకములో గౌడపాదుడు ప్రత్యుత్తరమిచ్చుచున్నాడని శ్రీ శంకరాచార్యులు తమ భాష్యములో చెప్పియున్నారు. "మనస్సునకు బాహ్యవస్తుప్రపంచముతో నెట్టి సంబంధమును లేదు కావున ప్రపంచమంతయు లేనిదే యని వేదాంతి చెప్పినయెడల, గురువు శిష్యుడు, బోధనగ్రంథము ఏదియు లేకుండగనే యుండవలయును కదా ?" అని ప్రతివాది యొక్క సందేహము. విషయమును స్పష్టముగా వివరించుచు అట్టి సందేహమును ఇచట నివారించుచున్నాడు.

ఆ పరమాత్మదృష్ట్యా ఆత్మానందము ననుభవించు క్షణమున గురువు శిష్యుడు శాస్త్రగ్రంథముకూడ కేవలము మనోభ్రాంతియే యగుచున్నది. అయితే మనస్సులోని కోట్ల కొలది అపవిత్రభావనలమధ్య అవి పవిత్ర భావనలగుటచేతనే అవి శాస్త్రములచే ప్రశంసింపబడి, జీవితములో గౌరవింపబడి ఆదరింపబడుచున్నవి. ఇది ఆత్మరక్షకమగు కల్పనయై యున్నది. స్వప్నములోకూడ మనను అధికతర చైతన్యము లోనికి మేల్కొలుపుటకై ఒక భయంకరదృశ్యము స్వాయముగా సమర్థమగుచున్నది కదా. ఇట్లే మనోవ్యాపారములలో కెల్ల తీవ్రమైనదగు ధ్యానమందు కాలక్రమమున అజ్ఞానాంధకారమునుండి మనస్సును జార్చి ప్రకాశవంతమగు వివేక క్షేత్రములలో దానిని విహరింపజేయుటలో శాస్త్రాధ్యయనము ముఖ్యమైనదని చెప్పవచ్చును.

కోట్ల కొలది మతములు ఆ బ్రహ్మతత్త్వమునకు వ్యతిరేకముగా నొకతత్త్వమున్నదని యెంతగా చెప్పినను అసత్య

మెన్నటికిని సత్యము కాజాలదు. తనను సమర్థించువారు న్నారు కదా యని యాతత్త్వము నిలుచుటలేదు. మరియు మనయొక్క (Majority) బహుళాభిప్రాయము వ్యతిరేక ముగా నున్నదని ఆతత్త్వమును ధ్వంసము చేయనులేము. ఈ ఆత్మసామ్రాజ్యములో ప్రజాపాలన పనిచేయదు !! మనము దానికై మన వోటును వేసినను వేయకున్నను ఆ తత్త్వము మనను పాలించుచునే యున్నది.

కా॥ అజః కల్పిత సంవృత్యా పరమార్థేన నాప్యజః ।
పరతంత్రాభినిష్పత్త్యా సంవృత్యా జాయతే తు సః ॥ ౭౪

మాయాకల్పితమైన ద్వైతనందిన యనుభవముల దృష్ట్యా ఆ ఆత్మ అజమగుచున్నది. పరమార్థములో ఆత్మ అజము కూడ కాదు. ఇతరమతస్థులదృష్ట్యా అజమైన యట్టి ఆత్మ కూడ జాతమైనట్లుగపడుచున్నది.

పూర్వశ్లోకములో పూర్వపక్షము చేసిన వైశేషిక వాదులు మరికొంత గట్టిగా వాదించువారై పూర్వశ్లోకమం దలి వేదాంతుల ప్రత్యుత్తరముపై మరియొక సమస్యను లేవ నెత్తుచున్నారు. "శాస్త్రపాఠములు మొదలైనవి యసత్యమైన యా శాస్త్రములు బోధించు ఆత్మకూడ వేదాంతియొక్క భ్రాంతమైన యూహామాత్రమే అయి యుండవలెను కదా" అని పూర్వపక్షి వాదము.

శ్రీ శంకరు లిట్టి ప్రశ్నతో తమ భాష్యమును ప్రారం భించి ఈ ప్రశ్న ద్వైతులచే యడుగబడినదని చెప్పు చున్నారు. మీరుకూడ పూర్వశ్లోకార్థమును వివేకముతో

అనుసరించుచుండినయెడల మీ మనస్సులోకూడ యిట్టి ప్రశ్న తప్పక ఉదయించియుండవచ్చును. గౌడపాదుడు కూడ యీ వాదమును కాదనలేదు, పైపెచ్చు అది నిజమే యనికూడ చెప్పుచున్నాడు. ఆత్మ అజమని శాస్త్రములలో చెప్పబడినది. ఈ అజత్వము కూడ ఆత్మయందారోపితమైనదే యగుచున్నది. అజత్వలక్షణము తద్వ్యతిరేకమైన జాతిగుణము దృష్ట్యానే అస్తిత్వము కలిగియున్నది.

అజము అను పదము ఆ పరమాత్మను సూచించుటకొఱకు మాత్రమే ఉపయోగింపబడినది. గాఢమైన మాయలో జీవించుచు జననమరణరూపక్షేత్రములో వ్యవహరించుచున్న మనకు బలిష్టమై అజ్ఞాన విశిష్టమై, మనకు పరిచితమైన భాషలోనే బోధించవలెనుకదా. వాక్కు మౌనము వహించిన, ఆనందరూపమగు వివేక భాషలో మాత్రము వివరింపశక్యమైన ఆత్మతత్త్వమును వివరించుటకొఱకై శాస్త్రములు మన స్థాయికి దిగివచ్చినవో యనునట్లు అవి మనము గ్రహించి విశ్వసించుటకు అనుగుణముగా మనభాషలో భాషించుచున్నవి.

ఆ పరమాత్మయొక్క నిర్వచనములన్నియు నిట్టివే యని చెప్పవచ్చును. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "అయం ఆత్మా బ్రహ్మ" "సచ్చిదానందరూపం" అను నివన్నియు కేవలము ఆత్మను సూచించు లక్షణములేగాని, పరిపూర్ణమైన వాస్తవ ప్రతిపాదనలు కావు. ఆ పరమాత్మకు ఈ పరిమిత భాషలో చెప్పగలుగు నిర్వచనములు ఉండజాలవు. ఈ భాష భ్రాంతప్రపంచములో సంబంధాపేక్షయా యనుభవములను

వ్యక్తపఱచగలిగినది, అత్యంతము పరిమితమైనది యగుచున్నది. ఇట్లు అజాతవాదము మనకు పరిచితమైన మాయాభాషలోనే అవాఙ్మానస గోచరమైన ఆ పరతత్త్వమును గురించి చెప్పుచున్నది.

హేతుఫలవాదమును విశ్వసించు సాంఖ్యులు ఆత్మ జన్మించుచున్నదని దృఢముగా చెప్పుచున్నారు. కావున వారికి వ్యతిరేకముగా ఆత్మ అజము అని వేదాంతులు నిర్ణయించిరి. ఒక అజ్ఞానభావమును తొలగించుటకు మనము చేయు నిట్టి నిర్ణయము మరియొక అజ్ఞానపు వ్రాతకు నకలై యున్నది. అదియొక మిథ్యను నిషేధించుచున్నది కావున పరమార్థములో అదికూడ అట్టి మిథ్యయొక్క (కార్బను కాపీయే) సమ ప్రతియే యగుచున్నది. కాని వేదాంతము యొక్క ప్రభావమేమనగా తన పదములద్వారా గంభీరభావములు ప్రతిధ్వనించునట్లు అజమై పరిపూర్ణమైన ఆత్మతత్త్వమును సూచించుటయే యగుచున్నది. భాష, తదితర జ్ఞాన సాధనలుకూడ సంబంధ దృష్ట్యానే ప్రవర్తించుచున్నవి. అట్లగుటచేత ఆత్మతత్త్వమును తెలిసికొనుటకు ఆ సాధనల నుపయోగించిన ఆ ఆత్మయొక్క నైజతత్త్వము అనిశ్చితముగానే నిలిచిపోవుచున్నది.

కా॥ అభూతాభి నివేశోఽస్తి ద్వయం తత్ర న విద్యతే ।
ద్వయాభావం స బుద్ధ్వైవ నిర్నిమిత్తో న జాయతే ॥ ౭౫

ఈ మిథ్యాజగత్తు సత్యమైనదని దాని సత్యత్వముపై మానవునకొక అభినివేశము కలదు. కాని ద్వైత మచటలేదు.

భవమును పొందిన వ్యక్తి తన దివ్యానుభూతిలో యీ ద్వైత ప్రపంచముయొక్క అభావమునే చూచుచున్నాడు అనగా నిట్టిప్రపంచమును అతడు చూచుట లేదు. తనలో జన్మకారణ మగు వాసనలు లేవు గనుక ఆతనికి మరల జన్మలేదు అని ఉపనిషత్తు చెప్పుచున్నది.

అనుభవమును సంపాదించుకొనుటకునై మనస్సునకు ఇచ్చిన అవకాశమే జన్మ యనబడుచున్నది. ఆ మనస్సు తన అజ్ఞానములో తాను చేసిన పూర్వకర్మలవలనను, తాను భావించి యుద్దేశించిన విధమునను జన్మను కాంక్షించు చున్నది. ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మట నట్టి మనస్సు ఉండదు కావున అది క్రొత్తరకమైన యనుభవములను కోరదు, కాంక్షించదు, భావించదు, ప్రణాళికలను తయారుచేసి అందు ప్రవర్తించదు. అట్లు గావున ఆత్మజ్ఞాని అజ్ఞానదేశమందడుగు పెట్టనవసరము లేదు.

మనస్సును అధిగమించుట యనగా జీవుని అంతరింప జేయుట యగుచున్నది. జనన మరణములు, జయాపజయ ములు, సుఖదుఃఖములు ఇత్యాది ద్వంద్వముల ననుభవించు టకు అజ్ఞానప్రపంచము ఈ జీవునకే గలదు. ఆ జీవుడుగాని, యంతమొందిన యిక నతనికి పునర్జన్మ ఉండజాలదు. జన్మ జన్మాంతరములుగా జీవుడు చేయు జీవయాత్రయొక్క యుద్దే శము ఆత్మను కనుగొనుటయే యగుచున్నది. దాగియున్న ఆ ఆత్మ కనుగొనబడగానే యింక యీ దాగుడుమూతలాట కట్టిపోవును. నన్ను నేను ఆ పరమాత్మగా కనుగొనగానే

ఆత్మరూపమైన నాకు జనన మరణరూప కర్మఫలమే యుండదు.

కా॥ యదా న లభతే హేతూనుత్తమాధమ మధ్యమాన్ ।
తదా న జాయతే చిత్తం హేత్వభావే ఫలం కుతః ॥ ౭౬

ఉత్తమ, మధ్యమ, అధమ కారణములేవియు లేకున్న యీ మనస్సు జన్మలేనిది యగుచున్నది. కారణమే లేకున్న కార్యమెట్లుండును ?

మీమాంసకులయొక్క మతప్రకారము పూర్వ కర్మ ఫలమే జన్మకు కారణమగుచున్నది. ఒక కార్యము ప్రతి ఫలము పొందిననేగాని సంపూర్ణము కాజాలదు. కావున కర్మ ఫలము కర్మకంటె యితరమైనది కాజాలదు. ఒక సమయ ములో చేసిన కర్మ పరిణతి పొంది మరియొక సమయములో ఫలముగా మారుచున్నది.

కర్మలకు వెనుకనుండు ఉద్దేశములు, తదనుగుణముగా కర్మచేయునపుడు కలుగు భావములు రెండును చేరి యొక వ్యక్తిలోని మనస్సుగా రూపొందుచున్నది. ఇట్లు మానవుడు పూర్వమందు తాను తన జీవితములో వ్యవహరించినప్పుడు సేక రించిన వాసనాసమూహమే అతని యీ జన్మలో మనస్సుగా రూపొందుచున్నది. కావున ఒక వ్యక్తి తన పూర్వార్జిత వాసనామూర్తియే అగుచున్నాడు.

ఇట్లు పూర్వకర్మలయొక్క వాసనలను చిట్టావేయుచు, భవిష్యత్తులో అనుభవించు కర్మఫలముల హానివృద్ధులను

సూచించునదే మనస్సు అనబడుచున్నది. భవిష్యత్తులో తన అనుభవమునకై అది క్షణక్షణము కర్మక్షేత్రములను తయారు చేసికొనుచున్నది. త్రిగుణములచేత సంపాదింపబడిన యీ మనోవాసనలు భవిష్యత్తునందలి యనుభవముల ననుభవించుటకై కర్మక్షేత్రములను నిర్ణయించుచున్నవి. ఈ యుద్దేశముతోనే సంభావ్యమైన సమస్త మానవకర్మలు శాస్త్రములచే ఉత్తమ మధ్యమ అధమములని త్రివిధములుగా విభజింపబడినవి. భగవదర్పితమై, స్వార్థరహితమై భక్తిప్రేమలతో చేయబడు కర్మలు ఉత్తమములు. ఆ కర్మలు పుణ్యఫలములనిచ్చునని భక్తుడు భావించుచున్నాడు. మనలోని పాశవిక ప్రవృత్తులను పోషించు కర్మలు అధమములు. మానవుడు పశుజన్మమెత్తి తత్ఫలితముల ననుభవించి తీర్చుకొనుటకు వీలుగా భవిష్యత్తును తయారుచేయు వాసనలనే యీ అధమకర్మలు మనలో యుత్పత్తి చేయుచున్నవి. స్వార్థపరుడై ఫలాపేక్షతో కర్మకాండననుసరించి మానవుడుచేయు వైదికకర్మలు మధ్యమ కర్మలనబడుచున్నవి. అట్టి కర్మలు ఒక జీవి ప్రపంచములో మానవుడై పుట్టి యనుభవించుటకు వీలైన ఫలములను సృష్టించుచున్నవి.

ఇట్టి యీ పునర్జన్మ విషయమై హిందువులు తదితరులు కూడ వ్యతిరేకులై యున్నారు. హైందవేతరులకు పునర్జన్మ సిద్ధాంతము పూర్తిగా ధ్వంసము చేయదగినదే యగుచున్నది కాని హిందువులలో అకర్మణ్యతను, అశక్తతను అలవఱచుకొనుటకును, శాస్త్రములను చులకనపఱచుటకును ఈ పునర్జన్మ సిద్ధాంతమును వ్యతిరేకించుచున్నారు.

వాస్తవములో ఈ కర్మసిద్ధాంతము మహత్తరమైన తాత్త్విక సత్యమై యున్నది. అట్టి దానిని మనము బాగుగా అర్థము చేసికొనిన అది జీవితములోని వ్యాఘాతములను ఎదుర్కొను టకై తరగని ధైర్యమును, శక్తిని నిచ్చుటయే కాక మనలో ప్రేమ భావమును దృఢపఱచుచున్నది.

కాని యీ కర్మ సిద్ధాంతమును "విధిచెయిదము" అని అపవ్యాఖ్యానము చేసియున్నారు. అది కేవలము "విధి చెయిదము" మాత్రమే యైనయెడల మన మతము వేదాం తము కూడ చాలదినములనాడే నశించియుండును. చారిత్రక, సాంఘిక వ్యాఘాతములను గడచి, మతమింకను స్థిరముగా నిలచినదను విషయమే హైందవ వేదాంతమెంత శక్తి సామ ర్థ్యములుగలదో తెలుపుచున్నది. మనమీ కర్మసిద్ధాంతమును అర్థముచేసికొనిన, అది కేవలము విధిచెయిదము యొక్క తత్త్వమును విశాలపరచునదే కాక అది మన భావనలను సంపూర్ణపరచునదికూడ యని తెలియగలదు. దానిని పూర్తిగా గ్రహించకున్న మానవుడు విధికి వశుడు అను 'విధిన్యాయము' మనకు తోచుచున్నది. ఏది యెట్లున్నను ఈ విషయములను గుఱించి ప్రస్తుతము ఎక్కువ చర్చించజాలము.

మానవుడు తన జీవితములో సేకరించిన వాసనా రూపములే యతని మనస్సనియు, అది త్రివిధకర్మలచే నియ మితమై యున్నదనియు, బోధించు భావమునే గౌడపాదు డిచట సూచించుచున్నాడు. వైరాగ్యముచే దేహమనోబుద్ధుల యం దలి మోహమును విడిపించుకొని, శుద్ధచైతన్యమైన ఆ ఆత్మ

తత్త్వమును, దానితో తన ఐక్యమును తెలిసికొనిన యోగికి మనస్సుచే కల్పితమైన కర్మబంధములుగాని, కర్మఫలములు గాని యేవియు యుండజాలవు. అట్టి వ్యక్తి యీ వాసనా ప్రతిఫలములకు వశుడు కాడు. మనస్సునుండి విడివడినవానికి వాసనాకార్యములైన విధులుగాని బాధ్యతలుగాని యుండ జాలవు.

పూర్వకర్మలయొక్క వాసనలను మనస్సు సేకరించి, ఉత్తమ మధ్యమ అధమములైన యా వాసనలను, తన స్వంతమో యనునట్లు ఆ మనస్సు రికార్డు చేసుకొనుచున్నది. గ్రామఫోను రికార్డువలె ఆ వాసనలను తనలో సంగ్రహించుకొనుచున్నది. దీనికి 'ముల్లు' తో సంబంధము కలిగినపుడు ఒక దేశకాలమునుండి మరియొక దేశకాలమునకు సంబంధాపేక్ష యా కదలునదై సుఖదుఃఖాత్మకమైన పాటలను వినిపించుచున్నది. మానవ దేహములోని 'అహంరూప జీవకేంద్రమే' ఆ 'ముల్లు' గా యున్నది.

ఒక వ్యక్తి తన మనోదేహములతో తాదాత్మ్యము పొందినంతవరకు ఆ జీవుడు తప్పక మనస్సులో వాసనలను పుట్టించుచున్నాడు. ఆ మనస్సును అధిగమించిన యీ వాసనలన్నియు అంతరించిపోవుచున్నవి కావున యా జీవుడు జన్మరహితుడగుచున్నాడు.

కా॥ అనిమత్తస్య చిత్తస్య యాఽనుత్పత్తిః సమాఽద్వయా ।
అజాతస్యైవ సర్వస్య చిత్తదృశ్యం హి తద్యతః ॥ ౭౭

అజమై, సంబంధ రహితమై, మనస్సుగా పరిణమించనిదై యుండు జ్ఞానస్థితియే స్థిరమైనది, పరిపూర్ణమైనది యగు

చున్నది. ప్రపంచమంతయు మనస్సుచేత విషయీకృతమయి నది కావున ఉన్నదంతయు అజమై యే యున్నది.

వివేకముచే వైరాగ్యమును పొంది మనస్సు నధిగమిం చినవానికి యీ మనోవాసనలెట్టి ప్రతిఫలమును ఉత్పత్తిచేయ జాలవని పూర్వశ్లోకములో మనము తెలిసికొంటిమి. విభక్తముచేయు వర్ణవిశ్లేషణ యంత్రమగు మనస్సు ద్వారా చూచుచున్నంతవరకే యీ ప్రపంచమునకు విలువ కలిగి యున్నది. ఆ మనస్సు నధిగమించినవానికి పళ్ళికిలించి భయ పెట్టు ప్రపంచముగాని, చిఱునవ్వులతో మోహింపజేయు ప్రపంచముగాని లేదు. మనకు నచ్చచెప్పగలగు గౌడపాదుని యీ యుపపత్తులద్వారా "ప్రపంచము మనస్సుయొక్క భ్రాంతి మాత్రమే" యని యిదివరకు తెలిసికొంటిమి.

ఆత్మజ్ఞానము గలవానియొక్క భ్రాంతమనస్సు తన కాధారమగు ఆత్మతత్త్వమునుండి అంతరించుచున్నది. సత్య మైన త్రాడును తెలిసికొనగానే భ్రాంతమైన పాము మాయ మగునట్లు సత్యమైన ఆత్మతత్త్వమును తెలిసికొనగానే భ్రాంత మైన మనస్సుచే సృష్టమైన యీ నానారూప ప్రపంచము తనకుతానై మాయమగుచున్నది. ఆత్మజ్ఞానోదయము కలి గిన క్షణముననే సాధకుడింతవరకు పోరాడుచున్న మనస్సు లేనిదే యగుచున్నది. మఱియు ఆత్మనుండి మరుగుపఱచు కోటగోడవలె నిలచిన మనస్సుయుండు స్థలముననే సచ్చిదా నందరూపమైన ఆ ఆత్మతత్త్వమును కనుగొనుచున్నాడు.

కా॥ బుద్ధ్వా ఽ నిమిత్తతాం సత్యాం హేతుం పృథగనాప్నువన్ ।
వీతశోకం తథా కామమభయం పదమశ్నుతే ॥ ౭౮

ఇట్లు హేత్వభావమే ఆత్మయని తెలిసికొనినపిమ్మట యతడు జన్మను కలిగించు ఇతర నిమిత్త కారణములను కనుగొనలేడు. అట్టివాడు రాగము, భయము, శోకము లేనట్టి మోక్షమును పొందుచున్నాడు.

నాలుగవ అధ్యాయములో ఇంతవరకు హేతువాదముపై మనకుండు అంధవిశ్వాసమందుగల దోషములను ఎత్తిచూపుటకు ప్రయత్నించు యుపపత్తులే ముఖ్యముగా గలవు. ఈ హేతుఫలభావము కేవలము మనస్సు యొక్క మాయయే యని సాధకుడు తెలిసికొనినయెడల యాతనియందు ఆధ్యాత్మికతాసిద్ధి పరిపూర్ణతనందుచున్నది. దేశకాలభావము కేవలము మనస్సుచే సృష్టమైనదని మనకు తెలియును. హేతువాదము మనస్సునకు మరియొక కర్మక్షేత్రమై యున్నదిగాని, యీ హేతువాదము దేశకాలముల యందు తప్ప యితరత్ర నిలువజాలదు.

ఇట్లు హేతుఫలన్యాయములో దోషమును కనిపెట్టుట మనస్సును బలహీనము చేయుట యగుచున్నది. మనస్సు తన వృత్తులు, తత్కర్మక్షేత్రములు లేకుండ యున్న యది మనస్సే కాజాలదు. ఇట్లు మనస్సు నధిగమించుట యనిన విశాలమైన ఆత్మసామ్రాజ్యములో ప్రవేశించుటయే యగుచున్నది. జనన మరణరూప భ్రాంతసంఘటనల నడుమ అర్థరహితమై, అంతవంతమై, బాధాకరమై, విసుగెత్తించు జీవ

యాత్రనుండి ముక్తినందించు స్థితియే యిది. మరియు నిది "చైతన్యజ్ఞాన స్థితి" యగు ఆత్మతత్త్వమై యున్నది.

"మహత్తరమైన యీ జీవితలక్ష్యమును చేరుటకు ఒకడు ఎందుకు పాటుపడవలెను ? ఈ జననమరణరూపగర్త ములో పడియుండిన నష్టమేమి ? అట్లు ఆత్మతత్త్వమును వివే కము ద్వారా కనుగొనుటలో ఏమి ముక్తి యున్నది ?" అని సంశయగ్రస్తులై ప్రశ్నించువారికి శ్లోకములోని ఉత్తరార్థ ములో ప్రత్యుత్తరమున్నది.

అట్లు మనోబుద్ధుల నధిగమించిన యొకడు ముక్తి శిఖ రాగ్రమును అందుకొనుచున్నాడు. అచట నతనికి నెట్టి భయముగాని, శోకముగాని, కాంక్షలుగాని యుండజాలవు. పరిమితమైన మర్త్యజీవితములో దుఃఖించుటకుగాను సదా మన హృదయములో ధరించు త్రిశూలముకంటె దుఃఖ త్రయమే యిది యగుచున్నది. మనము చేయు ప్రతి పనియు జీవితములో ప్రధానమైన యీ దుఃఖత్రయమునుండి విముక్తి చెందుటకు చేయు నిష్ప్రయోజనమైన ప్రయత్నమే యని బాగుగా పరిశీలించిన తెలిసికొనవచ్చును. నిర్మాణాత్మకమైన దైనను, వినాశకరమైనదైనను మన మనస్సు చేయు ప్రతి ప్రవృత్తియు యీ దుఃఖములనుండి తొలగుటకుగాని, వాంఛ లను పరిపూర్తి నందించుకొనుటకుగాని, భయమునుండి తప్పిం చుకొనుటకు గాని చేయు ప్రయత్నమే యై యున్నది.

'దుఃఖరాగభయాదులు లేనట్టి స్థితియే మోక్షము' అని వర్ణించి గౌడపాదుడు దేహమనోబుద్ధుల నధిగమించిన

స్థితిని విచక్షణగా సూచించుచున్నాడు. మనము దేహముతో తాదాత్మ్యము నొందినంతవరకు మనకు భయము గలదు. మనస్సుతో తాదాత్మ్యము నొందినంతకాలము మనము కోరికలకు దాసులమగుచున్నాము. బుద్ధితో తాదాత్మ్యము నొంది బంధితులమై యున్నంతవరకు మన మీ వేదనాత్మక మగు దుఃఖబాధనుండి తప్పించుకొనలేము.

ఈ త్రివిధములైన మాయా భూతములయొక్క, వాని భ్రాంత బిభీషకలయొక్క సరిహద్దులకు వెలుపల ఆ ఆత్మ జ్ఞానోదయమున్నది.

కా॥ అభూతాభినివేశాద్ధి సదృశే తత్ప్రవర్తతే ।
వస్త్వభావం స బుద్ధ్వైవ నిస్సంగం వినివర్తతే ॥ 79

అసత్యవస్తువులందు అభినివేశము కలిగియుండుటచే ఒకని మనస్సు యింద్రియ విషయముల వెనుక పరుగెత్తుచున్నది. వస్తువుల మిథ్యాత్వమును తెలిసికొని వైరాగ్యముచే ఆత్మజ్ఞానమును పొందిన పిమ్మట అది నిస్సంగమై వెనుకకు మరలి నైజతత్త్వమును చేరుచున్నది.

ఉపదేశగ్రంథమగుటచే నీ కారికలు మనకు అధ్యాయమునుండి అధ్యాయమునకు మార్గదర్శకములై యుండి అమృతత్వమును చేరు మార్గములో నడచుటకు మనకు సహాయము చేయుచున్నవి. ధ్యానస్థానమందు విద్యార్థికి మరియొక సూచన యిచట చేయబడినది. బాహ్యవస్తుప్రపంచము తన మనస్సుపై చేయు దాడులను ఎదుర్కొని జయించుటకు

కావలసిన శక్తిసామర్థ్యములనిచ్చు రహస్యబోధను ఇచ్చు చున్నది.

ఈ భ్రాంతవ్యక్తి అసత్యమును సత్యమని నమ్ముటయే మానసిక సంచారములగు మిథ్యాభయములకు కారణమని గుర్తించితిమి. మనస్సు ఇంద్రియ విషయ ప్రపంచమును తానే కల్పించుకొనియు, అది తన కల్పనయే యని మరచిపోవు చున్నది. పాపము ! తన స్వంత సృష్టినిచూచి తానే మోహితమై యందు తగుల్కొనుచున్నది. మౌనముగా వివేచించి, తన యుపపత్తులలోని యసందర్భమును తెలిసికొనిన తరువాత ఆ యోగియొక్క మనస్సు, పరిస్థితులచే సృష్టింపబడి, తన యొక్క మూఢసంకల్పములచే నుత్పత్తిచేయబడిన ప్రపంచ మును చూచి పరిహసించుటను నేర్చుకొనుచున్నది.

మనస్సు తనలోని అనంతమైన మిథ్యాస్వప్నములను తొలగించుకొనవలెను. ఆ వెనుక ఆత్మను తెలిసికొనుటకు ఒక సక్రమమైన సాధనను చేయవలెను. అదియే ధ్యానస్థానమందు కూర్చుని చేయు ప్రయత్నమై యున్నది. ఈ మహత్తరమైన మనస్సు తన పూర్వవాసనలచే కలుషితమై యున్నది. తాను కల్పించిన విషయప్రపంచముయొక్క సత్యత్వమందు అభివృద్ధి చెందు విశ్వాసమును తనలో కలిగించుకొనుచున్నది. ఇట్టి విశ్వాసము అధికముగా స్థిరపడుకొలది బాహ్యవిషయములు మనస్సు నాక్రమించుటకు అధిక శక్తివంతములగుచున్నవి. ఇట్లు ఈ మనస్సునకు స్వయంసృష్ట వస్తుప్రపంచముయొక్క సత్యత్వముపై పరిహాసాస్పదమై, అసంగతమైన అధికవిశ్వా

సము ఉండుటచేతనే అది యీ విషయములవైపు పరుగెత్తు చున్నదని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

అట్లైన యీ మనస్సును వస్తుప్రపంచమునుండి మరల్చుటకు గల రహస్యోపాయమేమి ? ఆ మనఃపరిధిలోనే మన ముండునంతవరకు ఈ మనస్సుయొక్క సమస్యతీరదు. కాని యీ మనస్సునధిగమించినంతనే యీ సమస్య తీరిపోవు చున్నది. ఇంద్రియ విషయములయొక్క మిథ్యాత్వమును, నిస్సారతను వివేకముతో తెలిసికొనినయెడల ఆ మనస్సు స్వయముగానే వానినుండి మరలిపోగలదు. నేడా మనస్సు ఇంద్రియవిషయములందు సంచరించుచున్నదనగా వానికా యింద్రియ విషయములయొక్క, అవి యిచ్చు సుఖముల యొక్క సత్యత్వమందు దృఢవిశ్వాసము కలుగుటచేతనే యది యట్లు సంచరించగలుగుచున్నది. వాని మిథ్యాత్వమును గ్రహించినయెడల మనస్సు స్వయముగానే జ్ఞానసాధనకై విశ్రాంతినందగలదు. కావున వివేకమే మనోరోగమునకు మందు అని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

కా॥ నివృత్తస్యాప్రవృత్తస్య నిశ్చలా హి తదా స్థితిః ।
విషయః స హి బుద్ధానాం తత్సామ్యమజమద్వయం ॥ ౮౦

ఇట్లు విషయములనుండి నివృత్తిచెంది, సంకల్పాదుల నుండి విడివడిన మనస్సు పవిత్రమైన అచలస్థితిని పొందు చున్నది. దీనినే జ్ఞానులు సమము, అజము, అద్వైతము అని తెలిసికొనుచున్నారు.

స్థిరచిత్తముతో మనస్సు నెట్లు వశపఱచుకొనవలెనో అను దానికి మార్గములు పూర్వశ్లోకములో చెప్పబడినవి. మనస్సు తనకలవాటగు ఇంద్రియ విషయములందు పరుగెత్తకుండిన అది స్థిరమనస్సు అగుచున్నది. ఆ మనస్సు వర్తమానమందలి బాహ్యవిషయములందు ప్రవర్తించకుండినను, యితః పూర్వము తనయందు గలవిగాని, భవిష్యత్తులో తాను పొందబోవునవి గాని యగు విషయక్షేత్రములలో పరుగెత్తగలదు.

మనస్సు దేశమందేకాక కొంతవరకు కాలమందు కూడ ప్రయాణము చేయగలదు. కావున వర్తమాన కాలమందలి సంకల్పాదులయందేగాక భూతభవిష్యద్విషయ ప్రవృత్తియందు కూడ ఆ మనస్సు లగ్నమగుచున్నది. అందుచే వర్తమానమందలి విషయసుఖముల నుండియే గాక, భూతభవిష్యద్విషయములనుండి కూడ ఆ మనస్సు విరమించవలెను, అని గౌడపాదు డిచట సూటిగాను సూక్ష్మముగాను సూచించుచున్నాడు.

ఇట్లు మనస్సు భూతభవిష్యద్వర్తమాన సంకల్పాదుల నుండి విరమించిన పిమ్మట యది స్థిరపడినదై యేకాగ్రము కలది యగుచున్నది. అట్టి తీవ్రధ్యానమందు తన కలవాటు పడిన సాధారణ సంకల్పాదులు ఆ మనస్సునకుండజాలవు. నిర్విషయమైన మనస్సే అతీతమనస్సగుచున్నది. ఇట్లు అతీతమైన స్థితియే ఆత్మానందస్థితి యగుచున్నది.

ఈ అతీతస్థితి యనునది కేవలము కవియైన వేదాంతిచే చేయబడిన ఊహాగానములోని నిస్సార సిద్ధాంతము మాత్రము కాదు. వందలకొలది యోగుల చేతను, మహర్షులచేతను ఈ

చాల అసంగతమైన భావము. నిద్ర యనునది దేహమునకు సంబంధించినది. దేహములో జీవతత్త్వమున్నంతవరకు ఎట్టి యోగినైనను దేహధర్మము ననుసరించవలసినదే. అయినప్పటికి రెప్పపాటంత తేలికగా గౌడపాదుడీ విషయమును సాహసించి చెప్పుచున్నాడనగా యీ పదమునకు నీ సందర్భములో నొక విశేషార్థము ఉండియుండవచ్చును. రెండవ, మూడవ అధ్యాయములలో సుషుప్తినిగుఱించి, స్వప్నమును గుఱించి వివరించియున్నాము. సూక్ష్మశరీరమగు మనోబుద్ధులతో తాదాత్మ్యము నందునప్పుడు జీవుడు అనుభవించునది స్వప్నమనియు, అవిద్యావరణమగు కారణ శరీరముతో తాదాత్మ్యమునందునపుడు యాతడనుభవించునది సుషుప్తియనియు అచట వివరించితిమి.

ఆత్మజ్ఞానము కలవాడు మనోబుద్ధుల నధిగమించుచున్నాడు. మరియు తనకు సహజతత్త్వమైన ఆత్మను మరగు పఱచు అవిద్య అతనియందు ఆవగింజంతైనను ఉండదు. అందుచే అతడు సూక్ష్మకారణశరీరములను దాటిపోవుచున్నాడు. ప్రకాశముదయించగానే చీకటి యుండజాలనట్లు జ్ఞానోదయముకాగానే సహజమైన ఆత్మతత్త్వమును గుఱించిన అవిద్య నిలువజాలదు. ఆత్మను గ్రహింపకపోవుటచే గలిగిన అజ్ఞానము జాగ్రత్స్వప్నములనెడి అన్యథాగ్రహణమును కలిగించుచున్నది. జాగ్రదవస్థలో కూడ మనోబుద్ధులే జ్ఞానసాధనలగుటచే దానిని ప్రత్యేకించి యిచట పేర్కొనలేదు.

ఆ పరమాచార్యునియొక్క కనికరములేని సత్యమైన పిలుపును కొంచెమైనను స్వానుభవముతో అర్థము చేసికొన

ప్రయత్నించినయెడల అట్టివానికి యీ పదములు ఈ సందర్భములో ఎట్టి యుద్దేశముతో అత డుపయోగించెనను విషయము స్పష్టము కాగలదు. శాస్త్రాధ్యయనముతోపాటు సాధనకూడ చేయమొదలిడినవానికి నిట్టి సందేహము కలుగనే కలుగదు.

"ప్రభాతం భవతి స్వయం — స్వయముగా ప్రకాశితమగుచున్నది" సుఖముగా పడకకుర్చీలో కూర్చుని యోచించువాని కిచట ఒక సందేహము కలుగగలదు. "మనోబుద్ధుల నధిగమించినపిమ్మట తెలిసికొనుటకు బుద్ధియు అనుభవించుటకు మనస్సును లేకపోవుటచే ఆ సాధకుడు ఆత్మానందమును ఎట్లు అనుభవించగలుగుచున్నాడు?" అను ప్రతివాది సందేహమునకీ శ్లోకము గౌడపాదుని ప్రత్యుత్తరమై యున్నది. జ్ఞానమును తెలిసికొనుటకు మరియొక జ్ఞానమక్కరలేదు. జ్ఞానమే స్వయముగా జ్ఞానస్వరూపమై యున్నది. సూర్యుని చూచుటకు మరియొక దీపకాంతి యక్కరలేదు. సూర్యుని ఆవరించియుండు మేఘములను తొలగించినయెడల స్వయం ప్రకాశుడగు సూర్యుడు స్వయముగానే కనబడుచున్నాడు. ఆత్మకూడ సంపూర్ణజ్ఞానస్వరూపము. అట్టి జ్ఞానమును తెలిసికొనుటకు మరియొక జ్ఞానమవసరములేదు. ఆత్మయొక్క సహజతత్త్వమును ఆవరించియుండు ఆవరణను తొలగించుటయే సమస్త వేదాంతసాధనలయొక్క యుద్దేశమై యున్నది.

ఇట్లు ఆత్మజ్ఞానము హృదయములో జరుగు ఆత్మవిష్కరణోత్సవమై యున్నది. ఆత్మానుభవమునకు ఆత్మకంటె నితరమైన సాధనము అవసరము లేదు.

కా॥ సుఖమావ్రియతే నిత్యం దుఃఖం వివ్రియతే సదా ।
యస్య కస్య చ ధర్మస్య గ్రహేణ భగవానసౌ ॥ ౮౨

ఈ మనస్సుండుటచే ఆత్మకు సహజమైన సుఖము ఆవృతమగుచున్నది. దుఃఖము బయల్వెడలుచున్నది. అందుచే యీ భగవంతుని సులభముగా గ్రహించుటకు శక్యము కాకున్నది.

ఈ శ్లోకమునకు తాము వ్రాయు వ్యాఖ్యానమును ఒక ప్రశ్నతో ప్రారంభించి గౌడపాదుడీ ప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పుచున్నాడని శ్రీ శంకరాచార్యులు చెప్పుచున్నారు. "మరల మరల బోధించుచున్నప్పటికిని మానవులా పరమాత్మతత్త్వమును ఎందుకు గ్రహింపలేకున్నారు ?" ఇందుకు ప్రత్యుత్తరముగా, మనస్సులోనుండు వాసనారూపమైన అనంతప్రవృత్తులే యిందుకు కారణమని కారికాకారుడు చెప్పుచున్నాడు.

మనస్సు విషయగ్రహణముచేయుట మనఃపరిధిని చికాకుపఱచుట యగుచున్నది. మేలుకొన్నంతవరకు నానావిధ ఇంద్రియవిషయ వస్తుప్రపంచమును గ్రహించని క్షణమే యుండదు. సుషుప్తిలో కూడ ఒక విధమైన సాత్త్వికజ్ఞానము కలదు. అది బాహ్యాభ్యంతర విషయములను గ్రహించక పోవచ్చును గాని, అచట అజ్ఞానమును ప్రకటించు మనోవృత్తి సదా యుండనే యున్నది. జాగ్రత్స్వప్నాపేక్షయా సుషుప్తిలోని యలజడి మిక్కిలి స్వల్పమైయున్నది. కావుననే సుషుప్తిలో తాను కలవరమును చెందితినని యే వ్యక్తియు

చెప్పుట లేదు. మానసిక శాంతిని కలవరపరచు కారణము లచట లేకపోవుటచే సుషుప్తిలో మనకందరకును ఒకే విధమైన యానందానుభవము కలదు. ఎచట గ్రహణ వ్యాపారము లేదో అచట శాంతి పాలించుచున్నది. కాని సుషుప్తిలో దరదృష్టవశాత్తు ఆ గ్రహణవ్యాపారము లేకపోయినప్పటికిని మనస్సులో అజ్ఞానమును తెలియజెప్పు మనోవృత్తులు నిరంతరము ఉండుటచే యచటకూడ యలజడి యుండనే యున్నది.

ఈ మనస్సులోని సంకల్ప వికల్పాదులు సదా యొకని యందుండుటచే అతడు తన సహజతత్త్వమును అనుభవింపలేకున్నాడని గౌడపాదుడు చెప్పుచున్నాడు. ఈ మనోవృత్తులే జీవితములో కష్టమును కలిగించుచున్నవి. శాంతి సమత్వములు, ఆనంద పరిపూర్ణతలు మొదలైనవన్నియు మనకు నైజతత్త్వములే యైనప్పటికిని, యీ మనోవృత్తులకారణముగా మన సహజతత్త్వము అడుగునపడి దుఃఖాదులు పైకి లేచుచున్నవి. ఇట్లు నిరంతరము శాస్త్రాధ్యయనముచేసి శాస్త్రబోధలు వినినప్పటికిని, అనేక సంవత్సరములు ధ్యానము తపశ్చర్య చేసినప్పటికిని ఒకడు మనస్సును పూర్తిగా అణచుకొనలేకపోవుటచే ఒక్కొక్క సాధకుడు ఆత్మతత్త్వమును అనుభవించలేకున్నాడు. ఈ విధముగా తాను బోధించిన ధ్యానమార్గము ననుసరించుట ఎంత ఆవశ్యకముగా పై వాక్యము వలన తెలియజెప్పుచున్నాడు. అట్లా మార్గము ననుసరించుటచే స్వప్నసుషుప్తులయొక్క సరిహద్దులను దాటి ఆత్మసామ్రాజ్యమునకు ప్రయాణించుట కనువగు అవకాశములను ఆ సాధకుడు కలిగించుకొనుచున్నాడు.

కా॥ అస్తి నాస్త్యస్తి నాస్తీతి నాస్తి నాస్తీతి వా పునః ।
చలస్థిరో భయా భావై రావృణోత్యేవ బాలిశః ॥ ౮౩

అస్తి యనియు, నాస్తి యనియు, అస్తినాస్తి యనియు, నాస్తినాస్తి యనియు, చలమనియు, స్థిరమనియు, ఉభయాభావమనియు, యూహించువారై బాలిశులైన పురుషులు తమ యీ భావములచేత ఆత్మతత్త్వమును కప్పివేయుచున్నారు.

చతుష్కోటి రూపమైన యీ వాదన బౌద్ధుడైన నాగార్జునుని గ్రంథములో నుండుటచేత కొంతమంది విమర్శకులు గౌడపాదుడు బౌద్ధుడని చెప్పుటకు వీలును కలుగజేయుచున్నది. ఇది అత్యంతము అసంగతమైనదనవచ్చును. ఏ సాహిత్యాచార్యుడును నామవాచకములు, క్రియావాచకములు, విభక్తులు అన్నియు తన హక్కు అని చెప్పలేదు కదా! అట్లే ఏ వేదాంతియు తర్కముపై తనవే సర్వహక్కులు అని భావించరాదు.

ఒక సమస్యను బుద్ధితో విశ్లేషించి చర్చనీయాంశమును అర్థముచేసికొనుటకు సాధ్యమైన నాలుగు మార్గములే యీ చతుష్కోటి రూపమై యున్నది. ఆ పరమాత్మపై గుణముల నారోపించుటలో దృఢమనస్కులైన భారతదేశములోని వివిధ మతస్థులయొక్క ముఖ్యభావములను ఒక్కచోట ఈ శ్లోకరూపములో చేర్చుటయే గౌడపాదుని ప్రయత్నమై యున్నది. దేహమనోబుద్ధిప్రాణముల కతీతమై ఆత్మయొకటి యున్నదనియు, అదియే యీ సుఖదుఃఖములను తెలిసికొను

జ్ఞాతయు, ఆ సుఖదుఃఖాదుల ననుభవించు భోక్తయు అగుచున్నదనియు వైశేషికులు నమ్ముచున్నారు. కావున వారి మతప్రకారము ఆత్మ "అస్తి - ఉన్నది" అగుచున్నది.

బౌద్ధులలో నొక తెగవారగు క్షణిక విజ్ఞానవాదులు ఆత్మ దేహముకంటె భిన్నమైనప్పటికిని బుద్ధితో తాదాత్మ్యము చెందుచున్నది. మనస్సులోని ప్రతిభావతరంగము ఆత్మచే ప్రకాశింపబడుచున్నదనియు, రెండు భావముల నడుమ తెలిసికొనుటకు ఆత్మకేదియు ఉండదు గావున అచట జ్ఞానమే లేదనియు వారు వాదించుచున్నారు. ఇట్లు వారి ఆత్మ ప్రతి భావముతో జన్మించి ప్రతి యితర భావముతో నశించుచున్నది. శాశ్వతమై, స్థిరమై, సదా అస్తిత్వము కలిగియుండు ఆత్మను వారు నమ్మరు. అది క్షణికమే యనియు అది అతి తొందరగా చలించుచున్నదగుటచే నిరంతరము అస్తిత్వము కలిగియున్నట్లగపడుచున్నదనియు వారి విశ్వాసము. ఇట్టి క్షణిక విజ్ఞానవాదులకు శాశ్వతమై స్థిరమైన ఆత్మ "నాస్తి - లేనిది" అగుచున్నది.

జైనులకు ఆత్మ "అస్తి నాస్తి - ఉన్నది, లేనిది" యగుచున్నది. ఆత్మ దేహముకంటె భిన్నమే యయ్యు దానికి దేహమంత పరిమాణమే కలదు. దేహమున్నంత వరకు ఆ ఆత్మ ఉన్నది. దేహము నశించినపిమ్మట ఆత్మ నశించుచున్నది. కావున వారి మతప్రకారము ఆత్మ "అస్తి నాస్తి - ఉన్నది లేనిది" అగుచున్నది.

కట్టకడపటగా, బౌద్ధులలో "శూన్యవాదులు" అను మతస్థులు గలరు. వారికి ఆత్మ అనునదొకటి లేనేలేదు.

సమస్త జీవులు, సమస్త పదార్థములు తుదకు నశించునవే యగుచున్నవి. కావున వారి మతప్రకారము ఆత్మ "నాస్తి నాస్తి - పూర్తిగా లేనిది" యగుచున్నది.

పైని చెప్పిన భావములన్నియు ఆత్మయందారోపిత మైన విశిష్టగుణములగుచున్నవి. ఆత్మను ఉన్నదిగాను, లేనిది గాను, ఉండి లేనిదిగాను, లేక లేనిదిగాను చూచు విభిన్న మతస్థులు తమ యొక్క పరిశీలనప్రకారము తాము కనుగొనిన నిర్వచనమును చెప్పియున్నారు. ఇందుచేతనే యీ మతము లన్నియు అపరిణతబుద్ధిగలవారిచే కల్పితమైన మతములని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

కా॥ కోటయ శ్చతస్ర ఏతాస్తు గ్రహైర్యాసాం సదాఽవృతః ।
భగవనాభి రస్పృష్టో యేన దృష్టః స సర్వదృక్ ॥ ౮౪

ఇవి ఆత్మతత్త్వమును గుఱించిన చతుర్విధ సిద్ధాంత ములై యున్నవి. ఒకడు వీనియందు తగుల్కొనుటచే వానికి ఆత్మ సదా ఆవృతమై యే యుంటున్నది. ఎవడైతే ఆత్మను తెలిసికొనుచున్నాడో వాడు వీనియందు నిస్సంగుడగుటయే కాక ఆత్మజ్ఞాని యగుచున్నాడు.

తన యొక్క సాధన, ఆత్మజ్ఞానములద్వారా యిటు వంటి అప్రధానమైన ఆత్మలక్షణములనుండి పైకి లేచి, ఇం ద్రియమనోబుద్ధులయొక్క జ్ఞానమునకు కూడ ఆధారమైన ఆత్మతత్త్వమును సహజ పవిత్ర స్వరూపముగా తెలిసికొనవల సినదని సాధకునకు గౌడపాదుడు ఉపదేశించుచున్నాడు. అంత

రికమైన గాఢమానమందు మనస్సుయొక్క మౌనమును అది గ్రహించుచున్నది. మరియు, స్వకీయమైన సహజశక్తిపై స్థాపితమై, పరిపూర్ణ ప్రభావముతో కూడి ఆ ఆత్మ నిలుచుచున్నది. అట్టి ఆత్మను తెలసికొనుము, నిన్ను నీవు తెలిసికొనుము !

కా॥ ప్రాప్య సర్వజ్ఞతాం కృత్స్నాం బ్రాహ్మణ్యం పదమద్వయం ।
అనాపన్నాది మధ్యాన్తం కిమతః పరమీహతే ॥ ౮౫

ఆది మధ్యాంత రహితమై, అద్వైతమైన బ్రహ్మతత్త్వ స్థితిని పొందినపిమ్మట అతను కోరదగినదేమి యున్నది ?

ఇట్లా జీవిత పరమలక్ష్యమును చేరినపిమ్మట దాని పరిధియందే ప్రతిబింబించుచు, దానియందే రమించుచున్నాడు. మరియు అట్టి సర్వవ్యాపి సర్వశక్తివంతము, అహంకార రహితమగు ఆత్మతత్త్వమందు సంతృప్తుడై ఆత్మతో నైక్యము పొందును. అట్టి ఆత్మజ్ఞానికి కోరదగినదిగాని, సంతృప్తి నిచ్చునదిగాని వేరేదియు ఉండదు. అట్టి ఆత్మజ్ఞానియే 'బ్రాహ్మణుడ'న బడుచున్నాడని గౌడపాదుడు చెప్పుచున్నాడు.

'యజ్ఞోపవీతము ధరించువాడే బ్రాహ్మణుడు' అని చెప్పు ఆత్మఘాతకులైన పూర్వాచారపరాయణులకు తమయొక్క సోదరులయెడ గలుగు భావమును చూచిన మనము నేటి మన సంఘములో యీ పై చెప్పిన జ్ఞానమునుండి యెంత వరకు దిగజారితిమో బాగుగా తెలియగలదు. నేడు జన్మచేతనే యంతయు సరిపోవుచున్నది. నేడు బ్రాహ్మణు

డనగా బ్రాహ్మణునకు పుట్టినవాడు మాత్రమే యగు చున్నాడు. వైద్యుని పుత్రుడు వైద్యుడు కాగలడా ? అనుకూలమైన యుద్దేశములకు సహాయకరమైన మనః ప్రవృత్తులకు వంశము కొంతవరకు హామీ ఇవ్వగలదు. అసలైన పరిణతి యొకని విద్యాభ్యాసమందు తదాచారణముపైన ఆధారపడి యున్నది. అట్లు ఒక ఇంజనీరుయొక్క పుత్రుడు డాక్టరగుట సంభవించవచ్చును.

స్వప్రయత్నముద్వారాను, స్వాయముగా ఆచరించుట ద్వారాను శూద్రుని పుత్రుడు బ్రాహ్మణుడు కావచ్చును. విశ్లేషములకు కారణమై, విభేదములు కలిగించి, విషపూరితమై గాలివెలుతురులు లేక గాఢాంధకారపూరితమై వైశాల్యము లేక క్రిక్కిరిసినదై, ఉక్కిరిబిక్కిరి చేయునదిగా చాతుర్వర్ణ్య వ్యవస్థ యుండవలయునని శ్రుతి యేనాడును యుద్దేశించి యుండలేదు.

ఆత్మజ్ఞానమును పొందిన యట్టి బ్రాహ్మణునకు నిక కోరదగిన దేమున్నది? అని గౌడపాదు డడుగుచున్నాడు. అనగా మరేదియు కోరదగినది లేదని భావము. అతడు సదా శాంతుడై బాహ్యప్రపంచములో నుండి ఆంతరిక ఆనందములో తేలి యాడుచుండును. అతడు దేనిని కోరడు. ఎట్టిదానిని కాంక్షించడు. మరేదియు ఆకాంక్షించి ఆశించడు. దేని విషయము విచారించడు. అతడు సర్వమును ఆవరించియుండును. అటు పిమ్మట తాను సాధనకాలములో అభ్యసించిన ఆత్మసంయమనము, త్యాగము, ధ్యానము ఇత్యాది జీవితధర్మములు గాని, సంకుచిత జీవిత న్యాయములుగాని యతనికుండవు.

అట్టివాడు దేహమందు అశ్రద్ధ వహించి జీవించుట సహజమే యగుచున్నది. అతని మనస్సు జీవభావావేశములను తలంపదు. కాని యది ఆత్మసామ్రాజ్యమునుండి ఆత్మచే ఆత్మానుభవమును ప్రసారము చేయుటకు శబ్దప్రసారయంత్రమగుచున్నది.

కా॥ విప్రాణాం వినయో హ్యేష శమః ప్రాకృత ఉచ్యతే ।
దమః ప్రకృతి దాంతత్వాదేవం విద్వాన్ శమం
వ్రజేత్ ॥ ౮౬

ఆత్మజ్ఞానమే బ్రాహ్మణులకు సహజమైన వినయము. వారికి మనశ్శాంతి సహజముగానే కలుగుచున్నది. వారికి ఇంద్రియ నిగ్రహము సహజమైనది యగుటచే నది పరిపూర్ణతనందుచున్నది. శాంతమైన బ్రహ్మనిట్లు తెలిసికొనినవాడు స్వయముగా సుఖియై అచలమైన శాంతుడుగా అగుచున్నాడు.

ఆత్మజ్ఞాని పొందు సంతృప్తిని గౌడపాదుడు పూర్వ శ్లోకములో సూచించినాడు. శుద్ధ చైతన్యమగు పరమాత్మయే తానని తెలిసిన తరువాత నతనికి పొందదగినది కాని సాధించదగినది కాని యేదియు లేదు. అటుపిమ్మట నాతడు వాంఛించునది యేదియు ఉండజాలదు. దేనినైన పొందుటకు పాటుపడవలసిన యవసరమతనికి లేదు. ఇట్లు చెప్పగానే సాధకుని మనస్సులో ఒక సందేహము ఉదయించవచ్చును. పరిపూర్ణతాలక్షణమైన ప్రేమ, దయ ఇత్యాది భావములను సిద్ధి పొందిన యోగి స్థిరముగా నిరంతరముగాని అభ్యసింపనవసరమున్నదా లేదా ? అట్టి ఆత్మజ్ఞాని వీనిని ప్రయత్నపూర్వకముగా గాని,

వైదికకర్మల ననుసరించుటద్వారా గాని ఎందుకు అభ్యసింప నవసరములేదో అను విషయమును గౌడపాదుడు చెప్పు చున్నాడు. వానికివన్నియు తనయందు ఆత్మకంటె పరమైన సహజగుణములుగా నుంటున్నవి. వాస్తవములో అట్టి పరి పూర్ణతనందిన యోగిని చూచియు, యాతని జీవితములోని వివిధ ప్రవర్తనలను చూచియే ధర్మశాస్త్రములు ధర్మము యొక్క నిర్వచనమును, నీతి నియమములను సూత్రీకరించినవి, అని చెప్పవచ్చును.

ఆత్మజ్ఞానము కలిగిన యోగి ఆ పరిపూర్ణ జ్ఞానాను భవములో తన ప్రత్యగాత్మకు ఆ పరమాత్మతోడి ఐక్యమును కనుగొనినవాడై, సదా వినయముతోనే ప్రవర్తించును. ఇతర జీవులతో సామూహికముగా ఐక్యమును కలిగించుకొని శారీ రకముగాను, మానసికముగాను, వైజ్ఞానికముగాను అణకువ కలిగియుండుటయే "వినయము" అనబడుచున్నది. అది కేవలము నింద్యమైన శరణాగతి కాదు. అది ప్రత్యేక వ్యక్తిత్వము ఆ పరిపూర్ణతలో ఇమిడిపోవుటయే యనవచ్చును. ఆత్మయందే కేంద్రీకృతమైన వానియొక్క మనోభావము లిట్లుండవలెను. ఆత్మయొక్క శక్తి పవిత్రతలదృష్ట్యా దేహ మనోబుద్ధులు, ఆ పరమాత్మయందు కేవలము ఆరోపితములే యగుచున్నవి.

ఇట్టి కల్పితజీవికి ప్రత్యేకవ్యక్తిత్వ మున్నదనియు, యా వ్యక్తిత్వముయొక్క మిథ్యారూపస్వభావాదులను ప్రత్యేకించి పరిగణించవలెననియు, పోరాడుట దురహంకారమే యగు చున్నది. ఇది వినయమునకు అత్యంత విరుద్ధం. గర్వము,

ద్వేషము, ఆత్మాభిమానము, పోట్లాడు స్వభావము, ఇవన్నియు తనయొక్క ఆధిక్యమును చూపునవే యగుచున్నవి. ఆత్మజ్ఞాని యగు యోగి యిట్టి దుఃఖాదులకు దూరముగా నిలచి, ప్రతి నిత్యమును జీవితము నందలి మధురానుభూతులలో క్రమబద్ధముగా ప్రవర్తించుచున్నాడు. సర్వవ్యాపియు ఏకమునగు ఆ పరమాత్మతో శ్రుతికలిపిన వాడగుటచేత నాతనిలో మానసికమైన యెట్టి యలజడులు ఉండజాలవు. శాంతి యనునది యతనికి స్వతస్సిద్ధమై సద్యః స్ఫూర్తిగలదై యున్నది. పర్వతములు చలించినను ఆత్మ పరిపూర్ణతనందిన సాధకుని మనస్సులో స్వల్పమైన చలనము కూడ కలుగదు. ఇచట "మిథిలాయాం దహ్యమానాయాం న మే కించిత్ ప్రదహ్యతి- మిథిలానగరము దహింపబడుచున్నను నన్నేదియు దహించదు" అను జనకుని వాక్యములు ఇట్టి ఆత్మ పరిపూర్ణతనే సూచించుచున్నవి.

ఒక యోగి ఆత్మయందే ఏకాగ్రతకలవాడై, అతీత సుఖములకు అధిపతివలె, పవిత్రమైన అస్తిత్వము నందలి చైతన్యముతో శాశ్వతమైన యానందము ననుభవించుచు జీవించుచున్నాడు. అట్టుపిమ్మట పిశాచములవంటి యావేశముతో స్వప్నసుఖములకొఱకై ఈ ఇంద్రియములను యాచించవలసిన యావశ్యకత యే ముండును ? అతడు ఎన్నటికిని ఈ యింద్రియములకు వశవర్తి కాడు. విషయక్షేత్రములందు సంతృప్తినందుటకు ఇంద్రియములు ఇక అతనిలో అవకాశమును అన్వేషించలేవు. కడుపునిండ భోజనము చేసిన వానికి ప్రక్కనున్న ఫలాహారపుపట్టెలోనున్న తినుబండారము

లను తినకుండ వదలిపెట్టినందుకై విచారించడు కదా! అతడు సంతుష్టినందినవాడై, పరిపూర్ణమైన తృప్తినంది దేనిని కోరడు. అతని యింద్రియములు అతని వశములో నుండును.

అజ్ఞానియొక్క యింద్రియములైతే విషయముల నను భవించవలెననెడి వాంఛతో భ్రాంతములై విషయక్షేత్రము లలో సదా సంచరించుచునే యుండును. అట్టి భ్రాంత జీవికి - ఇంద్రియ విషయములు ఇంద్రియములకంటె వేరుకావనియు, ఇంద్రియములు వైశాల్యమునందిన మనస్సుయొక్క అవయవ ములే యనియు, మనస్సు కేవలము ఆత్మయందారోపితమైనదే యనియు - జ్ఞానము కలిగిన, అనగా ఆత్మానందమే తానని తెలిసికొనినయెడల ఆతడీ యింద్రియ సుఖములవెంట యెంతమాత్రము పరుగెత్తడు.

జ్ఞాన యోగమునకును హఠయోగమునకును గల తార తమ్యమును వివరించుటకొరకే "ఇంద్రియములను వశపఱచు కొనుట జ్ఞానికి సహజమే" అని చెప్పవలసివచ్చినది. జ్ఞాన యోగములో వివేకముచేతను, అనుభవముచేతను ఇంద్రియ నిగ్రహముచేసిన హఠయోగములో ప్రాణాయామము చేతను, ప్రాణములను ఇంద్రియకేంద్రములనుండి ఉపసంహరించు కొనుటద్వారాను ఇంద్రియ నిగ్రహము జరుగుచున్నది. ఆత్మజ్ఞానముచే కలిగినదై, సహజమై సమగ్రమైన యింద్రియ నిగ్రహముతో పోల్చి ప్రాణాయామముచే కలిగిన యింద్రియ నిగ్రహము కష్టతరము, అసంపూర్ణము, స్వల్పకాలికము మరియు కల్పితము అగుచున్నది.

కా॥ సవస్తు సోపలంభం చ ద్వయం లౌకిక మిష్యతే ।
అవస్తు సోపలంభం చ శుద్ధం లౌకిక మిష్యతే ॥ ౮౭

వస్తుభావములతో సంబంధముకలిగి, అనుభవమాత్ర జ్ఞాతమైన జాగ్రదవస్థను వేదాంతము అంగీకరించుచున్నది. మరియు అవాస్తవమైన వస్తువులతో సంబంధముగల భావ ప్రపంచమును కూడ ఆ వేదాంతము అంగీకరించుచున్నది.

బౌద్ధులలో నొక తెగవారగు యోగాచార్యులకు వాడుకయందున్న పదజాలమును ఈ శ్లోకములోను రాబోవు శ్లోకములోను కూడ గౌడపాదుడు ఉపయోగించుచున్నాడు. వారి యుపదేశగ్రంథములో జాగ్రదవస్థ 'లౌకికము' అనియు, స్వప్నావస్థ 'శుద్ధ లౌకికము' అనియు పేర్కొనబడుచున్నది. మాండూక్యోపనిషత్తు యిదివరకే యీ రెండవస్థలను బాగుగా చర్చించి యీ జాగ్రత్స్వప్నములను రెండింటిని నిర్వచించియున్నది. ఇచట కూడ విమర్శకులు 'గౌడపాదుడు బౌద్ధమత విశ్వాసి' యను పరిహాసాస్పదమైన సిద్ధాంతమును బలపఱచ యత్నించు చున్నారు. శ్రీ శంకరుల వ్యాఖ్యాన సహాయముతో యీ కారికలను వివేకముగా అర్థముచేసికొను వానికి యిది యెంతమాత్రము అంగీకార్యము కాదు. ప్రత్యేకమైన యొక జ్ఞానివర్గముచేత ఉపయోగింపబడిన పదములను, భావములో కొంత మార్పుచేసి మరియొక జ్ఞానివర్గముచేత ఉపయోగించుకొనవచ్చును. ఈ సూత్రమును బౌద్ధులే రుజువు పరచిరి. వారికంటె పూర్వముననున్న వాఙ్మయమునుండి వారు ఎన్నియో పదములను అరువు తెచ్చుకొనియే

యున్నారు. కాని యీ పదములను కొంచెము అర్థభేదముతో ఉపయోగించిరి.

లౌకిక స్థితిలోను, శుద్ధలౌకిక స్థితిలోను కూడ జ్ఞాతకు జ్ఞేయమునకు సంబంధము కలిగియే యున్నది. అయితే విశ్వుడు జాగ్రదవస్థలో స్థూలప్రపంచమును సత్యమైనదానివలె తనయెదుట ప్రత్యక్షముగా చూచుచున్నాడు. కాని తైజసుడు స్వప్న వస్తుప్రపంచమును తైజసుని మనోభావనలుగా మాత్రమే చూచుచున్నాడు.

కా॥ అవస్త్వనుపలంభం చ లోకోత్తరమితి స్మృతం ।
జ్ఞానం జ్ఞేయం చ విజ్ఞేయం సదా బుద్ధైః ప్రకీర్తితం ॥ ౮౮

వస్తుభావములకు అతీతమైన యవస్థ 'లోకోత్తరము' ని చెప్పబడునది మరియొకటి కలదు. ఇది శాస్త్రీయానుభవముల కతీతమైనది. ప్రబుద్ధులు జ్ఞానం, జ్ఞేయం, విజ్ఞానం అను నీ త్రయమే పరమాత్మ యని వర్ణించుచున్నారు.

బౌద్ధులలోని 'యోగాచారులు' సుషుప్తినే 'లోకోత్తరము' అని పేర్కొనిరి. ప్రాజ్ఞునకు జాగ్రత్స్వప్నముల యందలి యనుభవములు లేవు. అతడు వీనికన్నిటికిని యధిగమించిన వాడై, ఎట్టి వస్తువుతోను చైతన్య సంబంధము కలిగియుండుటలేదు. పై చెప్పిన మూడవస్థలు జ్ఞానవిషయముల నన్నిటిని తెలియజేయుచున్నవి. ఈ మూడవస్థలయందలి మొత్తమైన యనుభవమే ఒకజీవియొక్క జీవితమై యున్నది. ఆ పరమాత్మతత్త్వమే యీ మూడవస్థలయందలి యనుభవములను ప్రకాశింపజేయుచున్నదని తెలిసికొనుటయే వేదాంత సాధన

యగుచున్నది. వేదాంతము ఈ పరమసత్యమునే సూచించు చున్నది. ఇతరమైన వేదాంతమతములన్నియు ఈ మూడవస్థలతో తాము తాదాత్మ్యము పొందినపుడు తదపేక్షయా తెలిసికొనిన ఆ పరమాత్మతత్త్వమును గుఱించిన సిద్ధాంతములే యగుచున్నవి. ఈ మూడవస్థలను అధిగమించుటయే వేదాంతరాజ్యములో ప్రవేశించుట యగుచున్నది. ఈ తురీయావస్థ యొక్క పరిపూర్ణజ్ఞానమే అజమై, అద్వైతమైన ఆ పరమాత్మతత్త్వమగుచున్నది. స్థూలమైన అజ్ఞానప్రపంచమునుండి జ్ఞేయమైన పరమాత్మతత్త్వము వరకు గల లక్షణక్రమమును ఆత్మజ్ఞానులు వివరించిరి. వారియొక్క యిట్టి వివరణయు, ఈ ఆత్మజ్ఞానము రెండును కలిసి బ్రహ్మవిద్యా వాఙ్మయమగుచున్నవి.

కా॥ జ్ఞానేచ త్రివిధేజ్ఞేయే, క్రమేణ విదితే స్వయం ।
సర్వజ్ఞతా హి సర్వత్ర భవతీహ మహాధియః ॥ ౮౯

జ్ఞానమును, త్రివిధజ్ఞేయమును వరుసగా వాని క్రమములో తెలిసికొనినవాడు సర్వత్ర సర్వవిషయములందు స్వయముగా సర్వజ్ఞత్వమును పొందుచున్నాడు.

ఈ కారికయొక్క ప్రాభవసౌందర్యములు నిజముగా సాటిలేనివే యగుచున్నవి. పరిపూర్ణతనందుటకై మాండూక్యోపనిషత్తులో చెప్పిన జీవన విధానమును, సాధనను ఈ శ్లోకము సూచించుచున్నది. సాధకుడు ఒకదాని తరువాత ఒకటిగా జాగ్రత్స్వప్న సుషుప్తులయందు అనుభవించు విశ్వతైజసప్రాజ్ఞులను క్రమముగా తెలిసికొనవలెను. ఈ మూడవస్థలలోనుండి, భ్రాంతిచే క్రీడించుచున్న తనను

గుఱించి గాఢముగాను, దృఢముగాను, సమగ్రముగాను తెలిసి కొనియుండవలెను. 'ఓం'ను ఉపాసించునపుడు 'అ'కారము మీద విశ్వుని, 'ఉ'కారము మీద తైజసుని 'మ'కారము మీద ప్రాజ్ఞుని యారోపించి ధ్యానించు పద్ధతిని వివరించు నపుడు ఉపనిషద్భాగములో ఈ విషయము కూడ వివరింప బడినది.

దార్ఢ్యముకొఱకు ఆ పద్ధతినే యిచట మరల గౌడ పాదుడు చెప్పుచున్నాడు. రూపగుణములులేని శుద్ధబ్రహ్మ నారాధించు వేదాంతికి ఈ మార్గము చాలముఖ్యమైనది. నిరంతరము వివేకముగలిగి సాధనచేయువాడు ఈ మూడవస్థల యందును వివిధముగా క్రీడించు తనలోని జీవుని బాగుగా తెలిసికొనుచున్నాడు. ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట అతడు శుద్ధమైన తురీయావస్థను కనుగొనగలడు. ఒక సాధకుని జ్ఞానిగాను, పరిపూర్ణ పరిణతి చెందినవానిగాను చేయుటకు 'ఈ మూడవస్థలలోను కలుగు అనుభవములను పూర్తిగా తెలిసికొనుట' యొక్క గొప్పశిక్షణమై యున్నది. అంత అతడు మనస్సులో శాంతుడుగాను, బుద్ధిలో కుశాగ్రతగల వాడును అగుచున్నాడు. ఇట్టి కుశాగ్రబుద్ధి యీ మూడవస్థల ననుభవించు విశ్వతైజసప్రాజ్ఞులను తెలిసికొనినయెడల, తద నంతరము ఈ మూడవస్థలకు సమానముగా ఆధారమైయుండు దివ్యతత్త్వమగు తురీయావస్థను కనుగొనుచున్నాడు.

ఇట్లు వివేకముతో ధ్యానము నభ్యసించిన వేదాంతి యీ లోకములోనే యిప్పుడే దివ్యత్వమును పొందుచున్నాడు. అట్టి దివ్యత్వము నందుటకై యతడు మరణము తరువాత మరి

యొక లోకమునకు పోనక్కర లేదు. ఈ లోకమునందే యిప్పుడే దివ్యత్వమును పొందుట ప్రతిమానవునకును జన్మహక్కై యున్నది. సాధకుడుచేయు నిష్కపటమైన ప్రయత్నము నను సరించియు, సరియైన సమాచరణమును బట్టియు అతడు సిద్ధిని పొందు సమయము నిర్ణీతమగుచున్నది. పరిపూర్ణతాభవనము నకు నిత్యసాధన, నిష్కాపట్యము, సరియైన అర్థజ్ఞానము అను నీ మూడును పునాదిరాళ్ళవంటివి.

శుద్ధచైతన్యరూపమగు నీ తురీయావస్థను చేరగానే, అట్టి ఆత్మజ్ఞాని ఆత్మతత్త్వమును పొంది సమస్తదేశకాలము లందును, సమస్త జీవులలోను, జ్ఞాతయగు ఆత్మయే తాను అగుచున్నాడు.

కా॥ హేయజ్ఞేయాప్యా వాక్యాని విజ్ఞేయాన్యగ్రయాణతః ।
తేషామన్యత్ర విజ్ఞేయాదుపలంభ స్త్రిషుస్మృతః ॥ ౯౦

ఏ వస్తువులు హేయములు, ఏవి జ్ఞేయములు, ఏవి ప్రాప్యములు–పొందదగినవి, ఏవి అవాక్యములు-వ్యర్థప్రయో జనములు గలవి, అను నీ నాలుగు విషయములును ప్రారంభ దశలోనే తెలిసికొనవలసియున్నది. ఈ నాలుగింటిలోను జ్ఞేయము తప్ప మిగిలిన మూడున్ను కేవలము భావనా మాత్రములుగానే యుంటున్నవి.

లక్ష్యమును చేరుటకు ఆతురతగల సాధకుడు "అన్ని టిని జ్ఞాపకముంచుకొన్నను, లోకజ్ఞానము నుపయోగించుట మాత్రము మరచిపోవుచున్నాడు" అనునది నిజమైనప్పటికిని యీ ప్రతిపాదన విపరీతముగనే కనబడుచున్నది. ఇదియే

యొక లోకమునకు పోనక్కరలేదు. ఈ లోకమునందే యిప్పుడే దివ్యత్వమును పొందుట ప్రతిమానవునకును జన్మహక్కై యున్నది. సాధకుడుచేయు నిష్కపటమైన ప్రయత్నము నను సరించియు, సరియైన సమాచరణమును బట్టియు అతడు సిద్ధిని పొందు సమయము నిర్ణీతమగుచున్నది. పరిపూర్ణతాభవనము నకు నిత్యసాధన, నిష్కాపట్యము, సరియైన అర్థజ్ఞానము అను నీ మూడును పునాదిరాళ్ళవంటివి.

శుద్ధచైతన్యరూపమగు నీ తురీయావస్థను చేరగానే, అట్టి ఆత్మజ్ఞాని ఆత్మతత్త్వమును పొంది సమస్తదేశకాలము లందును, సమస్త జీవులలోను, జ్ఞాతయగు ఆత్మయే తాను అగుచున్నాడు.

కా॥ హేయజ్ఞేయాప్యా వాక్యాని విజ్ఞేయాన్యగ్రయాణతః ।
తేషామన్యత్ర విజ్ఞేయాదుపలంభ స్త్రిషుస్మృతః ॥ ౯౦

ఏ వస్తువులు హేయములు, ఏవి జ్ఞేయములు, ఏవి ప్రాప్యములు–పొందదగినవి, ఏవి అవాక్యములు-వ్యర్థప్రయో జనములు గలవి, అను నీ నాలుగు విషయములును ప్రారంభ దశలోనే తెలిసికొనవలసియున్నది. ఈ నాలుగింటిలోను జ్ఞేయము తప్ప మిగిలిన మూడున్ను కేవలము భావనా మాత్రములుగానే యుంటున్నవి.

లక్ష్యమును చేరుటకు ఆతురతగల సాధకుడు "అన్ని టిని జ్ఞాపకముంచుకొన్నను, లోకజ్ఞానము నుపయోగించుట మాత్రము మరచిపోవుచున్నాడు" అనునది నిజమైనప్పటికిని యీ ప్రతిపాదన విపరీతముగనే కనబడుచున్నది. ఇదియే

ఆధ్యాత్మికతా పరిపూర్ణత నన్వేషించు మనము ఈ శ్లోకార్థమును ఇంత విపులముగా వివరించుకొనవసరము లేదు. అయినను మీ దృష్టిని ఇటువైపునకు ఆకర్షించుటకై బుద్ధిపూర్వకముగానే దీని నిచట చర్చించుచున్నాను. ప్రాచీన భారతీయ వేదాంతులు ఐహిక విషయములందలి విజయమును గూర్చి యోచించ సామర్థ్యము లేనివారు అని మీరు భావించరాదు. పాశ్చాత్య నాగరికతలోగాని, ప్రాచీన సంస్కృతిలోగాని ప్రావీణ్యతనందని తొందరపాటుగల భారతీయ విమర్శకులు, అందును ముఖ్యముగా మన తరమువారు పోషించుకొనిన విశ్వాసమై యీ భావమున్నది. నిరుపయోగమై, త్యక్తమైన ప్రపంచ సంస్కృతి వ్యవహారములతో పోషితులమైనామో యనునట్లు ఆరోగ్యము ఆహారము లేని తరముగా పెరుగుచు, శారీరకముగాను, మానసికముగాను, వైజ్ఞానికముగాను సాంస్కృతిక రోగము వలన బాధపడుచున్నాము. వ్రణీభూతమైన మన వ్యక్తిత్వములు రోగిష్టి హృదయముతోను, జర్జరిత బుద్ధితోను నిండిన యుగమును అందించుచున్నవి. శుద్ధ బ్రహ్మతత్త్వమును చర్చించుచున్నప్పటికిని ఇచట గౌడపాదుడు ఈ దుఃఖితప్రపంచమును, సుఖకరమై శాంతియుతమైన అస్తిత్వముయొక్క విశాలక్షేత్రములకు చేర్చుటకై బాగుగా ఆచరించినయెడల బంగారు తాళము వలె ఉపయోగపడు భావనా ప్రణాళికను ఇచ్చుచున్నాడని మనము గ్రహించునట్లు యీ శ్లోకము సహాయపడవలెను. ఇప్పుడు అందులోని ఆధ్యాత్మికతను చర్చించెదము.

ఇదివరకు చెప్పినట్లు జీవితలక్ష్యము తురీయావస్థ లేదా దివ్యచైతన్యము అయి యున్నది. దానిని చేరుటకుగాను కేవలము దాని నిర్వచనములను మాత్రము తెలిసికొనిన చాలదు. పైగా దానికి అపాయకరమైన నిషిద్ధభావములను తొలగించుకొని దానికై శ్రద్ధాయుత సాధనను, దానిపై స్థిరమైన భక్తిని అలవరచుకొని కారణమును నిషేధించి సత్యమును తెలుపు సమీకరణయోగమును అనుసరించవలెను. మనలనభివృద్ధిపఱచు జీవిత విలువలను తెలిసికొనవలెను. శ్రద్ధగా సమాచరించుటద్వారా మనస్సులోని వాసనా బంధములను విప్పుకొనుట కూడ మనకు తెలిసియుండవలెను.

హేయములు – వదలివేయ దగినవి. మనలో జీవభావములను కలిగించు జాగ్రత్స్వప్న సుషుప్తుల ననుభవించు విశ్వతైజస ప్రాజ్ఞులతోడి తాదాత్మ్యము వదలివేయ తగినది.

జ్ఞేయము – తెలిసికొనదగినది. వివేకముతోను శ్రద్ధతోను ఈ మూడవస్థలను అధిగమించుటచే గలుగు తురీయావస్థ జ్ఞేయమగుచున్నది.

ప్రాప్యము – పొందదగినది. వివేకము, మాయారాహిత్యము, మౌనము.

అవాక్యములు – నిష్ప్రయోజనమైన భావములు. మనలోని పైశాచికమైన పశుత్వభావములగు రాగద్వేషాదులు నిష్ప్రయోజనములుగా భావించతగినవి.

శ్రీ శంకరుల మతప్రకారము పొందదగినవి–వివేకము బాలునివలె అమాయకత్వము, మౌనము అయియున్నవి. ఆధ్యాత్మికతాజ్ఞానమునకు ఇవి అత్యంతప్రధానము లైనవి.

వివేకము - యుక్తాయుక్త వివేచనాజ్ఞానము. ఇది భక్తి చేతనే యభివృద్ధిచెందుచున్నది. గురు శుశ్రూష, తద్వాక్య శ్రవణము అంతతః శాశ్వతమై, అద్వైతమైన తత్త్వమునే శాస్త్రములు బోధించుచున్నవని తెలిసికొనుట.

అమాయకత - బాలునివలె ప్రవర్తించుట. అహంకారము, ఆడంబరము, రాగద్వేషాదులు అప్రధానముగా నుండునది బాల్యము.

మౌనము - అరుదైన ధ్యానక్షణములలో మనస్సు ప్రశాంతినందుట యను ఆంతరికమౌనమే యిచట సూచింపబడినది.

కా॥ ప్రకృత్యాఽఽకాశవత్ జ్ఞేయాః సర్వేధర్మా అనాదయః ।
విద్యతే న హి నానాత్వం తేషాం క్వచన కించన ॥ ౯౧

సహజ ప్రకృతిచేతనే సమస్తజీవులు ఆకాశమువలె అనాదియై అస్పృష్టములగుచున్నవి. ఆ జీవులయందు నానాత్వము ఎప్పుడును ఈషణ్మాత్రముకూడ లేదు.

ఆ పరమాత్మదృష్ట్యా, అనగా ఆ తురీయావస్థనుండి చూచిన జాగ్రత్స్వప్నాద్యవస్థలతో కూడిన యీ విషయ ప్రపంచము ఆ ఆత్మసామ్రాజ్యములో లేనిదే యగుచున్నది. వస్తుప్రపంచమంతయు అద్వైతములో ఐక్యమొందుటకు కరగి మునిగిపోవుచున్నది. ఇంద్రియ విషయములు, మనోభావములు, బుద్ధిలోని యుద్దేశములు కలిగిన యీ విషయ ప్రపంచము జీవభావముతో చూచువానికే గోచరించు

చున్నది. మనోబుద్ధులనెడి సాధనములద్వారా ఆ పరమాత్మ ప్రసరించునపుడే యీ జీవుడు ఉద్భవించుచున్నాడు.

భౌతిక ఆవరణలపై యీ తత్త్వముంచబడినపుడే యది మూఢమానవునివలె క్రీడించుచున్నది. అట్టి ఆవృతమైన ఆత్మకే బాధాకరమైన సత్యత్వముగల యీ నానారూప ప్రపంచము గోచరించుచున్నది. ఈ మనోబుద్ధులనెడి సాధనముల నధిగమించినపుడే యీ జీవుడు అంతరించుచున్నాడు. అతనితోపాటు అతడుచూచు ప్రపంచముకూడ నశించుచున్నది. ఇట్లు జీవులయొక్క సహజప్రకృతి అమృతమే అయియున్నదని యీ శ్లోకార్థము చెప్పుచున్నది. ఘటాకాశము వలె నది యెట్టి పరిమితులచేతను అస్పృష్టమే యగుచున్నది.

ఘటాకాశమహాకాశ ఉదాహరణను ఇదివరకు విపులముగా చర్చించియున్నాము.

అఖండమైన ఆత్మానుభవమే గల ఆ పరమాత్మతత్త్వమందు నానారూప ప్రపంచముయొక్క స్పర్శ యద్వైధముగాను, ఏ కాలమందును లేదు. మనోబుద్ధులనెడి విభాగీకరణ యంత్రములందు ఆ శుద్ధచైతన్యము ప్రసరించినపుడే నానారూప ప్రపంచము రూపొందుచున్నది.

కా॥ ఆదిబుద్ధాః ప్రకృత్యైవ సర్వే ధర్మాః సునిశ్చితాః ।
యస్యైవం భవతి క్షాంతిః సోఽమృతత్వాయ కల్పతే॥ ౯౨

సహజముగానే సమస్త జీవులు అచలమైనవి, ప్రబుద్ధమైనవి అయియున్నవి. ఎవడు ఇట్టి జ్ఞానము కలిగిన పిమ్మట

శాంతిని పొందుచున్నాడో అట్టివాడే ఆత్మతత్త్వమును తెలిసి కొనగలుగుచున్నాడు.

గురువులవద్ద శాస్త్రజ్ఞానమును పొందిన పిమ్మట శిష్యులు మానసికమైన ఉపశాంతిగలవారై, విశ్వాసమును అభివృద్ధిపఱచుకొని సంతృప్తినందవలెను. శాస్త్రాధ్యయనము చేసినపిమ్మటకూడ అతడు లక్ష్యమును గుఱించి, తల్లక్ష్యమును పొందుటకై యనుసరించవలసిన మార్గమునుగుఱించి యింకను సంశయము కలవాడైన యట్టివాడు సాధనకు తగినవాడు కాడు. అతనిలోని వివేకధర్మము ప్రప్రథమముగా గురువు బోధించిన లక్ష్యమందు, తత్సిద్ధియందు సంపూర్ణమైన సంతృప్తిని తప్పక కనుగొనవలెను. ఆ గురువు చెప్పు ఉపపత్తులందు, హేతువాద మందు సందేహములుగాని, అపార్థములుగాని శిష్యునకు కలిగినయెడల, ఆత్మజ్ఞానమును చేర్చు క్లిష్టమైన మార్గమును శ్రద్ధతోను, దృఢసంకల్పముతోను అనుసరించుటకు కావలసిన యుత్సాహమునుగాని, అంతఃప్రేరణనుగాని యాతడు పొంద లేడు.

ఒక గురువు తన స్వంతభావములపైగాక ఆ శాస్త్ర గ్రంథములపై చేయు చర్చలను క్రమముగా వేదాంతసాధకుడు వినును. అట్లు వినినపిమ్మట, తన వివేకముతో వానిని వివేచించి తనకు సంపూర్ణమైన మనోనిశ్చయము కలిగిన, అప్పుడే యా శిష్యుడు సాధనను ప్రారంభించవలెను. దేనిని గుఱించియు మరి పాటుపడవలసిన పనిలేని సమగ్రసంతృప్తియుత ఆనంద స్థితికి యీ అభ్యాస మతనిని చేర్చగలిగినయెడల ఆతడు అమృతత్త్వము ననుభవించు యోగిగా పరిగణింపబడుచున్నాడు.

ఆధ్యాత్మిక తృష్ణయందుండవలసిన త్రివిధములైన అంతస్థులను గౌడపాదు డిచట సూచించుచున్నాడు.

ఆత్మజ్ఞానము, శాస్త్రజ్ఞానము రెండునుగల గురువువద్ద శాస్త్రములను విని, తదర్థమును మననము చేసి దానిని ధ్యానించుట అనునది ప్రథమస్థితి.

మనోబుద్ధుల నధిగమించి తురీయావస్థలో ప్రతిష్ఠితు డగుటకుగాను, అధికాధికముగా తీవ్రధ్యానములో ప్రవేశించుట ద్వితీయస్థితి.

సాధకుడు సాధ్యమును చేరుట మూడవ స్థితియై యున్నది. అట్టిస్థితిలో సాధకుడు తన సాఫల్యమును, ఆనందమును సమగ్రమైన సుఖమును కూడ నితర సాధనముల ద్వారాగాక తన యనుభవములద్వారానే పొందినట్లు భావించవలెను. ఇట్టి స్థితిని తెలిసికొనిన తరువాత ఇంకను జ్ఞానము పొందవలెనని ఆశించకుండ సాధకుడు విశ్రాంతి నందుచున్నాడు. "కృతకృత్యస్థితిని–తెలిసికొనవలసినదానిని తెలిసికొంటిని, పొందదగిన దానిని పొందితిని, సాధించవలసిన దానిని సాధించితిని" యనెడు సంతృప్తిస్థితిని అతడు పొందుచున్నాడు.

అట్టివాడే అమృతత్త్వమును పొందుటకు సమర్థుడగుచున్నాడు. అతడు ఆత్మవిశ్వాసములో ప్రతిష్ఠితుడై జీవించుచున్నాడు. ఆత్మతో నైక్యముపొంది, ఆత్మయందు, ఆత్మవలె నెవడు జీవించుచున్నాడో అట్టివాడే అమృతత్త్వస్థితిని పొందుచున్నాడు.

కా॥ ఆదిశాన్తా హ్యనుత్పన్నాః ప్రకృత్యైవ సునిర్వృతాః ।
సర్వే ధర్మాః సమాభిన్నా అజం సామ్యం విశారదం ॥ ౬౩

సమస్త జీవులు ఆదినుండి నిత్యముక్తి నందినవై, స్వాభావముచేతనే సమమై అజమై యున్నవి. మరియు ఆ జీవాత్మలు సమమై అభిన్నములై యున్నవి. కావున యీ విభిన్న రూప జీవులన్నియు ఆత్మతప్ప మరేదియు కాదు. అవి సమమై, ప్రతిష్ఠితమైనవై, అజమైన శుద్ధ ఆత్మయే యగుచున్నవి.

ఒకడు ఆత్మజ్ఞానమును ఎప్పుడు సరిగా పొందుచున్నాడను విషయమును పూర్వశ్లోకములో తెలిసికొంటిమి. సాధకుడు ప్రశాంత సంతృప్తిని సంపూర్ణముగా పొందుటయే ఆత్మతత్త్వమును పొందుట యగుచున్నది. తనయొక్క యన్వేషణ సాఫల్యమునందిన క్షణములో అతడు ఆత్మతత్త్వానుభవమును పొందుచున్నాడు. పూర్వశ్లోకములో చెప్పిన పరిపూర్ణస్థితి క్రొత్తగా పొందదగినదిగాక, తనలోనుండు ఆత్మను తెలిసికొను అవకాశమే యది యని యీ శ్లోకార్థము చెప్పుచున్నది.

ఇట్లా ఆత్మతత్త్వమునుచేరి ఆత్మతో ఐక్యమును పొందిన జ్ఞాని యటుపిమ్మట తానుచూచు వస్తుప్రపంచము, ఆత్మనావరించు పంచకోశములు ఇత్యాదులన్నియు, వాస్తవములో ఆత్మయేగాని మరేదియు కాదని తెలిసికొనుచున్నాడు. అఖండమైన ఆత్మతత్త్వమందు విభేదములులేవు. స్వప్నమువలె మిథ్యయైన మహాబుద్ధులద్వారా ఆత్మ ప్రసరించినపుడు కలిగిన నానాత్వమే యీ ప్రపంచమగుచున్నది

కా॥ వైశారద్యం తు వైనాస్తి భేదే విచరతాం సదా ।
భేదనిమ్నాః పృథగ్వాదాస్తస్మాత్తే కృపణాః స్మృతాః ॥౯౪

ఎవరైతే ప్రపంచముయొక్క విభిన్నత్వమునందే సదావిశ్వాసము గలవారగుచున్నారో వారు ఆంతరికమై సహజమైన ఆత్మపారిశుధ్యమును కనుగొనలేరు. అట్లు భేద భావమందు మునిగియుండి వస్తువులలో పృథగ్భావమును చూచుచున్నవారిని "కృపణులు" అనుచున్నారు.

ఆత్మజ్ఞానము కలిగినవాడు తన జీవన్ముక్తస్థితిలో నెట్టి విభేదమును చూడక బాహ్యాభ్యంతరములయందు, సమస్త ప్రదేశములయందు సర్వకాలములయందు ఆత్మనే చూడవలెనని యీ శ్లోకము వెల్లడి చేయుచున్నది. విభేదములోగల అభేదముతో సమత్వమునంది యాతడు పరిపూర్ణ జీవితమును గడపుచున్నాడు. పరిపూర్ణ ఆత్మజ్ఞానస్థితి యిదియే యగుటచేత ఎవరైతే విభేదమును చూచుచున్నారో వారు ఆత్మదృష్ట్యా "కృపణులు" అని భావింపబడుచున్నారు.

ఇచట గౌడపాదుడుపయోగించిన "భేదనిమ్నాః-భేదమందు నిమగ్నులు" అను ద్వైతులను సూచించు పదము శక్తివంతమై, స్పష్టమైయున్నది. బ్రహ్మతత్త్వమును పొంద గోరు ఆధ్యాత్మిక సాధకుడు తన రాగాదులను త్రెంచుకొని, మనోబుద్ధుల నధిగమించుటకు సిద్ధపడిననేకాని ఉపనిషదాచార్యులు దర్శించి యనుభవించిన ఆత్మతత్త్వమును పొందజాలడు.

సంకుచితమనస్సు గలవాడగుటచే సాధకునకు నీశక్తి సహజముగా ఉండదు. విశాలహృదయము, విస్తరించు మానసిక వైజ్ఞానికదృష్టి యనునవి తత్త్వము నన్వేషించువానికి ప్రవేశపత్రమై యున్నవి. నానాత్వముగల ప్రపంచమునందు ప్రగాఢముగా తగుల్కొనుటచేత జీవులు సహజమైన ఆత్మతత్త్వమునుండి నిర్వాసితులగుచున్నారు. అట్టివారిని 'కృపణాః' యనుట యుక్తముగానే యున్నది.

బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు గార్గితో చెప్పిన వాక్యముతో నీశ్లోకము పోలియున్నది. అచట "ఓ గార్గి ! ఎవడైతే అక్షరమైన ఆత్మను తెలిసికొనకుండ ప్రపంచమును వీడుచున్నాడో వాడు 'కృపణుడు' అగుచున్నాడు" అని యాజ్ఞవల్క్యుడు గార్గితో చెప్పెను.

కా॥ అజే సామ్యే తు యే కేచిద్భవిష్యన్తి సునిశ్చితాః ।
తేహీ లోకే మహాజ్ఞానా స్తచ్చ లోకో న గాహతే ॥ ౯౫

సామ్యమై అజమైన ఆత్మయందు స్థిరమైన విశ్వాసము ఎవరికైతే గలదో వారు మహాజ్ఞానులు అనబడుచున్నారు. ఆట్టివారిని సాధారణమానవుడు తెలిసికొనలేడు.

మానవుడుగా పుట్టిన ప్రతివానికిని దివ్యత్వముయొక్క వారసత్వమును కోరుటకు సహజమైన హక్కుగలదు. అతడు మిథ్యయగు జీవభావమును పూర్తిగా త్యజించి ఆత్మచే పట్టాభిషిక్తుడైన సామ్రాజ్యాధిపతిగా ఆత్మయొక్క ఔన్నత్యస్థితిని అందుకొనవలసియున్నది. ఇట్లు చెప్పుటలో మహర్షులు ఎట్టి వారికిని విశిష్టస్థానమును ప్రత్యేకించి యుంచలేదు. ఒక

సాధారణమానవుని ఆవశ్యకపరిస్థితులలోనికి స్థిరముగాను, స్తిమితముగాను ఉద్ధరించుటకొఱకే వర్ణాశ్రమ వ్యవస్థ శాస్త్రములలో చెప్పబడినది. కాని ఉపనిషత్సాహిత్యములో మాత్రము ఒకని జన్మ, సాంగత్యము, వయస్సు, జాతి లింగభేదముల ఆధారముపై యెవనిని ఆ పరమాత్మ తత్త్వము నందు ప్రవేశించి సిద్ధిపొందుటనుండి నిషేధించి నిరాకరించ లేదు. స్త్రీలకు కూడ ఆత్మతత్త్వానుభవమునకు అవకాశము, హక్కు గలదు. వారిని స్త్రీలని యద్విధముగాను నిషేధించ లేదు. ఉపనిషత్తులకంటె పూర్వకాలమందు స్త్రీల యొక్క నిందను సామాన్యముగా సాహిత్యములో చూచుచున్నాము. కాని ఉపనిషత్తులకంటె తరువాతి కాలమందు స్త్రీలకు పవిత్రతయందు ఆధ్యాత్మికత యందుగల చురుకుదనము నకు ఉదాహరణలు గలవు. మరియు కొన్ని ఉపనిష ద్భాగములను స్త్రీలకు చెప్పుట, ఆత్మజ్ఞానులగు స్త్రీలనుండి వినుట అనునంతవరకు పురుషులతో సమానమైన అంతస్థు వారికీయబడినది. ఇట్టి విశాల హృదయముతో కూడిన హైంద వ సంస్కృతిని "ఎవరైనను సరే ఆత్మానుభవమును పొందినవారు లక్ష్యమును చేరుచున్నారు" అను వాక్యము ద్వారా గౌడపాదుడు ఉద్ఘాటించుచున్నాడు. కాని వీధిలోని సాధారణ మానవుడు అట్టి జ్ఞానిని తెలిసికొనలేకున్నాడు. వీధిని పోవువారు చూచుటకై యతడు యోగసిద్ధులవలె జీవిత రంగమందు తమాషాను కనబరచడు. అతడు యోగసిద్ధులను గాని, మంత్రాదులచే అమానుష క్రియలనుగాని, యోగా సనాదులను గాని కనబరచడు.

కా॥ అజేష్వజ మసంక్రాంతం ధర్మేషు జ్ఞానమిష్యతే ।
యతో న క్రమతే జ్ఞానమసంగం తేన కీర్తితం ॥ ౯౬

జీవులలో సారభూతమై, శుద్ధచైతన్యమగు ఆత్మ అజము బాహ్యవస్తువులయందు అసంక్రాంతము అగుచున్నది. ఈ జ్ఞానము దేనియందును సంక్రమించి యుండకపోవుటచేత యిది 'అసంగం' అని చెప్పబడుచున్నది.

'నైయాయికులు' జ్ఞానము ఆత్మయొక్క విశేషణ మనియు మనస్సు బాహ్యవిషయములందు సంక్రమించినపుడు జ్ఞానముదయించుచున్నదనియు, చెప్పుచున్నారు. వారి మతమును సమీక్షింప ప్రయత్నించుచు, బాహ్యవిషయము లన్నియు మనస్సుయొక్క భ్రాంతిచేత సృష్టమైనవే యని నిరూపించుటకు నీ కారిక పాటుపడుచున్నది. ఇట్టి కల్పిత ప్రపంచముదృష్ట్యా వైజ్ఞానిక ప్రపంచములో గాని, సాధారణ వ్యవహారజగత్తులోగాని జ్ఞానమనగా నియమితజ్ఞానము అనియే మనము అర్థముచేసికొనుచున్నాము. ఒక వస్తువును తెలిసికొనగానే ఆ 'వస్తుజ్ఞానము' నాకు కలదు అని చెప్పెదము. మనఃకల్పిత విషయాకృత ప్రపంచమునుండి సంపూర్ణముగా విరక్తుడగుటకు అశక్తుడగుటచే సాధారణ మానవుడు ఆత్మస్వరూపమైన జ్ఞానమును గ్రహించి యనుభవించుటకు అసమర్థుడగుచున్నాడు.

ఈ ఆత్మజ్ఞానము లేక ఆధ్యాత్మిక కేంద్రము ఒక్కటియే సత్యమైనది. సమాధియొక్క యనుభవము ఈ జ్ఞానముయొక్క జ్ఞానానుభవమే యగుచున్నది. నిర్విషయజ్ఞానమే ఆత్మయగు

చున్నది. దానిని యనుభవించుటయే జీవితములోను, లక్ష్య సిద్ధిలోను, సాధనలోను కూడ సంసిద్ధి యగుచున్నది. "కాంతి ఉష్ణతకూడ సూర్యునికి సంబంధించునట్లు" ఆ తత్త్వము ఉన్నది. నానారూపజీవులను సృష్టించి వారు తమ దివ్యత్వమును మరచి దుఃఖాదులచేతను, హాసన్మృత్యాదులచేతను, తమ దివ్యత్వమును పరిహాసాస్పదముగా చేసికొనునట్లు ఉత్పత్తి చేయుచున్నదో యనునట్లు పరిపూర్ణమై, అఖండమైన ఆ బ్రహ్మతత్త్వమే యిట్లు బహుధా విక్షిప్తమగుచున్నది.

కా॥ అణుమాత్రేఽపి వైధర్మ్యే జాయమానేఽవిపశ్చితః ।
అసంగతా సదా నాస్తి కిముతాఽవరణాచ్యుతిః ॥ ౯౭

అజ్ఞానులచే భావింపబడు నానారూప ప్రపంచభావము అణుమాత్రమున్నప్పటికిని, అది వారు ఆత్మను చేరకుండునట్లు గోడవలె అడ్డుపడుచున్నది. ఆత్మతత్త్వమును ఆవరించి యుండు ఇట్టి ఆవరణ యెచట నశించుచున్నది ?

జాగ్రదవస్థకును, స్వప్నావస్థకును మధ్య యద్వైధము గాను రాజీకుదురదు. స్వప్నములోని ధనమును జాగ్రదవస్థలోనికి తీసికొని రాలేము. అట్లే స్వప్నావస్థలోని పరిస్థితులకు తగినట్టుగా జాగ్రదవస్థయందలి మన యనుభవములను మార్చుకోలేము. స్వప్నములోని వస్తువులు ఆవగింజంతైనను జాగ్రత్తులో మనకు నిలువజాలవు.

అట్లే ఒకవ్యక్తి తన మనోబుద్ధులను అధిగమించి ఆత్మ సామ్రాజ్యములో కాలిడినంతనే యతనికి నానాత్వపు వాసన కూడ నుండజాలదు. అపరిమితములో పరిమితము ఎన్నటికిని

ప్రవేశింపజాలదు. జ్ఞాతృజ్ఞేయ సంబంధమున్నంతవరకు ఆత్మ జ్ఞానము సంపూర్ణము కాజాలదు. ఒక వ్యక్తి తత్త్వద్వారముగా సరిగా చేరి అపరిమితజ్ఞానస్వరూపమగు ఆ పరమాత్మ తత్త్వమందు ప్రతిష్ఠితుడు కాగానే అతడు తనకు సహజతత్త్వమునకును తనకును మధ్య ఆత్మనుండి మరగుపరచు ఎట్టి తెరయును లేదని యతడు తెలిసికొనగలడు. తనకు అజ్ఞానమున్నంతవరకు అట్టి తెర యున్నదని తెలిసికొనుచున్నాడు. సాధనవలన ఆత్మ ఉత్పత్తికాదు. తనయొక్క మిథ్యాభావనలనుండి, అపోహలనుండి భిన్నముగా ఆత్మ కేవలము కనుగొనబడుచున్నది.

కా॥ అలబ్ధావరణాస్సర్వే ధర్మాః ప్రకృతి నిర్మలాః ।
ఆదౌ బుద్ధాస్తథా ముక్తా బుధ్యంతే ఇతి నాయకాః ॥ ౯౮

సమస్త జీవులు స్వభావముచే నిత్య ముక్తులు, నిత్య పవిత్రులు అయియున్నవి. ఆదినుండి యవి ముక్తములై ప్రబుద్ధములై యున్నవి. అయినప్పటికిని 'జీవులు' "ఆత్మ తత్త్వమును తెలిసికొన సమర్థులు" అని ధీమంతులు చెప్పు చున్నారు.

శ్రీ శంకరులు తమ భాష్యములో ఒక ప్రశ్నను వేసి దానికి ప్రత్యుత్తరమే యీ శ్లోకమని చెప్పుచున్నారు. "ఆత్మ తత్త్వమును ఆవరించియుండు ఆవరణను నశింపచేయుటకు శక్యము కాదు" అని పూర్వశ్లోకములో చెప్పబడినది కదా ! ఇట్లు చెప్పుటచే "జీవులయొక్క సత్యతత్త్వము కప్పబడి

యున్నది" అని వేదాంతి నిజముగా ఒప్పుకొన్నట్లే యగుచున్నది అని యిచట ప్రతివాది యాక్షేపించుచున్నాడు. అట్టి ఆక్షేపణకు ఈ శ్లోకము ప్రత్యుత్తరమై యున్నది.

సమస్త జీవులలోను ఆత్మస్వరూపము సదా శుద్ధమైనది. ఎట్టి పరిమితులకు అది కట్టుబడి యుండలేదు. ఈ పరిమితములన్నియు మనస్సుయొక్క మాయాస్వప్నముచే కల్పితమైనవే యగుచున్నవి." అవి ఆదినుండియు నిత్యముక్తములు, శుద్ధ సత్త్వములు, ప్రబుద్ధములు, వాని సహజ స్వభావము 'నిత్యశుద్ధజ్ఞాన ముక్తము' అయి యున్నది అని శ్రీ శంకరులు చెప్పుచున్నారు.

అట్లయిన ఉపనిషత్తులలో చెప్పబడిన ఆత్మను "తెలిసికొనుటకు జీవులు శక్తులగుచున్నారు" అని యెందుకు చెప్పబడినది ? ఉదాహరణద్వారా యీ భావమును శ్రీ శంకరులు వివరించుచున్నారు. నిత్యవ్యవహారములో "సూర్యుడు ఉదయించుచున్నాడు." "సూర్యుడు అస్తమించుచున్నాడు" "దూరముగా కొండ నిలచియున్నది" ఇత్యాది మనము చెప్పెదము. వాస్తవములో సూర్యుడు స్వతఃగా ఉదయించను లేదు, అస్తమించను లేదు, మరియు, పర్వతము ఎప్పుడును ఎగిరి గంతిడి తిరుగుట లేదు. వాస్తవములో అది సదా స్థిరముగా నిలచియే యున్నది. దైనందిన జీవిత వ్యవహారములలో మనము ఒకదాని దృష్ట్యా మరియొక యనుభవమును గుఱించిన భాషలో మాట్లాడుచున్నాము. సూర్యుడు కదలుట లేదని మనకు శాస్త్రములద్వారా తెలిసినను మనము

సూర్యునియందు ఉదయించుట, అస్తమించుట, ప్రకాశించుట ఇత్యాది గుణములను ఆరోపించుచున్నాము. ఆత్మ దృష్ట్యా అసత్యమైన సూర్యునియందు మన దైనందిన యనుభవముల దృష్ట్యా యీ గుణములను ఆరోపించుచున్నాము. అట్లే యిచటకూడ విభిన్నులైనను జీవులు శాశ్వత బ్రహ్మతత్త్వమే అయి యున్నారు. ఆ పరమాచార్యులు మనతో మన అజ్ఞాన భాషలో మాట్లాడువారై "జీవులు తమ సహజ ఆత్మ తత్త్వమును తెలిసికొన సమర్థులగుచున్నారు" అని ఆశాభావమును కలిగించవలసిన వారైరి. స్వప్నమును చూచువానిని గుఱించి మనము చెప్పినప్పుడు అతడు "తన జాగ్రదవస్థను తెలిసికొనుటకు సమర్థుడగుచున్నాడు" అని మనము చెప్పగలము.

కా॥ క్రమతే న హి బుద్ధస్య జ్ఞానం ధర్మేషు నాపి నః ।
సర్వే ధర్మాస్తథా జ్ఞానం నైతత్ బుద్ధేన భాషితః ॥

జ్ఞానస్వరూపుడైన ఆత్మజ్ఞాని వస్తుప్రపంచమందు అసంగుడై యున్నాడు. సమస్త జీవులు, మరియు జ్ఞానము కూడ ఎట్టి పదార్థముచేతను అస్పృష్టులై యున్నవి. "ఇది బుద్ధునిచే చెప్పబడలేదు"

ఈ శ్లోకములో తన సంపూర్ణ కారికల భావమును సంగ్రహించి జ్ఞానులయొక్క జీవితానుభవమే నిర్విషయమైన శుద్ధజ్ఞాన స్వరూపమగుచున్నది యనియు, ఈ నిర్విషయక జ్ఞానమే బ్రహ్మజ్ఞానమనియు అది ఆకాశమువలె అస్పర్శమగుటవలన అందు ఎట్టి పదార్థము ఉండజాలదనియు గౌడపాదుడు చెప్పుచున్నాడు.

ఉపనిషత్తులలో వివరింపబడిన యీ జ్ఞానము నిర్విష యము, మిథ్యాదృశ్య ప్రపంచములచే అస్పృష్టము అను విష యము భావప్రపంచమే తప్ప బాహ్యవస్తు ప్రపంచమే లేదని చెప్పు బౌద్ధ సిద్ధాంతమువలె కనబడవచ్చును. బౌద్ధమతము ప్రచారములో నుండిన దినములలో గౌడపాదుడుండెను. కావున అతడు "వేదాంతము బౌద్ధమతము కాదు - నైతత్ బుద్ధేన భాషితం" అని చెప్పవలసి వచ్చినది. "తన బోధనా పద్ధతి బౌద్ధగ్రంథముల యందలి పద్ధతితో సామ్యమొంది యున్నదని గౌడపాదుడు తెలిసికొనియుండవచ్చును. అందుచే నతడు తనభావములు బౌద్ధమతమునకు సంబంధించినవి కావని నిరాకరించి చెప్పుచున్నాడు అని శ్రీ రాధాకృష్ణన్‌గారు తమ "భారతీయ తత్త్వశాస్త్రము" (Indian Philosophy) అను గ్రంథములో చెప్పియున్నారు.

గ్రంథమందలి యీ భాగమును గుఱించి విమర్శకులు చాలా భేద భావములను, తగాదాలను కలిగియున్నారు. బుద్ధునిచే చెప్పబడలేదు - అని గౌడపాదుడు చెప్పిన వాక్య ముపై పలువురు విమర్శకులు పలువిధములుగా విమర్శించి యున్నారు. 'బుద్ధుడు ఏదియు చెప్పలేదు' అని గౌడపాదుని యుద్దేశమని ఆచార్య భట్టాచార్యులు చెప్పుచున్నారు. కొంత మంది బౌద్ధలేఖకులు "బుద్ధుడు శూన్యమును గుఱించి చెప్పి నాడు" అనుచున్నారు. మరికొంతమంది బౌద్ధ లేఖకులు "బుద్ధుడు ఏదియు చెప్పలేదు. ఏలనన అది అంతఃప్రేరితమై గ్రహించదగినది గాని విశదముగా వివరించదగినది కాదు"

అని చెప్పియున్నారు. మొదటి వారు 'శూన్యవాదులు' రెండవ వారు "తత్త్వవాదులు" అయి యున్నారు.

ఏది ఎట్లున్నను భౌతికముగా బౌద్ధమతము అద్వైత మతమునకు సన్నిహితమై దగ్గరలోనున్నది. అయినప్పటికిని సూక్ష్మమై, నాజూకైన భేదమొకటి యీ రెండింటి మధ్య గలదు. ఉత్తములను సాటిలేనివారుగా మార్చుటయే ఆ భేదము. మొత్తముగా చెప్పిన మహాయానులు చెప్పినట్లు అద్వైతమతము బోధించు పరమాత్మనే బుద్ధుడుకూడ బోధించునట్లు తోచినప్పటికిని అతడు బ్రహ్మయే పరతత్త్వమని యెన్నడును బోధించలేదు" అను విషయమును అద్వైత బౌద్ధమతములను నిష్పాక్షికముగను నిష్కపటముగాను చదివిన విద్యార్థి నిర్ణయించుకొనగలడు.

కా॥ దుర్దర్శమతి గంభీరమజం సామ్యం విశారదం ।
బుద్ధ్వాపదమ నానాత్వం నమస్కుర్మో యథాబలం ॥ ౧౦౦

అజము, సమము, జ్ఞానరూపము, నానాత్వరహితము, తత్త్వములో గ్రహించుటకు కష్టతరము అయిన పరమాత్మను తెలిసికొనిన తరువాత మా యథాశక్తి దానికి మేము నమస్కరించెదము.

గ్రంథము పూర్తయినది. ఆత్మకు ఇచట చెప్పిన విశేషణములన్నిటిని యిదివరకే వివరించితిమి. ఆత్మను తెలిసికొనుటయే ఉత్తమోత్తమమైన ఆత్మారాధన యగుచున్నది. గురువునకుగాని ఆ పరమాత్మకుగాని మనమీయదగిన ఉత్తమ గౌరవము తాను ఆత్మగా అగుటయే అగుచున్నది. ప్రార్థన

యందలి యాదర్శము ననుసరించుటయే ప్రార్థన యగుచున్నది. మానసికమైన, వైజ్ఞానికమైన యిట్టి దిద్దుబాటు లేకుండిన యెడల కేవలము వాచికమైన ప్రార్థన తనకు నిరుగుపొరుగు వారికి కూడ చికాకు పరచునది మాత్రమే యగుచున్నది. ఇట్లు ఆత్మతత్త్వసిద్ధినందుటయే సాధకుడా ఉపనిషదృషులకు చేయు ఉత్తమోత్తమమైన పూజ యను భావమును శ్రీ గౌడ పాదుడు విద్యార్థిమనస్సులో నాటునట్లు తన ముగింపు శ్లోక ములో చెప్పుచున్నాడు.

సర్వవ్యాపియు, జగదతీతమును అగు ఆ పరమాత్మను ఆత్మలో తెలిసికొనినపిమ్మట, పూజాపురస్కారములకు గాని, భక్తిప్రేమలకుగాని యచట స్థానము లేదు. అయినను శ్రీ గౌడపాదుడు బ్రహ్మవాది, ఆత్మజ్ఞానమును అతిశయపఱచు వాడై, ఈ పరమాత్మకే నమస్కరించుచున్నాడు. పర మాత్మయగు మనలోని ఆత్మకు వేదోక్తప్రకారము నమస్క రించుట యనునది మన దేహమనోబుద్ధులపై విరక్తి కలుగు టకు యథాశక్తి మనము చేయు ప్రయత్నమైయున్నది. మరియు తద్ద్వారా సచ్చిదానందరూపమైన ఆ ఆత్మతత్త్వము కంటె మన సహజతత్త్వము భిన్నము కాదని మనము తెలిసి కొనుట అగుచున్నది.

అసంగోఽహం అసంగోఽహం అసంగోఽహం పునఃపునః ।
సచ్చిదానంద రూపోఽహం అహమేవాహ మవ్యయః ॥

ఓం తత్ సత్.

---